## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

నన్ను "నేను" చేరుకోవటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2990100028623

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

**Subject**

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

**Language**

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఐవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# సంగీత శాస్త్ర సుధార్ణవము

(కూలంకషమైన కర్ణాటక సంగీత శాస్త్ర గ్రంథము)




గ్రంథకర్త

మహామహోపాధ్యాయ

**డా॥ నూకల చిన్న సత్యనారాయణ**



# అవధూత దత్తపీఠాధిపతి జగద్గురు పరమపూజ్య

# శ్రీశ్రీశ్రీ గణపతి సచ్చిదానంద స్వామీజీ వారి

# ఆశీస్సందేశము

ఈ సృష్టి ఒక వృక్షమనుకొంటే, దీని వెనుక గల విత్తు పేరు శాంతం. దీని కాండం పేరు శక్తి. ఈ కాండం రెండుగా చీలే చోటు పేరు బిందువు. ఆ చీలిన కొమ్మల పేర్లు నాదం, భావం. వీటినే వేదాంత వేత్తలు నామరూపాలు అంటున్నారు. జీవుడు తన మూలస్థానానికి ప్రయాణించాలంటే, ఇటు నాద మార్గంలోనో, అటు భావ మార్గంలోనో బిందువు దగ్గరకు చేరక తప్పదు. కానీ, ఏది దగ్గర దారి? రెండింటిలోనూ ఏదో ఒక మార్గాన్ని మాత్రమే పట్టుకొనేవారికి ఏదీ దగ్గర దారి కాదు. రెండింటినీ సమన్వయం చేసినప్పుడు మాత్రమే బిందువు దగ్గరకు ప్రయాణం సాధ్యమవుతుంది. రహస్యమైన ఈ కిటుకు తెలిసిన కొద్దిమందిలో శ్రీ [illegible] చిన్న సత్యనారాయణ ఒకరు. అందుకే ఆయన దత్తపీఠం నుంచి **'నాదనిధి'** బిరుదు అందుకొన్నాడు.

నాదానికి భావ సంపర్కం కలిగించే శక్తి పేరు లయ. భావానికి నాద సంపర్కం కలిగించే శక్తి పేరు శ్రుతి. శ్రుతి లయల సమ్మేళనమే సంగీతం. అందువల్లనే సంగీతం మోక్షానికి మిక్కిలి దగ్గరి దారి అని మహర్షులు నిర్ణయించారు.

గొంతులోని కండరాలను కదిలించడం ద్వారా వచ్చే ధ్వనులతో శ్రావ్యమైనది సంగీతమని చాలా మంది భావిస్తూ ఉంటారు. సత్యం దానికి రవంత దూరంలో ఉన్నది. శ్రావ్య ధ్వనులను వినడం ద్వారా, శ్రోత హృదయంలో, కండరాలకు అతీతంగా ఉద్భవించే అంతర్గత ధ్వనులే అసలైన సంగీతం. బాహ్య సంగీతం పాడేవాడు కూడా ఒక శ్రోత కనుక, అతని హృదయంలో కూడా ఈ అంతర్గత ధ్వనులు ఉద్భవించే సావకాశం ఉంది. అవి ఉద్భవించినప్పుడు మాత్రమే అతడు సంగీతవేత్త అవుతాడు. ఈ కిటుకు కూడా ఈ రచయిత గ్రహించాడు. అందుకే ఆహవ అనాహత నాదాల గూర్చి ఈ గ్రంథంలో చర్చించాడు.

అంతర్గత ధ్వని సాక్షాత్కారం జరగాలంటే శరీరంలోని నాడీ మండలాన్ని నాదంతో అనుసంధానం చేయాలి. [illegible] కాలంలో ఈ కిటుకును బహిరంగంగా బోధపరిచిన మహనీయుడు శ్రీ వేంకటమఖి. ఆయన యోగవేత్త కనుక శరీరంలోని ప్రధాన నాడులకు అనుబంధంగా మేళకర్త రాగాలను ఏర్పరచి సంగీత ప్రపంచానికి కొత్త మలుపు తెచ్చాడు. సత్యనారాయణ గారికి ఆ మహనీయుడుతో గల సుదూర సంబంధమే ఈనాడు మీ స్వామీజీతో రాగరాగిణీ విద్యా యోగ ప్రక్రియగా [illegible] సాధించడానికి ఒక హేతువైందేమో!

భరతముని నుంచి ఈనాటి వరకు గల సంగీత స్రవంతులను ఈ రకమైన అంతర్ దృష్టితో అర్థం చేసుకొనగలిగిన వారు కాక, చిన్న సత్యనారాయణ గారు ఈ పెద్ద గ్రంథాన్ని ఇలా వ్రాయగలిగి యుండేవాడు కాదు. సంగీత శాస్త్ర మర్మజ్ఞులను అని పేరుతో రచయిత వ్రాసిన ఈ గ్రంథంలోని విషయాలు పరిశోధన దృష్టితోనూ, అనుభూతి దృష్టితోనూ కూడా సమగ్రంగా సమన్వయించబడినాయి. పరితలైన సంగీత విద్యార్థులకు ఈ విషయాలన్నీ అనుభూతి క్షేత్రంలో కొత్త పంటలను పండించగలవు. ఈ గ్రంథం ఈ రచయితకు పాథేయమై, నాద బిందు శక్తి, శాంత మార్గంలో ఇతని ప్రయాణం అఖండమై సాగు గాక, అని దత్త ప్రార్థన చేస్తున్నాము.

**జయగురుదత్త**

# సంగీత శాస్త్ర సుధార్ణవము

(కూలంకషమైన కర్ణాటక సంగీత శాస్త్ర గ్రంథము)



"శ్రుతిర్మాతాలయఃపితా" "నాదతనుమనిశం శంకరం నమామి"

గ్రంథకర్త

"మహామహోపాధ్యాయ"

డా॥ మాకల చిన్న సత్యనారాయణ

# SANGEETA SHASTRA SUDHARNAVAMU

*Author :*
*Mahamahopadhyaya*
**Dr. Nookala Chinna Satyanarayana**



*First Edition :* March, 2000

*Copies :* 1000

*Price :* **Rs. 350/-**
*U.S. Dollars :* **20/-**

*Copies available at :*
**Sundarakrupa :** 6-1-349/1
Padmarao Nagar, Secunderabad - 500 025
Phone : 040-7534061

*Composed at :*
Vamshi Art Printers
Khairathabad, Hyderabad -500 004
Phones : 3236420, 3242787

*Printed at :*
Sri Dattasai Graphics
1-8-702/5, Nallakunta, Hyderabad -500 044
Ph. : 7633275, 3020719



ఈ గ్రంధమునకు శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానము వారు దయతో
ధన సహాయము చేసిరి. వారికి నా కృతజ్ఞతలు

# మనవి

నేను "ఈ సంగీత లక్షణ సుధార్ణవము" అనే గ్రంథాన్ని నాలుగు, ఐదు సంవత్సరాలుగా కొద్ది కొద్దిగా అప్పుడప్పుడూ వ్రాస్తోనే ఉన్నాను. ఈ మధ్య 5, 6 నెలల నుంచి పట్టుదలగా వ్రాశాను. మొత్తానికి అనుకున్న దానికి దగ్గరదగ్గరగా వ్రాయడం పూర్తి చేసి నాకు పరమ మిత్రులు, సహృదయులు శ్రీ నీలకంఠేశ్వరరావుగారికి, వారి చిరంజీవి వేణుగోపాల్‌కి (వంశీ ఆర్ట్ ప్రింటర్స్) ఇచ్చాను. వారు ఈ గ్రంథానికి అక్షర కూర్పు చేశారు. లోగడ నా పుస్తకాలను వారు ప్రకాశింపచేశారు. వారికి ఇప్పుడు ఈ గ్రంథాన్ని ముద్రించిన శ్రీ దత్త సాయిగ్రాఫిక్స్ వారికి నా కృతజ్ఞతలు, ఆశీర్వచనాలు.

ఈ గ్రంథ ప్రకాశానికి సహాయ సహకారాలు అందించిన దయామూర్తులు, త్యాగశీలురకు కృతజ్ఞతా వందనములు.

నన్ను, మా కుటుంబ సభ్యులను వారి కృపా కటాక్షములతో ఆశీర్వదించుచున్న నా తల్లి దండ్రులకు, మా గురువులకు అందరికి, నా స్నేహితులకు, శ్రేయోభిలాషులకు, మహాత్ములైన, శ్రీశ్రీ కంచి పరమాచార్యుల వారికి, శ్రీశ్రీ శృంగేరి పరమాచార్యులవారికి, శ్రీశ్రీ పుష్పగిరి పరమాచార్యులవారికి, శ్రీశ్రీ గణపతి సత్‌చితానందస్వామివారికి, శ్రీశ్రీ దయానంద సరస్వతీ స్వాములవారికి, భగవాన్ శ్రీశ్రీ సత్యసాయిబాబా వారికి, హ్రిషికేశ్ శ్రీశ్రీ స్వామి శివానందులవారికి, నా సాష్టాంగ కృతజ్ఞతా ప్రణామములు.

ఆంధ్ర దేశంలో ఉన్న మహా విద్వాంసులలో పెద్ద వారికి నా ప్రణతులు. యువతరం వారికి భగవంతుని ఆశీస్సులు. సంగీత పోషకులకు ప్రత్యేక కృతజ్ఞతా వందనములు.

***ఈ గ్రంథ రచనలో నాకుపయోగపడిన గ్రంథములు.***

1. Indian Music Books of Prof. P. Sambomoorthy
2. The History of Carnatic Music by R. Raganamanija Iyengar
3. గానభాస్కరం K.V. శ్రీనివాసయ్యంగార్.
4. సంగీత కళాప్రదర్శిని - అరిపిరాల సత్యనారాయణమూర్తి
5. ఆంధ్రవాగ్గేయకారుల చరిత్ర - డా॥ బి. రజనీకాంతరావు.
6. సంప్రదాయప్రదర్శిని - సుబ్బరామ దీక్షితర్.

***ఈ గ్రంథకర్తలకు నా కృతజ్ఞతావందనములు***

భక్తజన విధేయుడు

**నూకల చిన్న సత్యనారాయణ**



గ్రంథకర్త తల్లిదండ్రులు :
బ్రహ్మశ్రీ నూకల అన్నాజీరావు గారు, శ్రీమతి యజ్ఞచైనమ్మగారు



పరమహంస పరివ్రాజిక, సంగీత జగద్గురు శ్రీ త్యాగరాజ స్వామి వారు

**1765 - 1847**



నాదజ్యోతి శ్రీ ముత్తుస్వామి దీక్షితర్ వారు
**1775 - 1835**

# సంగీత శాస్త్ర సుధార్ణవము

## విషయసూచిక

| క్ర.సం. | విషయము | పుటలు |
|---|---|---|

ఓం శ్రీ

# 1. సంగీతోత్పత్తి

శ్లో॥ బ్రహ్మ గ్రన్థిజ మారుతానుగతినా । చిత్తేన హృత్పంకజే ॥
సూరీణామనురంజకః శృతిపదం । యోయం స్వయంరాజతే ॥
యస్మాద్గ్రామ విభాగ వర్ణరచనాలంకార జాతిక్రమో ॥
వందే నాద తనుం తముద్ధర జగద్గీతం ముదే శంకరం ॥ (సంగీత రత్నాకరం)

"నాదతనుం అనిశం శంకరం నమామి" (త్యాగరాజు) మూలాధార నాదమెరుగుటే మోక్షమురా (త్యాగ) మానవ శరీరమున సూక్ష్మముగా కలిగిన ఆరు యోగ చక్రముల యందు నాదము పయనించును. అందు మొదటిది బ్రహ్మగ్రంథి ఇది మూలాధార స్థానమున 14 దళములు కలిగిన చక్రము.

## షట్చక్రములు

1. మూలాధారం-బ్రహ్మగ్రంధి, 2. స్వాధిష్టానం, 3. మణిపూరం-నాభి, 4. అనాహతం-హృదయం, 5. విశుద్ధం-కంఠం, 6. ఆజ్ఞాచక్రం-భ్రూమధ్యం, 7. సహస్రారం-కుండలిని.

"నాభి హృత్కంఠరసన" నాసాదులయందు శోభిల్లు సప్తస్వరములు.

సూక్ష్మ నాదము, మూలాధారమున గల బ్రహ్మగ్రంధి యందు ప్రాణాగ్నులప్రేరేపణచే ఉత్పన్నమయి, క్రమముగా నాభి, హృదయము, కంఠము, రసన, నాసిక, శిరస్సుల యందు, సప్తస్వరములుగ, ద్వాదశ స్వరస్థానములుగా, ద్వావింశతి శృతులుగా, త్రిస్థాయిల యందు బహిర్గత మగుచు, శ్రావ్యమైన సంగీతమై స్వయముగా ప్రకాశించుచున్నది. ఈ నాదము సకల జగత్తునకు ఆధారమైన ప్రణవము. ప్రణవనాదము ఈశ్వర రూపము. ఈ నాదము సంగీతమునకు ఆధారము, వేదమునకు ఆధారము. ఈనాదము, అక్షరము, పదము, వాక్యము, కావ్యము, నాటకము, అలంకారములకు ఆధారము. సకల శాస్త్రములకు ఆధారము. నాదమయమైన సంగీతమునందు, స్వర, స్వరస్థాన, శృతి, వర్ణ, గ్రామ, మూర్ఛన, అలంకార, జాతి, రాగ, గమకములు గలవు, ఈ నాదమే మరల లయాన్వితము. వేయేల నాదమే పరబ్రహ్మము. అట్టి పరబ్రహ్మమునకు, పరబ్రహ్మ మూర్తియైన శంకరునికి వందన మాచరించుచున్నాను.

## 2. సంగీత పరమార్థం

శ్లో॥ సామ వేదాదిదం గీతం । సంజగ్రాహ పితామహః (సం.రత్నాం)

సకలలోక సృష్టికర్తయైన పితామహుడు (బ్రహ్మ) లోకోపకారార్థమై, సామవేదము నుండి సంగీతము గ్రహించెను

శ్లో॥ గీతిగానేన యోగ స్యాత్ । యోగా దేవ శివైక్యతా ।
గీతిజ్ఞో యది యోగేన । సయాతి పరమేశ్వరం (సూతసంహిత) ॥

సంగీత సాధన ఒక మహా యోగము. అట్టి యోగ సాధన వలన మానవుడు పరమశివుని యందు లీనమగుచున్నాడు. సంగీత జ్ఞానముఅనుయోగముచేతపురుషుడు ఐశ్వర్యమును పొందుచున్నాడు.

శ్లో॥ నాహం వసామి వైకుంఠే । నయోగి హృదయేరవౌ ॥
మద్భక్తాయత్ర గాయంతే । తత్ర తిష్ఠామి నారద ॥
విష్ణుమూర్తి నారదునితో ఇట్లనుచున్నారు.

ఓ నారదా! నేను వైకుంఠమునగాని, యోగీశ్వరుల హృదయముల యందుగాని, సూర్యుని యందు గాని యుండను. నా భక్తులు ఎచ్చట గానము చేయుదురో అచ్చట యుందును.

శ్లో॥ త్రివర్గ ఫలదాస్సర్వే । దానయజ్ఞ జపాదయ: ॥
ఏకం సంగీత విజ్ఞానం । చతుర్వర్గ ఫలప్రదం ॥

దానము, యజ్ఞము, జపము, మూడు విధములైన ఫలముల నిచ్చును. సంగీత విజ్ఞానము, ధర్మ, అర్థ, కామ, మోక్షములను చతుర్విధ పురుషార్థ ఫలముల నిచ్చును.

## 3. సంగీత శబ్దార్థము

శ్లో॥ గీతం వాద్యం తథా నృత్యం । త్రయం సంగీతముచ్యతే ॥
గీత, వాద్య, నృత్యముల చేరిక సంగీత మనబడుచున్నది ॥

శ్లో॥ గీత వాద్యోభయం యత్ర । సంగీతమితిరేచన ॥
గీతము, వాద్యము చేరి సంగీతమగుచున్నది ॥

శ్లో॥ రాగ, స్వరశ్చ, తాళశ్చ, త్రిభి స్సంగీతముచ్యతే ।
రాగము, స్వరము, తాళముల చేరికయే సంగీతము॥

శ్లో॥ మార్గదేశీయ భేదేనద్వేధా - సంగీతముచ్యతే

సంగీతము మార్గము, దేశ్యము అను రెండు విధములుగా కలదు.

పరమశివునికి ప్రియమైనది, మోక్ష ప్రదమైనది మార్గ సంగీతము.

దేశ కాలానుగతమై మానవ మనో రంజకమైనది దేశ్యసంగీతము.

## 4. సంగీత మహాత్మ్యము

సంగీతమునకు పరమ శివుడు ప్రీతుడగుచున్నాడు. శ్రీకృష్ణుడు స్వయముగా వేణువును వాయించుచూ సకల లోకములకు తన్మయతను ప్రసాదించెను.

శ్రీ శారదాంబ తన విపంచీ వీణచే పార్వతిని అలరించి యుండుట విదితమే.

నారదగురు స్వామి తన 'మహతి' అను వీణను వాయించుట విదితము.

తుంబురుడు తన గానము చేత దేవతలను అలరించుట లోక విదితము.

పరమశివుడైన నటరాజు నాట్య మొనర్చుట ప్రసిద్ధమే.

విష్ణుని వీణ శార్ఙ్గి (సారంగి) రుద్రుని వీణ - రుద్రవీణ.

గంధర్వులు గానమున ప్రసిద్ధులు.

శ్లో॥ శిశుర్వేత్తి పశుర్వేత్తి । వేత్తి గానరసంఫణిః ॥

శిశువైన కుమారస్వామి, పశువైన నందీశ్వరుడు, పరమేశ్వరుని కంఠమున భూషలైన సర్పములు పరమేశ్వరుని గానమును రసించుచున్నవి.

ఉయ్యల యందు గల బాలబాలికలు, సంగీతమునకు ఆనందించుచున్నారు. కిరాతుని సంగీతమునకు అలరి పశు పక్ష్యాదులు మైమరచి కిరాతుని వలలో చిక్కుకొని ప్రాణములను త్యజించుట కైన సిద్ధమగు చున్నవి. సంగీతము మనశ్శాంతిని కల్గించును. యుద్ధ సమయమునందు సైనికులు సంగీతమునకు ధైర్య శౌర్యవంతులగుచున్నారు.

సంగీతము, భాష, ప్రాంతము, దేశము, మొదలైన పరిమితులు లేక సకల జన ప్రియమైనది. సంగీతము మాటలు అక్కరలేని ప్రపంచ భాష.

సకల సాహిత్య భావార్ధములకు అతీతమై ఆధ్యాత్మికమైనది, సంగీతము.

మహాభక్తులు, మహావాగ్గేయ కారులైన పురందరదాసు, భద్రాచల రామదాసు, తులసీదాసు, సూరదాసు, భక్తమీరాబాయి, తుకారాం, త్యాగరాజు, నారాయణ తీర్థులు, సదాశివ బ్రహ్మేంద సరస్వతి, జయదేవుడు, ముత్తు స్వామి దీక్షితర్, శ్యామశాస్త్రి మొదలైన మహా భక్త వాగ్గేయకారులు, తమ భక్తి జ్ఞాన వైరాగ్య పూరిత గానముతో భగవంతుని ప్రసన్నుని చేసికొని తరించి చరితార్థులగుట జగత్ప్రసిద్ధము.

సంగీతము వలన ఆనందముతో గోవులు అధికముగ క్షీరములను ప్రసాదించుట. పంటచేలు అధికముగా దిగుబడినిచ్చుట శాస్త్రజ్ఞులు కనుగొని ఆచరణ యందు ప్రయోగించుచున్నారు.

మానవుల మానసిక ఒత్తుడులను సంగీతము వలన సరి చేయవచ్చునను విషయము ప్రయోగము వలన ధృవపడినది. తోడిరాగము కలవరపడుచున్న మనస్సునకు శాంతిని ప్రసాదించును. కళ్యాణిరాగము మనోస్తబ్దతను పోగొట్టి ఉత్సాహమును, చురుకుతనమును కలిగించును. శహనరాగము, సావేరి, దయాస్వభావమును పెంపొందించును. మోహన, హంసధ్వని, ధైర్యమును, శౌర్యమును ఒసగును.

# 5. స్వరప్రకరణం

## (శృతి, స్వరస్థాన, స్వర వివరణ)

**నాదము :**

శ్రావ్యమైన శబ్దమే నాదము. శబ్దములు అనేకములు. చప్పుళ్లు అన్నియును శబ్దములే. నాదము శ్రావ్యమైనది, దీర్ఘమైనది. హెచ్చు తగ్గులు లేక ఒక నిర్ణీత వేపన (లేక) కంపన విలువ కలిగినది. నాదము=సౌండ్; శబ్దము=నాయిస్(NOISE).

నాదము భారతీయ విజ్ఞానమును అనుసరించి, ఆహతము, అనాహతము, అని రెండు విధములు. ఆహతము అనగా కొట్టబడినది. ప్రేరణచే కలిగినది. రెండు వస్తువుల పరస్పర సంఘర్షణ వలన కలిగినది అని అర్థము.

ఉదాహరణకు: గాత్రపాట-గొంతుకలో నున్న స్వరపేటిక యందు గల రెండు నాళముల మధ్య నుండి వచ్చు గాలి, ఆ నాళములకు తగిలి నాదము పుట్టుచున్నది. వీణా వాద్యము నందు వ్రేళ్లు, తీగెల సంఘర్షణ వలన, వైలెన్ యందు కమాను(BOW) తీగెలయందు సంఘర్షణ రాపిడి వలన, సన్నాయి యందు నాళద్వయము అనగా 'పీకె' యందు ఊదు గాలి,; మృదంగము నందు అరచేతులు, వ్రేళ్లు. మృదంగ నాళమున మూయబడిన చర్మము యొక్క సంఘర్షణ వలననూ నాదము కలుగుచున్నది.

**ఆహతనాదము :**

ఆహతనాదము శృతియై, స్వరమై, స్థాయియై, గమకమై, రాగమై, సంగీతమై ప్రపంచమున సాటిలేని శాస్త్రమై, విద్యయై, కళయై ప్రకాశించుచు, భగవంతుని ఉనికికి ఉదాహరణమై, అనిర్వచనీయమైన ఆనందహేతువై, భక్తికి, ఆధ్యాత్మ జ్ఞానమునకు ఆలవాలమై అలౌకిక శక్తి కలిగి, దేశ, కాల పరిస్థితులకు అతీతమై మానవులకు జీవన్ముక్తిని ప్రసాదించుచున్నది.

**అనాహత నాదము :**

ఈ నాదము స్వయంభూ. స్వయముగానే పుట్టుచున్నది. ప్రేరణ, ఘర్షణ ఈ అనాహత నాదమునకు అవసరము లేదు. ఈ నాదమే నాదబ్రహ్మము. ఈ అనాహతనాదము మహర్షులచే ఉపాసితమై హృదయమున స్థితమై యున్నది. అనాహత నాదోపాసన చేసిన మహర్షులే త్రిమూర్తులైన శంకరుడు, నారాయణుడు, బ్రహ్మ, అను భగవత్ పట్టములను పొందిరి. "నాదోపాసన చేసి శంకర నారాయణ విధులు వెలసిరి" (త్యాగరాజస్వామి) ఈ అనాహత నాదము చెవికి వినిపించదు. స్వానుభవేద్యము. దివ్యత్వమును కలిగి ఉండును. కేవల తపస్సు వలన, ధ్యానము వలన, మాత్రమే ఈ నాదమును వినుట సాధ్యము.

## 6. నాదోత్పత్తి :

"ప్రాణానల సంయోగము వలన ప్రణవ నాదము సప్తస్వరములై బరిగె" (త్యాగరాజస్వామి) నాదోత్పత్తి, ప్రాణము, అనల=అగ్ని=సంకల్పము వలన కలుగుచున్నది. మానవుని బ్రహ్మగ్రంధియగు మూలాధారము నుండి వెలువడి క్రమముగా నాభి, హృదయ కంఠ, శిరస్సుల యందు సూక్ష్మములైన స్థాయిభేదములు చెందుచు శ్రావ్యమై పయనించుచు యొప్పుచున్నది. నకారము=ప్రాణము; దకారము=అగ్ని, ఈనాదము నాభియందు అతి సూక్ష్మమై, హృదయమునందు సూక్ష్మమై, కంఠమునందు పుష్టమై, శిరస్సు నందు అపుష్టమై, ముఖమునందు కృత్రిమమై తోచుచున్నది అని శాస్త్రము చెప్పుచున్నది. కాని నాద స్థాయి, ఘన, భేదములు అన్నియును కంఠమునందు గల నాళములు, స్వరపేటిక యందే రూపొందుట "భౌతిక శాస్త్ర నిర్వచనము".

## 7. శృతి :

శృతి అనగా వినబడునది అని అర్థము. శ్రవణము=వినుట, శ్రవణేంద్రియము=చెవి, శ్రావ్యము=వినుటకు మధురము. వినేయోగ్యత కలిగినది (సంగీతము) అని అర్థము.

శృతి=అనగా వేదము అని అర్థము, వేదములు మహర్షులకు వారి తపస్సులో వినబడినవి కనుక.

సంగీతమున శృతి అనగా అతి సూక్ష్మమైన నాదము. నాదము స్థాయీ భేదము చెందునపుడు ఆ భేదము నందు గల అతి సూక్ష్మమైన నాదమునకు శృతి అని పేరు. ఆ స్థాయి భేదమునందు కలుగు రెండు హెచ్చుతగ్గుల నాదస్థాయి భేదములకు శృత్యంతరములని పేరు. ఈ నాద స్థాయీ భేదము సంగీతజ్ఞునికి స్పష్టముగా తెలియును. నాదస్థాయీ భేదములే శృతులు.

ఈ శృతులు ఒక స్థాయి యందు అనగా సప్తస్వర మండలమునందు. 22 కలవు అని సంగీత శాస్త్రకారులు చెప్పుచున్నారు. ఈ శృతులు పావు 1/4 స్వరములు.

స్వరము ఒక పూర్ణమైన స్వరము (FULL NOTE) అనగా ఒక యూనిట్ స్వరస్థానము అనగా అర్థ (1/2) యూనిట్. (సెమీటోన్). అర్థ స్వరము. శృతి అనగా పావు (1/4) యూనిట్ అనగా క్వార్టర్‌టోన్. పావుస్వరము. వీటి యొక్క ప్రమాణములకు సునిశితమైన సంగీతపరమైన చెవియే ప్రమాణము.

ఈ శృతుల పరిగణన పూర్వం ఒకలాగ ఉండేది. అంతకు పూర్వయుగంలో షడ్జమం, ఆధార షడ్జమంగా (ఫండమెంటల్ నోట్) ఇంకా పరిణామం చెందలేదు. అప్పుడు, షడ్జమం కూడా తక్కిన స్వరాల వలెనే చంచలముగా ఉండేది. ఆ కాలములో షడ్జమానికి 4 శృతులని రిషభానికి 3 శృతులని, గాంధారానికి 2 శృతులని మధ్యమానికి, పంచమానికి నాలుగు, నాలుగు శృతులని, ధైవతానికి 3 శృతులని, నిషాధానికి రెండు శృతులని పూర్వాచార్యులు నిర్వచించిరి.

శ్లో॥ చతుశ్చతు శ్చతుశ్చైవ షడ్జ పంచమ మధ్యమాః
ద్వేద్వేనిషాధ గాంధర స్త్రీ, స్త్రీ రిషభధైవతాః

వీటికి నియత శృతులని పేరు. (సామగాన మూర్ఛనకు నియత శృతులని గ్రహించవలెను.)

షడ్జమము పరిణామము చెందిన తరువాత స్వరములకు ఈ శృతులను నిర్ణయించే విషయంలో మార్పు వచ్చినది. ఆధునిక శృతుల నిర్ణయం తార్కిక విలువలు కలిగి ఉన్నది.

ఈ 22 శృతుల మధ్య, వాటి స్వభావాలను బట్టి 5 జాతులగ విభజింపబడ్డాయి. అవి దీప్త, ఆయత, మృదు, మధ్య, కరుణ. ఈ జాతుల వర్గీకరణకు ఆధునికంగా అవగాహన, ఆదరణ, ఉపయోగం లేదు. కేవలం గ్రంధాలలో నామ మాత్ర అవశిష్టంగా ఉన్నవి. (Mere Acadamic & Historical Interest) ఆ విధంగానే ఈ శృతుల పూర్వపు పేర్లు కూడా గ్రంధాలకు పరిమితంగానే ఉన్నవి. ఉపయోగంలో లేవు. ఆధునిక నామములు వాడుకలో ఉన్నవి.

స్వరములలో స, ప, అచలములు, వికృతి చెందవు. తక్కిన రిగమదని, ఒక్కొక్క స్వరము కోమలము తీవ్రము చొప్పున 10 స్వరస్థానములు స,ప లు చేరి 12 స్వర స్థానములైనవి. మరల ఆ స్వరస్థానములు ఒక్కొక్కటి రెండు చొప్పున విభాగములుగా అయి, 20 శృతులు అగుచున్నవి. ఈ 20 శృతులు స,ప లతో చేరి 22 అగుచున్నవి.

7. స్వరములు - 7

స్వరస్థానములు 12

| | | | |
|---|---|---|---|
| 1 | <u>స</u> | | <u>శృతులు 22</u> |
| 2 | రి | 1 స | 1 స |
| | | 2 శుద్ధరిషభం | 2 ఏక శృతి రిషభం 3 ద్విశృతిరిషభం. |
| | | 3 చతుశృతి రిషభం | 4 త్రిశృతి రిషభం 5 చతుశృతిరిషభం. |
| 3 | గ | 4 సాధారణ గాంధారం | 6 కోమల సాధారణ గాంధారం 7 సాధారణ గాంధారం. |
| | | 5 అంతర గాంధారం | 8 అంతర గాంధారం 9 చ్యుతమధ్యమ గాంధారం. |
| 4 | మ | 6 శుద్ధమధ్యమం | 10 శుద్ధమధ్యమం 11 తీవ్రమధ్యమం. |
| | | 7 ప్రతిమధ్యమం | 12 ప్రతిమధ్యమం 13 చ్యుతపంచమమధ్యమం |
| 5 | ప | 8 పంచమం | 14 పంచమం. |
| 6 | ద | 9 శుద్ధదైవతం | 15 ఏకశృతిదైవతం 16 ద్విశృతి ధైవతం. |
| | | 10 చతుశృతిదైవతం | 17 త్రిశృతి ధైవతం 18 చతుశృతి ధైవతం. |
| 7 | ని | 11 కైశిక నిషాధం | 19 కోమలకైశికనిషాధం 20 కైశికనిషాధం. |
| | | 12 కాకలి నిషాధం | 21 కాకలి నిషాధం 22 చ్యుత షడ్జమ నిషాధం. |

# 8. 22 శృతులు

| క్రమ సంఖ్య | ప్రాచీన శృతుల పేర్లు | జాతులు | 22 శృతుల ఆధునిక నామములు | ఆ శృతులువచ్చు రాగముల పేర్లు |
|---|---|---|---|---|
| 1 | తీవ్ర | దీప్త | కైశికనిషాధం | ఖరహరప్రియ |
| 2 | కుముద్వతి | ఆయత | కాకలినిషాధం | బేగడ |
| 3 | మంద | మృదూ | చ్యుతషడ్జమనిషాధం | కళ్యాణి, కురంజి |
| 4 | ఛందోవతి | మధ్య | షడ్జమం | అన్ని రాగములు |
| 5 | దయావతి | కరుణ | ఏకశృతి రిషభం | గౌళ |
| 6 | రంజని | మధ్యా | ద్విశృతి రిషభం | తోడి |
| 7 | రతిక | మృదూ | త్రిశృతి రిషభం | కాంభోజి |
| 8 | రౌద్రీ | దీప్తా | చతుశృతి రిషభం | శంకరాభరణం |
| 9 | క్రోధీ | ఆయత | కోమల సాధారణ గాంధారం | నాయకి, శ్రీరాగం |
| 10 | వజ్రిక | దీప్త | సాధారణ గాంధారం | రీతిగౌళ |
| 11 | ప్రసారిణి | ఆయత | అంతర గాంధారం | మోహన |
| 12 | ప్రీతి | మృదు | చ్యుతమధ్యమ గాంధారం | సురటి, ఆరభి |
| 13 | మార్జనీ | మధ్య | శుద్ధ మధ్యమం | హిందోళ |
| 14 | క్షితీ | మృదూ | తీవ్రమధ్యమం | బేగడ |
| 15 | రక్తా | మధ్యా | ప్రతిమధ్యమం | కళ్యాణి |
| 16 | సందీపిని | ఆయత | చ్యుతపంచమ మధ్యమం | కామవర్ధని |
| 17 | ఆలాపిని | కరుణ | పంచమం | పంచమం కలిగిన అన్ని రాగాలు |
| 18 | మదంతి | కరుణ | ఏక శృతి ధైవతం | సావేరి |
| 19 | రోహిణి | ఆయత | ద్విశృతి ధైవతం | భైరవి |
| 20 | రమ్యా | మధ్యా | త్రిశృతి ధైవతం | కాంభోజి |
| 21 | ఉగ్రా | దీప్త | చతుశృతి ధైవతం | భైరవి |
| 22 | క్షోభిణి | మధ్య | కోమలకైశికనిషాధం | నాయకి, శ్రీరాగం |

# 9. శృతులు, సెంట్లు, వేపనములు, భిన్నములు

మధ్య స్థాయి యందుగల 22 శృతుల వేపనములందునూ భిన్నములందును, సెంట్లు అను నాద కొలతల ద్వారా వ్యక్తము చేయబడినవి.

| క్రమ సంఖ్య | శృతుల స్వరములు | విలువ సెంట్లు | ఒకక్షణమునకు వేపనములు | భిన్నములు | ఆ శృతులు వచ్చు రాగములు |
|---|---|---|---|---|---|
| 1. | స | 0 | 240 | 1 | |
| 2. | රి1 | 90 | 252.8 | 256/243 | గౌళ, సౌరాష్ట్ర |
| 3. | රి2 | 112 | 256 | 10/15 | మాయామాళవగౌళ |
| 4. | రి3 | 182 | 266.6 | 10/9 | భైరవి, శ్రీరాగం |
| 5. | రి4 | 204 | 270 | 9/8 | శంకరాభరణం |
| 6. | గ1 | 294 | 284.4 | 32/27 | వరాళి, శ్రీరాగం, భైరవి |
| 7. | గ2 | 316 | 288 | 6/5 | ఖరహరప్రియ |
| 8. | గ3 | 386 | 300 | 5/4 | శహన |
| 9. | గ4 | 408 | 303.75 | 81/64 | కళ్యాణి |
| 10. | మ1 | 498 | 320 | 4/3 | హిందోళ, కుంతలవరాళి |
| 11. | మ 2 | 520 | 324 | 27/20 | బేగడ, గౌళీపంతు |
| 12. | మ3 | 590 | 337.5 | 45/32 | కళ్యాణి |
| 13. | మ4 | 610 | 341.7 లేక 341.3 | 729/5/2 లేక 64/45 | వరాళి |
| 14. | ప | 702 | 360 | 3/2 | అన్ని పంచమ రాగాలు |
| 15. | ద1 | 792 | 379 | 120/81 | సావేరి |
| 16. | ద2 | 812 | 384 | 8/5 | మాయామాళవగౌళ, భౌళి |
| 17. | ద3 | 884 | 400 | 5/3 | కాంభోజి |
| 18. | ద4 | 906 | 405 | 27/16 | కళ్యాణి, అభోగి |
| 19. | ని1 | 996 | 426.6 | 16/9 | మధ్యమావతి, భైరవి |
| 20. | ని2 | 1018 | 432 | 9/5 | ఖరహరప్రియ |
| 21. | ని3 | 1088 | 450 | 15/8 | |
| 22. | ని4 | 1110 | 455.6 | 243/128 | కురంజి, దేవగాంధారి, నీలాంబరి |
| | స | 1200 | 480 | 2 | |

# 10 శృతుల విషయ విశ్లేషణ

ప్రపంచ సంగీత చరిత్రలో శృతులను (క్వార్టర్-టోన్స్) ఉపయోగించిన ఘనత భారతదేశమునదే.

భారతదేశ సంగీతము యొక్క విశిష్టత, రాగ పద్ధతి వలన కలిగినది. రాగము యొక్క గొప్పతనము, విశేషము-లోకోత్తరత రాగమున గల "గమకము" వలన కలిగినది. గమకము యొక్క ఘనత ఏమి యనగా తన యందు ఇమిడియున్న శృతులను ఉపయోగించుట వలన కలిగినది.

ఒక్కమాటలో చెప్పవలెనన్న శృతుల ఉపయోగము వలన గమకములు, గమకముల ఉపయోగము వలన రాగము, రాగ పద్ధతి వలన భారతదేశ సంగీతము ప్రపంచ సంగీత రీతులలో ఒక విశిష్ఠ స్థానమును పొందినది.

శృతి, గమకము, రాగము, అను పదములు భారతదేశ సంగీతమున తప్ప మరి ఏ ఇతర సంగీత పద్ధతి యందును లేవు. భారతదేశ సంగీతమునకు శృతులు ఒక వినూత్న సౌరభమును తెచ్చిపెట్టినవి.

పురాతన తమిళ, సంస్కృత గ్రంథములలో 22 శృతులను గురించి ప్రస్థావించుచు భారతీయ రాగములకు 22 శృతుల ఉనికియే జీవనాధారములని నిర్వచించబడియున్నది. ఒక స్థాయి యందు శృతులు 22 అని, 24 అని, 27 అని, 32 అని, 40 అని, 53 అని, 96 అని. వివిధ పూర్వ సంగీత శాస్త్రజ్ఞులు వివిధ అభిప్రాయములను వెల్లడించిరి. సంగీతజ్ఞుడైన పాల్కురికి సోమనాథుకవి శృతులు 22 అని నిర్వచించెను. ఒక స్థాయి యందు 240 కంపనములు లేక వేపనములు కలవు. అవి అన్నియు సూక్ష్మ శృతులే సూక్ష్మ స్వరములే (Micro tones) కాని శ్రావ్యత కలిగి, రెండు స్వరములకు మధ్య మైత్రి కలిగినవే సంగీత శృతులన వచ్చును. తక్కినవి వదలి పెట్టబడినవి.

సంగీతజ్ఞులలో కొందరికి శృతులను గూర్చి లక్షణ జ్ఞానము లేక పోయినను వారు ఈ శృతులను లక్ష్య శుద్ధితో వారి రాగ గమకములలో వాడుచూనే యున్నారు. శృతుల యొక్క ఉనికి వలన భారతదేశ సంగీతము అత్యున్నత దశకు అభివృద్ధి అయినది అనుటకు ఇది తార్కాణము.

భాష మాట్లాడువారిలో కొందరికి వ్యాకరణ జ్ఞానము చదువు లేనప్పటికి వారు

వ్యాకరణ యుక్తముగా మాట్లాడ కలిగినట్లే, సంగీతజ్ఞులందరూ ఈ శృతులను సరియైన పద్ధతిలోనే శ్రావ్యతతోనే ఉపయోగించు చున్నారు. సురటి రాగమునందు నీనిదపా, భైరవి రాగమునందు దని సనీదప, తోడిరాగమునందు సరిగారిసా అను ప్రయోగముల గమకములలో శృతులు ఇమిడియున్నవి. గురుముఖతః, సంగీత భాషా 'నుడికారం', అవగాహన, వలన ఆయా శృతులను, సంగీత విద్వాంసుడు, విద్యార్థిదశలోనే నేర్చుకొని అవగాహన చేసుకొనును.

భారతీయ సంగీతములో ఈ శృతుల పరిజ్ఞాన విషయము చాలా సూక్ష్మమై, కష్టతరమైనది. 7 స్వరములు, 12 స్వరస్థానములు చెవికి స్పష్టముగా వినిపించుటయే గాక సంగీత వాద్యములందు స్పష్టముగా కనిపించునుకూడా. కాని శృతులు, సూక్ష్మస్వరములు. అరుంధతి నక్షత్రమువలె, నక్షత్రముల మిణుకు మిణుకుల వలె స్పష్టముగ వినిపించదు, అవగాహనకాదు. నిర్వచించుటకు నిర్దుష్ట రూపముగ తోచదు. కాని మనస్సుకు అంతరాళములకు అవగాహన అగును. శృతులు గమకమును ఆశ్రయించి ఉన్నవని, గమకములు రాగములను ఆశ్రయించి యున్నవని, ఆ రాగములు నిర్దుష్ట స్వరూప స్వభావములు, రాగభావములు, కలిగి యున్నవని సంగీతజ్ఞులకే గాక సంగీత రసజ్ఞులకు కూడ అనుభవేద్యమే. ఈ రాగభావము, రాగరసము, శృతుల ఉపయోగము వలన కలుగుచున్నది.

స్వరముల మధ్య గల శృతులు అన్నీ ఒకే విలువ కలిగిలేవు. ఈ శృతుల విలువలు మూడు విధాలుగా ఉన్నవి. మూడు పరిమాణాలు కలిగియున్నవి. సూక్ష్మము, సూక్ష్మతరము, సూక్ష్మతమములుగా ఉన్నవి. అవి క్రమంగా 81/80. భిన్నము కలిగినవిగా కొన్ని ఉన్నవి. వీటికి 22 సెంట్లు. "డిడిమస్ యొక్క కామా" అని అందురు. ఇది ప్రమాణ శృతి. ఈ శృతి అతి సూక్ష్మమైనది. ఇంత కంటె కొంచెముగా పెద్దది. 25/24. ఈ శృతికి 70 సెంట్లుకలవు. ఈ శృతి న్యూన్య శృతి. ఈ శృతి కంటె కొంచెము పెద్దది పూర్ణశృతి 256/243 భిన్నము కలిగి పైథాగరస్ లిమ్మా అనబడుచున్నది. ఈ శృతికి 90 సెంట్లు. మొత్తము ఒకస్థాయి యందు ఈ 3 ఏక శృతుల పరిమాణ భేదములతోనే 22 శృతులు ఉన్నవి. 81/80 శృత్యంతరము కలిగిన దానికి ప్రమాణ శృతియని, 25/24 భిన్నము కలిగిన శృతికి న్యూన శృతియని 256/243 భిన్నము కలిగిన శృతికి ప్రమాణ శృతి యని వ్యవహరించుచున్నారు.

ఈ 22 శృతులు కలిగిన స్వరమండలమును స్థాయి అనుచున్నారు. ఒక స్థాయి అనగా 22 శృతి అంతరములు కలిగిన సప్త స్వరమండలము లేక ద్వాదశ స్వరస్థానమండలము అనవచ్చును. ఈ 22 శృతులలో పూర్ణ శృతులు (256/247) ఏడు, న్యూనశృతులు (25/24) అయిదు, ప్రమాణ శృతులు (81/80) పది కలవు.

రెండు స్వరముల మధ్య ఒక ప్రమాణ శృతి 81/80 అంతరము లేకపోయినచో అవి శ్రావ్యత కలిగిన స్వరములు కావు అని అర్థము. వాటికి సంగీత విలువలు ఉండవు.

ఏక శృత్యంతర విలువలు 3 ఉన్నట్లే. ద్విశృత్యంతర విలువలు 2 ఉన్నాయి అవి క్రమంగా 16/15;135/128 భిన్నములుగా ఉన్నాయి. మొదటిది డైటానిక్ సెమిటోన్: పూర్ణద్విశృతి అంతరం. దీనికి 112 సెంట్లు. రెండవది సెమిటోను అనగా అర్ధ స్వరం లేక పూర్ణమైన స్వరస్థానానికన్న తక్కువగా పలుకుతుంది. దీనిని న్యూన ద్విశృత్యంతరం అంటారు. ఈ ద్విశృతికి (92 సెంట్లు)

త్రిశృత్యంతరం మాత్రం ఒక్కటే ఉంది. అది 10/9; (182 సెంట్లు). ఈ శృతిని మైనర్‌టోన్ అంటారు. (Minor Tone) చతుశృత్యంతరం కూడా ఒక్కటిగానే ఉంది. 9/8;204 సెంట్లు. ఈ శృతిని మేజర్‌టోన్ అంటారు. (Major Tone).

22 శృతుల మధ్య ఉండే ఏక శృత్యంతరాలు సమానాంతరాలుగా లేక 3 విధములుగా హెచ్చుతగ్గులు ఉండుట భారతదేశ సంగీత ప్రత్యేకత. భారతీయ సంగీతానికి **శృతి**మయమైన గమకం ముఖ్యం. స్వరాలను పాడిగా పాడినా, వాయించినా అది భారతీయ సంగీతంగా అంగీకరింపబడదు అనునది సత్యము. మన సంగీతము "జస్ట్ ఇంటోనేషన్" "JUST INTONATION" గా పరిణామాన్ని పొందింది.

## 11 షడ్జ మధ్యమ, పంచమ భావములు - 22 శృతులు

పూర్వపు సంగీత మహర్షులు 22 శృతులను కనుగొని ఆ శృతులను స్వరముల మధ్య వాడుచుండుట, 22 శృతుల పరిశోధన ఆశ్చర్యకరము అద్భుతము. ఆధునికుల పరిశోధనల యందుగల వేపనముల సంఖ్య, భిన్నములు, సెంట్లు మొదలైన సూక్ష్మమైన గణితమునకు భేదము ఏ మాత్రము లేక సరిపోవుట ఆశ్చర్యము. వారికి వీణ, చెవి మాత్రమే ఆధారము. ఆ ఆధారముతో మాత్రమే ఎంతో ఎత్తైన విలువలను స్థాపించిరి. వారు ఋగ్వేద మంత్రములను శ్రావ్యముగా, స,మ,ప, స్వరములలో పాడుటయేగాక షడ్జమమును ఆధార స్వరముగా చేసుకొనిరి.

ఈ స, మ, ప, లు సంవాదులు. షడ్జ-పంచమ భావము, షడ్జ-మధ్యమ భావములను ప్రస్థరించి పరిశోధించగా 22 శృతులు ఏర్పడినవి.

"షడ్జపంచమ భావేన శృతి ద్వావింశతిం జగుః"
("అహోబలుడు సంగీత పారిజాతం")

షడ్జ పంచమ భావము. ఆరోహణ క్రమముగా ప్రస్థరించిన 10 తీవ్ర శృతులు వచ్చును. 1. ద్విశృతి రిషభము, 2. చతుశృతి రిషభము, 3. సాధారణ గాంధారము, 4. చ్యుత మధ్యమ గాంధారము, 5. తీవ్ర మధ్యమము, 6. చ్యుత పంచమ మధ్యమము 7. ద్విశృతి ధైవతము, 8. చతుశృతి ధైవతము, 7. కైశిక నిషాదము, 10. చ్యుత షడ్జమ నిషాధము వచ్చును.

ఆరోహణ క్రమమున షడ్జమధ్యమ భావముగ ప్రస్థరించిన 10 కోమల శృతులు వచ్చును. 1. ఏకశృతి రిషభము, 2. త్రిశృతి రిషభము, 3. కోమల సాధారణ గాంధారము, 4. అంతర గాంధారము, 5. శుద్ధ మధ్యమము, 6. ప్రతి మధ్యమము, (పంచమము) 7. ఏక శృతి ధైవతము, 8. త్రిశృతి ధైవతం, 9. కోమల కైశిక నిషాధము, 10. కాకలి నిషాధము వచ్చును.

**12 షడ్జ–పంచమ భావము** అనగా షడ్జమమునకు పంచమ మునకు గల మధ్య దూరము అనియును, షడ్జ-పంచమముల సంవాదిత్వము (HARMONY) అనియును, అనగా ఆ రెండు స్వరములను ఒకే సారి ధ్వనింప చేసినచో వినిపించు శ్రావ్యత అనియును అర్ధము. షడ్జ పంచమములే గాక ఆ రెండు (షడ్జపంచమ) స్వరముల మధ్యగల దూరము (3 స్వరములు గాని 6 స్వరస్థానములు గాని 12 శృతులుగాని) ఉండిన మరి ఏ ఇతర రెండు స్వరములైనను షడ్జ-పంచమ భావము కలిగినవి అని అర్ధము.

ఉదా:- ఆరోహణ క్రమమున :- (1) స – ప ; (2) శు . రి – శు. ధై ; (3) చ . రి – చ. ధ ; (4) సాధారణ . గ – కై . ని ; (5) అంగ – కాని ; (6) శుమ – తార . స ; (7) ప్ర . మ – శు రి ; (8) ప – చ . రి ; (9) శు ధై – సాధారణ . గ ; (10) చ . ద – అంగ ; (11) కై . ని – శు . మ ; (12) కా . ని – ప్ర . మ ; (13) తా ర . స – ప

పై పన్నెండు జతలు స ప భావమున వచ్చిన కవల స్వరములు. ఈ షడ్జ-పంచమ భావ స్వరములను శృతుల భిన్నముల (లెక్కలలో) లో ప్రస్థరించినచో (1) ద్విశృతి రిషభము; (2) చతుశృతి రిషభం; (3) సాధారణ గాంధారం; (4) అంతర గాంధారం; (5) తీవ్రమధ్యమం; (6) చ్యుత పంచమ మధ్యమం; (7) ద్విశృతి ధైవతం; (8) చతుశృతి ధైవతం; (9) కైశిక నిషాధం; (10) చ్యుత షడ్జమ నిషాధంము యొక్క భిన్నములు వచ్చును.

**13. షడ్జ మధ్యమ భావము :-** అనగా షడ్జమమునకు శుద్ధ మధ్యమమునకు గల సంబంధము, (లేక) మధ్య దూరము అనియునూ స – శు.మ స్వరముల సంవాదిత్వము

(HARMONY) అనియునూ, అనగా స-శు.మ స్వరములను ఒకేసారి ధ్వనింప చేసినచో వినిపించు శ్రావ్యత అనియును అర్థము. స, శు.మ స్వరములే గాక అట్టి సంబంధము, అట్టి దూరము. అట్టి శ్రావ్యత గలిగిన మరి ఏ ఇతర (స-శు.మ భావముకలిగిన) రెండు స్వరములైనను షడ్జ-మధ్యమ భావము కలిగినవి అని అర్థము.

ఉదా:- ఆరోహణ క్రమమున :- (1) స - శ.మ; (2) శు . రి - ప్ర . మ ; (3) చ . రి - ష ; (4) సాధారణ.గ - శు.ధ; (5) అం . గ - చ . ద ; (6) శు . మ - కై . ని ; (7) ప్ర మ - కా . ని ; (8) ప - స ; (9) శు . ధ - శు రి ; (10) చ . ద - చ . రి ; (11) కై . ని సాధారణ . గ ; (12) కా . ని - అంగ ; (13. స - మ) ఈ పన్నెండు స - శు మ భావమున వచ్చిన కవల స్వరములు. వీటిని శృతుల భిన్నములలో లెక్కించి ప్రస్థరించినచో ; క్రమముగా.

(1) ఏకశృతి రిషభము ; (2) త్రిశృతి రిషభము (3) కోమల సాధారణ గాంధారము; (4) అంతర గాంధారము ; (5) శుద్ధ మధ్యమము (6) ప్రతి మధ్యమము ; (7) ఏక శృతి ధైవతము ; (8) త్రిశృతి ధైవతము ; (9) కోమల కైశిక నిషాధము ; (10) కాకలి నిషాధముల యొక్క భిన్నములు వచ్చును.

ఇట్లు, షడ్జ పంచమ భావమున పది తీవ్ర శృతులు అనగా 2, 4, 6, 8, 10, 12, 14, 16, 18, 20 శృతులు షడ్జ మధ్యమ భావమున పది కోమల శృతులు అనగా 1, 3, 5, 7, 9, 11, 13, 15, 17, 19 శృతులు స, ప, శృతులతో చేరి మొత్తము 22 శృతులగుచున్నవి.

స-ప; స-మ; భావముల ప్రస్థారముచే కలుగు 22 శృతుల పట్టిక :-

**14. 22 శృతులు – షడ్జ మధ్యమ, షడ్జ పంచమ భావములు, భిన్నములు**

| షడ్జ పంచమ భావము | షడ్జ మధ్యమ భావము |
|---|---|
| 1) షడ్జమం | |
| 2) ఏక శృతి రిషభం 256/243 | 3) ద్విశృతి రిషభం 16/15 |
| 4) త్రిశృతి రిషభం 10/9 | 5) చతుశృతి రిషభం 9/8 |
| 6) కోమల సాధారణ గాంధారం 32/27 | 7) సాధారణ గాంధారం 6/5 |
| 8) అంతర గాంధారం 5/4 | 9) చ్యుత మధ్యమ గాంధారం 81/64 |

10) శుద్ధ మధ్యమం 4/3
11) తీవ్ర మధ్యమం 27/20
12) ప్రతిమధ్యమం 45/32
13) చ్యుత పంచమ మధ్యమం 729/512
14) పంచమం 3/2
15) ఏక శృతి ధైవతం 128/81
16) ద్విశృతి ధైవతం 8/5
17) త్రిశృతి ధైవతం 5/3
18) చతుశృతి ధైవతం 27/16
19) కోమల కైశిక నిషాధం 16/9
20) కైశిక నిషాధం 9/5
21) కాకలి నిషాధం 15/8
22) చ్యుత షడ్జమ నిషాధం 243/128

షడ్జపంచమ భావమును అవరోహణ క్రమమున ప్రస్థరించినచో షడ్జమధ్యమ భావమున వచ్చు 10 కోమల శృతులు వచ్చును. (10వ శృతి పంచమమునకు ఒక్క శృతి తక్కువగా వచ్చును).

స్వరములు, స్వరస్థానములు, భగవంతుని విగ్రహముల వలె సూర్యచంద్రులవలె కనిపించును అవి విశ్వజనీనములు (యూనివర్సల్) బాహ్య చెవికి వినిపించును.

శృతులు అట్లుగాక సూక్ష్మ శ్రవణేంద్రియమునకు మాత్రమే అవగాహన అగును. భగవంతుని విగ్రహము వలె గాక భగవంతునివలె నుండును. స్వానుభవేద్యము. శృతుల విషయంలో ఒక అనిర్వచనమైన సూక్ష్మ జ్ఞానము కావలెను. అట్టి సూక్ష్మజ్ఞానము వివిధమైన పండితులలో వివిధములుగ ఉండును. ఇది విచిత్రము.

శృతులయొక్క భిన్నములు, సెంట్లు, వేపనముల విషయములలో పూర్వంలో ఏ ఒక పండితుడు ఇంకొక పండితునితో ఏకీభవించలేదు. విషయము అంత జటిలము, క్లిష్టము. శృతుల వేపనముల సంఖ్య, భిన్నములు, సెంట్లు గణితమునకే పరిమితము. లక్షణ గ్రంధమునకే పరిమితము. లక్ష్యమునందు శృతుల ఉనికి ప్రతి పండితునికి, విద్వాంసునికి మనస్సునకు తోచినను ఇదమిద్ధమని నిర్వచించుటకు వీలు ఉండదు. అంత అవ్యక్తమైనది ఈ 22 శృతుల విషయ అవగాహన.

ఉదాహరణకు ఏక శృతి రిషభము శుద్ధరిషభము యొక్క (క్రింది) కోమల భాగము. ద్విశృతి రిషభము, శుద్ధ రిషభము యొక్క పై భాగము. అంతవరకు నిజము. ఈ విభాగముల యొక్క పరిధి ఎంత అను విషయము అనూహ్యము అవ్యక్తము. శృతులు ఇసుక రేణువుల

వంటివి. చిటికెడు, గుప్పెడు అనుట తప్ప ఎన్ని కణములు ఉన్నవని వివరించ వీలుపడదు. "ఈలాగని వివరింపలేము చాలా స్వానుభవేద్యము" (త్యాగరాజస్వామి). స్వరములకుగాని, స్వరస్థానములకుగాని, శృతులకుగాని శ్రావ్యత ప్రధానము, సంగీతానందము ప్రధానము

ఈ సంగీత సుఖం, సంగీతానందం కూడా కొంతవరకు ఒక సంప్రదాయాన్ని అనుసరించిన అలవాటే.

పాశ్చాత్య సంగీతంలో గాత్ర సంగీతం, సంగీత నాటకంలోని సంగీతం, భారతీయ సంగీత శ్రోతకు శ్రావ్యముగా వినుపించకపోవచ్చును. స్వరస్థానములను వరుసగా పాడుతోన్నట్లు ఉండి రసించుట దుర్లభమగును. అటులనే మన సంగీతమున కంపిత గమకము శంకరాభరణమున మధ్యమము ఖరహరప్రియందు గ,ని, లు తోడిలో ఇంచుమించు అన్ని స్వరములకు ఈయబడు గమకములు పాశ్చాత్య సంగీతాన్ని వినుటకు అలవాటు పడిన శ్రోతకు అపస్వరములుగా తోచవచ్చును.

మధ్యప్రాచ్య సంగీతమున మన రాగములే వినిపించును కాని అన్ని స్వరములు హెచ్చు తగ్గులుగానే వినిపించును. సంగీతము ఎంత విశ్వజనీనమైనను కొంతవరకు ప్రాంతీయ భేదములు లేకపోలేదు.

అసలు శృతులు ఎన్ని? ఏయే శృతులు సంగీతపరమైనవి? సంగీత యోగ్యమైనవి? అను విషయాలు అవ్యక్తాలుగానే ఉన్నాయి. ఈ విషయం వీడని చిక్కు.

అట్లాగని, సూక్ష్మ శృతుల జోలికి పోకుండా స్వరస్థానములలోనే రాగములు పాడిన దేవుడులేని గుడివలె, భావములేని కవిత్వమువలె, ఎండిన వృక్షమువలె, నిస్సారముగా ఉండును. శృతుల ఉనికియే సంగీతమునకు జీవము. ఈ శృతులకు ప్రత్యేక ప్రతిపత్తి లేదు. కొన్ని గమకములను ఆశ్రయించి ఉన్నవి కొన్ని స్వరభాగములుగా ప్రకాశించుచున్నవి. స్వరములు తారలు, శృతులు తారల సూక్ష్మ కిరణములు. (మిణుకు మిణుకులు).

ప్రతి మానవుని చుట్టూ ఒక (AURA) ప్రకాశం ఉంటుంది అనే విషయం, ఆధ్యాత్మిక భౌతిక శాస్త్రజ్ఞులు నిర్ణయించి చెప్పిన విషయమే. ఈ ప్రకాశం (AURA) బాహ్యదృష్టికి తోచదు. కాని మనసునకు ద్యోతకమగును అదియే ఆకర్షణ. అట్టి ఆకర్షణయే శృతుల ద్వారా స్వరములకు రాగములకు కలుగుచున్న ఆకర్షణ. సంగీతానికి మాధుర్యాన్ని ప్రసాదించేవే **శృతులు.**

ఒక నిర్దుష్టమైన స్వరస్థానమునకు ఒక నిర్దుష్టమైన శృతి కలదుగదా. ఆ శృతియే ఆస్వర స్థానము. ఆ స్వరస్థానమే స్వయంరంజకత్వము గల స్వరమైనది. శృతి, స్వరస్థానము, స్వరము అవినా భావముగా ప్రకాశించును. సామగానము నుండి పరిణామము చెందిన సామగాన మూర్ఛన యందుగల స్వరముల స్థానములను నిర్ణయించుటలో శృతులను కనుగొనిరి.

సామగాన మూర్ఛనలో గల స్వర సప్తమునకు (స,రి,గ,మ,ప,ద,ని అను స్వరములకు) క్రమముగా 4,3,2,4,4,3,2 శృతులలో ఉండినట్లు కనుగొనిరి. ఇవియే నియతశృతులు. సామ గాన మూర్ఛనలో గల స్వరములకు నియత శృతులు.

22 శృతుల పేర్లు, మొట్టమొదటిసారిగా భరతుని నాట్య శాస్త్రమున వివరింపబడినది. తరువాత సంగీత రత్నాకరమునందు, సంగీత పారిజాతము నందు సంగీత దర్పణమునందు నాట్యశాస్త్రము నందువలెనే ఉన్నవి.

## 15. 22 శృతుల భిన్నములను లెక్కించుట

ఒక క్షణమునకు 240 వేపనములు (Per Second) అయిన ఆ స్థాయి ప్రపంచవ్యాప్తంగా "షడ్జమము" (Fundamental Note) అను ఒక (Understanding) (Convention) నిర్ణయము కలదు. ఇదియే (Absolute Pitch) కేవల స్థాయి.

240 వేపనములు, ఒక క్షణమునకు గల స్థాయి షడ్జమం అయినచో ఆ స్థాయియందు తక్కిన శృతులు భిన్నములలో దిగువ నుదహరించబడినది.

స=240=1 1 అనుకొని లెక్కకు ఉపక్రమించవలెను.

ప్రమాణశృతి:81/80; న్యూనశృతి:25/24; పూర్ణశృతి:256/243 ఈ మూడు ఏకశృత్యంతరములు.

$$1 \times \frac{256}{243} = \frac{256}{243} = \text{ఏకశృతి రిషభం}$$

$$\frac{256}{243} \times \frac{81}{80} = \frac{16}{15} = \text{ద్విశృతి రిషభము}$$

$\frac{16}{15} \times \frac{25}{24} = \frac{10}{9}$ = త్రిశృతి రిషభం

$\frac{10}{9} \times \frac{81}{80} = \frac{9}{8}$ = చతుశ్శృతి రిషభం

$\frac{9}{8} \times \frac{256}{243} = \frac{32}{27}$ = కోమల సాధారణ గాంధారం లేక శుద్ధ గాంధారం

$\frac{32}{27} \times \frac{81}{80} = \frac{6}{5}$ = సాధారణ గాంధారం లేక షట్శృతి రిషభం

$\frac{6}{5} \times \frac{25}{24} = \frac{5}{4}$ = అంతర గాంధారం

$\frac{5}{4} \times \frac{81}{80} = \frac{81}{64}$ = చ్యుత మధ్యమ గాంధారం లేక పైథాగరస్ మేజర్ (Pythogorean Major Third)

$\frac{81}{64} \times \frac{256}{243} = \frac{4}{3}$ = శుద్ధ మధ్యమం

$\frac{4}{3} \times \frac{81}{80} = \frac{27}{20}$ = తీవ్ర మధ్యమం

$\frac{27}{20} \times \frac{25}{24} = \frac{45}{32}$ = ప్రతి మధ్యమం

$$\frac{45}{32} \times \frac{81}{80} = \frac{729}{512}$$ = చ్యుత పంచమ మధ్యమం

$$\frac{729}{512} \times \frac{256}{243} = \frac{3}{2}$$ = పంచమం

$$\frac{3}{2} \times \frac{256}{243} = \frac{128}{81}$$ = ఏక శృతి ధైవతం

$$\frac{128}{81} \times \frac{81}{80} = \frac{8}{5}$$ = ద్విశృతి ధైవతం

$$\frac{8}{5} \times \frac{25}{24} = \frac{5}{3}$$ = త్రిశృతి ధైవతం

$$\frac{5}{3} \times \frac{81}{80} = \frac{27}{16}$$ = చతుశృతి ధైవతం

$$\frac{27}{16} \times \frac{256}{243} = \frac{16}{9}$$ = కోమల కైశిక నిషాధం

$$\frac{16}{9} \times \frac{81}{80} = \frac{9}{5}$$ = కైశిక నిషాధం

$$\frac{9}{5} \times \frac{25}{24} = \frac{15}{8}$$ = కాకలి నిషాధం

$$\frac{15}{8} \times \frac{81}{80} = \frac{243}{128}$$ = చ్యుత షడ్జమ నిషాదం

$$\frac{243}{128} \times \frac{256}{243} = 2$$ = తార షడ్జమం

ఈ 22 శృత్యంతరాలలో

ప్రమాణ శృతులు 81/80 - 10

పూర్ణ శృతులు 256/243 - 7

న్యూన శృతులు 25/24 - 5 ఉన్నవి

16. భరతుని నాట్యశాస్త్రమున, శార్ఙ్గదేవుని సంగీత రత్నాకరమున శృతులు పేర్లు.

| | | |
|---|---|---|
| షడ్జమం | - | తీవ్ర, కుముద్వతి, మంద, ఛందోవతి |
| రిషభం | - | దయావతి, రంజని, రతిక |
| గాంధారం | - | రంధ్రి, క్రోధ |
| మధ్యమం | - | వజ్రిక, ప్రసారిణి, ప్రీతి, మార్జని |
| పంచమం | - | క్షితి, రక్త, సందీపిని, ఆలాపిని |
| ధైవతం | - | మదంతి, రోహిణి, రమ్యా |
| నిషాధం | - | ఉగ్ర, క్షోభిణి |

చిట్ట చివర క్రింది గీత గల శృతులు, నియత శృతులు (అనగా) సామగాన మూర్ఛన యొక్క నియత శృతులు (అనగా) ఇంచుమించు ఖరహరప్రియ మేళరాగ మూర్ఛనకు సమానమగు శృతులు.

17. నారదుని సంగీత మకరందమున స్వర శృతుల పేర్లు

| | | |
|---|---|---|
| షడ్జమం | - | సిద్ధ, ప్రభావతి, కాంత, సుప్రభ |
| రిషభం | - | సిఖ, దీప్తిమతి, ఉగ్ర |

గాంధారం - హ్లాది, నిర్వీరి

మధ్యమం - దిరా, సర్వసహా, క్షాంతి, విభూతి

పంచమం - మాలిని, చపల, బాల, సర్వరత్న

ధైవతం - శాంత, వికలిని, హృదయోన్మాలిని

నిషాధం - విసారిణి, ప్రసన్న

భావభట్టుని "అనుపసంగీత విలాసము" నందు గల స్వర శృతుల పేర్లు.

షడ్జమం - నందనా, నిష్కళ, గుడ, సకల

రిషభం - మధుర, లలిత, కక్షర

గాంధారం - భ్రగజాతి, హ్రస్వగీతి

మధ్యమం - రంజిక, చాపర, పూర్ణ, అలంకారిణి

పంచమం - వైణిక, వలితా, త్రిస్థానా, సుస్వర

ధైవతం - సౌమ్య, భాషాంగిక, వార్తిక

నిషాధం - వ్యాపకా, ప్రసన్నా, సుభగ

ఒకస్థాయిని చేయగలుగు రెండు శృత్యంతరముల మొత్తము ఒకస్థాయి (OCTAVE) అగును.

ఉదాహరణకు సంవాది శృతిద్వయం

పంచమ శృతులు + శుద్ధమధ్యమ శృతులు కలసిన ఒకస్థాయి అగును.
సెంట్లు 702 + 498 = 1200 ; 3/2 × 4/3 = 2 స

అనువాది శృతులు

1. చతుశృతి ధైవతం + కోమల సాధారణ గాంధారం = స్థాయి స
884 + 316 = 1200 ; 27/16 × 32/27 = స

2. త్రిశృతి ధైవతం + సాధారణ గాంధారం = స్థాయి స
5/3 × 6/5 = 2స ; 884+316=1200 సెంట్లు స

3. ద్విశృతి ధైవతం + అంతర గాంధారం = స్థాయి స
814 + 386 = 1200 సెంట్లు; 8/5 × 5/4 = 2స

4. చరి; 9/8 × కో.కై.ని. 16/9=2 ; 204+996=1200 స

5. త్రి.రి. + కై.ని = స్థాయి స
10/9 × 9/5 = 2 (182+1011=1200 సెంట్లు) స

6. ద్వి.రి. + కాకలిని = స్థాయి స
16/15 × 15/8=2 (112+1088=1200 సెంట్లు) స

7. ఏ.క.రి. + తీవ్ర.కా.ని. = స్థాయి స
256/243 × 243/128 = 2 (90 + 1110 = 1200 సెంట్లు)

కొంతమంది సంగీత శాస్త్రజ్ఞులు ఒక స్థాయి యందు 22 శృతులను నిర్ణయించి, పేర్లను పెట్టుటకు బదులు, 3 స్థాయిలకు 22 × 3 = 66 శృతుల పేర్లను ఇచ్చిరి.

శృతులు రెండు విధములుగా శాస్త్రకారులు (ఒకరిద్దరు) విభజించిరి.

1. స్వరగత శృతులు సప్తస్వరములకు ఉండు శృతులు
2. అంతర్గత శృతులు స్వరముల మధ్య గల శృతులు

తంజావూరు సరస్వతీ మహల్ పుస్తక భాండాగారమున 'మేళాధికార లక్షణము' అను గ్రంథ (గ్రంధరచయత పేరు లేదు) వ్రాతప్రతి యందు 24 శృతలను పేర్కొని యున్నారు. ఇందు 2 శృతులు అధికముగానున్నవి.

మొదటిది సాధారణ గాంధారమునకును - అంతర గాంధారమునకును మధ్యగలదు - దీని పేరు ప్రతి అంతర గాంధారము.

రెండవది కై.ని.కి. కా.ని కి మధ్య గలదు.

దీనిపేరు ప్రతికాకలి నిషాధము

ఈ గ్రంధమునందు గల 24 శృతులను స్వర స్థానములుగ భావించి 136 చక్రములను, ఒక చక్రమునకు 34 మేళములను పేర్కొనెను. 136×34=4624 మేళములను పేర్కొనెను. దీనిని బట్టి - మన లక్ష్య సంగీతము ఎంత ఉన్నత శిఖరములను సాధించెనో మన సంగీత లక్షణ ప్రపంచము అంతకంటె వైశాల్యతను సాధించినది అనుకొనవలెను. అవసరానవసరములు వేరుమాట.

## 18. శృతులు–వివిధ నిర్వచనములు – విభిన్న అభిప్రాయములు

"శ్రూయన్త ఇతి శృతయః"

**సంగీతదర్పణ గ్రంథమున :-**

శ్లో॥ స్వరూప మాత్ర శ్రవణాత్ నాదో అనురణ నం వినా
శృతిరిత్యుచ్చతే భేదాస్త స్యాద్వా వింశతిర్మతాః

అనురణము లేనిదియు, స్వరూప మాత్రముగ మొదట వినబడునట్టి ధ్వని నాదము శృతి యనబడును. ఆ శృతి 22 భేదములగు చున్నది.

**రాగవిబోధమునందు :-**

"ద్వ్యంతర్నేష్టానే రవః" సారికల (అనగా వీణమెట్లు) పైన వ్రాలిన తంత్రుల నుండి శబ్దించు నాదము శృతి యనబడుచున్నది.

"సంగీత పారిజాతము" నందు

శ్లో॥ కేశాగ్ర వ్యవధానేన భావ్యోపి శృతయశ్శ్రితాః॥
వీణాయాశ్చతథా గాత్రే సంగీత జ్ఞానినాం మతే॥
మధ్యే పూర్వోత్తరాబధ్వే వీణాయాః గాత్రయేవచా ।
షడ్జ పంచమ భావేన శృతి ర్ద్వావింశతీం జగుః ॥

**అర్థము :-** మనుష్య శరీరమందును, వీణయందును, ఒక కేశ ప్రమాణమునకొక శృతివంతున ఎన్నియో శృతులున్నవి, అని సంగీత జ్ఞానులు చెప్పుచున్నారు. వీణయందు గాని, శరీర మందుగాని షడ్జ, పంచమ ప్రకారముగ కలుగు శృతులు 22 మాత్రమే అని పెద్దలు చెప్పుచున్నారు.

*మతంగుని "బృహద్దేశి"*

శ్లో॥ శ్రవణార్థస్యధాతో క్తిప్రత్యయే చ సుసంశ్రితే ।
శృతి శబ్దః ప్రసాద్యో యం శబ్దజ్ఞైః కర్మసాధనైః ॥

19. విశ్వావసు మతము

శ్రవణేంద్రియ గ్రాహ్యత్వా ధ్వని రేవ శృతిర్భవేత్

శ్రవణేంద్రయము అనగా చెవి గ్రహించగలిగెడు ధ్వని శృతి అనబడుచున్నది.

**కోహలుడు**

ద్వావింశతింకే చిదు -దాహరంతి/శృతిఃశృతిజ్ఞాన విచారదక్షాః
షట్షష్టి భిన్నాఃఖలుకే చిదాసా మానన్త్యమేవ ప్రతిపాదయంతి॥

కొందరు శృతులు (22) ద్వావింశతి అని, మరి కొందరు 66 అని చెప్పుచున్నారు.

శ్లో॥ అనన్త్యంహి శృతీనాంచ సూచయంతి విపశ్చితః ।
యథా ధ్వనివి శేషాణా మమానంగగనోదరే ॥
ఉత్తాల పవనోద్వేల్ల జ్జలరాశి సముద్భవాః ।
ఇయంత్యః ప్రతిపద్యంతేన తరంగ పరంపరాః ॥

**అర్థము:-** ఆకాశ (Space) ఉదరమున అనగా మధ్యమున జనించు నాద విభూతి అనగా సంపద యందు కలుగు శృతులను గణించుట సాధ్యము కాదు. (జలరాశి యందు) తటాకమున గల నీటి యందు గాలి వీచుటచే కల్గు తరంగముల యందు సూక్ష్మ తరంగములు (అలలు) అనేకములు ఉన్నట్లు ఒక శృతి యందు అనేక శృతులున్నవని చెప్పుచున్నారు.

20. *ఈ గ్రంథకర్త వివరణ :-* శృతులు అనంతములు కావు. ఎట్లన ఒక స్థాయి యందు 240 వేపనములు కలవు. అయిదు స్థాయిల యందు 5×240=ఒక క్షణమునకు 1200 వేపనములు. ఇవి అన్నియూ శృతులే అనుకొనిననూ ఆ సంఖ్యకు పరిమితి యున్నది.

అదియునుగాక భౌతిక శాస్త్రరీత్యా వేపనములు (Vibrations) 18 లేక 19 కి తగ్గినను, 10,000కు హెచ్చినను, చెవి వినలేదు. అంతకు హెచ్చుగా గబ్బిలము వినగలదు. (వాటిని ULTRA SONIC SOUNDS అందురు)

అందుచేత శృతులు అనంతములు కావు అని తెలిసినది. అదియునుగాక అన్ని వేపనములు శృతులు కావు. శ్రావ్య, సంగీత యోగ్యత కలిగిన వాటి గూర్చియే మన జిజ్ఞాస, పరిశోధన, తెలిసికొను ప్రయత్నం.

ఇంకొక విషయం, పియానో వాద్యము నందు ఆర్గన్ వాద్యము నందు అనుమంద్ర (Double Bass) స్థాయి యందు గల మెట్లు 16 వేపనములు కలిగియుండును. ఆధునిక పియానోలలోనూ ఆర్గన్‌లలోనూ మొదటి స్వరము (మెట్టు) 16 వేపనములు కలిగియుండును. అతితారస్థాయి యందు కీచురాయి ధ్వనివలె. క్షణమునకు 4752 వేపనములు సంఖ్యకు దాటి వెళ్ళదు. అనుమంద్ర, అతితార స్థాయీ స్వరములకు క్రింద స్వరములుగాని, పై స్వరములు గాని గాన యోగ్యములు కావు. కనుక శృతుల సంఖ్య అనంతము కాదు. పాశ్చాత్య గాత్ర సంగీత బృందగానముల యందు 100 నుండి, 900 లేక 1000 వేపనములు (క్షణమునకు) మాత్రమే ఉండును. 100 వేపనములకు తక్కువగానైననూ 1000 వేపనములు హెచ్చుగానైనను గాన యోగ్యము కాదు. మానవ శరీరమునందుగాని, వాధ్యమునందుగాని గానయోగ్యముకాని నాదము పలికించెడు పద్ధతి (Machanism) లేదు.

14 వేపనములు తక్కువ వేపనములతో శబ్దము కలిగించి భయ కంపనము పుట్టించ వచ్చును. అటులనే 10,000కు హెచ్చు వేపనములతో (Ultra Sonic Sounds) మంటలార్పు చున్నారని వార్త. గబ్బిలములు ఇట్టి అతిహెచ్చు వేపనములుగల శబ్దములు చేసి వాటి దారిని కనుగొనును. అటులనే దోమలు వాటి రెక్కలచే ఇట్టి హెచ్చు వేపనములు శబ్దములు చేసి మానవులను విసిగించుచున్నవి.

# 21. శార్ఙ్గ దేవుని శృతి నిరూపణము

శార్ఙ్గదేవుడు భరతుని తరువాత కాలమువాడు. ఈతడు "సంగీత రత్నాకరము" అను సంగీత లక్షణ గ్రంధమును వ్రాసెను. ఈతడు 12వ శతాబ్దము వాడు. ఈయన శృతులను గూర్చి చాలా పరిశోధనలు, ప్రయోగములు, చేసినవాడు. ఈతనికి సమభాగము గల శృతులు మాత్రమే (Equal Intervals) సంగీత యోగ్యమని తెలియును. శార్ఙ్గదేవుడు షడ్జపంచమ భావమున శృతులను స్థాపించక, ఒక స్థాయి యందు 22 సమ భాగములుగా విభజించి శృతులను ఏర్పరచెను.

ఈతడు శృతులను నిర్ణయించుటకై ధృవవీణ, చలవీణలను రూపొందించి, వాటికి 22 తంత్రుల చొప్పున అమర్చి రెండు వీణల పొడుగు, ఒకటిగా ఉండునట్లు చేసి, వాటికి రెండింటికి ఒకే శృతులను చేసెను. ఈ 22 శృతుల మధ్య మరియొక శృతి రాకూడదని చెప్పియున్నాడు. ధృవ, చల వీణల యందు ఒకే పద్ధతిలో (Identical) శృతులను అమర్చెను.

ఇట్లు శృతులను చేయుటలో 4వ శృతియందు షడ్జమము, 7వ శృతి యందు రిషభము, 9వ శృతియందు గాంధారము, 13వ శృతియందు మధ్యమము, 17వ శృతియందు పంచమము, 20వ శృతియందు ధైవతము, 22వ శృతియందు నిషాధము వచ్చినవి.

(ఇవి ఇప్పుడు మనము చూచుచున్న వీణలు కావు. ఇవి, స్వరమండలి, సంతూర్, Lyre వాద్యముల వంటివి అయి ఉండవచ్చును. వీటికి శారికలు (మెట్లు). Frets ఉండి యుండవు).

ఆపై చలవీణ యందుగల శృతులను 4 విడతలుగా (4 Stages) ఒక్కొక్క శృతి తగ్గించుచుపోగా చలవీణ యందు షడ్జ, మధ్యమ, పంచమ శృతులు ధృవవీణ యందుగల నిషాధ, గాంధార, మధ్యమములకు సరిసమానముగ పలికెను. ఈ ప్రయోగమును బట్టి, నియత శృతులు (హరప్రియ స్వరశృతులు) వచ్చినవి.

శ్లో॥ చతుశ్చతుశ్చతుశ్చైవ షడ్జమధ్యమ పంచమాః ।
ద్వేద్వే నిషాధ గాంధారౌ త్రీస్త్రీ రిషభ ధైవతాః ॥

## 22. శార్ఙ్గదేవుని ధృవ చల వీణల ప్రయోగ పథకము

| | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ధృవవీణ | . | . | . | స | . | . | రి | . | గ | . | . | . | మ | . | . | . | ప | . | . | ద | . | ని | సమశృతి |
| చలవీణ | | | | 4<br>స | | | 2<br>రి | | 3<br>గ | | | | 4<br>మ | | | | 4<br>ప | | | 3<br>ద | | 2<br>ని | సమశృతి |
| 1వ భేదము | | | స | | | రి | | గ | | | | మ | | | | ప | | | ద | | ని | | ఒక శృతి తక్కువ |
| 2వ భేదము | | స | | | రి | | గ | | | | మ | | | | ప | | | ద | | ని | | | రెండు శృతులు తక్కువ |
| 3వ భేదము | స | | | రి | | గ | | | | మ | | | | ప | | | ద | | ని | | | | మూడు శృతులు తక్కువ |
| 4వ భేదము | | | రి | | గ | | | | మ | | | | ప | | | ద | | | ని | | | | 4 శృతులు తక్కువ |

పై పథకమునందు, శృతులను మార్చునపుడు ధ్రువవీణ యందు గల స్వరములతో చలవీణ స్వరములు లయము చెందు విధము తెలియునది.

పాల్కురికి సోమనాథుడు గొప్ప సంగీత విద్వాంసుడు గాయకుడు వైణికుడు పండితుడు మహాకవి. ఈతడు శార్ఙ్గ దేవుని తరువాతకాలమునకు చెందినవాడు. ఈతడు "రాగవిబోధ" అను సంగీత గ్రంథమును రచించెను. వీణయందు 4 తంత్రులు వేసి 22 మెట్లు (సారికలను) అమర్చి శృతులను గణించెను. షడ్జ పంచమ భావమున ఒకస్థాయి యందు 22 శృతులు మాత్రమే యున్నవని వివరించెను. మెట్లతో శృతులను నిర్ణయించెను.

ఈతడు షడ్జ పంచమ భావమున కలుగు శృతుల యొక్క స్వరములకు శ్రావ్యత, అన్యోన్యత (Harmony, Concordance) ఉండునని అభిప్రాయమును చెప్పెను.

ఈతడు తన 'రాగ విబోధ' గ్రంథము నందు 1. శృతి స్వర జ్ఞానోపాయన వీణ 2. అఖిల రాగమేళ శుద్ధ వీణ 3. అఖిల రాగమేళ మధ్యమేళ వీణ 4. ఏక రాగమేళ శుద్ధ వీణ, 5. ఏక రాగమేళ మధ్యమేళ వీణ అను అయిదు (5) వీణలను చెప్పియున్నాడు.

"సంగీత పారిజాతము" అను సంగీత గ్రంథకర్తయైన అహోబలుడు 22 శృతులను నిర్ణయించునపుడు వీణా తంత్రి యొక్క కొలతలను బట్టి నిర్ణయించి చెప్పెను. వీణ తంత్రి యొక్క మధ్యలో (1/2) తార షడ్జమము పలుకును. రెండు షడ్జమములకు మధ్య 1/4) మధ్యమము వచ్చును. తంత్రిని 3గా భాగించి అందు రెండు భాగములు త్రోసిన (3/4) పంచమము వచ్చును. షడ్జ పంచమముల మధ్యలో గాంధరము వచ్చును. మేరు భాగము నుండి పంచమము వరకు కొలిచి దానిని మూడు భాగములుగా చేసి మొదటి భాగము చివర రిషభము వచ్చును. పంచమము, తారషడ్జమముల మధ్య ధైవతము పలుకును.

పంచమ తారషడ్జమములను మూడు భాగములను చేసి రెండు భాగముల చివర నిషాధము పలుకును అని నిర్ణయించెను. ఈ పై స్వరములు శుద్ధ స్వరములు అనగా ("హరప్రియ") సామగాన మూర్ఛన స్వరములు.

ఈతడే వీణ యందు వికృత స్వర నిరూపణమును కూడ చేసెను. వికృత స్వరములు అనగా శుద్ధ మేళమున వచ్చు స్వరములకు అన్యములు:-

వీణ మేరువునకును రిషభమునకును మధ్య 3 భాగములు చేసి, అందు రెండు భాగములను విడిచిన కోమల రిషభము పలుకును. మేరువునకును ధైవతమునకును నడుమ తీవ్ర గాంధారము పలుకును. తీవ్ర గాంధారమునకును షడ్జమమునకును మధ్యలో ఒక భాగము విడిచిన తీవ్ర మధ్యమము పలుకును. పంచమమునకు తారషడ్జమమునకును మధ్యలో మూడు భాగములు చేసి మొదటి భాగము కొనలో కోమల ధైవతము వచ్చును. ధైవతమునకును తారషడ్జమమునకును మధ్యలో మూడు భాగములు చేసిన తీవ్ర నిషాధము వచ్చును అని చెప్పియున్నారు. (ప్రాచీన గ్రంధములలో గల శృతుల విషయమును పరిశోధించి, గణించి, నిర్ణయించిన వారు ఈ శతాబ్దము (20వ శతాబ్దము) ప్రారంభము వరకును ఏ విద్వాంసులు ఏ పండితులు ప్రయత్నించలేదు. వీణ యందు 12 స్వరస్థానాలకు, మెట్లను అమర్చి వాయించు చుండెడివారు. అటులనే గాత్రజ్ఞులు కూడా 12 స్వరస్థానములను అధారముగా చేసికొని రాగములను అద్భుతముగా ఆలపించెడి వారు. వారిలో ఎవ్వరికిని ఈ 22 శృతుల విషయము పరిశోధించెడి తలంపు కలుగలేదు. గ్రంథముల యందు 22 శృతుల విషయము కలదు అని మాత్రము వారికి తెలియును. వారికి 12 స్వరస్థానములను మాత్రము ఆధారముగా చేసుకొని సంగీతమును పాడిన, ఆ సంగీతము, శ్రావ్యముగా ఉండదు అని తెలియును. వారు స్వర, గమకములో శృతులను పాడుచున్నారు. శృతులతో గమకములు, గమకములతో రాగములు ఉన్నవి. అట్టిది. శృతులు పాడకుండుట, ఎట్లు? కాని పూర్వ గ్రంధకర్తల శృతులపై గల నిర్ణయములుపై పరిశోధనలు చేయలేదు.

ఒక విధముగా వారు చెసినది మంచిపనే, ఒక విధముగా కాదు. అనేక విధములుగా వారు చేసినది, చేయుచున్నది (గ్రంధముల జోలికి పోక హాయిగా పాడుట) మంచిపనే. ఏలనన. శృతుల విషయంలో ఒకరికి ఇంకొకరికి పొంతన లేదు. ఎవ్వరూ సరియైన మార్గమును చెప్పలేదు. అంతయూ గందరగోళము. అందు సుఖము లేదు. సుఖము సంగీతమును పాడుటలో, వాయించుటలో, నేర్పుటలో, నేర్చుకొనుటలోనే ఉన్నది.

ఈ 22 శృతుల పరిశోధన 1904వ సంవత్సరమున సి. నాగోజీరావుగారు 22 శృతుల వీణను తయారు చేయించి గాన భాస్కర గ్రంధకర్త శ్రీ కె.వి శ్రీనివాస అయ్యంగార్ గారికి చూపించి ఆ వీణను వాయించినారు. వారిరువురు 22 శృతుల పరిశోధన మొట్టమొదటిసారిగ ప్రారంభించినారు. అదే ప్రథమ ప్రయత్నము. తరువాత చాలా మంది పండితులు శృతుల పరిశోధన ప్రారంభించినారు.

23 నాగోజీరావుగారి 22 శృతుల పద్ధతి (కరుణామృత సాగర ప్రకారముగ)

| సంఖ్యలు | స్వర నామములు | స్వర భిన్నములు | అంతర భిన్నములు | అంతర దశాంశ భిన్నములు | 32 అంగుళాల తంత్రిలో శ్రుతులకు కొలతలు | సెంట్లు | అంతర సెంట్లు | స.540 కంపనముల చొప్పున కంపన సంఖ్యలు | సం. 240 కంపనముల చొప్పున పిటి సంఖ్యలు |
|---|---|---|---|---|---|---|---|---|---|
| ల | స | 1 | | 32 | | | 5.0 | 240 | |
| 1 | రి1 | 24/25 | 24/25 | .9600 | 30.72 | 71 | 71 | 562.59 | 250 |
| 2 | రి2 | 15/16 | 125/128 | .9375 | 30 | 112 | 41 | 576 | 256 |
| 3 | రి3 | 9/10 | 24/25 | .9000 | 28.8 | 182 | 71 | 600 | 266.66 |
| 4 | రి4 | 8/9 | 80/91 | .8889 | 28.44 | 204 | 22 | 607.50 | 270 |
| 5 | గ1 | 27/32 | 243/256 | .8438 | 27 | 294 | 90 | 640 | 284.44 |
| 6 | గ2 | 5/5 | 80/31 | .8333 | 26.67 | 316 | 22 | 648 | 288 |
| 7 | గ3 | 4/5 | 24/25 | .8000 | 25.60 | 386 | 71 | 675 | 300 |
| 8 | గ4 | 25/32 | 125/128 | .7813 | 25 | 427 | 41 | 691.20 | 307.2 |
| 9 | మ1 | 3/4 | 24/25 | .7507 | 24 | 498 | 71 | 720 | 320 |
| 10 | మ2 | 20/27 | 80/31 | .7407 | 23.70 | 520 | 22 | 729 | 324 |
| 11 | మ3 | 32/45 | 24/25 | .7111 | 22.76 | 590 | 71 | 759.375 | 337.5 |
| 12 | మ4 | 25/35 | 125/128 | .6944 | 22.22 | 631 | 41 | 777.60 | 345.6 |
| 13 | ప | 2/3 | 24/25 | .6567 | 21.33 | 702 | 71 | 810 | 360 |
| 14 | ధ1 | 16/25 | 24/25 | .6400 | 20.48 | 773 | 71 | 843.75 | 375 |
| 15 | ధ2 | 5/8 | 125/128 | .6250 | 20 | 814 | 41 | 864 | 384 |
| 16 | ధ3 | 3/5 | 24/25 | .6000 | 19.20 | 884 | 71 | 900 | 400 |
| 17 | ధ4 | 16/27 | 80/81 | .5926 | 18.99 | 906 | 22 | 9911.25 | 405 |
| 18 | ని1 | 9/16 | 243/255 | .6625 | 18 | 996 | 90 | 960 | 426.67 |
| 19 | ని2 | 5/9 | 80/81 | .5556 | 17.78 | 1018 | 22 | 972 | 432 |
| 20 | ని3 | 8/15 | 25/25 | .5333 | 17.07 | 1088 | 71 | 1012.50 | 450 |
| 21 | ని4 | 25/48 | 125/128 | .5208 | 16.67 | 1129 | 41 | 1036.80 | 460.8 |
| 22 | స | 1/2 | 24/25 | .5000 | 16 | 1200 | 71 | 1080 | 480 |

"పై పథకములో వ్యత్యాసములు కలవు. అంతరసెంట్లు లెక్క సరిపోవుట లేదు. 1200 సెంట్లుకు బదులు 5 సెంట్లు హెచ్చుగా వచ్చుచున్నది. 1205 వచ్చుచున్నది" (గాన భాస్కర గ్రంథకర్త) ఈ పథకము లెక్కలకు కిట్టించినట్లు ప్రయత్నించినట్లు తోచుచున్నది. దీనికి ప్రాయోజిత యోగ్యత ఉన్నట్లు తోచుటలేదు.

24. 22 శ్రుతులు Mr. సహస్రబుద్ధిగారి యభిప్రాయము ననుసరించి గుణింపబడిన పథకము

| శ్రుతుల సంఖ్యలు | స్వర నామములు | స్థాన భిన్నములు | 32 అంగుళపు తంత్రిలో స్వరములు పుట్టు స్థానం | స. 540 చొప్పున వేపన సంఖ్యలు | సెంట్సులు | అంతర సెంట్సులు | రత్నాకర పద్ధతి |
|---|---|---|---|---|---|---|---|
| 1 | స | 1 | 32.00 | 540 | | | |
| 2 | రి1 | 43/44 | 31.27 | 552.6 | 40 | 41 | సంగీత రత్నాకర ప్రకారము 1 శ్రుతికిని మఱియొక శ్రుతికిని ఉండవలసిన అంతరము 54.54¹/ |
| 3 | రి2 | 42/44 | 30.55 | 565.7 | 81 | 41 | |
| 4 | రి3 | 41/44 | 29.82 | 579.5 | 122 | 41 | |
| 5 | గ1 | 40/44 | 29.09 | 594 | 165 | 43 | |
| 6 | గ2 | 39/44 | 28.36 | 609.2 | 209 | 44 | |
| 7 | మ1 | 38/44 | 27.64 | 625.3· | 254 | 45 | |
| 8 | మ2 | 37/44 | 26.91 | 642.2 | 300 | 46 | |
| 9 | మ3 | 36/44 | 26.18 | 660 | 347 | 47 | |
| 10 | మ4 | 35/44 | 25.45 | 678.9 | 396 | 49 | |
| 11 | ప1 | 34/44 | 24.37 | 698.8 | 446 | 50 | |
| 12 | ప2 | 33/44 | 24 | 720 | 498 | 52 | |
| 13 | ప3 | 32/44 | 23.37 | 742.9 | 551 | 53 | |
| 14 | ప4 | 31/44 | 22.55 | 766.5 | 606 | 55 | |
| 15 | ధ1 | 30/44 | 21.82 | 792 | 663 | 57 | |
| 16 | ధ2 | 29/44 | 21.09 | 819.3 | 722 | 59 | |
| 17 | ధ3 | 28/44 | 20.36 | 848.6 | 83 | 61 | |
| 18 | ని1 | 27/44 | 19.64 | 880 | 845 | 62 | |
| 19 | ని2 | 26/44 | 18.91 | 913.8 | 911 | 66 | |
| 20 | స1 | 25/44 | 18.18 | 950.4 | 979 | 68 | |
| 21 | ప2 | 24/44 | 17.45 | 990 | 1049 | 70 | |
| 22 | స3 | 23/44 | 16.73 | 1033 | 1123 | 74 | |
| 23 | ప4 | 22/44 | 16 | 1080 | 1200 | 77 | |

"సహస్ర బుద్ధి పై పథకము ప్రకారము శృతులను లెక్క చేయునపుడు వీణ తంత్రి యొక్క పొడవును 4 సమ భాగములుగా చేసి వాటి యందు 22 భాగములను ఒక స్థాయికి ఇచ్చి. తారషడ్జమమును స్థాపించినారు. ఈ లెక్క తారషడ్జమమునకు సరిపోవునుకాని తక్కిన స్వర శృతులకు సరిగా నుండదు. ఇందు మధ్యమ, పంచమములే సరిగా లేవు. 12, 15 శృతులను గమనించిన ఈ విషయము తెలియును.

*గాన భాస్కర గ్రంధ కర్త శ్రీ కె.వి. శ్రీనివాస అయ్యంగారు.*

25. ద్వావింశతి శ్రుతులు: రాజా సురేంద్రనాథ మోహన్ ఠాకూరుగారి యభిప్రాయము.

| శ్రుతుల సంఖ్యలు | స్వర నామములు | శ్రుతి భిన్నములు | 32 అంగుళాల తంత్రిలో స్వరములు పుట్టు శ్రుతి స్థానం | స. 540 చొప్పున కంపన సంఖ్యలు | సెంట్లు | అంతర సెంట్లు | రత్నాకర పద్ధతి |
|---|---|---|---|---|---|---|---|
| 1 | స | 1 | 32.0 | 540 | – | – | సంగీత రత్నాకర ప్రకారముగ 54.54 1/2 అంతరు సెంట్లు యుండవలయును. |
| 2 | రి1 | 35/36 | 31.11 | 555.4 | 49 | 49 | |
| 3 | రి2 | 34/36 | 30.22 | 571.8 | 99 | 50 | |
| 4 | రి3 | 33/36 | 29.33 | 489.1 | 151 | 52 | |
| 5 | గ1 | 32/36 | 28.44 | 607.5 | 204 | 53 | |
| 6 | గ2 | 31/36 | 27.56 | 627.1 | 259 | 55 | |
| 7 | మ1 | 30/36 | 26.67 | 648 | 316 | 57 | |
| 8 | మ2 | 29/36 | 25.78 | 670.3 | 374 | 58 | |
| 9 | మ3 | 28/36 | 24.89 | 694.3 | 435 | 61 | |
| 10 | మ4 | 27/36 | 24.0 | 720 | 498 | 63 | |
| 11 | ప1 | 38/52 | 23.4 | 738.9 | 543 | 45 | |
| 12 | ప2 | 37/52 | 22.8 | 758.9 | 589 | 46 | |
| 13 | ప3 | 36/52 | 22.2 | 780 | 637 | 48 | |
| 14 | ప4 | 35/52 | 21.5 | 802.3 | 685 | 58 | |
| 15 | ధ1 | 34/52 | 20.0 | 825.9 | 736 | 51 | |
| 16 | ధ2 | 33/52 | 20.3 | 850.9 | 787 | 51 | |
| 17 | ధ3 | 32/52 | 19.7 | 877.5 | 841 | 54 | |
| 18 | ని1 | 31/52 | 19.1 | 905.8 | 895 | 54 | |
| 19 | ని2 | 30/52 | 18.5 | 936 | 952 | 57 | |
| 20 | స1 | 29/52 | 17.8 | 968.3 | 1011 | 59 | |
| 21 | స2 | 28/52 | 18.2 | 1002.9 | 1072 | 61 | |
| 22 | స3 | 27/52 | 16.6 | 1040 | 1135 | 63 | |
| 23 | స4 | 25/52 | 16.0 | 1080 | 1200 | | |

"ఈ పథకమునందు గల లెక్కలలో షడ్జమము తప్ప తక్కిన స్వరశృతులు చేరిక గలిగినవిగా నుండలేదు".

26. ద్వావింశతి శ్రుతులు: కె.బి. దేవాలుగారి యభిప్రాయము.

| శ్రుతుల సంఖ్యలు | స్వర నామములు | స్వర భిన్నములు | 32 అంగుళాల తంత్రిలో స్వరములు పుట్టు స్థానం | స. 540 చొప్పున కంపన సంఖ్యలు | సెంట్సులు | అంతర సెంట్సులు | ర.ప్ర.అం. సెంట్సులు |
|---|---|---|---|---|---|---|---|
| 1 | స | 1 | 32 | 540 | – | – | రత్నాకర ప్రకారముగ స్వరములకు మధ్య నుండు అంతరములు 54.54½ |
| 2 | రి1 | 30.48 | 367 | 84 | 84 | | |
| 3 | రి2 | 15/16 | 30.00 | 576 | 112 | 27 | |
| 4 | రి3 | 9/10 | 28.80 | 600 | 182 | 71 | |
| 5 | గ1 | 8/9 | 28.44 | 607.5 | 204 | 22 | |
| 6 | గ2 | 27/32 | 27.00 | 640 | 294 | 90 | |
| 7 | మ1 | 5/6 | 26.60 | 648 | 316 | 22 | |
| 8 | మ2 | 4/5 | 25.60 | 675 | 386 | 71 | |
| 9 | మ3 | 64/81 | 25.28 | 683.437 | 408 | 22 | |
| 10 | మ4 | 16/21 | 24.38 | 708.45 | 471 | 63 | |
| 11 | ప1 | 3/4 | 24.00 | 720 | 498 | 27 | |
| 12 | ప2 | 32/45 | 22.76 | 759.375 | 590 | 92 | |
| 13 | ప3 | 45/64 | 22.50 | 768 | 610 | 20 | |
| 14 | ప4 | 2/3 | 21.33 | 810 | 702 | 92 | |
| 15 | ధ1 | 40/63 | 20.32 | 850.5 | 786 | 84 | |
| 16 | ధ2 | 5/8 | 20.00 | 864 | 814 | 27 | |
| 17 | ధ3 | 3/5 | 19.20 | 900 | 884 | 71 | |
| 18 | ని1 | 16/27 | 18.96 | 911.25 | 906 | 22 | |
| 19 | ని2 | 9/16 | 18.00 | 960 | 996 | 90 | |
| 20 | స1 | 5/9 | 17.07 | 972 | 1018 | 22 | |
| 21 | స2 | 8/15 | 17.78 | 1012.5 | 1088 | 71 | |
| 22 | స3 | 128/243 | 16.86 | 1025.15625 | 1110 | 22 | |
| 23 | స4 | 1/2 | 16.00 | 1080 | 120 | 90 | |

గాన భాస్కర గ్రంథకర్త అభిప్రాయముననుసరించి ఈ పట్టిక యందు గల లెక్కల ప్రకారము స్వరశృతులు వ్యత్యాసముగనే యున్నవి.

27. 22 శ్రుతులు: ఇ. క్లైమన్స్‌గారి యభిప్రాయము

| శ్రుతుల సంఖ్యలు | స్వర నామములు | స.1 చొప్పున స్వరము లకు శృతి భిన్నములు | 32 అంగుళముల తంత్రిలో స్వరములు పుట్టు స్థాన | స. 240 చొప్పున కంపన సంఖ్యలు | సెంట్లు | అంతర సెంట్లు | స.ర.ప్ర.అంతరములు |
|---|---|---|---|---|---|---|---|
| | స | 1 | 32 | 240 | | | |
| 1 | రి1 | 20/21 | 30.48 | 252 | 84 | 84 | సంగీతరత్నాకర ప్రకారముగ నుండవలెనన అంతర సెంట్లు 54.54½ |
| 2 | రి2 | 15/16 | 30 | 256 | 112 | 27 | |
| 3 | రి3 | 9/10 | 28.80 | 266.67 | 182 | 71 | |
| 4 | రి4 | 8/9 | 28.44 | 270 | 203 | 22 | |
| 5 | గ1 | 27/32 | 27 | 284.44 | 294 | 90 | |
| 6 | గ2 | 5/6 | 26.67 | 288 | 316 | 22 | |
| 7 | గ3 | 4/5 | 25.6 | 300 | 386 | 71 | |
| 8 | గ4 | 64/81 | 25.28 | 303.75 | 408 | 22 | |
| 9 | మ1 | 16/21 | 24.38 | 315 | 471 | 63 | |
| 10 | మ2 | 3/4 | 24 | 320 | 498 | 27 | |
| 11 | మ3 | 20/27 | 23.70 | 324 | 520 | 22 | |
| 12 | మ4 | 32/45 | 22.76 | 337.50 | 590 | 71 | |
| 13 | మ5 | 45/64 | 22.50 | 541.33 | 610 | 20 | |
| 14 | ప | 2/3 | 21.33 | 360 | 702 | 92 | |
| 15 | ధ1 | 40/63 | 20.32 | 378 | 786 | 84 | |
| 16 | ధ2 | 5/8 | 20 | 384 | 814 | 27 | |
| 17 | ధ3 | 3/5 | 19.20 | 400 | 884 | 71 | |
| 18 | ధ4 | 16/27 | 18.96 | 405 | 906 | 23 | |
| 19 | ని1 | 4/7 | 18.29 | 420 | 969 | 66 | |
| 20 | ని2 | 9/16 | 18 | 126.67 | 996 | 27 | |
| 21 | ని3 | 5/9 | 17.78 | 432 | 1018 | 22 | |
| 22 | ని4 | 8/15 | 17.07 | 450 | 1088 | 20 | |
| 23 | ని5 | 135/256 | 16.88 | 455.11 | 1108 | 20 | |
| 24 | స | 1/2 | 16 | 480 | 1200 | 92 | |

ఈ పథకము ననుసరించి వీరికి భారతీయ సంగీత అవగాహన లేదు అని తెలియుచున్నది.

## 28. ద్వావింశతి శ్రుతులు: సుబ్రహ్మణ్య శాస్త్రులవారి యభిప్రాయము

| శ్రుతుల సంఖ్యలు | స్వర నామములు | స.1 చొప్పున స్వరములకు శ్రుతి భిన్నములు | 32 అంగుళముల తంత్రిలో స్వరములు పుట్టు స్థానం | స. 240 చొప్పున శ్రుతుల సంఖ్యలు | సెంట్లు | అంతర సెంట్లు | ర.ప్ర.సెంట్లు |
|---|---|---|---|---|---|---|---|
| | స | 1 | 32 | 240 | | | |
| 1 | ర1 | 80/81 | 31.60 | 243 | 22 | 22 | సంగీతరత్నాకర ప్రకారముగ నుండవలసిన అంతర సెంట్లు $54.54\frac{1}{2}$ |
| 2 | ర2 | 15/16 | 30 | 256 | 112 | 90 | |
| 3 | ర3 | 25/27 | 29.63 | 259.2 | 133 | 21 | |
| 4 | గ1 | 8/5 | 28.44 | 270 | 204 | 71 | |
| 5 | గ2 | 640/729 | 28.09 | 273.375 | 225 | 21 | |
| 6 | మ1 | 5/6 | 26.67 | 288 | 316 | 71 | |
| 7 | మ2 | 64/81 | 25.28 | 303.75 | 408 | 92 | |
| 8 | మ3 | 32/41 | 24.98 | 307.5 | 429 | 21 | |
| 9 | మ4 | 3/4 | 24 | 320 | 498 | 69 | |
| 10 | ప1 | 20/27 | 23.70 | 324 | 520 | 22 | |
| 11 | ప2 | 45/65 | 22.50 | 341.33 | 610 | 90 | |
| 12 | ప3 | 25/36 | 22.22 | 345.6 | 631 | 21 | |
| 13 | ప4 | 2/3 | 21.33 | 360 | 702 | 71 | |
| 14 | ధ1 | 160/243 | 21.07 | 364.5 | 723 | 21 | |
| 15 | ధ2 | 5/8 | 20 | 384 | 314 | 91 | |
| 16 | ధ3 | 50/81 | 19.75 | 388.8 | 835 | 21 | |
| 17 | ని1 | 16/27 | 18.96 | 405 | 906 | 71 | |
| 18 | ని2 | 1280/2187 | 18.73 | 110.63 | 927 | 21 | |
| 19 | స1 | 5/9 | 17.78 | 432 | 1018 | 91 | |
| 20 | స2 | 128/243 | 16.85 | 455.565 | 1110 | 92 | |
| 21 | స3 | 64/123 | 16.65 | 461.25 | 1131 | 21 | |
| 22 | స4 | 21/2 | 16 | 480 | 1200 | 69 | |

ఈ పథకమును పరిశీలించినచో వీరు కొన్ని ఆంగ్లేయ పద్ధతులను, అనుసరించినట్లు, కొన్ని స్వరకల్పనలను చేసినట్లు తోచును. కనుక ఇది సంగీతరత్నాకర పద్ధతి ననుసరించిలేదు.

## 29. షడ్జపంచమ భావమున, 22 శృతులను ప్రస్తరించు క్రమమును జూపెడి పథకము

| స్థాయి సంఖ్యలు | శ్రుతుల సంఖ్యలు | | | | | | | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 |
| 1 | | | | | | | | | | | | | ప1 | | | | | | | | | |
| 2 | | | | ప2 | | | | | | | | | | | | | ప3 | | | | | |
| 3 | | | | | | | | ప1 | | | | | | | | | | | | | | |
| 4 | | | | | | | | | | | | ప6 | | | | | | | | | | |
| 5 | | | ప7 | | | | | | | | | | | | | | | | | | | |
| 6 | | | | | | | ప9 | | | | | | | | | | | | | | | |
| 7 | | | | | | | | | | | ప11 | | | | | | | | | | | |
| 8 | | ప12 | | | | | | | | | | | | | ప13 | | | | | | | |
| 9 | | | | | ప14 | | | | | | | | | | | | | | | | | |
| 10 | | | | | | | | ప20 | | | | | | | | | | | | | | |
| 11 | ప17 | | | | | | | | | | | | ప18 | | | | | | | | | |
| 12 | | | ప19 | | | | | | | | | | | | | ప20 | | | | | | |
| 13 | | | | | | | ప11 | | | | | | | | | | | | | | ప22 | |

## 30. షడ్జమధ్యమ భావముగ 22 శృతులను ప్రస్తరించు క్రమమును జూపెడి పథకము

| స్థాయి సంఖ్యలు | శ్రుతుల సంఖ్యలు | | | | | | | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 |
| 1 | | | | | | | | | మ1 | | | | | | | | | మ2 | | | | |
| 2 | | | | | మ3 | | | | | | | | | మ4 | | | | | | | | |
| 3 | మ5 | | | | | | | | | మ6 | | | | | | | | | మ1 | | | |
| 4 | | | | | | మ8 | | | | | | | | | మ9 | | | | | | | |
| 5 | | | మ10 | | | | | | | | మ11 | | | | | | | | | మ12 | | |
| 6 | | | | | | | మ13 | | | | | | | | | మ14 | | | | | | |
| 7 | | మ15 | | | | | | | | | | మ16 | | | | | | | | | మ17 | |
| 8 | | | | | | | | మ18 | | | | | | | | | మ19 | | | | | |
| 9 | | | మ20 | | | | | | | | | | మ21 | | | | | | | | | మ22 |

31. రత్నాకరోక్త ద్వావింశతి శ్రుతులం జూపెడి పథకము

అబ్రహాం పండితుల కరుణామృత సాగరము ప్రకారము రత్నాకరుని ద్వావింశతి శృతులు

| సంఖ్యలు | స్వర నామములు | సంవర్గ మానములు | సంవర్గమాన సంఖ్యలు | స.540 వేపనముల చొప్పున స్వరములకు వేపన సంఖ్యలు | భావన 1 చొప్పున స్వరములకు భిన్నములు | 32 అంగుళపు తంత్రిలో స్వరములకు స్థానములు | శ్రుతులకు అంతరములు | శ్రుతులకు సెంట్సులు | అంతర సెంట్సులు |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 |
| 0 | స1 | 0 | 1.00000 | 540 | 1.0000000 | 32.0000000 | 0 | 0 | 54.54½ |
| 1 | స2 | .01368318 | 1.032008 | 557.28432 | 0.9689844 | 31.07501 | .9925 | 45.55 | 54.54½ |
| 2 | స3 | .02736666 | 1.063041 | 575.12268 | 0.9889310 | 30.043392 | .9617 | 109.09 | 54.54½ |
| 3 | స4 | .04104955 | 1.099131 | 593.531128 | 0.9098095 | 29.113904 | .9319 | 168.64 | 54.54½ |
| 4 | రి1 | .05473273 | 1.134313 | 612.52848 | 0.8816912 | 28.210918 | .9030 | 219.13 | 54.54½ |
| 5 | రి2 | .06841591 | 1.17062 | 632.1348 | 0.8342482 | 27.335942 | .8750 | 272.78 | 54.54½ |
| 6 | రి3 | .08009909 | 1.208086 | 652.3686 | 0.8277522 | 26.488102 | .8478 | 327.27 | 54.54½ |
| 7 | గ1 | .09578207 | 1.246758 | 673.2493 | 0.8020800 | 25.666560 | .8215 | 381.82 | 54.54½ |
| 8 | గ2 | 10946545 | 1.286663 | 694.8000 | 0.7772029 | 24.87049 | .7916 | 436.36 | 54.54½ |
| 9 | మ2 | .12314864 | 1.327849 | 717.0379 | 0.7580978 | 24.099150 | .2714 | 490.91 | 54.54½ |
| 10 | మ2 | 13683182 | 1.370351 | 739.989 | 0.7297400 | 23.351680 | .7474 | 545.45 | 54.54½ |
| 11 | మ3 | .15051500 | 1.414214 | 763.67556 | 0.7071068 | 23.827418 | .7643 | 600 | 54.54½ |
| 12 | మ4 | .16419818 | 1.45948 | 788.1192 | 0.6851755 | 21.925616 | .7018 | 654.55 | 54.54½ |
| 13 | ప1 | .17788136 | 1.506196 | 813.34584 | 0.6639245 | 21.245584 | .6800 | 709.09 | 54.54½ |
| 14 | ప2 | .19156455 | 1.554406 | 839.37924 | 0.6433325 | 20.586640 | .6589 | 763.64 | 54.54½ |
| 15 | ప3 | .20524773 | 1.604160 | 866.2464 | 0.6233790 | 19.948128 | .6385 | 818.18 | 54.54½ |
| 16 | ప4 | .21893091 | 1.655507 | 893.9732 | 0.6040447 | 19.329430 | .6187 | 872.73 | 54.54½ |
| 17 | ధ1 | .23261409 | 1.708457 | 922.5878 | 0.5853100 | 18.729920 | .5995 | 927.27 | 54.54½ |
| 18 | ధ2 | .24629727 | 1.763182 | 952.1183 | 0.5671563 | 17.149000 | .5809 | 981.82 | 54.54½ |
| 19 | ధ3 | .25998045 | 1.819619 | 982.5948 | 0.5495656 | 17.566099 | .5629 | 1036.36 | 54.54½ |
| 20 | ని1 | .27366362 | 1.877862 | 1014.04548 | 0.5325206 | 17.020659 | .5454 | 1090.91 | 54.54½ |
| 21 | ని2 | .28734682 | 1.937968 | 1046.50272 | 0.5160040 | 16.512118 | .5285 | 1145.45 | 54.54½ |
| 22 | ప | .30103000 | 2.000000 | 1080.00000 | 0.5000000 | 16.000000 | .5121 | 1200 | 54.54½ |

శృతుల విషయమై సహస్రబుద్ధి, ఠాకూర్, చిన్నస్వామి మొదలియార్, క్లైమెన్స్, దేశాలు, నాగోజీరావు, సుబ్రహ్మణ్యశాస్త్రి పంచాపకేశ భాగవతులు, మాణిక్య మొదలియార్, భండార్‌కర్, ప్రతాపరామస్వామి, మొదలైన పందొమ్మిది శాస్త్రకారుల వివిధ అభిప్రాయములను రత్నాకరుని అభిప్రాయముతో తులనాత్మక పరీక్ష పరిశోధన చేసినవారు అబ్రహాం పండితులు. వీరు తమ "కరుణామృత సాగరము". అను గ్రంధము నందు ఒక పట్టికను (స్టేట్‌మెంట్)ను రూపొందించిరి. ఈ తులనాత్మక పట్టిక ననుసరించి ఈ పరిశోధకుల పరిశోధనల మధ్య ఒక స్థాయి యందు గల 22 శృతులలో 158 అభిప్రాయ భేదములు కలవు.

దానిని బట్టి వీరిలో ఒక్కరునూ సంగీత రత్నాకరుని "ద్విగుణశ్చోత్తరోత్తరై:" అను సూత్రమును గ్రహించి శృతులను పరిశోధించినట్లు కనుపించదు. (గాన భాస్కరం)

32. రత్నాకరోక్త ద్వావింశతి శ్రుతులను జూపెడి పథకము

| శ్రుతుల సంఖ్యలు | స్వర నామములు | నియత శ్రుతులు | 32 అంగుళముల తంత్రిలో స్వరములకు స్థానములు | శ్రుతుల భిన్నములు | శ్రుతులకు సెంట్సులు | అంతర సెంట్సులు | సరియైన అంతర సెంట్సులు |
|---|---|---|---|---|---|---|---|
| 1 | స | స | 32 | .0000 | 0 | | రత్నాకరోక్త లెక్క ప్రకారముగల అంతర సెంట్సులు 54.54 1/2 |
| 2 | రి1 | | 31.01 | .9690 | 55 | 55 | |
| 3 | రి2 | | 30.05 | .9389 | 109 | 54 | |
| 4 | రి3 | రి | 29.11 | .9098 | 164 | 55 | |
| 5 | గ1 | | 28.21 | .8816 | 218 | 54 | |
| 6 | గ2 | గ | 27.34 | .8542 | 273 | 55 | |
| 7 | మ1 | | 26.49 | .8278 | 327 | 54 | |
| 8 | మ2 | | 25.67 | .8021 | 383 | 55 | |
| 9 | మ3 | | 24.87 | .7772 | 436 | 54 | |
| 10 | మ2 | మ | 24.10 | .7531 | 491 | 55 | |
| 11 | ప1 | | 23.35 | .7297 | 454 | 54 | |
| 12 | ప2 | | 22.83 | .7071 | 600 | 55 | |
| 13 | ప3 | | 21.93 | .6852 | 655 | 54 | |
| 14 | ప4 | ప | 21.25 | .6639 | 709 | 55 | |
| 15 | ధ1 | | 20.59 | .6433 | 764 | 55 | |
| 16 | ధ2 | | 19.95 | .6234 | 818 | 54 | |
| 17 | ధ3 | ధ | 19.33 | .6040 | 873 | 55 | |
| 18 | ని1 | | 18.73 | .5853 | 827 | 55 | |
| 19 | ని2 | ని | 18.15 | .5672 | 982 | 55 | |
| 20 | స1 | | 17.59 | .5496 | 1036 | 54 | |
| 21 | స2 | | 17.04 | .5325 | 1091 | 55 | |
| 22 | స3 | | 16.51 | .5160 | 1145 | 54 | |
| 23 | స4 | స | 16 | .5000 | 1200 | 55 | |

ఈ పథకమునందు గణిత సౌలభ్యము కొరకు వ్యత్యాసమును సరిచేసినట్లు తెలియుచున్నది. దీని యందు కొంత ముందు వెనకలు లేకపోలేదు.

33. ద్వావింశతి శృతులు - ఈ గ్రంథకర్త విశ్లేషణము - పరిశీలన

ఒక స్థాయి యందు 22 శృతులు ఉనికిని గూర్చి వాటి సంఖ్యను గూర్చి వాటి విలువలను గూర్చి అనేక మంది గ్రంథకర్తలు, శాస్త్రజ్ఞులు (Masicologists) మొదటి నుండి ఇప్పటి వరకు ఏకాభిప్రాయం కలిగి ఉండకపోవటం మనకి తెలుస్తూంది.కారణాలను పరిశీలిస్తే శృతులు అతి సూక్ష్మంగా ఉండటం వాటి స్వరూప, స్వభావాలు, విలువలు అవ్యక్తంగా ఉండి ఇదమిద్ధం అని వర్ణించటానికి నిరూపించటానికి వీలు లేక పోవడం. అవి Enigmatie గానూ, Ambiguous గానూ ఉన్నాయి. Solid గా లేవు. Fluid గా ఉన్నాయి. అవి ఉన్నవి అనటం ఖాయం. ఎట్లున్నవి, వాటిని చూపించు, అంటే దొరకవు. వీటిని (శ్రుతులను) భగవంతునితో పోల్చవచ్చు.

ఈ 22 శృతులు స్వరములను ఆశ్రయించి ఉన్నవి. నిర్ణీత శృతి యందు స్వరము లేక కొంచెముగా ఇటు అటు జరిగిన ఆ స్వరము అపస్వరమగును. స్వరమునకు సుస్వర మాధుర్యాన్ని ఇచ్చునది నిర్ణీతమైన శృతియే అనుట సందేహము లేదు. వీటియందు 10 శృతులు కోమలములు. ఇవి స-మ భావమున వచ్చినవి; 10 తీవ్ర శృతులు స-ప భావమున వచ్చినవి. వీటియందు 10 శృతులుగానే ఉన్నవి. తక్కిన 10 స్వరస్థానములుగా నున్నవి.

పూర్వులు చెప్పిన 22 శృతులు ఒక స్థాయి యందు ఉన్నవి. వాటియందు 12 శృతులు నిర్దిష్టమైన స్వరూపము. శ్రావ్యత కలిగినవి. తక్కిన 10 శృతులు గమకములందు మిళితమై, గమకమునందు అంతర్భాగమై యున్నవి. ఈ 10 శృతులకు ప్రత్యేక ప్రతిపత్తి లేదు. ఈ 10 శృతులపై నిలిపి సుదీర్ఘముగా ఆయా స్వరములను పాడుట గాని వాయించుటగాని (Rendering) చేసిన ఆ స్వరములు సంగీత యోగ్యత లేక శ్రావ్యతను గోల్పోవును.

ఈ శృతులను క్రమపద్ధతిలో వరుసగా పరిశీలించెదము.

**1.** **ఏక శృతి:** (1) 81/80; (2) 25/24; (3) 256/243; అనే మూడు విధాలుగా ఉంది. ఏక శృతి రిషభాన్ని 256/243గా శాస్త్రజ్ఞులు నిర్ణయించారు. దీనిని కోమల శుద్ధరిషభం అనవచ్చు. ఇది శృతి, స్వరస్థానము కాదు. ఈ రిషభం గౌళలో వచ్చును అని నిర్ణయించారు. ఈ స్వరం మీద నిలిపితే అపస్వర బాధ కలుగుతుంది. సారి, సారి, సారి అని గమకంతో అనిన బాగుగనే ఉండును. ఇచ్చట రి అల్పము. సా అధికము. ఈ ఏక శృతి రిషభ స్వరము సారిసారిదసా అనే ప్రయోగంలో పూర్వీకల్యాణిలో వచ్చును.

**2.** **ద్విశృతి రిషభం:** 16/15 (తీవ్ర శుద్ధరిషభం). ఈ శుద్ధ రిషభాన్ని శుద్ధంగా గమకంతో 'స'తో చేర్చకుండగనే పట్టవచ్చు. ఈ స్వరానికి శ్రావ్యత సహజంగానే ఉంది. ఇది స్వరస్థానము.

Solid ఈ స్వరశృతికి ప్రత్యేక ప్రతిపత్తి కలదు గమకముతోనైనను గమకములేక శుద్ధ స్వరముగానైనను రాణించును. ఇదియే నిజమైన, సహజమైన శుద్ధ రిషభము. దీనిని భావించుట, పాడుట వాయించుట సులభము. అన్ని శుద్ధ రిషభ రాగము యందును వచ్చును. ఏక శృతి రిషభము ఈ రిషభము యొక్క (AURA) ఛాయ, ప్రకాశాంశ, కాంతిరేఖ.

3. **త్రిశృతి రిషభం** (కోమల చతుశృతి రిషభం) చతు శృతి యొక్క పూర్వభాగం, అంశ. ఈ శృతి స్వరమునకు ప్రత్యేక ప్రతిపత్తి లేదు ఈ స్వరముపై నిలిపిన అపస్వర క్షోభ కలుగును. షడ్జమమునకు మైత్రి కాదు. వేద రుక్కులు గానము చేయునప్పుడు చతుశృతి రిషభమునకు ప్రయత్నము చేసి అచ్చటికి వెళ్లలేక త్రిశృతిలో ఆగిరి అని అందురు. త్రిశృతి రిషభ, త్రిశృతి దైవతములట్లే వచ్చినవి అని ఊహ.

4. **చతు శృతి రిషభము:** 9/8 ప్రముఖమైనది నిర్ధిష్ట రూపము కలది. సహజమైనది, శ్రావ్యమైనది. అన్ని చతుశృతి అంతరములు కలిగిన స్వరములు పూర్ణములు, శ్రావ్యములు. (Consonent) ఇది అతి చిన్న సంవాది. Full Note. అన్ని చతుశృతి రిషభ రాగములలో వచ్చును.

ఈ స్వరము గమకములోనైనను శుద్ధముగనైననూ రాణించును. ఈ స్వరము 7వ సంవాది 7th Harmonic. సంవాదులు క్రమముగా (1) స-స; (2) స-స; (3) స-ప; (4) స-మ; (5) స-అంతరగ; (6) స-సాధారణగ; (7) స-చరి;

ప్రపంచ సంగీత రీతులలో ఈ చతుశృతి రిషభమునకు ప్రాముఖ్యత కలదు. షడ్జమమునకు పైన మొట్టమొదటి సంపూర్ణ స్వరము (Major Note) ఇదే. ఈ స్వరము వచ్చు అన్ని ప్రసిద్ధ రాగములలో-శంకరాభరణం, కళ్యాణి, కంభోజి, ఖరహరప్రియ, రక్తి రాగములు-మోహన, దర్బారు, బిలహరి, శహన మొదలైన రాగములలో ప్రముఖ పాత్రను నిర్వహించుచు ప్రకాశించును.

5. **కోమల సాధారణ గాంధారము:** 32/27 సాధారణ గాంధారము యొక్క పూర్వ రూపము. ఛాయ; (సాధారణగాంధారం కాంతి పుంజము. కొన్ని సందర్భములలో సాధారణ గాంధార గమకమునందు లీలగా వచ్చును. ప్రత్యేకముగా పట్టుటకు వీలులేదు. అట్లు పట్టిన శ్రావ్యత ఉండదు. నాయకి, శ్రీరాగం, తోడి, వరాళి, దర్బారు కానడ, రాగములలో కొన్ని సంగతులలో కొన్ని సందర్భములలో గమకములతో చేరి వినిపించును. చతుశృతి రిషభమును కొన్ని రాగ సందర్భములలో కదుపునపుడు ఈ గాంధారమును స్పృశించుట జరుగును.

"రీ,గ రీ,గ రీ,గ" నాయకి యందు శ్రీరాగము నందు అతి సూక్ష్మమైన గమకము నందు రి,గామరిస అనవచ్చును.

6. **సాధారణ గాంధారము:** 6/5; 4 గాంధార శృతులలో రెండవది. ఇది స్వర స్థానము. పూర్ణస్వరము. ఈ స్వరము పై నిల్పవచ్చును. (Sustain) ఇది షడ్జమమునకు అను సంవాది. (6th Harmonic) శ్రావ్యత కలిగినది. ప్రత్యేక రూపము కలది. అన్ని సాధారణ గాంధార రాగములలో వచ్చును.

7. **అంతర గాంధారము:** (కోమల అంతర గాంధారము) 5/4; షడ్జమమునకు 5వ సంవాది. పూర్ణము శ్రావ్యము. ఇదియే అసలైన అంతర గాంధారము. దీనిపై ఎంత సేపైనను నిల్పవచ్చును. షడ్జమముతో చేర్చి ఈ స్వరమును ధ్వనింపచేసిన శ్రావ్యముగా నుండును. ఈ గాంధారమునకు పంచమముతో కూడా మైత్రి కలదు. స గ ప లను మూడు స్వరములకు TRIADS అందురు. ఇవి స్వరత్రయము. ఈ స్వరము స, ప ల యొక్క హితుడు. శంకరాభరణం, కాంభోజి, బిలహరి, మోహన, కళ్యాణి, మొదలైన ప్రముఖ రాగాల్లో ప్రకాశిస్తూ, దర్శనమిస్తోంది.

8. **త్రిశ్ర అంతర గాంధారము లేక చ్యుత మధ్యమ గాంధారము** : 83/84 అంతర గాంధారము యొక్క కాంతిపుంజము (AURA) ఛాయా స్వరం. ప్రత్యేకతలేనిది. భావించుట కష్టము. దీనిపై నిలుపుట తగదు. వీలులేదు. గమకము నందు వచ్చునేమో అనుకొనవలసినదే. దేవగాంధారి యందు ఈ స్వరము వచ్చునందురు.

9. **శుద్ధ మధ్యమము** : 4/3 Perfect Foutheth షడ్జమమునకు సరియైన సంవాది. సప్త స్వర మండల కుటుంబములో తల్లిగా భావించవచ్చును. తండ్రి షడ్జమం. పెద్ద కుమారుడు రాజ్య అర్హుడు, పంచమం.

ఈ సప్తస్వరములు ప్రకృతిలోనే ఉన్నవి. వీటిని ఋషులు కనిపెట్టారుకాని (Discover చేశారు.) సృష్టించలేదు. (Invention కాదు) షడ్జమధ్యమ భావమున శృతులు వచ్చుట కూడా ప్రాకృతికమే. షడ్జపంచమ భావాన్ని అవరోహణ క్రమం చేస్తే షడ్జ-మధ్యమభావము అగును. అటులనే షడ్జ-మధ్యమ భావాన్ని అవరోహణ క్రమంగా ప్రస్తరిస్తే షడ్జపంచమ భావశృతులే వచ్చును. స్వరసప్త కోలాహలమున, స్వరాకీకారణ్యమున షడ్జమము ప్రారంభము. మధ్యమము ఒక విశ్రాంతి కేంద్రము. స్వర సముద్రము నందు ఒక ద్వీపము. షడ్జమ తారషడ్జమములు ఈవలి ఆవలి గట్లు. ఒడ్డులు. మధ్యమ పంచమములు చిన్న పెద్ద ద్వీపములు.

షడ్జమము నుండి మధ్యమము వరకు షడ్జ-మధ్యమ భావము 4/3 మధ్యమము నుండి తార షడ్జమము వరకు షడ్జ-పంచమ భావము 3/2 ఈ రెండు భావములు కలసి ఒక స్థాయి అగుచున్నవి. 4/3 × 3/2 = 2 తారస్థాయి. ప్రపంచ సంగీత రీతులలో గానీ, భారతీయ సంగీతము నందు గాని శుద్ధ మధ్యమ రాగములే ఎక్కువగా నున్నవి. ప్రతి మధ్యమ రాగములు చాలా తక్కువ.

ఖరహరప్రియను గ్రహభేదముగా చేయగా అన్నీ ప్రముఖ రాగములే వచ్చును. అవి, తోడి, కళ్యాణి, హరికాంభోజి నఠభైరవి, శంకరాభరణ రాగములు. ఇందులో కళ్యాణి మాత్రమే ప్రతి మధ్యమ రాగము. తక్కిన 5 రాగములు శుద్ధ మధ్యమ రాగములే. ఈ ఏర్పాటు కూడా ప్రకృతి సిద్ధమే. (Natural Phenomenon) ఈ అయిదు రాగములు బ్రహ్మసృష్టి, కళ్యాణి విశ్వామిత్ర సృష్టి అనుట ఒక ఉత్ప్రేక్ష.

10. **తీవ్ర శుద్ధ మధ్యమము:** 27/20 ఈ మధ్యమము అరుదైనవి. (Obscure) (Rare) ఈ స్వరము, లేక శృతి, గమకమునందు ఒక క్షణకాలమున దర్శనమిచ్చును. దాని ఉనికిని తెలియుటకు అతి సూక్ష్మ శ్రవణ జ్ఞానము కావలయును.

బేగడ రాగమున ఇది ఉన్నదా అను సందేహము. ఈ మధ్యమము లెక్కలకే పరిమితి. లక్ష్యమున అనుభవేద్యము. బేగడ యందు ఇది లేక పోయినను బేగడకు లోటురాదు.

ఒక్కొక్క రాగమున మాత్రమే ఉపయోగపడు ఈ అరుదు శృతులు ఉన్నను లేకపోయిననూ ఒకటే. ఏక రాగ ఆశ్రితులు ఈ శృతులు పరాన్న భుక్కులకు పోల్చదగునా!! అపచారమా?! ఇట్టి ఏక శృతి త్రిశృతి రిషభం. కోమల సాధారణ గాంధారం, చ్యుత మధ్యమ గాంధారం, చ్యుత పంచమ మధ్యమం, ఏక శృతి ధైవతం త్రిశృతి ధైవతం, కోమల కైశిక నిషాధం. చ్యుత షడ్జమ నిషాధం శృతులు ఏకరాగ ఆశ్రితులు. సమశృతులు కావు. వీటికి ధైర్యంగా నిలబడే శక్తి లేదు. సంగీత ఉపయోగం లేదు. ఇవి పాకుడు రాళ్ల లాంటివి. బుద్బుద ప్రాయమైనవి. ఇవి తక్కిన 12 శృతుల లేక స్వరస్థానముల ఛాయలు (Extensions) వాటి కాంతికణములు. 12 స్వరస్థానములు నిజములు, Facts, Truths, Solid Sculptures. 10 శృతులు Myth, Enigmatic, సందేహాలు. ఈ 12 స్వరస్థానములు గట్టిగా నిలబడి సంగీత కట్టడమునకు స్థంభముల వలె నిలబడి మిగిలిన 10 శృతులకు ఆశ్రయమిచ్చి వాటికి ఉనికిని కల్పించి గ్రంధములందును కేవల సంగీత శాస్త్రజ్ఞుల ఆలోచనలలోనూ జీవింప చేయు జీవార్యము 12 స్వరస్థానములకే దక్కును. రాజవంశమున రాజేశ్వరుని పెద్ద కుమారునికే పట్టాభిషేక యోగ్యత రెండవ కుమారునికి రాజయోగములేదు అట్లె, ఈ 12 స్వరస్థానములు (పెద్దకుమారులు) 10 స్వరస్థానములు చిన్నకుమారులు.

**11.** ప్రతిమధ్యమము : 45/32 లేక 1024/729 ఈ స్వరశృతికి శ్రావ్యత, ప్రాముఖ్యము మొదలగునవి అన్నియును ఉన్నవి. అన్ని ప్రతిమధ్య రక్తిరాగములలోనూ ఈ స్వరశృతియే వాడబడుచున్నది.

**12.** చ్యుత మధ్యమ పంచమము (తీవ్రప్రతిమధ్యమము) : ఈ స్వరశృతి Myth; obsuere ఊహ, అరుదు. వరాళి, లోనూ, అవరోహణ సంగతిలో (పమగరిస) శుద్ధగాంధారము, శుద్ధ రిషభము వచ్చు ఆరు దేవరాగములలో వచ్చు అవకాశము ఉన్నది.

**13.** పంచమము : 3/2 షడ్జమము తరువాత షడ్జమ మంతస్వరం. షడ్జ-పంచమములు సంవాదులు. శ్రావ్యత, ప్రాముఖ్యం, ప్రయోజనం, అన్ని విధములైన సంగీత విలువలు కలిగి పుష్టి అయినది. స్వయం ప్రకాశం కలిగినది, ఈ పంచమ స్వరం. షడ్జ, పంచమాలు ప్రకృతి స్వరాలు. 'వీటికి వికృతి లేదు ఇవి అచల స్వరములు. చలించవు. వీటికి గమకములు అనే అలంకారములు అక్కర్లేదు. సంగీతమునకే అవి అలంకారములు. సంగీతమునకు భూమికలు ఆధారములు.

7 స్వరాలే ఉండి 8వ స్వరం ప్రకృతిలో లేకపోవడం, ఈ స్వరాలు అన్ని శ్రావ్యంగా ఉండి రమ్యంగా మాధుర్యంగా, ఉండటం స-ప, భావం. స-మ భావం స్వరముల మధ్య నిర్ణీత గమక నిర్ణయం, రిగమదని స్వరములు రెండేసిగా విభజన చెందడం ఇవన్నీ నేచురల్ మ్యూజికల్ లాస్. పాకృతిక సంగీత ధర్మాలు భగవన్నిర్మితాలు. సంగీత న్యాయాలు. సార్వ జనీకాలు.(Universal)

షడ్జం - Indomental Note. అది తేకపోతే కుటుంబ కలతలు (Confusion) (Discordent Effects)

షడ్జగ్రామం Home-Sweet Home. షడ్జమానికి తక్కిన స్వరాలకు మధ్య ఒక (Silver Cord ఉంది) జీవన బంధము సంగీత యజ్ఞోపవీత బంధనము ఉంది. ఒక తీయటి తాళి ఉంది.

రి,గ,మ,ద,ని,స్వరాలకు Direct గా షడ్జమంతో మైత్రి, సంబంధం, ఉంటూ వాటితో కూడా మైత్రి, సంబంధం, ఉంటుంది.

శుద్ధరిషభం అని మనం అన్నప్పుడు షడ్జమానికి శుద్ధరిషభం అని అర్థం. అలాగే ఏ స్వరం అనినా, ఏ స్వరస్థానం అనినా ఏ శృతి అనినా షడ్జమానికి (Direct Relationship or Value) నేరుగా ఆయా సంబంధాలు కలిగిన స్వరం అని అర్థం. అందుకే షడ్జమానికి అంత ప్రాముఖ్యత. ఎంత కట్టడానికైనా భూమి కావలసినట్లు.

స్వరజ్ఞానానికి షడ్జమం ముఖ్యం. షడ్జమం మరచిపోతే మిగతా స్వరాలు అనామకాలుగా దిక్కులేనివిగా అనాధలుగా ఉండి రస విహీనంగా స్వరజ్ఞాన శూన్యతను వ్యక్తపరుస్తాయి. షడ్జమాన్ని మనస్సు నందు ప్రతిష్ఠించిన తరువాతనే స్వరజ్ఞానం ప్రారంభం అవుతుంది. స్వరసప్తకాన్ని రెండు భాగాలుగా చేసి "సరిగమ" ను పూర్వాంగంగానూ "పదని" ని ఉత్తరాంగంగానూ పేర్కొన్నారు పెద్దలు. ఉత్తరంగానికి "ప" ప్రారంభ స్వరం.

పంచమం అనగా 5వ స్వరం అని అర్థం. దీనికి మధ్యమానికి కూడా వేరే పేర్లు లేవు. సరిగ "మ" పదని లలో 'మ' మధ్యన ఉంది కనుక మధ్యమం అన్నారు. కోకిల వసంత ఋతువులో కూసిన కూత పంచమం అంత మధురంగా ఉంటుందట. పంచమం మధురంగా శ్రావ్యంగా ఉంటుంది. ఇది అచల స్వరం. ప్రకృతి స్వరం. అవికృత స్వరం. దీనిని Perfect 5th అంటారు. (Western Music) పాశ్చాత్య సంగీతంలో దీని సంకేతం "జి". మేళకర్త రాగాలలో అన్ని స్వరాలు ఉండాలి; పంచమం ఉండాలి. పంచమ వర్జరాగాలు శ్రీరంజని, అభోగి, వసంత, లలిత, హంసానంది, రంజని రాగాలు అందంగా ఉంటాయి. కళ్యాణిలోనూ, పూర్వీకళ్యాణిలోనూ, తోడిలోనూ పంచమం వర్జ్యం చేసి పాడటం ఒక రుచి, ఒక అందం. (Delicacy) పంచమం అరుదుగా వచ్చే రాగాలు. రీతిగౌళ, నాటకురంజి, ఫరజు, తీవ్ర ప్రతిమధ్యమాన్ని, మృదుపంచమం, చ్యుత పంచమం అని వాడటం ఉంది. పంచమం అచలంకదా అందుచేత పంచమానికి చ్యుతిని ఈయడం అనే విషయం రుచిగా (Not in good taste) లేదు.

**14. ఏకశృతి ధైవతం:** 128/81. ఏకశృతి రిషభాన్ని గురించిన వర్ణనలు అన్ని ఈ శృతి స్వరానికి సరిపోతాయి. ఇది కోమల శుద్ధ ధైవతం. ఇది అరుదు. గమకంతోనే దీని ఉనికి. దీనిమీద నిలపడానికి వీలులేదు శ్రావ్యత ఉండదు. పాద; పాద; పాద అని సావేరిలోనూ, తోడిలోనూ, షణ్ముఖప్రియ రాగాల్లోనూ దుర్బలంగా, అల్పంగానూ ఉంటుంది.

**15. తీవ్రశుద్ధ ధైవతం:** ద్విశృతి ధైవతం: 8/5 నిజమైన శుద్ధ ధైవతం, ఈ స్వరం మీద నిలిపి పాడవచ్చు, వాయించవచ్చు. అన్ని శుద్ధ ధైవతం వచ్చే రాగాలలోనూ వస్తుంది.

**16. త్రిశృతి ధైవతం :** 5/3 హరప్రియలో, సామగాన మూర్ఛనలో వస్తుందని సంగీత శాస్త్ర గ్రంథాలలో ఉంది. ఇది సమశృతి కాదు. పంచమానికి త్రిశృతి భావంలో ఉంది. కనుక సుస్వరం లోపిస్తుంది. దీనిపై నిలపవడానికి వీలులేదు. కాంభోజిలో ఈ త్రిశృతి ధైవతం ఉందని సమకాలీన గ్రంథాలు పూర్వ గ్రంథాలను అనుకరిస్తూ వ్రాశాయి. లక్ష్య లక్షణాలు అవగాహన చేసుకొన్న పండిత విద్వాంసులు, ఈ శృతిని గురించి తార్కికంగా వివరించాలి. Logical గా establish చేస్తే బాగుంటుంది.

ఈ త్రిశృతిధైవతం పాదప అని పాడటానికి బదులు పానిప అని పాడేచోట ఆనందభైరవిలోనూ, అఠాణాలోనూ వస్తూ ఉండవచ్చు.

భౌళి, భూపాల, రేగుప్తి రాగాలను, విని పాడే హరిదాసులు. నాటకాలలో నటకులు భాగవతులు. జానపద సంగీతం పాడేవారు (Rustic style) ఈ త్రిశృతి ధైవతం శుద్ధ ధైవతాన్ని హెచ్చించిపాడటం కద్దు.

**17. చతుశ్శృతి ధైవతం:** 27/16. షడ్జమానికి చతుశ్శృతి రిషభం శుద్ధ మధ్యమానికి పంచమం; పంచమానికి చతుశ్శృతి ధైవతం ఈ మూడు ఒకే నిష్పత్తిలో ఉండి రంజకత్వం కలిగిన స్వర జంటలు. చతుశ్శృతి రిషభానికి ఉన్న అన్ని మంచి లక్షణాలు ఈ స్వరానికి ఉన్నాయి.

**18. కోమల కైశిక నిషాధం:** 16/9 సామగాన మూర్ఛన, హరప్రియ, నాయకి, మాంజ, మధ్యమావతి రాగాల్లో లీలగా గమక గర్భితంగా, గమకాంతర్గతంగా వస్తుంది. ఈ శృతిస్వరం శుద్ధ మధ్యమానికి శుద్ధ మధ్యమం

**19. కైశిక నిషాధం** : 9/5 ఎక్కువ రాగాల్లో వచ్చేదీ ఈ స్వరశృతే. దీనికి సుస్వర విలువ ఉంది. నిలిపి పాడవచ్చు. కానడ, ఖరహరప్రియ, తోడి, కాంభోజి మొదలైన అన్ని కైశిక నిషాధ రాగాలలో వస్తుంది. దీనికి నిర్ధిష్టమైన రూపం ఉంది.

**20. కాకలి నిషాధం** : 15/8. శంకరాభరణం, కళ్యాణి, మొదలైన రాగాల్లో వస్తుంది. ఈ శృతి స్వరం మీద నిలిపి పాడవచ్చు.

**21. చ్యుత షడ్జమ నిషాధం** : 243/128 ఈ స్వరం నీలాంబరి, కురంజి, వరాళి రాగాల్లో స్పష్టంగా వినిపిస్తుంది. ఈ స్వరం షడ్జమంతో చేరి సానిసానిసాని అని గాని, నీస, నీస, నీస అని గాని వినిపిస్తుంది.

**22. షడ్జమం:** భరతుని నాట్య శాస్త్రము ఇప్పటికి 1600 సంవత్సరములు క్రిందటిది. ఈ గ్రంథమును శృతుల విషయము నందు అనుసరించినది, శార్ఙ్గ దేవుని రత్నాకరము. అయినను ఈ ఇద్దరు శాస్త్రకారులు శృతుల విషయము నందు ఏకాభిప్రాయము కలిగిన వారు కారు.

లక్ష్య ప్రమాణములను ఆధారముగ చేసుకొనిన (లక్ష్య ప్రమాణములకు సరిపోయిన),

ద్రావిడ పురాతన గ్రంథములైన "తొల్ కాప్పియము", "శిలప్పధికారముల" యందు 'శృతుల విషయము హృద్యముగ వివరింపబడినది. ఈ గ్రంథముల యందు 12, 24, 48, 96 మొదలైన విధముగా సమశృతులు చెప్పబడి, వాటియందు రాగములు ఎట్లు పుట్టునో వివరింపబడినది. ఈ పద్ధతి ద్రావిడ దేశమున భరతునికి పూర్వము 1000 సంవత్సరములు క్రిందటనే వాడుకలో నున్నది. పై ద్రావిడ గ్రంథములలో వట్టప్పాలై అను 24 శృతుల పద్ధతిలో రెండు శృతులను తగ్గించి 22 శృతులగాన పద్ధతిని కూడా చెప్పి యున్నారు. ఈ 24 శృతుల పద్ధతి. అబ్రహాం పండితుని కరుణామృత సాగరమున వివరింపబడెను.

ఈ శృతుల లెక్కింపు విషయమున అనేక గ్రంథకర్తలు, శాస్త్రజ్ఞులు, అనేక అభిప్రాయములు కలిగి యుండిరి. ఈనాడు కూడా భేదాభిప్రాయములు కలవు. స్వరముల విషయమునగాని, స్వరస్థానముల విషయమున గాని భేదాభిప్రాయములు లేకుండుట, శృతుల విషయమున ఇన్ని వివిధాభిప్రాయములుండుటకు కారణము తెలుసుకొనుట సులభము. నిజమునకు వీరందరూ వారివారి ఆలోచనల, పరిశోధనల ద్వారా వారు ప్రతిపాదించినవి యధార్ధములే. ఈ అభిప్రాయములలో ఒక్కటీ అబద్ధము కాదు. ఏలనన శృతులు శిలలు కావు కణములు. కిరణములు. స్వరములు స్వరస్థానములు శిలలు. శృతులు సైకత రేణువులు. సూక్ష్మ కణములు. అవి గణితమునకు అతీతములు. సూక్ష్మాతి సూక్ష్మములు. అవి స్థూల చక్షువుతో స్థూల శ్రవణేంద్రయములకు తోచవు. వాటిని చూచుటకు వినుటకు అంతరేంద్రియమైన మేధస్సు Intellect కావలెను. వారివారి జ్ఞానేంద్రియముల ద్వారా వారికి తోచినట్లు వారందరు వివిధ అభిప్రాయములను వెల్లడించిరి.

# 34. శుద్ధ వికృత స్వర నిరూపణ

శ్లో॥ చతు శ్చతు శ్చతుశ్చైవ షడ్జమధ్యమపంచమా: ।
ద్వేద్వే నిషాద గాంధారౌ త్రిస్త్రిఋషభధైవతౌ ॥ (సం.ర.)

తా. పైని చెప్పబడిన 22 శ్రుతులలో షడ్జపంచమ మధ్యములు నాలుగేసి శ్రుతులను, ఋషభ ధైవతములు మూఁడేసి శ్రుతులను, నిషాద గాంధారములు రెండేసి శ్రుతులను, బడసియుండును.

మఱియు, షడ్జమునకు దీప్తా, ఆయతా, మృదూ, మధ్యాజాతులందును; ఋషభమునకు, కరుణా, మధ్యా, మృదూ జాతులయందును; గాంధారమునకు దీప్తా, ఆయతా జాతులయందును; మధ్యమమునకు దీప్తా, ఆయతా, మృదూ, మధ్యా జాతులందును; పంచమమునకు మృదూ, మధ్యా, ఆయతా, కరుణా జాతులందును; ధైవతమునకు కరుణా, ఆయతా, మధ్యా జాతులయందును; నిషాదమునకు దీప్తా, మధ్యా జాతులయందును శ్రుతులు గలిగియుండును.

*శ్రుతిజాతుల విభాగ పథకమును నీ దిగువఁ జూడుఁడు*

| | | శృతులు | జాతులు | | | శృతులు | జాతులు |
|---|---|---|---|---|---|---|---|
| 1 | స | తీవ్రా | దీప్తా | 12 | మ | ప్రీతీ | మృదూ |
| 2 | స | కుముద్వతీ | ఆయతా | 13 | మ | మార్జనీ | మధ్యా |
| 3 | స | మన్దా | మృదూ | 14 | ప | క్షితీ | మృదూ |
| 4 | స | ఛన్దోవతీ | మధ్యా | 15 | ప | రక్తా | మధ్యా |
| 5 | రి | దయావతీ | కరుణా | 16 | ప | సన్దీపినీ | ఆయతా |
| 6. | రి | రఞ్జనీ | మధ్యా | 17 | ప | ఆలాపినీ | కరుణా |
| 7 | రి | రతికా | మృదూ | 1౬ | ధ | మదన్తీ | కరుణా |
| 8 | గ | రౌద్రీ | దీప్తా | 19 | ధ | రోహిణి | ఆయతా |
| 9 | గ | క్రోధీ | ఆయతా | 20 | ధ | రమ్యా | మధ్యా |
| 10 | మ | వజ్రికా | దీప్తా | 21 | ని | ఉగ్రా | దీప్తా |
| 11 | మ | ప్రసారిణీ | ఆయతా | 22 | ని | క్షోభిణీ | మధ్యా |

స్వరము

శ్లో॥ శ్రుత్యనంతరభావీయ: స్నిగ్ధోనురణనాత్మక: ।
స్వతోరంజయతి శ్రోతృ చిత్తం స స్వర ఉచ్యతే ॥ (సం.ర.)

తా. శ్రుతికి వెంటనే కలిగెడి స్నిగ్ధమైనదియును, అనురణనాత్మకమైన దనియును, స్వకీయముగ రంజనమును గలదియు, శ్రోతృచిత్త సుఖావహముగ నుండునదియును స్వర మనఁబడును.

## 35. సంగీత రత్నాకర గ్రంథగత శుద్ధ వికృత స్వరములు

* ఈ గురుతులఁగలవి శుద్ధస్వర నామములనియును, గురుతులు లేనివి వికృతస్వర నామములనియు నెఱుంగునది.

| శృతుల సంఖ్యలు | శ్రుతుల పేర్లు | నియత శ్రుతులు | స్వరముల పేర్లు |
|---|---|---|---|
| 1 | తీవ్రా | | కైశికీ నిషాదము |
| 2 | కుముద్వతీ | | కాకలి నిషాదము |
| 3 | మన్దా | | చ్యుత షడ్జము |
| 4 | ఛన్దోవతీ | స | శుద్ధ షడ్జము *; అచ్యుత షడ్జము |
| 5 | దయావతీ | | |
| 6 | రఞ్జనీ | | |
| 7 | రతికా | రి | శుద్ధ ఋషభము *; వికృత ఋషభము; (చతుశ్రృతి ఋషభము) |
| 8 | రౌద్రీ | | |
| 9 | క్రోధీ | గ | శుద్ధ గాంధారము *; |
| 10 | వజ్రికా | | సాధారణ గాంధారము. |
| 11 | ప్రసారిణీ | | అంతర గాంధారము |
| 12 | ప్రీతీ | | చ్యుత మధ్యమము. |
| 13 | మార్జనీ | మ | శుద్ధ మధ్యమము *; అచ్యుత మధ్యమము |
| 14 | క్షితీ | | |
| 15 | రక్తా | | |
| 16 | సన్దీపినీ | | కైశికి పంచమము; త్రిశ్రుతి పంచమము. |
| 17 | ఆలాపినీ | ప | శుద్ధ పంచమము *; |
| 18 | మదన్తీ | | |
| 19 | రోహిణీ | | |
| 20 | రమ్యా | ధ | శుద్ధధైవతము *; వికృత ధైవతము. చతుశ్రుతి ధైవతము. |
| 21 | ఉగ్రా | | |
| 22 | క్షోభిణీ | ని | శుద్ధ నిషాదము *; |

## 36. రాగవిబోధ గ్రంథగత శుద్ధ వికృత స్వరములు

* ఈ గురుతులఁగలవి శుద్ధస్వర నామములనియును, గురుతులు లేనివి వికృతస్వర నామములనియు నెఱుంగునది.

| శృతుల సంఖ్యలు | శ్రుతుల పేర్లు | నియత శ్రుతులు | స్వరముల పేర్లు |
|---|---|---|---|
| 1 | తీవ్రా | | కైశికి నిషాదము; తీవ్రతమ ధైవతము |
| 2 | కుముద్వతీ | | కాకలి నిషాదము |
| 3 | మన్దా | | మృదు షడ్జము |
| 4 | ఛన్దోవతీ | స | శుద్ధ షడ్జము *; |
| 5 | దయావతీ | | |
| 6 | రఞ్జనీ | | |
| 7 | రతికా | రి | శుద్ధ ఋషభము *; |
| 8 | రౌద్రీ | | తీవ్ర ఋషభము ; (చతుశ్రృతి ఋషభము) |
| 9 | క్రోధీ | గ | శుద్ధమధ్యమము *; తీవ్రతమ ఋషభము; |
| 10 | వజ్రికా | | త్రిశ్రృతి (రి) |
| 11 | ప్రసారిణీ | | అంతర గాంధారము |
| 12 | ప్రీతీ | | మృదు మధ్యమము. |
| 13 | మార్జనీ | మ | శుద్ధ మధ్యమము *; తీవ్రతమ గాంధారము |
| 14 | క్షితీ | | తీవ్రతమ మధ్యమము |
| 15 | రక్తా | | |
| 16 | సన్దీపినీ | | మృదు పంచమము |
| 17 | ఆలాపినీ | ప | శుద్ధ పంచమము *; |
| 18 | మదన్తీ | | |
| 19 | రోహిణీ | | |
| 20 | రమ్యా | ధ | శుద్ధధైవతము *; |
| 21 | ఉగ్రా | | తీవ్ర ధైవతము ; చతుశ్రుతి ధైవతము. |
| 22 | క్షోభిణీ | ని | శుద్ధ నిషాదము *; తీవ్రతర ధైవతము |

## 37. స్వరమేళకళానిధి గ్రంథగత శుద్ధ వికృత స్వరములు

* ఈ గురుతులఁగలవి శుద్ధస్వర నామములనియును, గురుతులు లేనివి వికృతస్వర నామములనియు నెఱుంగునది.

| శృతుల సంఖ్యలు | శ్రుతుల పేర్లు | నియత శ్రుతులు | స్వరముల పేర్లు |
|---|---|---|---|
| 1 | తీవ్రా | | కైశికీ నిషాదము; షట్ఛ్రుతి ధైవతము |
| 2 | కుముద్వతీ | | కాకలి నిషాదము |
| 3 | మన్దా | | చ్యుతషడ్జ నిషాదము |
| 4 | ఛన్దోవతీ | స | శుద్ధ షడ్జము *; |
| 5 | దయావతీ | | |
| 6 | రఞ్జనీ | | |
| 7 | రతికా | రి | శుద్ధ (రి) *; |
| 8 | రౌద్రీ | | |
| 9 | క్రోధీ | గ | శుద్ధ (గ) *; పంచశ్రుతి (రి). |
| 10 | వజ్రికా | | సాధారణ (గ) ; షట్ఛ్రుతి (రి). |
| 11 | ప్రసారిణీ | | అంతర (ర) |
| 12 | ప్రీతీ | | చ్యుత మధ్యమ గాంధారము |
| 13 | మార్జనీ | మ | శుద్ధ (మ) *: |
| 14 | క్షితీ | | తీవ్రతమ మధ్యమము |
| 15 | రక్తా | | |
| 16 | సన్దీపినీ | | చ్యుత పంచమ మధ్యమము |
| 17 | ఆలాపినీ | ప | శుద్ధ (ప) * |
| 18 | మదన్తీ | | |
| 19 | రోహిణీ | | |
| 20 | రమ్యా | ధ | శుద్ధ (ధ) * |
| 21 | ఉగ్రా | | |
| 22 | క్షోభిణీ | ని | శుద్ధ (ని) *; పంచశ్రుతి (ధ). |

### 38. చతుర్దండి ప్రకాశిక గ్రంథగత శుద్ధ వికృత స్వరములు

* ఈ గురుతులఁగలవి శుద్ధస్వర నామములనియును, గురుతులు లేనివి వికృతస్వర నామములనియు నెఱుంగునది.

| శృతుల సంఖ్యలు | శ్రుతుల పేర్లు | నియత శ్రుతులు | స్వరముల పేర్లు |
|---|---|---|---|
| 1 | తీవ్రా | | కైశికీ నిషాదము ; షట్శ్రుతి ధైవతము |
| 2 | కుముద్వతీ | | కాకలి నిషాదము |
| 3 | మన్దా | | |
| 4 | ఛన్దోవతీ | స | శుద్ధ షడ్జము *; |
| 5 | దయావతీ | | |
| 6 | రఞ్జనీ | | |
| 7 | రతికా | రి | శుద్ధ (రి) *; |
| 8 | రౌద్రీ | | |
| 9 | క్రోధీ | గ | శుద్ధ (గ) *; పంచశ్రుతి (రి). |
| 10 | వజ్రికా | | సాధారణ (గ) ; షట్శ్రుతి (రి). |
| 11 | ప్రసారిణీ | | అంతర (గ) |
| 12 | ప్రీతీ | | |
| 13 | మార్జనీ | మ | శుద్ధ (మ) *; |
| 14 | క్షితీ | | తీవ్రతమ మధ్యమము |
| 15 | రక్తా | | |
| 16 | సన్దీపినీ | | వరాళి మధ్యమము ; వికృత పంచమ (మ) |
| 17 | ఆలాపినీ | ప | శుద్ధ (ప) *; |
| 18 | మదన్తీ | | |
| 19 | రోహిణీ | | |
| 20 | రమ్యా | ధ | శుద్ధ ధైవతము *; |
| 21 | ఉగ్రా | | చతుశ్రుతి ధైవతము |
| 22 | క్షోభిణీ | ని | శుద్ధ (ని) *; పంచశ్రుతి (ధ). |

## 39. సంగీత పారిజాతగత శుద్ధ వికృత స్వరములు

* ఈ గురుతులఁగలవి శుద్ధస్వర నామములనియును, గురుతులు లేనివి వికృతస్వర నామములనియు నెఱుంగునది.

| శృతుల సంఖ్యలు | శ్రుతుల పేర్లు | నియత శ్రుతులు | స్వరముల పేర్లు | | సూచన |
|---|---|---|---|---|---|
| | | | కోమల స్వరములు | తీవ్ర స్వరములు | |
| 1 | తీవ్రా | | | తీవ్ర-ని | 22 శ్రుతులకు పైన కొన్ని శ్రుతులున్నవని ఈ గ్రంథకారుడు చెప్పియున్నారు. |
| 2 | కుముద్వతీ | | | తీవ్రతర-ని | |
| 3 | మన్దా | | | తీవ్రతమ-ని | |
| 4 | ఛన్దోవతీ | స | శుద్ధ-స * | | |
| 5 | దయావతీ | | పూర్వ-రి | | |
| 6 | రఞ్జనీ | | కోమల-రి | | |
| 7 | రతికా | రి | శుద్ధ (రి)*; పూర్వ-గ | | |
| 8 | రౌద్రీ | | కోమల-గ | తీవ్ర-రి | |
| 9 | క్రోధీ | గ | శుద్ధ-గ * | త్రీవతర-రి | |
| 10 | వజ్రికా | | | తీవ్ర-గ | |
| 11 | ప్రసారిణీ | | | తీవ్రతర-గ | |
| 12 | ప్రీతీ | | | తీవ్రతమ-గ | |
| 13 | మార్జనీ | మ | శుద్ధ-మ * | అతితీవ్రతమ-గ | |
| 14 | క్షితీ | | | తీవ్ర-మ | |
| 15 | రక్తా | | | తీవ్రతమ-మ | |
| 16 | సన్దీపినీ | | | తీవ్రతమ-మ | |
| 17 | ఆలాపినీ | ప | శుద్ధ-ప * | | |
| 18 | మదన్తీ | | పూర్వ-ధ | | |
| 19 | రోహిణీ | | కోమల-ధ | | |
| 20 | రమ్యా | ధ | పూర్వ-ని ; శుద్ధ-ధ* | | |
| 21 | ఉగ్రా | | కోమల-ని | తీవ్ర-ధ | |
| 22 | క్షోభిణీ | ని | శుద్ధ-ని* | తీవ్రతర-ధ | |

40. రత్నాకర ప్రకారమని వాడుకలో ఉన్న స్వరస్థానములు పుట్టిన శృతులను చూపెడి పథకము.

| శృతుల సంఖ్యలు | శ్రుతుల నామములు | జాతులు | సంకేత స్వరములు | స్వరనామములు |
|---|---|---|---|---|
| 1 | తీవ్రా | దీప్తా | కై-ని | కైశికీ నిషాదము ; షట్శృతి ధైవతము |
| 2 | కుముద్వతీ | ఆయతా | కా-ని | కాకలి నిషాదము |
| 3 | మన్దా | మృదూ | | |
| 4 | ఛన్దోవతీ | మధ్యా | స | శుద్ధ షడ్జము |
| 5 | దయావతీ | కరుణా | | |
| 6 | రఞ్జనీ | మధ్యా | రి | తోడి ఋషభము; శుద్ధఋషభము |
| 7 | రతికా | మృదూ | రి | రత్నాకరగత శుద్ధ ఋషభము |
| 8 | రౌద్రీ | దీప్తా | రి | చతుశ్రుతి ఋషభము |
| 9 | క్రోధీ | ఆయతా | రి-గ | శుద్ధగాందారము |
| 10 | వజ్రికా | దీప్తా | గ-రి | సాధారణగాంధారము ; షట్శృతి ఋషభము |
| 11 | ప్రసారిణీ | ఆయతీ | గ | అంతర గాంధారము |
| 12 | ప్రీతి | మృదూ | | |
| 13 | మార్జనీ | మధ్యా | మ | శుద్ధ మధ్యమము |
| 14 | క్షితీ | మృదూ | | |
| 15 | రక్తా | మధ్యా | మ | ప్రతి మధ్యమము |
| 16 | సన్దీపినీ | ఆయతా | | |
| 17 | ఆలాపినీ | కరుణా | ప | పంచమము |
| 18 | మదన్తీ | కరుణా | | |
| 19 | రోహిణీ | ఆయతా | ధ | శుద్ధ ధైవతము |
| 20 | రమ్యా | మధ్యా | ధ | గ్రంథగత శుద్ధ ధైవతము |
| 21 | ఉగ్రా | దీప్తా | ధ-ని | చతుశ్రుతి ధైవతము |
| 22 | క్షోభిణీ | మధ్యా | ని | శుద్ధ నిషాదము |

## 41. గ్రామత్రయములను జూపెడి పథకము
## రత్నాకర పద్ధతికి కొంచెము వ్యత్యాసమైన పద్ధతి

| శృతుల సంఖ్యలు | శ్రుతుల నామములు | జాతులు | షడ్జ గ్రామము | మధ్యమ గ్రామము | గాంధార గ్రామము |
|---|---|---|---|---|---|
| 1 | తీవ్రా | దీప్తా | ● | ● | ● |
| 2 | కుముద్వతీ | ఆయతా | ● | ● | ● |
| 3 | మన్దా | మృదూ | ● | ● | ● |
| 4 | ఛన్దోవతీ | మధ్యా | స | స | స |
| 5 | దయావతీ | కరుణా | ● | ● | ● |
| 6 | రఞ్జనీ | మధ్యా | ● | ● | రి |
| 7 | రతికా | మృదూ | రి | రి | ● |
| 8 | రౌద్రీ | దీప్తా | | | |
| 9 | క్రోధీ | ఆయతా | గ | గ | ● |
| 10 | వజ్రికా | రీప్తా | ● | ● | గ |
| 11 | ప్రసారిణీ | ఆయతా | ● | ● | ● |
| 12 | ప్రీతి | మృదూ | ● | ● | ● |
| 13 | మార్జనీ | మధ్యా | మ | మ | మ |
| 14 | క్షితీ | మృదూ | ● | ● | ● |
| 15 | రక్తా | మధ్యా | ● | ● | ● |
| 16 | సన్దీపినీ | ఆయతా | ● | ప | ప |
| 17 | ఆలాపినీ | కరుణా | ప | ● | ● |
| 18 | మదన్తీ | కరుణా | ● | ● | ● |
| 19 | రోహిణీ | ఆయతా | ● | ● | ద |
| 20 | రమ్యా | మధ్యా | ద | ధ | ● |
| 21 | ఉగ్రా | దీప్తా | ● | ● | ● |
| 22 | క్షోభిణీ | మధ్యా | ని | ని | ని |

42. గ్రామ నిర్ణయమును చూపుటకై సంగీత రత్నాకరమునందుఁ గల పరిశిష్టములోని పథకము

| శృతుల సంఖ్యలు | శ్రుతులు | జాతులు | షడ్జ గ్రామము | మధ్యమ గ్రామము | గాంధార గ్రామము | |
|---|---|---|---|---|---|---|
| 1 | తీవ్రా | దీప్తా | • | • | ని | మధ్యమ గ్రామము నందు ధైవతము 20-వ స్థానమును విడిచి 19వ స్థానములో నున్నది. ఇది గ్రంథాంతర భేదమని చెప్పుచున్నారు. |
| 2 | కుముద్వతీ | ఆయతా | • | • | • | |
| 3 | మన్దా | మృదూ | • | • | • | |
| 4 | ఛన్దోవతీ | మధ్యా | స | స | స | |
| 5 | దయావతీ | కరుణా | • | • | • | |
| 6 | రఞ్జనీ | మధ్యా | • | • | • | |
| 7 | రతికా | మృదూ | రి | రి | రి | |
| 8 | రౌద్రీ | దీప్తా | | | | |
| 9 | క్రోధీ | ఆయతా | గ | గ | • | |
| 10 | వజ్రికా | దీప్తా | • | • | గ | |
| 11 | ప్రసారిణీ | ఆయతా | • | • | • | |
| 12 | ప్రీతి | మృదూ | మ | మ | మ | |
| 13 | మార్జనీ | మధ్యా | • | • | | |
| 14 | క్షితీ | మృదూ | • | • | | |
| 15 | రక్తా | మధ్యా | • | • | • | |
| 16 | సన్దీపినీ | ఆయతా | • | ప | ప | |
| 17 | ఆలాపినీ | కరుణా | ప | • | • | |
| 18 | మదన్తీ | కరుణా | • | • | • | |
| 19 | రోహిణీ | ఆయతా | • | ధ | ధ | |
| 20 | రమ్యా | మధ్యా | ద | • | • | |
| 21 | ఉగ్రా | దీప్తా | • | • | • | |
| 22 | క్షోభిణీ | మధ్యా | ని | ని | • | |

ఈ వివిధ పథకముల ప్రయోజనము గ్రంథగతము. నిర్బంధము కాదు. సహేతుకము కాదు. లక్ష్యసాధనలో ప్రతిబింబము కాదు.

## 43. ఎట్టయాపుర నివాసి సుబ్బరామ దీక్షితులు వ్రాసిన – సంగీత సాంప్రదాయ ప్రదర్శినిలోని పద్ధతి

| శృతుల సంఖ్యలు | శ్రుతుల నామములు | జాతులు | షడ్జ గ్రామము | మధ్యమ గ్రామము | గాంధార గ్రామము | షరాలు |
|---|---|---|---|---|---|---|
| 1 | తీవ్రా | దీప్తా | ● | ● | ● | |
| 2 | కుముద్వతీ | ఆయతా | ● | ● | ● | |
| 3 | మన్దా | మృదూ | ● | ● | స | |
| 4 | ఛన్దోవతీ | మధ్యా | స | స | ● | |
| 5 | దయావతీ | కరుణా | ● | ● | ● | |
| 6 | రఞ్జనీ | మధ్యా | ● | ● | రి | |
| 7 | రతికా | మృదూ | రి | రి | ● | |
| 8 | రౌద్రీ | దీప్తా | ● | ● | ● | |
| 9 | క్రోధీ | ఆయతా | గ | గ | గ | |
| 10 | వజ్రికా | దీప్తా | ● | ● | ● | |
| 11 | ప్రసారిణీ | ఆయతా | ● | ● | ● | |
| 12 | ప్రీతి | మృదూ | ● | ● | మ | |
| 13 | మార్జనీ | మధ్యా | మ | మ | ● | |
| 14 | క్షితీ | మృదూ | ● | ● | ● | |
| 15 | రక్తా | మధ్యా | ● | ● | ● | |
| 16 | సన్దీపినీ | ఆయతా | ● | ప | ప | |
| 17 | ఆలాపినీ | కరుణా | ప | ● | ● | |
| 18 | మదన్తీ | కరుణా | ● | ● | ● | |
| 19 | రోహిణీ | ఆయతా | ● | ● | ద | |
| 20 | రమ్యా | మధ్యా | ధ | ధ | ● | |
| 21 | ఉగ్రా | దీప్తా | ● | ● | ● | |
| 22 | క్షోభిణీ | మధ్యా | ని | ని | ని | |

ఈ పథకము వేంకటమఖి సంప్రదాయానుగతమైన పద్ధతి. గాంధార గ్రామమున గల షడ్జమమునకు ఒక శృతి తక్కవగా ఎట్లుండునో అనూహ్యము. ఇది శాస్త్రీయముగా కన్పించుటలేదు.

మాణిక్య మొదలియారు రచించిన సంగీత చంద్రికలో గ్రామ వివరణ చేయుచు షడ్జగ్రామము మంద్రస్థాయి మూర్ఛనలు, మధ్యమ గ్రామము మధ్య స్థాయి మూర్ఛనలు, గాంధార గ్రామము తారస్థాయి మూర్ఛనలను, కలిగియున్నవని చెప్పెను. ఎంత హాస్యాస్పదముగా నున్నది.?!

## 44. గ్రామరహస్యములను జూపెడి పథకము

| | | 19 | 20 | 21 | 22 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 1 | 2 | 3 | 4 | 5 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ధ్రువవీణ స్వరములు | | ని | | | | స | | | రి | | గ | | | | మ | | | | ప | | | ధ | | ని | | | | స | | | | * |
| చలవీణ భేదములు | 1 | | | | | | | | స | | | రి | | గ | | | | మ | | | | ప | | | ధ | | ని | | | | * | |
| | 2 | | | | | | | స | | | రి | | గ | | | | మ | | | | ప | | | ధ | | ని | | | | * | | |
| ఋషభ లోపము | 3 | | | | | | స | | | రి | | గ | | | | మ | | | | ప | | | ధ | | ని | | | | * | | | |
| షడ్జగ్రామము | 4 | ని | | | | స | | | రి | | గ | | | | మ | | | | ప | | | ధ | | ని | | | | స | | | | |
| | 5 | | | | | | | రి | | గ | | | | మ | | | | ప | | | ధ | | ని | | | | స | | | | | |
| | 6 | | | | | | రి | | గ | | | | మ | | | | ప | | | ధ | | ని | | | | స | | | | | | |
| ఋషభగ్రామము | 7 | | | | | రి | | గ | | | | మ | | | | ప | | | ధ | | ని | | | | స | | | రి | | | | |
| | 8 | | | | | | గ | | | | మ | | | | ప | | | ధ | | ని | | | | స | | | రి | | | | | |
| గాంధారగ్రామము | 9 | | | | | గ | | | | మ | | | | ప | | | ధ | | ని | | | | స | | | రి | | గ | | | | |
| | 10 | | | | | | | | మ | | | | ప | | | ధ | | ని | | | | స | | | రి | | గ | | | | | |
| | 11 | | | | | | | మ | | | | ప | | | ధ | | ని | | | | స | | | రి | | గ | | | | | | |
| | 12 | | | | | | మ | | | | ప | | | ధ | | ని | | | | స | | | రి | | గ | | | | | | | |
| మధ్యమగ్రామము | 13 | | | | | మ | | | | ప | | | ధ | | ని | | | | స | | | రి | | గ | | | | మ | | | | |
| | 14 | | | | | | | | ప | | | ధ | | ని | | | | | | | రి | | గ | | | | మ | | | | | |
| | 15 | | | | | | | ప | | | ధ | | ని | | | | స | | | రి | | గ | | | | మ | | | | | | |
| | 16 | | | | | | ప | | | ధ | | ని | | | | స | | | రి | | గ | | | | మ | | | | | | | |
| పంచమగ్రామము | 17 | | | | | ప | | | ధ | | ని | | | | స | | | రి | | గ | | | | మ | | | | ప | | | | |
| | 18 | | | | | | | ధ | | ని | | | | స | | | రి | | గ | | | | మ | | | | ప | | | | | |
| | 19 | | | | | | ధ | | ని | | | | స | | | రి | | గ | | | | మ | | | | స | | | | | | |
| ధైవతగ్రామము | 20 | | | | | ధ | | ని | | | | స | | | రి | | గ | | | | మ | | | | ప | | | ధ | | | | |
| | 21 | | | | | | ని | | | | స | | | రి | | గ | | | | మ | | | | ప | | | ధ | | | | | |
| నిషాదగ్రామము | 22 | | | | | ని | | | | స | | | రి | | గ | | | | మ | | | | ప | | | ధ | | ని | | | | |
| | 23 | | | | | | | | స | | | రి | | గ | | | | మ | | | | స | | | ధ | | ని | | | | | |

ఈ రెండు పథకముల యందు ధృవవీణ చలవీణల సహాయమున షడ్జ, రిషభ, గాంధార, మధ్యమ, పంచమ, ధైవతీ, నిషాధ గ్రామముల యందు శృతుల పంపకము (స్వరములకు) చూపబడినది.

## 45. గ్రామభేదములో చలవీణయందు స్వరస్థాన భేదములను జూపెడి పథకము

| | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | I | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ధ్రువవీణ | స | | | రి | | గ | | | | మ | | | | ప | | | ధ | | ని | | | | స | మధ్యషడ్జ గ్రామము. |
| 4-వ భేదము. చలవీణ | స | | | రి | | గ | | | | మ | | | | ప | | | ధ | | ని | | | | స | మధ్యషడ్జ గ్రామము. |
| 7-వ భేదము. | రి | | గ | | | | మ | | | | ప | | | ధ | | ని | | | | స | | | రి | ఋషభ గ్రామము. |
| 9-వ భేదము. | గ | | | | మ | | | | ప | | | ధ | | ని | | | | స | | | రి | | గ | గాంధార గ్రామము. |
| 13-వ భేదము. | మ | | | | ప | | | ధ | | ని | | | | స | | | రి | | గ | | | | మ | మధ్యమ గ్రామము. |
| 17-వ భేదము. | ప | | | ధ | | ని | | | | స | | | రి | | గ | | | | మ | | | | ప | పంచమ గ్రామము. |
| 20-వ భేదము. | ధ | | ని | | | | స | | | రి | | గ | | | | మ | | | | ప | | | ధ | ధైవత గ్రామము. |
| 22-వ భేదము. | ని | | | | స | | | రి | | గ | | | | మ | | | | ప | | | ధ | | ని | నిషాద గ్రామము. |
| 26-వ భేదము. | స | | | రి | | గ | | | | మ | | | | ప | | | ధ | | ని | | | | స | మంద్రషడ్జ గ్రామము. |

ఈ పథకమున గల ధృవ, చలవీణల సహాయమున షడ్జమాది. నిషాధముల వరకు గల గ్రామమును చూపబడినవి.

### 46. గ్రామభేదములో చలవీణయందు స్వరస్థానములను షడ్జాదిగ( జూపెడి పథకము

| | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | I | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 4-వ భేదము. చలవీణ | స | | | రి | | గ | | | | మ | | | | ప | | | ధ | | ని | | | | స | మధ్యషడ్జ గ్రామము. |
| 7-వ భేదము. | స | | రి | | | | గ | | | | మ | | | ప | | ధ | | | | ని | | | స | ఋషభ గ్రామము. |
| 9-వ భేదము. | స | | | | రి | | | | గ | | | మ | | ప | | | | ధ | | | ని | | స | గాంధార గ్రామము. |
| 13-వ భేదము. | స | | | | రి | | | గ | | మ | | | | ప | | | ధ | | ని | | | | స | మధ్యమ గ్రామము. |
| 17-వ భేదము. | స | | | రి | | గ | | | | మ | | | ప | | ధ | | | | ని | | | | స | పంచమ గ్రామము. |
| 20-వ భేదము. | స | | రి | | | | గ | | | మ | | ప | | | | ధ | | | | ని | | | స | ధైవత గ్రామము. |
| 22-వ భదము. | స | | | | రి | | | గ | | మ | | | | ప | | | | ధ | | | ని | | స | నిషాద గ్రామము. |
| 26-వ భేదము. | స | | | రి | | గ | | | | మ | | | | ప | | | ధ | | ని | | | | స | మంద్రషడ్జ గ్రామము |

ఈ గ్రామ రహస్యములు గ్రంథ కర్తలకే పరిమితమై సుబోధకముగా లేక ఈనాటికీ రహస్యములుగానే ఉన్నవి అనుట అతిశయోక్తి కాదు.

**47. గ్రామత్రయ మూర్ఛనలు** :- షడ్జగ్రామము, మధ్యమగ్రామము, గాంధార గ్రామములను, వాటి మూర్ఛనల పేర్లను, వాటి ప్రథమస్వరములను యీ దిగువ కనుపఱచిన పట్టికయందు జూపుట గమనించదగును.

| 1. షడ్జగ్రామమూర్ఛనల పేర్లు | | | 2. మధ్యమగ్రామ మూర్ఛనల పేర్లు | | | 3. గాంధార గ్రామమూర్ఛనల పేర్లు | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1. ఉత్తరమంద్రము | స | ( స నుండి స వరకు ) | 1. సౌవీరము | మ | ( మనుండి మ వరకు ) | 1. నందా | గ | ( గ నుండి గ వరకు ) |
| 2. రజని | ని | ( ని " ని " ) | 2. హరిణాశ్వము | గ | ( గ " గ " ) | 2. విశాల | రి | ( రి " రి " ) |
| 3. ఉత్తరాయతము | ధ | ( ధ " ధ " ) | 3. కలోపనతము | రి | ( రి " రి " ) | 3. సుముఖి | స | ( స " స " ) |
| 4. శుద్ధషడ్జము | ప | ( ప " ప " ) | 4. శుద్ధమధ్యమము | ప | ( స " స " ) | 4. విచిత్రము | ని | ( ని " ని " ) |
| 5. మత్సరికృతము | మ | ( మ " మ " ) | 5. మార్గి | ని | ( ని " ని " ) | 5. రోహిణి | ధ | ( ధ " ధ " ) |
| 6. అశ్వక్రాంతము | గ | ( గ " గ " ) | 6. పౌరవి | ధ | ( ధ " ధ " ) | 6. సుఖ | ప | (ప " ప " ) |
| 7. అభిరుద్గతము | రి | ( రి " రి " ) | 7. హృష్యకము | ప | ( ప " ప " ) | 7. ఆలాపము | మ | ( మ " మ " ) |

పైన దెలుపబడిన 21 మూర్ఛనలలో రజని, ని, రంజని అనియు, నందా, సు, సంరాయనియు నారదుడు తన సంగీతమకరంద గ్రంథములో చెప్పియుండెను. పై మూర్ఛనలయొక్క ప్రథమస్వరములు అవరోహణ క్రమముగా నుండుట ముఖ్యముగా గమనించదగును.

**షడ్జగ్రామ స్వర నిష్పత్తులు** :- ఒక సెకండుకు మధ్యస్థాయి షడ్జము యొక్క వేపసంఖ్య 240గా నేర్పఱచుకొనినచో షడ్జగ్రామము (ఖరహరప్రియ) యొక్క స్వరనిష్పత్తులీ క్రింది విధముగా నుండునని గమనించదగును.

| స | రి | గ | మ | ప | ధ | ని | స | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 10/9 | 33/27 | 3/3 | 3/2 | 5/3 | 16/9 | 2 | ఈ విధముగా నుండునని గ్రహించునది. |

**సామగాన స్వర నిష్పత్తులు** :- ఇవియు షడ్జగ్రామము (ఖరహరప్రియ రాగము) యొక్క స్వరనిష్పత్తులనే గలిగియుండునని గ్రహించునది.

### 48. షడ్జ, మధ్యమ, గాంధార గ్రామములు:ఈ గ్రంధకర్త నిరూపణము

| శ్రుతుల | స్వరస్థానములు | శృతులభిన్నములు | షడ్జగ్రామం | | | మధ్యగ్రామం | | గాంధారగ్రామం | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| తీవ్రా | కై.ని | 9/5 | 1 | • | • | • | • | • | ని |
| కుముద్వతీ | కా.ని. | 15/8 | 2 | • | • | • | • | • | • |
| మన్దా | తీ.రా.ని. | 243/128 | 3 | • | • | • | • | • | • |
| ఛన్దోవతీ | రి.స | 1 | 4 | • | స | • | స | • | స |
| దయావతీ | ఏకశృతిరి | 256/243 | 5 | • | • | • | • | • | • |
| రఞ్జనీ | ద్విశృతిరి | 16/15 | 6 | • | • | • | • | • | రి |
| రతికా | త్రిశృతిరి | 10/9 | 7 | • | రి | • | రి | • | • |
| రౌద్రీ | చ.రి | 9/8 | 8 | • | • | • | • | • | • |
| క్రోధీ | కో.సా.గా. | 32/27 | 9 | • | గ | • | గ | • | • |
| వజ్రికా | సా.గా. | 6/5 | 10 | • | • | • | • | • | గ |
| ప్రసారిణీ | అంగ | 5/4 | 11 | • | • | • | • | • | • |
| ప్రీతి | తీ.అంగా. | 81/64 | 12 | • | • | • | • | • | • |
| మార్జనీ | శుమ | 4/3 | 13 | • | మ | • | మ | • | మ |
| క్షితీ | తీ.శుమ. | 27/20 | 14 | • | • | • | • | • | • |
| రక్తా | ప్ర.మ. | 1024/729 | | | | | | | |
| | | 45/32 | 15 | • | • | • | • | • | • |
| సన్దీపినీ | తీ.ప్రమ | 40/27 | | | | | | | |
| | | 729/512 | | | | | | | |
| | | 64/45 | 16 | • | • | • | ప(మ) | • | ప(మ) |
| ఆలాపినీ | ప | 3/2 | 17 | • | ప | • | • | • | • |
| మదన్తీ | ఏ.ద | 128/81 | 18 | • | • | • | • | • | • |
| రోహిణీ | ద్వి.ద. | 8/5 | 19 | • | • | • | • | • | ద |
| రమ్యా | త్రి.శృ.ద. | 5/3 | 20 | • | ద | • | ద | • | • |
| ఉగ్రా | చ.ద. | 27/16 | 21 | • | • | • | • | • | • |
| క్షోభిణీ | కో.కై.ని. | 16/9 | 22 | • | ని | • | ని | • | • |
| | | | ఖరహరప్రియ | | | ఇంచుమించు చ్యుత పంచమ ఖర హరప్రియ | | ఇంచుమించు చ్యుత పంచమ తోడి రాగం | |

## 49. గ్రామత్రయము ఈ గ్రంధకర్త వివరణ

షడ్జగ్రామము గానయోగ్యమైనది. గాంధార గ్రామము ఏకాలమునందును వాడుకలో లేదు. గాంధారగ్రామము స్వర్గములలో ప్రకాశించుచున్నది. అని, నారదుడు చెప్పినట్లు శార్ఙగదేవుడు తన సంగీత రత్నాకరమున చెప్పెను. భరతుని కాలమున షడ్జ, మధ్యమ గ్రామము మాత్రము వాడుకలో నున్నట్లు భరతుని నాట్యశాస్త్రమున కలదు. ఈ విషయమే తిరిగి శార్ఙగదేవుడుకూడా చెప్పియున్నారు. "సంగీత పారిజాతము" అను గ్రంధమునందు ఆ కాలమునాటికే (సుమారు 500 ఏళ్ల క్రిందటనుండియే) మధ్యమ గ్రామము వాడుకలో లేనట్లు తెలియుచున్నది.

ఈ మధ్యమ గ్రహ రహస్య మేమియన: పంచమమునకు బదులుగా మధ్యమము అనగా (ఇంచుమించు) చ్యుత పంచమము కలిగిన ఖరహరప్రియయే. అనగా మధ్యమగ్రామ శుద్ధ మధ్యమమును గ్రహము చేయగా చక్రవాక రాగమగును.

అటులనే గాంధార గ్రామమనగా :- తోడి మేళమునందు పంచమమునకు బదులు చ్యుత పంచమమధ్యమము కలిగిన మేళము. అనగా గాంధారగ్రామ శుద్ధ మధ్యమము గ్రహము చేసినచో మరల (ఇంచుమించు) తోడి రాగమే అగుచున్నది.

ఖరహరప్రియ యొక్క ధైవతము గ్రహము చేసినచో గాంధార గ్రామము (చ్యుత పంచమ తోడి) అగుచున్నది. కనుక ఈ మూర్ఛన, లేక రాగము షడ్జ గ్రామ స్వరములలోనే ఇమిడి యున్నది అని భావము.

అటులనే మధ్యమ గ్రామము చ్యుత పంచమ ఖరహరప్రియ.అనగా చ్యుతపంచమ ఖరహరప్రియ యొక్క మధ్యమ గ్రహమున చక్రవాక రాగముగా షడ్జమ గ్రామమున ఇమిడి యున్నది.

అటులనే 72 మేళకర్తలకు పంచమమునకు బదులు చ్యుత పంచమమును ప్రయోగించి ఇంకొక 72 మేళములు. (72 గ్రామములుగా చేయవచ్చును కాని గాన యోగ్యత (వాటికి మధ్యమ, గాంధార గ్రామములవలననే) ఉండదు.

సంగీత మనస్సు లేని గణిత శాస్త్రజ్ఞులు సంగీతమున జోక్యము చేసుకొని తమ సంస్కృత భాషా జ్ఞానముతో సంగీత గ్రంధములలో తమ జ్ఞానమును ప్రవేశపెట్టి నందువలన సంగీతజ్ఞులకు కష్టకాలము కల్గినది. యధాశక్తి ఇప్పుడు కూడా కల్గుచున్నది.

### 50. మూర్ఛనలను జూపెడి పథకము

| శృతుల సంఖ్యలు | మూర్ఛనల పేర్లు | ఆరోహణ | అవరోహణ | |
|---|---|---|---|---|
| 1 | ఉత్తరమంద్రము | సరిగమపదనిస | సనిధపమగరిస | |
| 2 | రజనీ | రిగమపదనిసరి | రిసనిధపమగరి | |
| 3 | ఉత్తరాయతము | గమపధనిసరిగ | గరిసనిధపమగ | |
| 4 | శుద్ధషడ్జము | మపధనిసరిగమ | మగరిసనిధపమ | స |
| 5 | మత్సరికృత్ | పధనిసరిగమప | పమగరిసనిధప | గ్రామము |
| 6 | అశ్వక్రాంతము | ధనిసరిగమపధ | ధపమగరిసనిధ | |
| 7 | హృద్ధతము | నిసరిగమపదని | నిధపమగరిసని | |
| 8 | సౌవీరీ | సరిగమపధనిస | సనిధపమగరిస | |
| 9 | హరిణాశ్వము | రిగమపధనిసరి | రిసనిధపమగరి | |
| 10 | కలోపనతము | గమపధనిసరిగ | గరిసనిధపమగ | |
| 11 | శుద్ధమధ్యము | మపధనిసరిగమ | మగరిసనిధపమ | గ |
| 12 | మార్గము | పధనిసరిగమప | పమగరిసనిధప | గ్రామము |
| 13 | పౌరవి | ధనిసరిగమపధ | ధపమగరిసనిధ | |
| 14 | హృష్యకము | నిసరిగమపధని | నిధపమగరిసని | |
| 15 | నన్దము | సరిగమపధనిస | సనిధపమగరిస | |
| 16 | విలాపము | రిగమపధనిసరి | రీసనిధపమగరి | |
| 17 | సుముఖీ | గమపధనిసరిగ | గరిసనిధపమగ | |
| 18 | చిత్రిమ | మపధనిసరిగమ | మగరిసనిధపమ | మ |
| 19 | చిత్రవతీ | పధనిసరిగమప | పమగరిసనిధప | గ్రామము |
| 20 | సుఖము | దనిసరిగమపధ | ధపమగరిసనిధ | |
| 21 | ఆలాపము | నిసరిగమపధని | నిధపమగరిసని | |

ఈ 21 మూర్ఛనలు 3 గ్రామముల యందు గల శృతులలో గల స్వరములను (స్వరస్థానములను) గ్రహ భేద ప్రక్రియచే ప్రస్థరింపగా వచ్చినవి. వీటిని ఇంచుమించుగా పాడవచ్చును, వాయించవచ్చును. కాని గాన యోగ్యములై సుస్వర సంగీత యోగ్యములైనవి. షడ్జ గ్రామమున గల ఏడు మూర్ఛనలే అని కాలానుగతముగా తేలిన విషయము.

# 51. జాతులు - త్రయోదశ లక్షణాలు

గ్రామము నుండి మూర్ఛనలు, మూర్ఛనల నుండి జాతులు, జాతుల నుండి
ములు, మేళముల నుండి రాగములు క్రమ పరిణామము చెందినవి.

జాతులు అనగా ఆధునిక రాగ పూర్వ రూపములే. జాతులు గాన యోగ్యములు.
కులు గానము చేయుకాలమున గమకములు పరిణామము చెందియుండలేదు. వివిధ
, వర్ణ, అలంకారములతో జాతులను అలంకరించి పాడెడివారు. సందర్భము గల
సంగతియే తానము. ఆ జాతులే అలంకార సహితములుగ వివిధ గమకములతో చేరి
క్రమముగా రాగములు దశకు పరిణితి చెంది ప్రకాశించుచున్నవి. రాగదశకు పరిణితి
దిన సంగీతము సంపూర్ణమైనట్లు. ఈనాటి స్థితి ఎంత ఎత్తు. ఎంత లోతు అయినదనిన
గీతమే రాగము. రాగమే సంగీతముగా సంపూర్ణమైన స్థితిని పొందినది.

ఆధునిక యుగమున తానము పరిణితి చెంది మధ్యమ కాలమునందు లయతో
న సంచారము లేక ప్రస్థారమయినది. అదియే "ఘనము" కూడ.

గ్రామము, మూర్ఛన, జాతి, తానము, అలంకారము, మొదలైన ప్రాచీన గాన రీతులు
ప పరిణామము చెందినవి. వాటి రీతులు మారినవి వాటి యందుండు విషయములు
నరీతులు) కూడా మార్పు చెందుతూ వచ్చినవి.

గ్రామముల నుండి మూర్ఛనలు, మూర్ఛనల నుండి మేళములు, మేళముల నుండి
తులు వచ్చినవి. నిజమునకు మూర్ఛనలు మేళములు వేరుకావు.

జాతి గానప్రక్రియ. మూర్ఛన కేవల ఆరోహణ అవరోహణ మాత్రమే. జాతియందు
ములు, తానములు, అలంకారములు కలవు. ఆధునిక రాగ పూర్వ రూపమే జాతి. జాతి,
న ప్రక్రియలకు త్రయోదశ లక్షణములు క్రమముగ ఏర్పడినవి.

తానము, వర్ణము, అలంకారము ఈ మూడు ప్రాచీన గాన ప్రక్రియలు. సంగీతము,
యలయొక్క వివిధములైన నిర్దిష్ట రూపములు.

వర్ణము అనగా స్వర ప్రస్థార క్రమము ఈ వర్ణములు, స్థాయి, ఆరోహి వర్ణము,
వరోహి, సంచారీ. అను నాలుగు భాగములుగా నున్నది. ఒకే స్వరము పై ఎడతెగక నుండు
దము స్థాయి వర్ణము. ఆరోహణ క్రమమున పైపైకి సంచరించునది ఆరోహి వర్ణము.
వరోహణ క్రమమున క్రిందుగా సంచరించునది. అవరోహి వర్ణము. ఈ పై మూడింటి
ందు ఎడతెగక సంచరించునది సంచారి వర్ణము.

ఆ కాలమున షడ్జమ స్వరము ఇప్పటివలె ఆధారషడ్జమము కాదు. ఈ స్థితి ఈనాడు ఊహించుట కష్టము. గాత్రమునకు గాని, వాద్యమునకు కాని ముందుగా 'స' స్వరమును శృతిగా ఆధారము చేసుకొని గదా ఈ కాలమున సంగీతజ్ఞులందురు గానము చేయునది. ఒకప్పుడు ఈ 'స' ఆధార షడ్జమము (Fundamental Note) గా పరిణితి (evolove) చెందలేదు. గాత్రమునకు తోడుగా వీణను వాయించునపుడు గాత్రజ్ఞుని స్వరముకు వీణమెట్ల యందు ఏ మెట్టు యందు ఉన్నదో వెతకవలసి వచ్చెడిది. గాత్రజ్ఞుని శృతికి వీణను శృతి చేయుపద్ధతి అప్పటి (ఇంచుమించు అతి పూర్వ యుగమునందు). ఆ స్థితి యందు మొదలు పెట్టు స్వరమునకు ప్రాముఖ్యత వచ్చినది. ఆ దశయందే షడ్జమం ఆధార స్వరము అయినది. ఆ స్థితియందే వాది స్వరము (ఎడతెగక వచ్చు స్వరము). అంశస్వరము (అనగా ప్రముఖ స్వరము లేక జీవస్వరము) (రాగ భావమును వెల్లడి చేయుస్వరము) న్యాసస్వరము (అనగా చివర నిలుపు స్వరము) వాడుకలోనికి వచ్చినవి. సంవాది, అనువాది స్వరములు వాది స్వరము యొక్క పరిధిలో, వాది స్వరము ననుసరించి పరిభ్రమించు స్వరములుగా వాడుకలోనికి వచ్చినవి. ఈ స్వర సంబంధములన్నియు రాగము నందుగాని, గీతము నందు గాని అంతర్గాగములుగా నుండెడివి.

విన్యాసము, సన్యాసము, అపన్యాసములు వివిధ సందర్భములలో న్యాసములే.

జాతి అనగా స్వర సప్తక మూర్ఛనా మేళమే. జాతి మూర్ఛన, మేళము, యొక్క అభివృద్ధి, పరిణతి చెందిన రూపాంతరమే. అనగా మూర్ఛన మేళమైనది, మేళము జాతియైనది, జాతి గమకముతో చేరి రాగమైనది.

షడ్జీ జాతుల యొక్క సంఖ్య, గ్రహ, అంశ, న్యాస స్వరముల వాడిన విధములను బట్టి ఒక పద్ధతి ప్రకారము ప్రస్థరించగా 15 షడ్జీ జాతులుగా రూపొందినవి.

షడ్జమము గ్రహస్వరముగలవి షడ్జీ జాతులు. అటులనే రిషభము గ్రహముగా గలవి ఆర్షభిజాతులు. ఆ విధముగానే, గాంధారి జాతులకు గాంధారము గ్రహము. అటులనే తక్కిన స్వరజాతులు వాటి వాటి గ్రహస్వరములు నామములతోనే ఉండెడివి.

మధ్యమ గ్రామము నుండి 11 జాతులు ఉద్భవించినవి.

1. షడ్జకైశికి 2. షడ్జోదీచ్యవ 3. షడ్జమధ్యమ 4. గాంధారోదీచ్యవ 5. రక్త గాంధారి 6. కైశికి 7.. మధ్యమోదీచ్యవ 8. కర్మారవి 9. గాంధార పంచవి 10. ఆంధ్రి 11. నందయంతి.

ఈ జాతుల యందు కొన్ని (5)? సంపూర్ణములు. కొన్ని షాడవములు (4)? కొన్ని (10)? ఔడవములుగా రూపొందించబడినవి. ఈ జాతుల నుండియే అనంతములైన రాగములు వచ్చినవి. సంపూర్ణ, షాడవ, ఔడవ భేదములుగా రాగములు రూపొందించినవి.

రత్నాకర వ్యాఖ్యాత సింహభూపలుడు :-

6. భాష రాగములు 20 విభాష రాగములు 4 అంతర్భాష రాగములు పేర్కొనెను.

క్రీ.పూ. 4వ శతాబ్ధమున భరతుడు. తన నాట్య శాస్త్రమున జాతికి 10 లక్షణములను వివరించెను. అవి క్రమముగా 1. గ్రహము 2. అంశము 3. తారము 4. మంద్రము 5. న్యాసము 6. అపన్యాసము 7. అల్పత్వము 8. బహుత్వము 9. షాడవము 10. ఔడవము.

క్రీ.శ. 13వ శతాబ్దమున శార్ఞ్గ దేవుడు తన సంగీత రత్నాకరమున 13 లక్షణములను పేర్కొనెను. అవి క్రమముగా (1) గ్రహము (2) అంశము (3) తారము (4) మంద్రము (5) న్యాసము (6) అపన్యాసము (7) సన్యాసము (8) విన్యాసము (9) బహుత్వము (10) అల్పత్వము (11) అంతరమార్గము (12) షాడవము (13) ఔడవము.

ఈ 10 గాని, 13 గాని, లక్షణములు ప్రాచీన రాగములకు గాని, ఆధునిక రాగ పద్ధతికి అన్వయించవు అని వేంకట మఖి పేర్కొనెను. అయినను సూక్ష్మముగ పరిశీలించినచో ఈ 13 రాగ లక్షణములే కాక ఇంకను ఎన్నియో రాగమునకు లక్షణములు కలవని తెలియును.

## లక్షణములు

ట్టు స్వరము. రాగముగాని, పాటగాని, పల్లవిగాని
ణముగా షడ్జమమే ప్రతిరాగమునందును గ్రహస్వరము.

క. రాగ రూపమును వ్యక్తము చేయు ఒక స్వరముగాని
ఉండవచ్చును. ఈ స్వరమే "జీవస్వరము".

ములో పాడుట. కొన్ని రాగములకు తారస్థాయి యందు
వమాంత్య, ధైవతాంత్య, నిషాధాంత్య రాగములు ఇట్టివే.
ములు "సారంగ" రాగము నందు తార గాంధారముపై

ి –రోజు, పున్నాగవరాళి, జంఝూటి; మొ॥

ులలో పాడు రాగ స్వరములు. ఈ స్వరములు కొన్ని
్చును. ఆనందభైరవి, ఖమాస్, అఠాణా రాగములకు
ములు ఉన్నట్లు తోచదు.

ము, రాగమునకు, స్వరకల్పనకు పల్లవికి చివర నుండు
ము.

యొక్క వివిధ రూపములు.

ధ్య వచ్చు సంగతులను ముగించు స్వరము.

వివిధ స్థాయిల యందు ముగించు స్వరము.

వివిధ కళలను చూపించుచు బహు విన్యాసములను

పాట పాడుచున్నప్పుడు సమముగా గాక, క్లిష్టముగా
ుట విన్యసించుట అగుచున్నది. 4 అక్షర కాలము
క అక్షరము వదలి గాని 4 అక్షరకాలు స్వరములుగాని,
సము (Off Beat).

9. బహుత్వ స్వరము : రాగమునందు గాని సంగతి యందు గాని, ఎడతెగకవచ్చునది లేక దీర్ఘముగా లేక ముఖ్య ప్రయోగమున వచ్చునది. ఇది రెండు విధములు. (1) అలంఘనము (2) అభ్యాసము ఈ రెండు బహుత్వ సూక్ష్మ భేదములు.

ఉదా: బేగడ రాగమునందు, మధ్యమ నిషాధములు, దర్బారాగమునందు గాంధారము.

10. అల్పత్వము : రాగమున అల్పముగా ప్రయోగింపబడు స్వరము. లంఘనము, అనభ్యాసము అను ఈ రెండు అల్పత్వ భేదములు. అరుదు స్వరము, దుర్బలస్వరము.

ఉదా: ఆరభి రాగమునందు గాంధార నిషాధములు. సురటి రాగమునందు ధైవతము.

11. అంతర మార్గము : అపూర్వ ప్రయోగములు

12. షాడవము : ఆరు స్వరములు కలిగిన రాగము; 13 ఔడవము :- అయిదు స్వరములు కలిగిన రాగము.

## 53. రాగ త్రిశతి లక్షణములు

ఈ పై త్రయోదశ లక్షణములే గాక రాగము క్రమ పరిణామము చెందుచూ రాగ లక్షణములను తెలుసుకొనుటకు మరిన్ని విషయములు జేర్చబడినవి.

1. ఒక రాగము మేళకర్తయా? అనగా జనకరాగమా?
2. జన్యరాగమా? జన్యరాగమైనచో ఏ మేళ కర్తజన్యము?
3. ఆరాగ స్వరస్థానములు.
4. ఆరోహణ; అవరోహణ; (మూర్ఛన)
5. ఔడవమా? షాడవమా? సంపూర్ణమా (వర్జ్యరాగమా?)
6. ఉపాంగరాగమా? భాషాంగ రాగమైనచో అన్యస్వరమేది?
7. అన్యస్వరములు ఒకటియా? రెండా? మూడా?
8. అన్యస్వరము మూర్ఛనలో కలదా లేక ప్రయోగము నందు కలదా?
9. వక్రరాగమా? క్రమరాగమా?
10. మూర్ఛన ప్రధాన రాగమా? ప్రయోగ ప్రధాన రాగమా?
11. పూర్వాంగ ప్రధాన రాగమా? ఉత్తరాంగ ప్రధాన రాగమా?
12. వాది, సంవాది, అనువాది స్వరములు ఏవి?

12. అల్పత్వము, బహుత్వము, దుర్బలస్వరములు ఉన్నవా? ఏవి ? ఏ ప్రయోగములలో వచ్చును?

13. జీవ స్వరము, గ్రహ, అంశ న్యాస స్వరములు.

14. త్రిస్థాయి రాగమా? కానిచో మంద్ర, తార స్థాయి యందు పరిమిత సంచాములను గూర్చి

15. శృతులను గూర్చి

16. గమకములను గూర్చి

17. రాగకాలము; రాగలయ

18. రాగచరిత్ర (ఉండినచో)

19. రాగమునందు గల సంగీతరచనలు

20. ప్రసిద్ధ, రక్తి, అపూర్వ, మేళకర్త, వివాది, రాగములలో ఏ రాగములకు సంబంధించిన రాగము.

21. ప్రసిద్ధ సంగీత విద్వాంసులు ఎక్కువగా ఇష్టముగా పాడినచో ఆ వివరం.

22. మనోధర్మ సంగీతమునకు అనువైన రాగమా?

23. ఒకటి, రెండు కీర్తనలపై ఆధారపడిన రాగమా?

24. ముక్తాంగ కంపిత, అర్ధకంపిత, కంప విహీన రాగములలో ఏ కోవకు చెందినది.

25. హిందూస్థానీ సంగీతము నుండి తీసుకొనబడినదా? లేక కర్ణాటక సంగీత సంప్రదాయ బద్ధముగా వచ్చుచున్నదా?

26. ఈ రాగమును హిందుస్థానీ సంగీత పద్ధతిలోకి చొప్పింపబడినదా?

27. రాగరంజక ప్రయోగములు, అపురూప ప్రయోగములు.

28. పంచమాంత్య, ధైవతాంత్య, నిషాధాంత్య రాగములకు చెందినదియా?

29. రాగ రసభావములు ఏవి?

30. జన రంజకమా? విద్వత్‌రంజకమా? లేక పండిత పామర రంజకమా?

మొదలైన విషయములను ఎన్నటినో అధ్యయనము చేయవలయును.

## 54. పురుష స్త్రీ రాగములకు దేవతా, వేద, కుల, రస, గుణములు

| | పురుషరాగములు | స్త్రీ (భార్య) రాగములు | అధిదేవతలు | వేదములు | కులములు | రసములు | గుణములు |
|---|---|---|---|---|---|---|---|
| 1. | భూపాలము | బిలహరి - మలహరి, భాండి | శివుడు | సామవేద | బ్రాహ్మణ | శృంగార | రాజస |
| 2. | భైరవి | దేవక్రియ, మేఘరంజి, కురంజి | విష్ణువు | సామవేద | బ్రాహ్మణ | రౌద్ర | రాజస |
| 3. | శ్రీరాగము | ఆంధాళి, భల్లారి, సాహుళి | సరస్వతి | యజుర్వేద | క్షత్రియ | భీభత్స | తామస |
| 4. | ఫలమంజరి | దేశి, ముఖారి, లలిత | లక్ష్మి | యజుర్వేద | క్షత్రియ | కరుణ,శాంత | తామస |
| 5. | వసంత | రామక్రియ, వరాళి, గౌళ | సూర్యుడు | ఋగ్వేద | వైశ్య | హాస్య | సాత్విక |
| 6. | మాళవి | గుండక్రియ, ఘూర్జరి, భౌళి | రదుడు | ఋగ్వేద | వైశ్య | భయానక | సాత్విక |
| 7. | బంగాళ | కళ్యాణి, సావేరి, ఆహిరి | వినాయకుడు | అధర్వణవేద | శూద్ర | అద్భుత | రాజస |
| 8. | నాట | ఘంటారవము, కాంభోజి, శంకరాభరణము | తుంబురుడు | అధర్వణవేద | శూద్ర | వీర | రాజస |

పుత్రరాగములు :- పురుషరాగములకు జనించిన రాగములను పుత్రరాగములని చెప్పబడును. అవి ఉ॥ కాఫి, రేగుప్తి, నీలాంబరి, మారువ, రామగిరి, సారంగ, మందారి, సౌరాష్ట్ర, కేదార, ముఖారి లలిత, తోడి, ధన్యాసి, నారాయణి, గౌరి, వంతువరాళి, వరాళి, పూర్వి, సావేరి, బేగడ, భౌళి, మనోహరి, యమున, మొదళ్గు రాగము లగును.

సంగీతము, రాగములు, రస, భావములకు అతీతమైనవి; కైవల్యానంద (Absolute Bliss) దాయకములను మాట పరమ సత్యము. సంగీతమునకు అధి దేవత పరబ్రహ్మము. అన్ని రాగములు దివ్య మానవ కులమునకు చెందినవి. సంగీతము కేవల సత్వగుణ ప్రధానము.

## 55. సప్తస్వరములకు గల వార, నక్షత్ర, వస్త్ర భూషణ, విలేపన, పుష్ప భోజన, రస, ఛందస్సు, సాదృశ్యములు, బీజాక్షర వివరములు

| స్వరములు | వారములు | నక్షత్రములు | వస్త్రములు | భూషణములు | విలేపనములు | పుష్పములు | భోజనములు | రసములు | ఛందస్సులు | సాదృశ్యములు | బీజాక్షరములు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| షడ్జ | ఆది | శతభిష | తెల్లని | ముత్యము | కుంకుమ | జాజి | పెరుగుఅన్నం | రౌద్ర | అనుష్టుఫ్ | నెమలికూత | ఓం |
| రిషభ | సోమ | చిత్త | పీతాంబరం | నీలము | అగరు | చంపక | పాయసము | వీరకరుణ | గాయత్రి | ఎద్దురంకె | ఐం |
| గాంధార | మంగళ | ధనిష్ట | ఎఱ్ఱని | వజ్రము | కస్తూరి | సురపొన్న | ఫలాహారము | శాంత | త్రిష్టుప్ | మేకధ్వని | సౌం |
| మధ్యమ | బుధ | మఖ | నీల | వైఢూర్యము | పచ్చకర్పూరం | మల్లె | చిత్రాన్నము | హాస్య | బృహతి | క్రౌంచపక్షిధ్వని | హ్రీం |
| పంచమ | గురు | ఉత్తర | పసుపు | మరకతము | గోరోజనము | మొగిలి | పిండి | శృంగార | పంఙ్తి | కోకిలధ్వని | క్లీం |
| ధైవత | శుక్ర | పూర్వాషాఢ | చిత్ర | గోమేధికము | చందనము | గన్నేరు | శుద్ధాన్నము | భీభత్స | ఉష్టిక్ | తురగము (గుఱ్ఱము) | గ్లౌం |
| నిషాద | శని | అనూరాధ | శ్యామ | పుష్యరాగము | కదంబము(పొడి) | తామర | నానబియ్యము | భయఅద్భుత | జగతి | గజఘీంకార | హ్రాం |

# 56. గమకములు

శ్లో॥ తాసాంతు స్థాయ వాగేషు విసృతిస్స విధాస్యతే ॥ సం।ర।
శ్లో॥ ఏతేషాం మిశ్రణాన్మి శ్రస్యాస్యు ర్భూరయోభిధా ః॥ సం।ర।

స్థాయము=రాగావయవము; వాగము=గమకము. స్థాయవాగము=గమకములను అవయవములుగా గలిగిన రాగములు. స్థాయ వాగములు 96. అవి సంకీర్ణ-సంకీర్ణములై ఒకటితో నొకటి చేరి మిశ్రితములుగా అనంతములై రూపొందినవి అని శార్ఙ్గదేవుడు వివరించెను. దీనిని బట్టి గమకములు అనంతములు అని చెప్పవచ్చును. అది అనుభవము కూడ.

భారతీయ సంగీతానికి గమకములు ప్రాణములు. ఆయువు పట్లు. ప్రపంచ సంగీత రీతులలో భారత సంగీతానికి విశిష్టత చేకూర్చినవి గమకములే. గమకములు లేని రాగములు ఉండవు. రాగభావము, రాగరూపము, గమకములతోనే ఏర్పడును. ఒకే మేళము. ఒకే మూర్ఛన అయినప్పటికిని ఒకటి రెండు స్వర గమక భేదముల వలన ఆ రాగముల స్వరూపము. స్వభావము వేరగును. ఉదాహరణకు సురటిరాగమునకు, కేదారగౌళరాగమునకు సనిదప స్వరములు ఒకే స్వరస్థానములు కలిగియున్నను, నిదపా అనుటలో సురటి యందు నీనిదపా అనియును, కేదారగౌళయందు నిదదానిప అని వినిపించును. ఆరభి, సామ, కేదారగౌళ, దేవగాంధారి, శంకరాభరణము, కాంభోజి, హరికాంభోజి, బిలహరి రాగముల యందు ఒకే స్వర స్థానములు కలిగియున్నను వాటి యందు పలుకు సూక్ష్మ గమకముల వైవిధ్యమును బట్టి ఆయా రాగములు భిన్న రూపములుగా ప్రకాశించుచున్నవి.

భారతీయ సంగీతము రెండు విధములుగా రెండు పద్ధతులుగా రెండు భిన్న శైలులతో ప్రకాశించుటకు కారణము *ఈగమకములే.* హిందూస్థానీ సంగీతము లేక ఉత్తర భారతీయ సంగీతమునందు *జారు గమకము* (Glide) అతి ప్రాముఖ్యముగా నుండును. రెండవది స్వరములపై నిలబెట్టి పాడుట వలన హిందూస్థానీ సంగీత శైలి ప్రకాశించుచున్నది.

దానికి భిన్నముగా కర్ణాటక సంగీతమునందు కంపితము, ఊపు, ఆందోళితము. ఆందోళిక, అనుగమకములు (OSCILLATION) రెండు స్వరముల మధ్య జరుగుట ప్రాముఖ్యముగా వినిపించును. ఇట్టి గమకములు (GRACES) భారతీయ సంగీతమున తప్ప వేరు సంగీత పద్ధతుల యందు లేవు.

గమకములు అనంతములు అని చెప్పవచ్చును. అది అనుభవము కూడ. అయినను పూర్వపు శాస్త్రకారులు గమకములు పంచదశ (15) అనియును; తరువాత లక్షణకారులు పది అనియును నిర్వచించి వాటిని వర్ణించిరి.

## 57. పంచదశ గమకములు

1. కంపితము; 2. లీనము; 3. ఆందోళితము; 4. ప్లావితము; 5. స్ఫురితము; 6. తిరుపము; 7. ఆహతము; 8. వళి; 9. ఉల్లసితము; 10. హుంపితము; 11. కురుళము; 12. త్రిభిన్నము; 13. ముద్రితము; 14. నామితము; 15. మిశ్రితము.

1. **కంపితము** : స్వరమును కంపింప జేయుట. ఈ కంపనము చేయునపుడు ఆ స్వరముపై (మాత్రము) ఊపుచు ఆ స్వరము యొక్క పైకి గాని క్రిందికి గాని ఎక్కువగా ఊపకూడదు. పై, క్రింద స్వరములను తగలకూడదు (Vibrato) కంపితము.

2. **లీనము** : రెండు స్వరములు. ఒక దానితో ఒకటి మెల్లగా చల్లగా కలియుట. లీనమౌట. కళ్యాణి రాగమునందు నిషాధముపై కొంతసేపు నిలబెట్టి, షడ్జవమనందు లయింపచేయుట పరిపాటి. ఈ లీనము సాధారణముగా క్రింది స్వరము నుండి పై స్వరమునకే వర్తించును. పై స్వరము నుండి క్రింది స్వరమునకు కూడ లీనము కలదు.

3. **ఆందోళితము** : ఇది కర్ణాటక సంగీత ప్రముఖ గమకము. ఈ గమకము (OSCILLATION) రెండు స్వరముల మధ్య ఊపుట ఊగిసలాడించుట. అంతరగాంధార పంచమముల మధ్య ఈ డోలికా గమకమును ఉపయోగించిన ఆ స్వరము శుద్ధ మధ్యమము అగును. అటులనే చతుశృతి రిషభ - శుద్ధ మధ్యమముల మధ్య ఆందోళితము సాధారణ గాంధారమగును. అటులనే చతుశృతి ధైవత - షడ్జమములు మధ్య నాదమును ఊగించిన కైశిక నిషాధమగును. ఈ ఊగించుట లయ బద్ధముగ జరుగును. ఈ ఆందోళిత గమకము నందు అనేక భేదములున్నవి. వాటి నిడివిని బట్టి, సూక్ష్మ, అతిసూక్ష్మ, లఘు; బృహత్ ఆందోళితములు సందర్భానుసారముగా ఆయా స్వరముల మధ్య, వచ్చుచుండును.

4. **ప్లావితము** : ఆందోళిత గమక భేదము

5. **స్ఫురితము** : జంట స్వరము నందు రెండవ స్వరమును నొక్కిపలుకుట(ACCENT)

(Stress) సస, రిరి, గగ ఈ గమకము చాల ముఖ్యమైనది. తరుచుగ అన్ని రాగములలోనూ వచ్చును. ఈ గమకమును పలకలేకపోయినచో ఆ రాగము పేలవముగ నుండి పాటలోని లోటు తెలియును.

5బి. **ప్రత్యాఘాతము** లేక ప్రత్యాహతము, స్ఫురితమునందు భాగము. ఇది అవరోహణ గమకము. రిససనినిదదపపమమగా జంట స్వరమునకు పైన ఒక మీది స్వరమును జేర్చి పాడుచు జంటస్వరము నందు రెండవ స్వరమును క్రింది నించి అనుట లేక ఒత్తుట లేక కొట్టుట.

6. **తిరుపము (తిరిపెము)** స్వరమును నొక్కుట.

7. **ఆహతము:** రెండు విధములు 1. రవ; 2. ఖండింపు

(1) రవ = రిససా, సనినీ నిదదా, స్ఫురిత గమకము యొక్క ఉపయోగము ఈ 'రవ' యందు తెలియును.

'రవ' భారత సంగీతమున అతి ముఖ్యము. కర్ణాటక సంగీతమున ఇంకనూ ముఖ్యము. ఈ గమకము పలకలేనిచో కర్ణాటక సంగీత సౌరభమే ఉండదు. జంటమీద ఒక స్వరమును చేర్చిన రవ అగును. రిససా రవ=వజ్రమువలె ప్రకాశించు గమకము.

(2) ఖండింపు = ఆరభి రాగమునందు సనిదా; మగరీ; అను ప్రయోగములలో ససదా: మమరీ: అనునప్పుడు ని,గ,లు ఖండింపబడుచున్నవి. ససనిదా; మమగరీ అను ఉత్ప్రేక్ష కలిగించుట.

8. **వళి** : ఉదా : స్వరమును సుడియించి మీద స్వరమును రాబట్టుట. ఇది వీణ గమకము.

9. **ఉల్లసితము** : రెండు విధములు 1. ఎక్కుజారు; 2. దిగుజారు

1. స్వరమును మీదికి జార్చుచు పాడుట ఎక్కుజారు. సారంగ కృతి 'నీవాడనేగాన' యందు దేవాదిదేవవర. సాసాస-సాససస వలె

2. స్వరమును క్రిందికి జార్చుట దిగుజారు. శహనరాగంలో ప- రీగమప వలె

10. **హుంపితము** : సా సా అను నప్పుడు హుంకరించునట్లు పాడుట. ఇది గమకము అగునా!

11. కురుళము : స్వరములను ఒదుగుతోపాడుట ఒక రకమైన (Swing) ఊపుతోపాడుట. ఇది రెండు విధములు. 1. ఒదుగు 2. ఒరయిక

ఒదుగు : సామ గాదమాని దాసనిసా

ఒరయక సాగ నీస దాని మాద గామసా

12. త్రిభిన్నము : ఇది వీణ వాయించు విధములలో ఒకటి. 3 స్వరములు 3 తీగెలపై ఒకే సారి మీటుచు వాయించుట. ఇది వాదనా విశేషము (Manner of Playing) గమకము అగునా!

13. ముద్రితము : పెదవులను కలిపి. "ఊఁ" అని పాడుట ఇది పాడే విధము. గమకము అగునా!

14. నామితము : నాదమును సూక్ష్మము చేసి (Modulalion) పాడుట. దీనిని గమకము అనవచ్చునా!

15. మిశ్రితము : పై గమకములను 2,3 కలిపి పాడుట.

"స్వరస్య కంపో గమకః శ్రోతృ చిత్త ముదావహః" అను ప్రమాణముననుసరించి స్వరమును కదుపుట, ఊపుట, కొట్టుట, జార్చుట, మొదలైన అనేకమైన స్వరముల మధ్య జరుగు ప్రక్రియలు. వయ్యారములు (Inter action) (Graces) మొదలైన శ్రావ్యతకు దోహదము చేయు, శ్రావ్యతను పెంపొందించు సంపద "గమకము" అని పూర్వాచార్యులు.

ఈ గమకములు 15. అని గాని, 10 అని గాని నిర్ణయించుట ఆధునిక తర్కవాదమునకు సరిపోదు సరికాదు.

గమకములు అనంతములు కాకపోయినను ఊహకు లెక్కకు చాలా ఎక్కువగా ఉన్నవి. మిశ్రిత గమకములు అనుభవేద్యమే గాని లెక్కించుటకుగాని, వర్ణించుటకు గాని, వీలుకాదు. అన్ని లెక్కలు. అన్ని వర్ణనలు. కొంతవరకు ప్రయత్నము మాత్రమే. నిర్ణయము మాత్రము కాదు.

58. **దశ విధ గమకములు** : 1. ఆరోహణము; 2. అవరోహణము; 3. మూర్ఛన: 4. ఢాలు; 5. స్ఫురితము; 6. కంపితము; 7. ఆహతము; 8. ప్రత్యాఘాతము: 9. త్రిపుచ్ఛము; 10. ఆందోళితము.

వీటి యందు ఆరోహణ, అవరోహణ, మూర్ఛన గమకములు కానేరవు. త్రిభిన్నము, త్రిపుచ్ఛము, 3 తీగెలు ఒకేసారి ధ్వనింపజేయుట, వీణా వాదనా విశేషము. వీటి యందు కొన్ని, 15 గమకములయందు కలవు. కొన్ని గమకముల పేర్లు దూరాన్వయములు. క్లిష్టాన్వయములు. ఆధునిక యుగమునందు ఈ నామములకు గమకములను పాడు విధమునకును పొంతన లేదు. గమకములను, ముఖ్యముగా కర్ణాటక సంగీత గమకములను, పునః పరిశీలించి నిర్వచించాలి. ఈ ప్రయత్నంలో భాగంగా ఈ క్రింది విషయములను అవగాహన చేసుకొనుట అవసరం ఉన్నది.

## 59. గమకములు ఆధునిక లక్ష్య తార్కిక దృష్టి

కర్ణాటక సంగీతంలో ఎక్కువగా ఆందోళిత గమకములే కలవు. రెండు స్వరముల మధ్య ఊగించుట ఆందోళితము అగును. ఏ ఇతర సంగీత పద్ధతులలోనూ ఈ 'ఆందోళిత' గమకము ఉన్నట్లు తోచదు. ఇందుకు భిన్నముగా హిందూస్థానీ సంగీతము నందు 'జారు' గమకము ప్రముఖముగా వినిపించుచున్నది. స్ఫురితము. ప్రత్యాహతము గమకములు, రవ, భారతీయ సంగీత శైలులలోనూ (Common) కలవు. జారు, కర్ణాటక సంగీతమునందు కూడ కలదు. "ఆందోళితము" అను గమకము కర్ణాటక సంగీత ప్రత్యేకత. చ.రి-మ-శు.మ స్వరముల మధ్య ఆందోళితమును పాడినచో అది ('గ') సాధారణ గాంధార స్వరముగా తోచును. అటులనే చ.ద-స.స స్వరముల మధ్య ఆందోళితము "ని" (కైని) స్వరముగ తోచును. అంగ-పప స్వరముల మధ్య ఊగించిన (ఆందోళితము)చో అది "మ" (శుమ) స్వరముగ తోచును. ఇట్టి పద్ధతి మరి ఏ ఇతర సంగీత పద్ధతి యందును లేదు. ఈ గమకములు కర్ణాటక సంగీతమును వినుట అలవాటు లేని వారికి వింతగా తోచును. ఇందుకు భిన్నముగ హిందుస్థానీ సంగీతము నందు స్వరము మీద నిలిపి పై స్వరమును తాకుచు ఆందోళిత గమకము ఉండును.

ఉదాహరణమునకు

| | | | | |
|---|---|---|---|---|
| కైశిక | నీ -నీ | = | సా, ని, సా, ని | హిందుస్థానీ సంగీతము |
| | నీ నీ | = | సా, ద ద స ని స | కర్ణాటక సంగీతము |
| సాధారణ | గా గా | = | మా, గ మా, గ | హిందుస్థానీ సంగీతము |
| | గా గా | = | మా, రి రి మ గ మ | కర్ణాటక సంగీతము |

| | | | | |
|---|---|---|---|---|
| శుద్ధ | మా మా | = | పా, మ పా, మ | హిందూస్థానీ సంగీతము |
| | మా మా | = | పా, గ గ ప మ ప | కర్ణాటక సంగీతము |
| శుద్ధ | రీ రీ | = | గా, రి గా, రి | హిందూస్థానీ సంగీతము (కోమలరిషభం) |
| | రీ రీ | = | సా, రి సా, రి | కర్ణాటక సంగీతము (శుద్ధరిషభం) |
| శుద్ధ | దా, దా | = | నీ, ద నీ, ద | హిందూస్థానీ సంగీతము (కోమల ధైవతం) |
| | దా దా | = | పా, ద పా, ద | కర్ణాటక సంగీతము (శుద్ధ ధైవతం) |

కర్ణాటక సంగీతమునందు అధిక సందర్భములలో స్వరమును శుద్ధముగ స్వరముపై గమకములేకుండా (Flat) గా పట్టుట సంప్రదాయము కాదు.

ముఖ్యముగ శు. రి ; సాధారణ 'గా'
శు ధై ; కై. నిషాధము
ప్ర మ ; కా. నిషాధము

ఈ స్వరములను శుద్ధముగా పట్టుట ఆచారము కాదు. అనగా ఈ స్వరములపై (ఏదో ఒక గమకముతో గాక) నిలపెట్టుట సంప్రదాయ విరుద్ధముగ తోచును. శురి, శుద, ప్రమ కాని, లు క్రమముగా, స, ప, ప, స ల మీద ఆధారపడి ఆ స్వరములకు భూమికలుగా ఆలంబనములుగా చేసుకొనవలెను. ఉదా: రీ=సరిసరి; (ప్రమ) మా=పామపామ); దా=పాదపాద; నీ=సానిసాని, సాదారణ గాంధారం గా=రీమగామ అని పలుకును. కైశిక నిషాధం నీ= దాననీస అని పలుకును.

గమకములను (Graces) (Nuances) సంపూర్ణముగా నిర్వచించుట అసాధ్యము. గమకముల సంఖ్యను కూడా లెక్కించుట అసాధ్యమే. అయినను ఈ గమకములు ఒక పద్ధతి (Order) ప్రకారము ఉన్నవి కనుక వీనిని ఒక పద్ధతి యందు వర్ణించుటకు ప్రయత్నించుటలో దోషము లేదు. రాగ విషయము, గమక విషయము, శృతుల విషయము వ్రాయుటకన్న పాడుచుగాని, వాయించుచు గాని వర్ణించుట సులభము. వినువారికి అవగాహన అగును. వ్రాసి వర్ణించుటయు కష్టమే. చదువుచు అవగాహన చేసుకొనుట కూడా కష్టమే. ఈ క్రింది వర్ణన ఒక ప్రయత్నము మాత్రమే.

శుద్ధ రిషభము - శుద్ధ ధైవత గమకములు

చతుశృతి రిషభ - చతుశృతి ధైవత గమకములు

సాధారణ గాంధార - కైశిక నిషాధ గమకములు

అంతర గాంధార - కాకలి నిషాధ గమకములు

ప్రతిమధ్యమ - కాకలి నిషాధ గమకములు

సర్వ సాధారణముగా ఒకే విధముగా నుండును. సాధారణంగా ఒకే విధముగా నుండును.

శు.రి = సా రి సా రి (లేక) రీ స రీ స గా నుండును.

శు.ద = పా ద పా ద (లేక) దా ప దా ప గా నుండును.

చ.రి = సా గ రీ (లేక) సామరి(లేక) గారిగారి (లేక) మారిమారిగా నుండును.

చ.దై = పా ని ద (లేక) పా స ద (లేక) నీద నీద (లేక) సాద సాదగా నుండును.

సాధారణ.గా = రీమరి రీమరి (లేక) మా, రిమారి (లేక) రీమగామ అయి యుండును.

కై:ని = దాసద దాసద (లేక) సాదసాద (లేక) దాసనీస అయి యుండును.

ప్ర మ = పా మ పా మ (లేక) మా ప మా ప అయి యుండును.

కా ని = సా ని సా ని (లేక) నీస నీస అయి యుండును.

అంగ = { మాగ మాగ (లేక) గామ గామ అయి యుండును.
పాగ పాగ (లేక) గాప, గాప అయి యుండును. }

శు.మ. = పాగపాగ (లేక) గాపమాప (లేక) గామగామ (లేక) మాగమాగ అయి యుండును.

ఈ పై గమకములు అన్నియును. ఆందోళిత గమకములే. ఈ ఆందోళిత గమకములు రెండు విధములుగా బృహదాందోళితము: స్వల్పాందోళితము అనవచ్చును.

బృహత్ అనగా పెద్ద Big Oscillation = మా = పా.గపా.గ:గాపమాప

.స్వల్ప అనగా చిన్న Small oscillation = మా = మా.గ.మా.గ.గామగామ

**స్ఫురితము** : జంట స్వరము నందు రెండవ స్వరమును నొక్కి పలుకుట. కొట్టుట. క్రింది నుంచి త్వరిత గతిని నొక్కిపలుకుట.

(1) సస రిరి గగ (2) సదసా: రిసరీ: గరిగా: మొ॥

ప్రత్యాహతము : రిస సని నిద దప పమమగ

ఇది కూడా జంటయే. మొదటి స్వరమైన రి ఎక్స్ట్రా స్వరము. స్వరమును నొక్కిపలుకుట.

రవ : రిససా ; గరిరీ ; మగగా

త్వరితగతిని మూడవ స్వరమును నొక్కిపలుకుట స్ఫురితించుట (ధృతరవ)బెల్జియం కటింగు)

ఈ రవ గమకమునే నెమ్మదిగా కూడా పలికించ వచ్చును.

రిససా ; గరిరీ ; మగగా

దీనిని విళంబ రవ అని నిర్వచించవచ్చును.(కాశీకమలము)

వళి జారు : స్వరమును జార్చుట. ఎక్కుజారు = స్వరములను ఎక్కించుచు పైకి లాగుట.

దిగుజారు = స్వరములను క్రిందికి జార్చుట.

స్థూలముగ ఈ గమకములను పై విధముగా వర్ణించవచ్చును. సూక్ష్మముగా గమకములు అనేకములుగా నున్నవి. వాటిని సుబోధకముగ వర్ణించుట ఇంచుమించు అసాధ్యము. ఈ గమకములు ఒక సంగతి యందు బహుళముగా నుండును. కర్ణాటక సంగీతమునందు "రాగము" అనేక సంగతులతో నుండును. అందు ఒక్కొక్క సంగతి అనేక గమకములతో చేరి యుండును. ఈ గమకములను ఆధారముగా చేసుకొని గమకములలో అంతర్లీనముగా సూక్ష్మ శృతులు పలుకును. గమకములు, అలంకారములు, చేరి రాగమగును. ఆరోహి, అవరోహి, స్థాయి. సంచారి వర్ణములు చేరి అలంకారములు అగును.

అలంకారము అనగా నిర్ణీత స్వరబృందములు నిర్ణీత స్వర సమూహములు.

శృతులు, అంతర్లీనముగ గల గమక, అలంకార, వర్ణములతో, చేరిన సంగతులు, రాగ భావమును సద్యవముగా వ్యక్తము చేయును.

ఈ గమకములను రాగ రంజక ప్రయోగముల ద్వారా అధ్యయనం చేసే పద్ధతి కూడా సుబోధకంగా ఉంటుంది.

స్వరస్థానాల వైవిధ్యంవల్ల, వాటిని మార్చటం వలన, వాటి మూర్ఛనా బేదాలవలన, వివిధ రాగాలు ఏర్పడతాయి. అదే గాకుండా ఒకే మూర్ఛన. ఒకే స్వరస్థానాల సంయోగం అయినప్పటికి గమక భేదాల వలన రాగాలు, రాగ భావాలు మార్పు చెందుతాయి.

ఇందువలన కర్ణాటక సంగీతం ఎంతో అభివృద్ధి అయిందని ఎంతో ఎత్తు పెరిగిందని

ఎంతో లోతును సాధించినదని బోధపడుతుంది.

మగరిస అనే ప్రయోగం? చాలా రాగాలలో ఉంది. ఈ స్వరస్థానాల మగరిస (శు.మ; అం:గ; చ:రి ; స). గమక భేదాలను బట్టి అనేక రాగాలుగా స్ఫురిస్తుంది.

| | |
|---|---|
| మ గా రి రీ స - సా రి గా - స రీ స | = దేవగాంధారి |
| మా మ గ రి స రీ | = ఆరభి |
| మ గ గ రి స: రి గా రి రీ | = సామ |
| మా గ ప మా మగ రీ | = సురటి |
| మ గ గా మ రీ రీ రీసా | = కేదారగౌళ |
| స రి మా మ గ మ పా ప | = యదుకుల కాంభోజి |
| స రీ గా ; మ పా మా గ | = యదుకుల కాంభోజి |
| రీ రీ : గా మ పా మ మా గ : గ మ రీ | = శహన |
| మ గ గా రి రి గా స | = ద్విజావంతి |

పై ప్రయోగాలలో గల గమక భేదాలను అనుసరించి రాగ స్వరూపాలు, రాగభావాలు మార్పు చెందటం అనే విషయం ఎంతో సూక్ష్మంగా అపురూపంగా ఉన్నది.

# 60. రాగప్రకరణం

మిక్కిలి పురాతనకాలములో ఋగ్వేదమును సాధారణంగా ఒకే శైలియగు స్వరిత (స)లో పాడుచుండెడివారు. కాని ఆ తరువాత ఉదాత్త (రి) అనుదాత్త (ని) స్వరములనుచేర్చి పాడుచుండెడివారు. ఈ విధంగా ఋగ్వేదగానంలో ప్రారంభమైన ఏకస్వరకొలత రి స ని. అను త్రిస్వరకొలతగాను ఆ తరువాత గ రి స ని ధ. అను పంచస్వర కొలతగాను ఆ తరువాత మ గ రి స ని ధ ప. అను సప్తస్వరకొలతగాను వృద్ధి చేయడినది. ఈ విధంగా యేర్పడిన సంపూర్ణకొలతయగు యీ మ గ రి స ని ధ ప లో స ని ధ ప అను భాగమును హెచ్చుస్థాయి నుండి పాడినపుడు అది ఒక సంపూర్ణమైన స్థాయి (అక్టేవు)గా యేర్పడును. భారతీయ సంగీతచరిత్రలో యీ స్థాయిని కనిపెట్టిన పద్ధతి అతిముఖ్యమైనదనియు, అప్పటి నుండే సంగీతకళ యదార్థముగా ప్రారంభమైనదనియు చెప్పవచ్చును. ఋగ్వేదములో కూడ యీ స్థాయిలు మూడు విధములనియు అవి ఒకదానికంటె మరియొకటి హెచ్చుస్థాయిలో పాడదగుననియు చెప్పియుండుటచే యీ త్రిస్థాయి పద్ధతి సుమారు మూడువేల సంవత్సరముల క్రిందటనే ఆమోదింపబడినట్లు మనకు స్పష్టమగుచున్నది.

స్వరితస్వరము :- ఋగ్వేదగానములో పలుకు మధ్య స్వరమగు 'స' ను స్వరిత స్వరమని చెప్పడును.

ఉదాత్తస్వరము :- ఋగ్వేదగానములో పలుకు హెచ్చుస్వరమగు 'రి'ని ఉదాత్తస్వరమని చెప్పబడును.

అనుదాత్త స్వరము :- ఋగ్వేదగానములో పలుకు తగ్గు స్వరమగు 'ని'ని అనుదాత్త స్వరమని చెప్పబడును.

స్వరసంఖ్యనుబట్టి రాగములకేర్పడిన పేర్లు :- పైన దెలిపినటుల క్రమంగా అభివృద్ధి చేయబడిన సప్తస్వరములందలి కొలతలకు యీ క్రింది పేర్లు నేర్పరచి యుడుట గ్రహించునది. 1 స్వరము గలది ఆర్సికమనియు, 2 స్వరములుగలది గాథిక యనియు, 3 స్వరములు గలది సామిక యనియు, 4 స్వరములు గలది స్వరాంతర యనియు, 5 స్వరములు గలది ఔడవ, యనియు; 6 స్వరములు గలది షాడవ యనియు, 7 స్వరములు గలది సంపూర్ణమనియు చెప్పబడును.

# * రాగప్రకరణం *

శ్లో॥ యోసౌధ్వని విశేషస్తు స్వరవర్ణ విభూషితః
రంజకో జన చిత్తానాం సరాగః కథితో బుధైః

శృతి, స్వరస్థాన స్వర, వర్ణ, అలంకార, గమక, మూర్ఛన, ప్రయోగములు చేత విభూషింపబడి. సంగీత రసిక జనుల చిత్తములను రంజింప చేయు నాద విభూతి రాగముగా శోభిల్లు చున్నది అని పండితులు నిర్వచించిరి.

'రాగము' భారతదేశ సంగీతము యొక్క విశిష్టత. ప్రపంచ సంగీత రీతులలో భారతీయ సంగీతమునకు తన 'రాగము' వలన ఒక ప్రత్యేక స్థానమును సంపాదించుకొనినది.

"రాగము" అను పదమునకు అనేక అర్థములు కలవు. కోరిక ; రంగు ; రంజనము; వన్నె ; ఎరుపు వర్ణము ; వర్ణము ; వలపు ; ప్రీతి ; అనురాగము ; రక్తి ; ఆనందము; ఉల్లాసము ; శోభ, ప్రకాశము మొదలైనవి. పై వాటిలో ఎక్కువగా సంగీతమునకు సంబంధించినవియే.

కర్ణాటక సంగీతము రాగమయము. కల్పిత సంగీత రచనలు. అనగా పాటలు, స్వరజతులు, వర్ణములు, కృతులు, కీర్తనలు, జావళీలు, పదములు, మొదలైనవి అన్నియును రాగ రూపములే. మనోధర్మ సంగీత శాఖలైన, రాగాలాపన, స్వరకల్పన, నెరవు, తానము, పల్లవి మొదలైనవి అన్నియును రాగ రూపములే, రాగ భూయిష్టములే. రాగమునకు ఒక నాద రూపము ఉండును. రాగమునకు భావము, రసము ఉండును. రాగమునకు నిర్ణీత కాలము ఉండును. నవసరములకు వాటి భావములకు వివిధ రాగములున్నవి. ఈ రాగ పద్ధతి సంగీత మహర్షుల సంగీత తపస్వుల హృదయములందు ఉద్భవించినవి. మొట్టమొదట, మూర్ఛనలుగా ఉద్భవించి క్రమపరిణామము చెందుచు జాతులుగ, రాగములుగా అభివృద్ధిని చెందినవి. రాగమునకు పూర్వ రూపమైన 'జాతి'కి పూర్వాచార్యులు మొదలు 10, తరవాత 3 కలిపి మొత్తము 13 లక్షణములను చెప్పిరి. రాగమునకు, శృతులు, స్వరస్థానములు, గమకములు, సంగతులు, ఔడవ, షాడవ, సంపూర్ణ, వర్జ్య, వక్రాదులు, ఆరోహణ అవరోహణలు, వాది, సంవాది, అనువాదులు. గ్రహ, న్యాస, అంశ స్వరాదులు, మంద్ర, మధ్యతార స్థాయిలు, బహుత్వ అల్పత్వ స్వరములు, మొదలైన అంశములు ఎన్నియో లక్షణములు కలవు.

"స్వరరాగ సుధారసయుత భక్తి స్వర్గాపవర్గమురా"
"రాగ సుధారస పానము చేసి రంజిల్లవే మనసా"

"రాగ రత్నమాలికచే రంజిల్లునట" ఇట్లు అనేక విధములుగా రాగ మహత్మ్యమును త్యాగరాజస్వామి కొనియాడిరి.

సంగీతము యొక్క పరమావధి 'రాగము'

రాగమును అవగాహనతో హృద్యముగా పాడుటలో ఎంత ఆనందము ఎంత కష్టమున్నదో రాగమును అవగాహనతో ఆనందించుట అంత కష్టము. అయినను రాగ అవగాహన లేక పోయినను అవ్యక్తమైన ఆనందమును 'రాగము' శ్రోతకు ఒసంగును.

క్రీ॥శ॥ 1660 ప్రాంతమున వేంకటమఖి యను మహానుభావుడు చతుర్దండి ప్రకాశిక యను గొప్ప సంగీత గ్రంథమును వ్రాసెను. సంగీత చరిత్రయందు 72 మేళకర్తల పద్ధతిని విశదీకరించెను వాటికి నామములను కల్పించెను. క్రమసంఖ్యను ఏర్పరచెను. 3 రిభషములు, 3 గాంధారములతో ప్రస్థరించెను.

ఆధునిక కనకాంగి, రత్నాంగి, మేళకర్త నామములను, ఒసగి వాటిని క్రమ సంపూర్ణములుగా దిద్ది, వాటికి కటపయాది సూత్రమును అన్వయించినది, 'అకళంక" బిరుదును కలిగిన మహారాష్ట్ర సంగీతపండితుడు సంగ్రహ చూడామణి గ్రంథమును వ్రాసిన వాడు, తంజావూరు ఆస్థాన విద్వాంసుడైన శ్రీ గోవిందాచార్యులు, ఆ తరువాత కనకాంబరి - ఫేనద్యుతి నామములు క్రమ సంపూర్ణములు గానూ, కటపయాది సూత్రమునకు అన్వయించబడినవి.

## 61. రాగపరిణామం : రాగవిభజన : రాగ ఆలాపన పద్ధతి

ఋగ్వేదాన్ని ఆదిలో ఒక స్వరంతో ప్రవచనం చేసేవారు. అలా పాడటాన్ని "ఆర్చిక గానం అనేవారు. తరువాత రెండు స్వరాలలో గానం చేయడాన్ని "గాధికగానం" అనే వారు. తరువాత 3 స్వరాలతో గానం చేయడం ఆచారంలోకి వచ్చింది. అట్లా గానం చేయడానికి "సామిక" గానం అనే వారు. ఇట్లు మూడు స్వరాలతో గానం చేసేటప్పుడు మధ్య స్వరాన్ని సమాహారం అనీ, పై స్వరాన్ని 'ఉదాత్తం' అని క్రింది స్వరాన్ని "అనుదాత్తం" అని అన్నారు. ఈ రకం అయిన వేదగానం ఈనాడు కూడ మనం వింటూ ఉంటాం.

సామ వేదాన్ని గానం చేసేటప్పుడు మాత్రం ఋగ్వేద, యజుర్వేద గానానికి భిన్నంగా 7 స్వరాలలో పాడటం మొదలుపెట్టి, ఈనాడు 7 స్వరాలలో పాడుతూనే ఉన్నారు. స్వచ్ఛంగా, సంప్రదాయంగా, సంగీతబద్ధంగా తమిళనాడు, ఆంధ్రరాష్ట్రాల వేద పండితులు గానం ఆ విధంగా చేస్తున్నారు.

ఈ గానం, మగరిస నిదప అవరోహణ క్రమంలో అనగా మధ్యస్థాయిలో మగరిస మంద్ర స్థాయిలో నిదప స్వరాలు ఉంటున్నాయి. ఈ స్వరాలు ఖరహరప్రియ స్వరస్థానాలుగా ఉంటున్నాయ. అనగా (చ॥రి; సా॥గ; శు॥మ; ప; చ॥దై; కై॥ని;) స్వరస్థానాలతో సామ వేదాన్ని గానం చేయటం జరుగుతున్నది.

యజుర్వేదం ఈ ప్రకారం 7 స్వరాలలో గానం నిర్ణీత బద్ధంగా చేస్తే అదే సామగానం అవుతుంది అని వేద పండితులు వివరించారు.

వేదాన్ని ఉదాత్త అనుదాత్త స్వరితాలతో పాడుతూ క్రమంగా 4 స్వరాలు (స్వరాంతరం) 5 స్వరాలు (ఔడవం) 6 స్వరాలు (షాడవం) 7 స్వరాలు (సంపూర్ణం) ఉపయోగిస్తూ పాడగా అన్నారు. ఆ సంగీతానికి వైదికగానం అన్నారు. కాలక్రమంగా సంగీతం కళాగానంగా పరిణామం చెందింది. సంగీతానికి ప్రాతిపదిక సామగానం. సామగాన స్వరాలు, సామగాన మూర్ఛన సంగీతానికి మూలం. సామగాన మూర్ఛన నుండి తక్కిన మూర్ఛనలు, జాతులు, రాగాలు, ఉద్భవించాయి.

సామగాన మూర్ఛనను, హరప్రియ, ముఖారి, చిత్తరంజని ఖరహరప్రియ అనే వివిధ పేర్లతో కాలవాహినిలో పిలుస్తూ వచ్చి ఈనాడు అనగా 72 మేళకర్తల కాలానికి ఖరహర ప్రియగా స్థిరపడింది.

ఈ ఖరహరప్రియ రాగం నుండి క్రమంగా తోడి, కళ్యాణి, హరికాంభోజి, నరభైరవి: చ్యుతపంచమ తోడి; శంకరాభరణ రాగాలు గ్రహభేద స్ఫూర్తితో వెలువడి ప్రసిద్ధరాగాలుగా ప్రకాశిస్తున్నాయి. ఈ ఖరహర ప్రియ రాగమే షడ్జగ్రామము. చ్యుత పంచమ ఖరహర ప్రియయే మధ్యమ గ్రామము. చ్యుత పంచమ తోడియే గాంధార గ్రామము.

ఈ ప్రకారము భారతీయ సంగీతమునకు ప్రాతిపదిక సామగాన మూర్ఛనయే.

"మోదకర నిగ మోత్తమ సామ వేదసారం" "సద్యోజాత ఆది పంచవక్త్రజ
సరిగమపదనీ వరసప్తస్వర విద్యాలోలం" త్యాగరాజు

భారతీయ సంగీతము రాగ దశకు చేరిన తరువాత నిజమైన సంగీత అభివృద్ధి కళా విషయంగా ప్రారంభం అయింది.

## 62. రాగవిభజనలు

సంగీత రత్నాకర కర్త శార్ఙ్గదేవుడు, రాగ విభజన నిర్దుష్ట రూపములలో గావించెను.

1. మార్గ రాగములు : అనగా శాస్త్ర బద్ధమైనవి. దేశకాల పరిస్థితులు ప్రభావములకు ప్రభావితము చెందనవి. శాశ్వత మైనవి. దేశ విస్తృతమైనవి.

ఇవి ఆరు విధములు (1) గ్రామ; (2) ఉప; (3) శుద్ధ; (4) భాష ; (5) విభాష ; (6) అంతర్భాష రాగములు.

2. <u>దేశ్యరాగములు :</u> అనగా : దేశకాల పరిస్థితులను బట్టి మార్పు చెందు స్వభావము కలిగి ప్రజలలో వాడుకలో నుండు రాగములు ((Applied). But classical)

ఇవి 4 విధములు

(1) రాగాంగ రాగములు : జనక రాగములు, ప్రసిద్ధ రాగములు, మేళకర్త రాగ సదృశములైన రాగములు ఉదా: శంకరాభరణము మొ॥

(2) ఉపాంగరాగములు : జన్య రాగములకు సదృశమైనవి. ఉదా: మోహన మొ॥

(3) భాషాంగ రాగములు : భారతదేశమునందు ఆయా భాషా రాష్ట్రములకు చెందినవి. (ఇప్పటి అర్థము (అన్యస్వరము కలిగినవి) ఉదా: సారంగ మొ॥

(4) క్రియాంగ రాగములు : ఉత్సవములందు, ఆయా రసములకు అనుగుణంగా ఉండు రాగములు. సన్నివేశానుకూల రాగములు ఉదా: కదనకుతూహలం : కుంతల వరాళి మొ॥

**63. 2వ విభజన : ఘన ; నయ ; దేశ్యరాగములు**

ఘన రాగములు : ప్రసిద్ధ రాగములు ; ఉదాత్త రాగములు

ఎక్కువ అవకాశము కలిగి ఉండు విశృతమైనరాగములు ; తానమును వీణపై వాయించు రాగములు (ఘనము=తానము)

1. ఘనరాగములు అయిదు : నాట ; గౌళ ; ఆరభి ; వరాళి ; శ్రీరాగము ద్వితీయ ఘనరాగములు రీతిగౌళ ; నారాయణగౌళ; భౌళి ; కేదారం ; సారంగనాట
2. నయరాగములు : అనగా రక్తి రాగములు : బిలహరి : కేదారగౌళ, ఆనందభైరవి మొ॥
3. దేశ్యరాగములు : అన్యదేశ ; అన్య సంప్రదాయ అనగా హిందూస్థానీ సంగీత శైలి నుండి తీసుకొనిన రాగములు. కాపి: బేహాగ్: మొ॥

64. 3వ విభజన : నాదరుని విభజన (సంగీత మకరందము) ముక్తాంగ కంపిత . అర్ధకంపిత; కంప విహీన రాగములు

1. ముక్తాంగ కంపిత రాగములు : సర్వ స్వర గమక, వరీక, రక్తి రాగములు. ఉ॥ తోడి ; భైరవి మొ॥

2. అర్ధకంపిత రాగములు : తగు మాత్రంగా గమకములుండు రాగములు. ఉ॥ బిలహరి, బహుదారి మొ॥

3. కంప విహీన రాగములు : కదనకుతూహలం ; కుంతల వరాళి; మొ॥

65. 4వ విభజన: మతంగుని రాగ విభజన (బృహద్దేశి గ్రంధము) శుద్ధ, ఛాయాలగ; సంకీర్ణ రాగాలు

1. శుద్ధ రాగములు : శంకారాభరణం, కేదారగౌళ, మోహన మొ॥

2. ఛాయాలగ (సాలగ) రాగములు : ఒక రాగమునందు ఇంకొక రాగచ్ఛాయ వచ్చు రాగములు ; అసావేరి ; రీతిగౌళ; మొ॥

3. సంకీర్ణ రాగములు : ఒక రాగమునందు కొన్ని ఇతర రాగ చ్ఛాయలు వినిపించు రాగములు ఇట్టి రాగములు అరుదు.

66. 5వ విభజన : ఈ రాగవిభజన రామామాత్యునిది. ఉత్తమ, మధ్యమ, అధమ రాగములు

1. ఉత్తమ రాగములు : ప్రసిద్ధ రాగములు. ఎక్కువ మందికి తెలిసి ఎక్కువ అవకాశముతో అనేక రచనలు కలిగి, మనోధర్మ సంగీతము (రాగ ఆలాపన, స్వరకల్పన, నెరవు, తానము, పల్లవి)నకు అవకాశము కలుగు రాగములు.

   ఉదా॥ కాంభోజి; భైరవి; తోడి మొ॥

2. మధ్యమ రాగములు : పరిమితి కలిగిన అవకాశము, ప్రాచుర్యం కలిగి, పరిమితమైన సంఖ్యగల రచనలు కలిగి, మనోధర్మ సంగీతమునకు తగు మాత్రంగా అవకాశము కలిగిన రాగములు. బహుదారి, కన్నడగౌళ మొ॥

3. అధమ రాగములు : ఒక్కటి, రెండు, రచనలు కలిగి మనోధర్మ సంగీతానికి అవకాశం లేక గమకము లేక, నామ మాత్రంగా ఉండి ప్రాచుర్యం లేని రాగములు. ఉ॥ జింగ్లా ; వసంతభైరవి మొ॥

67. **6వ విభజన** : సూర్యాంశ, చంద్రాంశ, గౌడ, రాగములు (నారదుని సంగీత మకరంద విభజన)

సూర్యాంశరాగములు, పగటి వేళ పాడదగు రాగములు :

ఉదయం : ఉదా: గాంధార ; జయసాక్షి ; సామవేది ; మొ॥ 20 రాగములు.

మధ్యాహ్నం : శంకరాభరణం, కాంభోజి, పూర్వి బలహంస, మొ॥ 14 రాగములు.

చంద్రాంశ రాగములు: శుద్ధనాట, కురంజి; సారంగ, ఛాయ; మొ॥ 19 రాగములు.

సూర్యాంశ చంద్రాంశ రాగములు : (ఉదయము, సాయంకాలము పాడదగిన రాగములు. దేశాక్షి ; మాహురి ; ఆందోళి ; భైరవి, రమాకృతి మొ॥ 10 రాగములు.

గౌడ రాగములు : (మధ్యాహ్నం 12 గం॥ నుండి 3 గంటల వరకు పాడతగు రాగములు శుద్ధ సారంగ; వరాళి ; ద్రవతి ; మొదలైనవి.

68. **7వ విభజన** : నారదుని విభజన : స్త్రీ, పురుష, నపుంసక రాగములు

1. స్త్రీ రాగములు : కురంజి ; బిలహరి ; వరాళి ; గౌళ మొదలైనవి.
2. పురుష రాగములు : భైరవి, భూపాలము, శ్రీరాగము మొదలైనవి.
3. నపుంసక రాగములు : ఇవి ప్రశ్నార్థకములు, ఈ విభజనకు తార్కిక విలువలేదు.

69. **8వ విభజన** : (నారదుని విభజన) ఉదయ, మధ్యాహ్న, సాయంత్ర రాగములు.

రాగ కాల నిర్ణయ పద్ధతి యందు అనుసరించ తగు రాగములు. (ఈ పద్ధతి హిందూస్థానీ సంగీత పద్ధతి యందు ఇప్పటికిని అనుసరించబడుచున్నది. ఉదయం, మధ్యాహ్నం, సాయంత్రం, రాత్రి, అర్ధరాత్రి, తెల్లవారు ఝాము వేళలకు వివిధ రాగములు నిర్ణయించబడి ఆచరించబడుచున్నది.

ఉదయరాగములు : బిలహరి ; మలహరి; ముఖారి భైరవి మొ॥నవి.

మధ్యాహ్న రాగములు : శ్రీరాగము ; మధ్యమావతి ; కళ్యాణి మొ॥నవి.

70. **9వ విభజన** : పుత్ర, మిత్ర, కళత్ర రాగములు

పుత్ర రాగములు. జన్యరాగములకు సదృశమైనవి.

మిత్ర రాగములు పేర్లనుబట్టి దగ్గర దగ్గర రాగములు రంజని, నిరంజని, జనరంజని మనోరంజని మొ॥

మిత్రరాగములు : రాగచ్ఛాయను బట్టి దగ్గర రాగములు జనరంజని-పూర్ణచంద్రిక; రీతిగౌళ-ఆనందభైరవి; ఆరభి-దేవగాంధారి.

కళత్ర రాగములు : భర్త, శంకరాభరణం - కళత్రం, బిలహరి. భర్త కల్యాణి, కళత్రం మోహన కళ్యాణి.

71. **10వ విభజన :** ఈ విభజన హిందూస్థానీ సంగీత పద్ధతి యందలిది. రాగ, రాగిణి, పరివారపద్ధతి, ఈ విభజన కూడ జనక, (కళత్ర, మిత్ర) జన్య రాగ పద్ధతికి సదృశమైనదియే.

రాగము అనగా పురుష రాగము.

రాగిణి అనగా కళత్రరాగము.

72. **11వ విభజన :** పురాతన తమిళ సంగీత సంప్రదాయమున గల రాగవిభజన :

ఈ సంప్రదాయమున హరి కాంభోజి ప్రధాన రాగము.

పణ్ = రాగము, మేళకర్త రాగము

తిరమ్ = జన్యరాగము.

పణ్ విభాగములు మూడు.

ఎహల్ పణ్ = పగలు పాడబడు రాగము

ఇరవు పణ్ = రాత్రి పాడతగు రాగము

పొదు ప్పణ్ = అన్ని వేళల పాడుకొనదగు రాగము.

73. **12వ విభజన :** పార్శ్వ దేవుని వివరణము.

ఈ విభజన రాగాంగ, ఉపాంగ, భాషాంగ, క్రియాంగ రాగములను, సంపూర్ణ, షాడవ, ఔడవ రాగములతో ప్రస్థరించగా 12 రాగ విభజనలు వచ్చును.

74. **13వ రాగవిభజన :**

పంచమాంత్య రాగములు - నవరోజు - సరిగమప - పమగరిసనిదప

దైవతాంత్య రాగము - కురంజి - సనిసరిగమపద - దపమగరిసనిస

నిషాధాంత్యరాగములు - నాదనామక్రియ : చిత్తరంజని సరిగమపదని - నిదపమగరిసనిసా

## 75. 14వ రాగవిభజన :

సంపూర్ణ, షాడవ ఔడవ రాగ భేదములు

సంపూర్ణ రాగం - సప్త స్వరములతో ఉండెడిరాగము - ఖరహరప్రియ

షాడవ రాగము - ఆరు స్వరములతో గల రాగము. శ్రీరంజని

ఔడవ రాగము - అయిదు స్వరములతో కలిగినరాగము. మోహన.

వీటిని ప్రస్థరించగా ఈ దిగువ నుదహరించిన భేదములు వచ్చును.

1. సంపూర్ణ సంపూర్ణం; 2. సంపూర్ణ షాడవం ; 3. సంపూర్ణ ఔడవం

2. షాడవ సంపూర్ణం ; షాడవ షాడవం ; షాడవ ఔడవం

3. ఔడవ సంపూర్ణం ; ఔడవ ఔడవం ; ఔడవ షాడవం

ఇవి మరల శుద్ధ సంకీర్ణ వక్ర భేదములగును.

ఉదాహరణకు:

1. శుద్ధ ఔడవ రాగము - మోహన
2. సంకీర్ణ ఔడవ రాగము : ఆందోళిక సరిమపనిస । సనిదమరిస
3. వక్ర ఔడవ రాగము - భోగిసింధం. సపమపదనిస । సనిదనిపమస
4. శుద్ధషాడవ రాగము : శ్రీరంజని సరిగమదనిస
5. సంకీర్ణ షాడవ రాగము : కన్నడగౌళ సరిగమపనిస । సనిదపమగస
6. వక్ర షాడవ రాగము : గౌళ : సరిగమ రిమపనిస । సనిపమరిగమరిస
7. శుద్ధ సంపూర్ణము 8.సంకీర్ణ సంపూర్ణము 9. వక్ర సంపూర్ణము

## 76. 15. వక్రరాగ విభజన

1. వక్ర సంపూర్ణము 2. వక్ర క్రమ సంపూర్ణము 3. వక్రషాడవము 4. వక్ర క్రమ షాడవము 5. వక్ర ఔడవము 6. వక్రక్రమ ఔడవము.

ఆరోహణ వక్ర సంపూర్ణ, షాడవ, ఔడవ భేదములు

అవరోహణ వక్ర సంపూర్ణ, షాడవ, ఔడవ భేదములు

ఉభయ వక్ర సంపూర్ణ, షాడవ, ఔడవ భేదములు

షాడవ ఔడవ రాగములు వర్జ్య రాగముల క్రిందకు వచ్చును.

77. **16వ విభజన :** భాషాంగ రాగములు, అనగా అన్య స్వరస్థానములు కలిగిన రాగములలో, ఏకాన్యస్వర, ద్విఅన్యస్వర, త్రిఅన్యస్వర, బహు అన్యస్వర భాషాంగ రాగములు; మూర్ఛన యందు అన్యస్వరములు కలిగిన భాషాంగరాగములు, ప్రయోగమునందు అన్యస్వరములు కలుగు రాగములు కలవు.

78. **17వ విభజన :** అర్ధ భాషాంగ రాగములు. అనగా స్వరస్థానము ఒకటే అయినను శృతుల యందు భేదములు కలిగినచో అవి అర్ధ భాషాంగ రాగములనుట వాడుక యందు కలదు. ఉదా: శహన రాగమున, సావేరి రాగమున, ఆహిరి రాగమున అంతర గాంధారము ఒక శృతి తక్కువగా పలుకును. ఈ రాగములను అర్ధ భాషాంగ రాగములనుట కద్దు.

79. **18వ విభజన :**

మూర్ఛన ప్రధాన రాగములు - కళ్యాణి, భైరవి మొ॥

ప్రయోగ ప్రధాన రాగములు - అఠాణా, ఆహిరి యదుకుల కాంభోజి మొ॥

80. **19వ విభజన :**

పూర్వాంగ ప్రధాన రాగములు - ద్విజావంతి, శహన, మొ॥

ఉత్తరాంగ ప్రధాన రాగములు - అఠాణా, మొ॥ ఉత్తరంగ ప్రధాన రాగములు అరుదు.

81. **20వ విభజన :**

పూర్వ ప్రసిద్ధ రాగములు : ఆధునిక ప్రసిద్ద రాగములు అనగా పూర్వం ప్రసిద్ధి అయిన రాగముల మూర్ఛనల యందు కొద్ది మార్పులతో నూతన నామములతో ప్రకాశించు రాగములు.

మలహరి - సావేరి ; దేశాక్షి - బిలహరి.

సాళగభైరవి - ముఖారి. :

82. **21వ విభజన :** ప్రసిద్ధ రాగములు-తోడి, కళ్యాణి మొ॥

రక్తి రాగములు - బిలహరి, శహన మొ॥

అపూర్వ రాగములు - ఘంటా : పాడి, రేగుప్తి మొ॥

83. **22వ విభజన :** మేళకర్త రాగములు. 16 ప్రకృతి, వికృతి స్వరములను ప్రస్తరించగా వచ్చు 72 మేళకర్తలు.

## 84. 23వ విభజన :

సువాది. వివాది మేళకర్త రాగ విభజన. ఈ 72 మేళకర్తల యందు సువాది రాగములు 32 మేళకర్త రాగములు సహజములు.

40 వివాది మేళములు: ఈ రాగములు అసహజములు అయినను కర్ణాటక సంగీతమున మాత్రము ప్రచారములో ఉన్నవి. 32 మేళకర్తలు ప్రకృతి సిద్ధమైన 12 స్వరస్థానములను ప్రస్థరించగా వచ్చిన స్వరస్థాన మేళకర్తలు. తక్కిన 40 మేళకర్తలు, మారు పేర్లతో అనగా షట్శ్రుతి రిషభం శుద్ధ గాంధారం, షట్శ్రుతి ధైవతం, శుద్ధ నిషాధం అను వికృతి స్వరములలో ఏ ఒక్కటైనను కలిగిన మేళములు వివాది మేళములు

**కటపయాది సూత్రము** :- 72 మేళకర్తల నామములకు ఆ మేళకర్త సంఖ్యను తెలుసుకొన గలుగునట్లు, మేళ నామముల మొదటి రెండు అక్షరములను ఏర్పరచిరి. ఆ ఏర్పాటునకు క, ట, ప, య ఆది సూత్రము అని పేరు.

# 85. 72 మేళకర్తల పద్ధతి

**రాగము** :- స్వరవర్ణములచే అలంకరింపబడి వినువారిచిత్తమును రంజింప చేయు ధ్వని విశేషమును రాగమని చెప్పబడును. ఇట్టి రాగములు ముఖ్యముగా 72 అగును. వీటినే జనకరాగములనియు, మేళకర్తరాగములనియు, ముఖ్యరాగములనియు, రూట్ రాగములనియు చెప్పుదును. వాటి వివరముల నీక్రింద దెలుపుట గమనించదగను.

72 మేళకర్తలు :- సప్తస్వరముల యొక్క శుద్ధ, వికృతిభేదములచే యేర్పడు షోడశస్వరముల ప్రస్తారముచే మేళకర్తలు 72గా నేర్పడుచున్నవి ఎటులనగా: సప్తస్వరములగు, సరిగమపధని, లో మొదటి భాగమైన, సరిగమ, ను పూర్వాంగమనియు, రెండవభాగమైన, పధని, అనునది ఉత్తరాంగమనియు చెప్పబడును. పూర్వాంగములోని శుద్ధస్వరములగు షడ్జ, -శు. రిషభ, -శు. గాం,-శు మధ్యమములను ఉత్తరాంగములోని శుద్ధస్వరములగు పంచమ, శు. ధై-శు. నిషాదములతో ప్రస్తరించిన యేర్పడునది మొదటి మేళకర్త రాగమగును. ఇదేవిధముగా పైన దెలిపిన పూర్వాంగములోని శుద్ధ స్వరములను ఉత్తరాంగ శుద్ధ వికృతి స్వరములచే వరుసగా ప్రస్తరించినచో 6 మేళకర్తలు యేర్పడుట నీక్రింద గమనించునది.

| | పూర్వాంగ స్వరస్థానములు | | | | ఉత్తరాంగ స్వర స్థానములు | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1) | షడ్జ | శు.రి | శు.గ | శు.మ | ప | శు.ధై | శు.ని | ప్రస్తరించిన | 1వ | మేళకర్త |
| 2.) | " | " | " | " | ప | శు.ధై | కై.ని | " | 2వ | " |
| 3) | " | " | " | " | ప | శు.ధై | కా.ని | " | 3వ | " |
| 4) | " | " | " | " | ప | చ.ధై | కై.ని | " | 4వ | " |
| 5) | " | " | " | " | ప | చ.ధై | కా.ని | " | 5వ | " |
| 6) | " | " | " | " | ప | ష.ధై | కా.ని | " | 6వ | " |

మొదటి చక్రము యేర్పడును. ఇదేవిధముగా. పూర్వాంగ ప్రకృతి, వికృతి స్వరములతో ఉత్తరాంగ ప్రకృతి, వికృతి స్వరములతో ప్రస్థరించిన 6 చక్రములు ఏర్పడును.

2వ చక్రం ష.శు-రి.-సా-గాం- శు.మ లను.ఉత్తరాంగ స్వరభేదములతో ప్రస్తరించిన - 6 చక్రము.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 3వ | చక్రం | " | షడ్జ-.శు-రిఅం.గా-.శు-మ-.ములను | " | "6 మే॥ |
| 4వ | చక్రం | " | షడ్జ-చ.రి-.సా.గాం-. శు-మ-.ములను | " | "6 మే॥ |
| 5వ | చక్రం | " | షడ్జ చ.రి-అం-గాం.-శు.మ-.ములను | " | "6 మే॥ |
| 6వ | చక్రం | " | షడ్జ-ష-రి.అం-గాం-శు-మ-.ములను | " | "6 మే॥ |

అనగా 6×6=36 మేళకర్తలు యేర్పడుచున్నవి. వీటినే శుద్ధ మధ్యమ మేళకర్తలని చెప్పబడును. వీటిని మరల ప్రతిమధ్యమముతో ప్రస్తరించిన మరియొక 36 మేళకర్తలు యేర్పడి మొత్తము 36+36=72 మేళకర్తలగుటయు అవి 12 చక్రములుగా విభజింపబడుటయు యీ క్రింది పథకమున గమనించదగును.

# 72 మేళకర్తలు గల 12 చక్రముల పేర్లు యేర్పడు వివరము

ఇందు (చక్రము) :- (1) చంద్రుడు (ఇది ఒక గ్రహము) చంద్రుడు

(2) నేత్ర చక్రము - (2) కన్నులు (నేత్రద్వయము)

(3) అగ్ని చక్రము - (3) అగ్నులు (త్రేతాగ్నులు) 1 దక్షిణాగ్ని 2 గార్హస్త్యాగ్ని 3 ఆహదనీయాగ్ని. మరియు 1. జఠరాగ్ని ; 2. బడబాగ్ని ; 3. దావాగ్ని

(4) వేదచక్రము - (4) వేదములు (చతుర్వేదములు) 1. ఋగ్వేదము 2. యజుర్వేదము 3. సామవేదము 4. అధర్వణ వేదము.

(5) బాణచక్రము (5) బాణములు (పంచబాణములు) 1. అరవిందము 2. అశోకము 3. చూతము 4. నవమల్లికము 5. నీలోత్పలము అనునవి. ఇవి పుష్పములు. మన్మధునికి పూవులే బాణములు.

(6) ఋతుచక్రము - (6) ఋతువులు (షట్ ఋతువులు) 1. వసంత ఋతువు 2. గ్రీష్మఋతువు 3. వర్షఋతువు 4. శరదృతువు 5. హేమంత ఋతువు 6. శిశిర ఋతువు అనునవి షట్ ఋతువులు.

(7) ఋషిచక్రము - (7) ఋషులు (సప్తఋషులు) 1. కశ్యప, 2. అత్రి 3. భరద్వాజ 4. విశ్వామిత్ర 5. గౌతమ 6. జమదగ్ని 7. వసిష్ట ఋషులు.

(8) వసుచక్రము - (8) వసువులు (అష్టవసువులు) 1. అనల 2. అనిల 3. ప్రత్యూష 4. ప్రభాస 5. ద్రోణ 6. సోమ 7. అధ్వర 8. ధృవ.

(9) బ్రహ్మచక్రము - (9) బ్రహ్మలు (నవబ్రహ్మలు) 1. మరీచి 2. అత్రి 3. పులస్త్య 4. పులహ 5. క్రతు 6. దక్ష 7. అంగీరస 8. భృగు 9. వసిష్ట అను వారు నవబ్రహ్మలు.

(10) దిశిచక్రము - (10) దిశలు (దశదిశలు) 1. ఇంద్ర 2. అగ్ని 3. యమ 4. నిరుతి 5. వరుణ 6. వామ 7. కుబేర 8. ఈశాన్య 9. అంతరిక్ష 10. పృధివి.

(11) రుద్రచక్రము - (11) రుద్రులు (ఏకాదశరుద్రులు) 1. శివ 2. శంబు 3. పినాకి 4. గిరీశ 5. హర 6. స్థాణు 7. భర్గ 8. భైరవ 9. సదాశివ 10. కపాలి 11 ఈశ్వర అనువారు పదకొండుగురు రుద్రులు.

(12) ఆదిత్య చక్రము - (12) ఆదిత్యులు (ద్వాదశాదిత్యులు) 1. మిత్ర 2. అర్యమ 3. త్వష్ట 4. ధాత 5. వివస్వాన్ 6. అరుణ 7. భగ 8. అంశుమాన్ 9. ఇంద్ర 10. పర్జన్య 11. విష్ణు 12. పూషా అనువారు ద్వాదశాదిత్యులు

72 మేళకర్తలు ఒక్కొక్క చక్రమునకు 6 మేళముల వంతున 76÷6=12 చక్రములను యేర్పరచి వాటికి ఆయా చక్రసంఖ్యను బట్టి పై విధముగా పేర్లను పెద్దలు యేర్పరచిరి. ఈ చక్రముల పేర్లు భూత సంఖ్యలుగ ఉండుట వలన జ్ఞాపికలుగ సహాయపడుచున్నవి (MNEMONICS)..

# 86. 72 మేళకర్తల పథకము

| మేళసంఖ్య | పూర్వమేళకర్తలు లేక శుద్ధమధ్యమ మేళకర్తలు. (1-36) | | మేళకర్తల స్వరములు |
|---|---|---|---|
| | శ్రీ గోవిందాచారి పెట్టిన నామములు | శ్రీ వెంకటమఖి పెట్టిన నామములు | షడ్జ-రిగాం-మ-పం-ధై-ని |
| | | 1. ఇందు-చక్రము | |
| 1. | కనకాంగి | కనకాంబరి | ష-శు-శు-శు-పం-శు-శు |
| 2. | రత్నాంగి | ఫేనద్యుతి | ష-శు-శు-శు-పం-శు-కై |
| 3. | గానమూర్తి | గానసామవరాళి | ష-శు-శు-శు-పం-శు-కా |
| 4. | వనస్పతి | భానుమతి | ష-శు-శు-శు-పం-చ-కై |
| 5. | మానవతి | మనోరంజని | ష-శు-శు-శు-పం-చ-కా |
| 6. | తానరూపి | తనుకీర్తి | ష-శు-శు-శు-పం-ష-కా |
| | | 2. నేత్ర-చక్రము | |
| 7. | సేనాపతి | సేనాగ్రణి | ష-శు-సా-శు-పం-శు-శు |
| 8. | హనుమతోడి | జనతోడి | ష-శు-సా-శు-పం-శు-కై |
| 9. | ధేనుక | ధునిభిన్నషడ్జము | ష-శు-సా-శు-పం-శు-కా |
| 10. | నాటకప్రియ | నటాభరణము | ష-శు-సా-శు-పం-చ-కై |
| 11. | కోకిలప్రియ | కోకిలారవము | ష-శు-సా-శు-పం-చ-కా |
| 12. | రూపవతి | రూపవతి | ష-శు-సా-శు-పం-ష-కా |
| | | 3. అగ్ని-చక్రము | |
| 13. | గాయకప్రియ | గేయహెజ్జజి | ష-శు-అం-శు-పం-శు-శు |
| 14. | వకుళాభరణము | వాటివసంతభైరవి | ష-శు-అం-శు-పం-శు-కై |
| 15. | మాయామాళవగౌళ | మాయామాళవగౌళ | ష-శు-అం-శు-పం-శు-కా |
| 16. | చక్రవాకము $ | తోయవేగవాహిని | ష-శు-అం-శు-పం-చ-కై |
| 17. | సూర్యకాంతము | ఛాయావతి | ష-శు-అం-శు-పం-చ-కా |
| 18. | హాటకాంబరి | జయశుద్ధమాళవి | ష-శు-అం-శు-పం-ష-కా |

## 87 మేళకర్తల పథకము

| మేళసంఖ్యలు | పూర్వమేళకర్తలు లేక శుద్ధమధ్యమ మేళకర్తలు. (1-36) | | మేళకర్తల స్వరములు |
|---|---|---|---|
| | శ్రీ గోవిందాచారి పెట్టిన నామములు | శ్రీ వెంకటమఖి పెట్టిన నామములు | షడ్జ-రిగాం-మ-పం-ధై-ని |
| | | 4.వేద-చక్రము | |
| 19. | ఝుంకారధ్వని | ఝుంకారభ్రమరి | ష-చ-సా-శు-పం-శు-శు |
| 20. | నఠభైరవి | నారీరీతిగౌళ | ష-చ-సా-శు-పం-శు-కై |
| 21. | కీరవాణి | కిరణావళి | ష-చ-సా-శు-పం-శు-కా |
| 22. | ఖరహరప్రియ | శ్రీరాగము | ష-చ-సా-శు-పం-చ-కై |
| 23. | గౌరీమనోహరి | గౌరీవేళావళి | ష-చ-సా-శు-పం-చ-కా |
| 24. | వరుణప్రియ | వీరవసంతము | ష-చ-సా-శు-పం-ష-కా |
| | | 5. బాణ-చక్రము | |
| 25. | మారరంజని | శరావతి | ష-చ-అం-శు-పం-శు-శు |
| 26. | చారుకేశి | తరంగిణి | ష-చ-అం-శు-పం-శు-కై |
| 27. | సరసాంగి | సౌరసేన | ష-చ-అం-శు-పం-శు-కా |
| 28. | హరికాంభోజి | హరికేదారగౌళ | ష-చ-అం-శు-పం-చ-కై |
| 29. | ధీరశంకరాభరణము | ధీరశంకరాభరణము | ష-చ-అం-శు-పం-చ-కా |
| 30. | నాగానందిని | నాగాభరణము | ష-చ-అం-శు-పం-ష-కా |
| | | 6. ఋతు-చక్రము | |
| 31. | యాగప్రియ | కలావతి | ష-ష-అం-శు-పం-శు-శు |
| 32. | రాగవర్ధని | రాగచూడామణి | ష-ష-అం-శు-పం-శు-కై |
| 33. | గాంగేయభూషణి | గంగాతరంగిని | ష-ష-అం-శు-పం-శు-కా |
| 34. | వాగధీశ్వరి | భోగచ్ఛాయానాట | ష-ష-అం-శు-పం-చ-కై |
| 35. | శూలిని | శైలదేశాక్షి | ష-ష-అం-శు-పం-చ-కా |
| 36. | చలనాట | చలనాట | ష-ష-అం-శు-పం-చ-కా |

# 72 మేళకర్తల పథకము

| మేళ సంఖ్యలు | ఉత్తరమేళకర్తలు లేక ప్రతిమధ్యమ మేళకర్తలు | | మేళకర్తల స్వరములు |
|---|---|---|---|
| | | 7.ఋషి-చక్రము (37-72) | |
| 37. | సాలగము | సౌగంధిని | ష-శు-శు-ప్ర-పం-శు-శు |
| 38. | జలార్ణవము | జగన్మోహనము | ష-శు-శు-ప్ర-పం-శు-కై |
| 39. | ఝాలవరాళి | ధాలివరాళి | ష-శు-శు-ప్ర-పం-శు-కా |
| 40. | నవనీతము | నభోమణి | ష-శు-శు-ప్ర-పం-చ-కై |
| 41. | పావని | కుంభిని | ష-శు-శు-ప్ర-పం-చ-కా |
| 42. | రఘుప్రియ | రవిక్రియ | ష-శు-శు-ప్ర-పం-చ-కా |
| | | 8.వసు-చక్రము | |
| 43. | గవాంబోధి | గీర్వాణి | ష-శు-సా-ప్ర-సం-శు-శు |
| 44. | భవప్రియ | భవాని | ష-శు-సా-ప్ర-సం-శు-కై |
| 45. | శుభపంతువరాళి | శివపంతువరాళి | ష-శు-సా-ప్ర-సం-శు-కా |
| 46. | షడ్విధమార్గిణి | స్తవరాజము | ష-శు-సా-ప్ర-సం-చ-కై |
| 47. | సువర్ణాంగి | సౌవీరము | ష-శు-సా-ప్ర-సం-చ-కా |
| 48. | దివ్యమణి $ | జీవంతిని | ష-శు-సా-ప్ర-సం-చ-కా |
| | | 9.బ్రహ్మ-చక్రము | |
| 49. | ధవళాంబరి | ధవళాంగము | ష-శు-అం-ప్ర-పం-శు-శు |
| 50. | నామనారాయణి | నామదేశి | ష-శు-అం-ప్ర-పం-శు-కై |
| 51. | కామవర్ధని | కాశిరామక్రియ | ష-శు-అం-ప్ర-పం-శు-కా |
| 52. | రామప్రియ | రమామనోహరి | ష-శు-అం-ప్ర-పం-చ-కై |
| 53. | గమనశ్రమ | గమకక్రియ | ష-శు-అం-ప్ర-పం-చ-కా |
| 54. | విశ్వంబరి $ | వంశవతి | ష-శు-అం-ప్ర-పం-చ.కా |

| | | | |
|---|---|---|---|
| | | 10.దిశి-చక్రము | |
| 55. | శ్యామలాంగి | శ్యామల | ష-చ-సా-ప్ర-పం-శు-శు |
| 56. | షణ్ముఖప్రియ | చామరము | ష-చ-సా-ప్ర-పం-శు-కై |
| 57. | సిమ్హేంద్రమధ్యమము | సుమద్యుతి | ష-చ-సా-ప్ర-పం-శు-కా |
| 58. | హేమవతి | దేశిసింహారవము | ష-చ-సా-ప్ర-పం-చ-కై |
| 59. | ధర్మవతి | ధామవతి | ష-చ-సా-ప్ర-పం-చ-కా |
| 60. | నీతిమతి | నిషధము | ష-చ-సా-ప్ర-పం-షత-కా |
| | | 11.రుద్ర-చక్రము | |
| 61. | కాంతామణి | కుంతలము | ష-చ-అం-ప్ర-పం-శు-శు |
| 62. | ఋషభప్రియ $ | రతిప్రియ | ష-చ-అం-ప్ర-పం-శు-కై |
| 63. | లతాంగి | గీతప్రియ | ష-చ-అం-ప్ర-పం-శు-కా |
| 64. | వాచస్పతి | భూషావతి | ష-చ-అం-ప్ర-పం-చ-కై |
| 65. | మేచకల్యాణి | శాంతకల్యాణి | ష-చ-అం-ప్ర-పం-చ-కా |
| 66. | చిత్రాంబరి $ | చతురంగిణి | ష-చ-అం-ప్ర-పం-ష-కా |
| | | 12.ఆదిత్య-చక్రము | |
| 67. | సుచరిత్ర | సంతానమంజరి | ష-ష-అం-ప్ర-పం-శు-శు |
| 68. | జ్యోతిస్వరూపిణి | జ్యోతిరాగము | ష-ష-అం-ప్ర-పం-శు-కై |
| 69. | ధాతువర్ధని | ధౌతపంచమము | ష-ష-అం-ప్ర-పం-శు-కా |
| 70. | నాసికాభూషణి | నాసామణి | ష-ష-అం-ప్ర-పం-చ-కై |
| 71. | కోసలము | కుసుమాకరము | ష-ష-అం-ప్ర-పం-చ-కా |
| 72. | రసికప్రియ | రసమంజరి | ష-ష-అం-ప్ర-పం-ష-కా |

ఈ గురుతుగల మేళములు కటపయాది సంఖ్యలకు భిన్నముగా నున్నవి.

## 88. కటపయాది సంఖ్యాపథకము

| కటపయాది సంఖ్యలు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 0 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| కాది నవకము | క | ఖ | గ | ఘ | ఙ | చ | ఛ | జ | ఝ | ఞ |
| టాది నవకము | ట | ఠ | డ | ఢ | ణ | త | థ | ద | ధ | న |
| పాది పంచకము | ప | ఫ | బ | భ | మ | | | | | |
| యాద్యష్టకము | య | ర | ల | వ | శ | ష | స | హ | | |

పైన దెలిపిన కటపయాది సంఖ్యలను గుర్తించునపుడు "అంకానాం వామతో గతిః' ' యనెడి సూర్య సిద్ధాంతానుసారము క్రింద నుండి ఏక, దశస్థానములు గైకొనుచు మేళసంఖ్య నిర్ణయింపవలెను. ఉదా:- మాయామాళవగౌళ. ఇందు మొదటి "మా" యను అక్షరము పాదిపంచకములో 5వ అంకెకు సరిపోవును. రెండవ "య" అను అక్షరము యాద్యష్టకములో 1వ అంకెకు సరియగును. గనుక మొదటి 5వ అంకె ఏక స్థానమునను, రెండవ 1వ, అంకె దశ స్థానమునందును వేసిన మాయామాళవగౌళ 15వ, సంఖ్య యగును. ఇటుల 72 మేళముల సంఖ్యలను కనుగొనవచ్చును. సంయుక్తాక్షరములు గల మేళసంఖ్య నిర్ణయించునపుడు, యీ క్రింది విషయమును గమనింపవలెను.

ఉదా:- షణ్ముఖప్రియ. ఇందు మొదటి 'ష' యను అక్షరము యాద్యష్టకములో 6వ అంకె. రెండవ'ణ్ము' అను సంయుక్తాక్షరములో, 'ణు' హల్లును వదలి మకారమునే లెక్కించిన 'మ' యనునది పాదిపంచకములో 5వ, అంకెకు సరియగును. గనుక మొదటి 6ను, ఏకస్థానమునను రెండవ 5ను, ధశమస్థానమునను బెట్టిన 56 అగును. ఈ రీతిగాతక్కినయన్ని మేళముల సంఖ్యలను తెలియవలెను. ఉదా:- గానమూర్తి, ఇందు మొదటి 'గా' అను అక్షరము కాదినవకము, లో3వ, అంకెకు సరియగుటచే ఏకస్థానమునను, రెండవ న, యను యక్షరము (o) సున్నయగుటచే సున్నకు విలువలేదుగావున, గానమూర్తి 3వ మేళమగును. ఇటులనే తక్కిన మేళముల సంఖ్యలన్నిటిని యూహించునది. అయితే యీకాలమున 72 మేళకర్తలలో 5 మేళకర్తలను మాత్రము, కటపయాది, గణితశాస్త్రమునకు వ్యతిరేకముగా సంయుక్తాక్షరములోని మొదటి హల్లునే లెక్కించుటయును, ఋ, అను ప్రాణాక్షరమును, రి, అను ప్రాణాక్షరముగా

నెంచి లెక్కించుటయును ఈ క్రింది దెలుపు 4+1=5 మేళకర్త రాగముల సంఖ్యలద్వారా గుర్తెఱుంగునది.

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1. చక్రవాకము | గణిత | శాస్త్రరీత్యా | 26వ, | మేళమగుచున్నను | 16వ, | మేళముగలను |
| 2. దివ్యమణి | .... | " | 18వ, | " | 48వ, | " |
| 3. విశ్వంభరి | .... | " | 44వ, | " | 54వ, | " |
| 4. చిత్రాంబరి | .... | " | 26వ, | " | 66వ, | " |
| 5. ఋషభప్రియ | .... | " | 60వ, | " | 62వ, | మేళమగును. |

లెక్కించుచున్నారు. కావున యిప్పటికాలమున వాడు 72 మేళములలో పై 5 మేళములుగాక మిగత 67 మేళములే కటపయాది విధులను సరిగా ననుసరించుచున్నవి.

***పూర్వమేళకర్తలు*** :- 72 మేళకర్తలలో 1 నుండి 36 వరకు గల 36 మేళ కర్తలను పూర్వమేళకర్తలని చెప్పబడును. వీటినే శుద్ధమధ్యమ మేళకర్తలనబడును.

***ఉత్తరమేళకర్తలు***:- 72 మేళకర్తలలో 37 నుండి 72 వరకు గల 36 మేళకర్తలను ఉత్తరమేళకర్తలని చెప్పబడును. వీటినే ప్రతిమధ్యమ మేళకర్తలనబడును.

**కల్పితమేళకర్తలు** :- శ్రీ వెంకటమఖికి పూర్వము వాడుకలో నుండి కొందరిచే 19 మేళకర్తలనియు, మరికొందరిచే 20 మేళకర్తలనియు చెప్పబడిన ప్రాచీన మేళకర్తలనే వెంకటమఖి కల్పిత మేళకర్తలని పేరు పెట్టి యుండెను.

***భూత–మేళచక్రములు***:- శ్రీ వెంకటమఖి 72 మేళకర్తలను 12 సమభాగములుగా చేసి వాటికి భూత మేళచక్రములని పేరుపెట్టెను. వాటినే (1) ఇందు (2) నేత్ర (3) అగ్ని (4) వేద (5) బాణ (6) ఋతు (7) ఋషి (8) వసు (9) బ్రహ్మ (10) దిశ (11) రుద్ర (12) ఆదిత్య చక్రములని చెప్పబడును. భూతసంఖ్యలు:- (1) ఇందు అనగా చంద్రుడు ఒక్కడు. (2) నేత్రములు రెండు; (3) అగ్నులు మూడు; (4) వేదములు నాల్గు; (5) పంచబాణుడు. (6) ఋతువులు ఆరు; (7) సప్తఋషులు; (8) అష్టావసువులు; (9) నవబ్రహ్మలు; (10) దశదిశలు; (11) ఏకాదశ రుద్రులు; (12) ద్వాదశాదిత్యులు.

***మేళసంజ్ఞలు*** :- శ్రీ వెంకటమఖిచే ఒక్కొక్క చక్రములోగల 6 మేళకర్తలకు యివ్వబడిన 6 సంజ్ఞలను మేళ సంజ్ఞలని చెప్పబడును. అవి (1) పా (2) శ్రీ (3) గో (4) భూ (5) మా (6) షా యగును.

## 89. మూర్ఛనాకారక జన్యరాగములు

| | జన్యరాగములు | ఆరోహణ - అవరోహణములు | మేళకర్త సంఖ్య | స | రి | గ | మ | ప | ధ | ని |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. | ధన్యాసి | స గ మ ప ని స - స ని ధ ప మ గ రి స | 8 | | -- | -- | -- | -- | -- | సాళగభైరవి |
| 2. | దేశ్యతోడి | స గ మ ప ధ ని స - స ని ధ ప మ గ రి స | 8 | | -- | కాంభోజి | -- | -- | -- | -- |
| 3. | శుద్ధతోడి | స రి గ మ ధ ని స - స ని ధ మ గ రి స | 8 | | -- | -- | -- | -- | -- | పుష్పలతిక |
| 4. | వసంత | స గ మ ధ ని స - స ని ధ మ గ రి స | 17 | | -- | -- | రమణి | -- | -- | -- |
| 5. | మాల్ కౌస్ | స గ మ ధ ని స - స ని ధ మ గ స | 20 | | -- | శుద్ధసావేరి | ఉ.ర. చంద్రిక | -- | మోహన | మధ్యమావతి |
| 6. | అభేరి | స గ మ ప ని స - స ని ధ ప మ గ రి స | 22 | | -- | మోహన | కేదారగౌళ | -- | -- | ఆరభి |
| 7. | అభోగి | స రి గ మ ధ స - స ని ధ మ గ రి స | 22 | | -- | -- | వలజి | -- | -- | -- |
| 8. | ఉ.ర.చంద్రిక | స గ మ ప ని స - స ని ప మ గ స | 22 | | -- | మోహన | మధ్యమావతి | మాల్కౌస్ | -- | శుద్ధసావేరి |
| 9. | పుష్పలతిక | స రి గ మ ప ని స - స ని ప మ గ రి స | 22 | | శుద్ధతోడి | -- | -- | -- | -- | -- |
| 10. | మధ్యమావతి | స రి గ మ ప ని స - స ని ప మ రి స | 22 | | హిందోళ | -- | శుద్ధసావేరి | ఉ.ర.చంద్రిక | -- | మోహన |
| 11. | సాళగభైరవి | స రి మ ప ధ స - స ని ధ ప మ గ రి స | 22 | | ధన్యాసి | -- | -- | -- | -- | -- |
| 12. | కాంభోజి | స రి గ మ ప ధ స - స ని ధ ప మ గ రి స | 28 | | -- | -- | -- | -- | దేశ్యతోడి | -- |
| 13. | కుంతలవరాళి | స మ ప ధ ని ధ స - స ని ధ ప మ స | 28 | | -- | -- | బుధమనోహరి | -- | -- | -- |
| 14. | కేదారగౌళ | స రి మ ప ని స - స ని ధ ప మ గ రి స | 28 | | -- | -- | ఆరభి | ఆభేరి | -- | -- |
| 15. | నాగస్వరావళి | స గ మ ప ధ స - స ధ ప మ గ స | 28 | | -- | -- | హంసధ్వని | -- | -- | -- |
| 16. | మోహన | స రి గ ప ధ స - స ధ ప గ రి స | 28 | | మధ్యమావతి | మాల్కౌస్ | -- | శుద్ధసావేరి | ఉ.ర.చంద్రిక | -- |
| 17. | యదుకుల కాం | స రి మ ప ధ స - స ని ధ ప మ గ రి స | 28 | | -- | -- | బిలహరి | -- | -- | -- |
| 18. | వలజి (భోజి) | స గ ప ధ ని స - స ని ధ ప గ స | 28 | | -- | -- | -- | ఆభోగి | -- | -- |
| 19. | ఆరభి | స రి మ ప ధ స - స ని ధ ప మ గ రి స | 29 | | ఆభేరి | -- | మో.కళ్యాణి | కేదారగౌళ | -- | -- |
| 20. | బుధమనోహరి | స రి గ మ గ ప స - స ప మ గ రి స | 29 | | -- | -- | -- | కుంతలవరాళి | -- | -- |
| 21. | శుద్ధసావేరి | స రి మ ప ధ స - స ధ ప మ రి స | 29 | | ఉ.ర.చంద్రిక | -- | మోహన | మధ్యమావతి | -- | -- |
| 22. | హంసధ్వని | స రి గ ప ని స - స ని ప గ రి స | 29 | | -- | -- | -- | నాగస్వరావళి | -- | -- |
| 23. | రమణి | స గ మ ప ని స - స ని ధ ప మ గ స | 63 | | -- | -- | -- | వసంత | -- | -- |
| 24 | మోహనకల్యాణి | స రి గ ప ధ స - స ని ధ ప మ గ రి స | 65 | | -- | -- | -- | ఆరభి | -- | -- |

# 90. మూర్ఛనాకారక మేళపధకము

| నం. | శుద్ధమధ్యమ మేళకర్తలు | స | రి | గ | మ | ప | ధ | ని |
|---|---|---|---|---|---|---|---|---|
| 1. | కనకాంగి | | 51 | .... | .... | .... | .... | .... |
| 2. | రత్నాంగి | | 53 | .... | 19 | .... | .... | .... |
| 3. | గానమూర్తి | | 54 | .... | 55 | .... | .... | .... |
| 4. | వనస్పతి | | .... | .... | 25 | .... | .... | .... |
| 5. | మానవతి | | .... | .... | 61 | .... | .... | .... |
| 6. | తానరూపి | | ---- | ---- | ---- | ---- | ---- | ---- |
| 7. | సేనావతి | | 63 | .... | .... | .... | 17 | .... |
| 8. | హనుమతోడి | | 65 | 28 | 20 | .... | 29 | 22 |
| 9. | ధేనుక | | 66 | .... | 56 | .... | 35 | .... |
| 10. | నాటకప్రియ | | .... | 64 | 26 | .... | .... | .... |
| 11. | కోకిలప్రియ | | .... | .... | 62 | .... | .... | .... |
| 12. | రూపవతి | | ---- | ---- | ---- | ---- | ---- | ---- |
| 13. | గాయకప్రియ | | 69 | .... | .... | .... | .... | .... |
| 14. | వకుళాభరణము | | 71 | .... | 21 | .... | .... | 58 |
| 15. | మాయామాళవగౌళ | | 72 | .... | 57 | .... | .... | .... |
| 16. | చక్రవాకము | | .... | .... | 27 | .... | .... | 59 |
| 17. | సూర్యకాంతము | | .... | 7 | 63 | .... | .... | .... |
| 18. | హాటకాంబరి | | .... | 48 | .... | .... | .... | .... |
| 19. | ఝుంకారధ్వని | | .... | .... | .... | 2 | 53 | .... |
| 20. | నఠభైరవి | | .... | 29 | 22 | 8 | 65 | 28 |
| 21. | కీరవాణి | | .... | .... | 58 | 14 | 71 | .... |
| 22. | ఖరహరప్రియ | | 8 | 65 | 28 | 20 | .... | 29 |
| 23. | గౌరీమనోహరి | | 10 | .... | 64 | 26 | .... | .... |
| 24. | వరుణప్రియ | | .... | .... | .... | 92 | .... | .... |

మూర్ఛనాకారక మేళపధకము ఆయా గ్రహస్వరములం దేర్పడు మేళముల సంఖ్యలు

| నం. | శుద్ధమధ్యమ మేళకర్తలు | స | రి | గ | మ | ప | ధ | ని |
|---|---|---|---|---|---|---|---|---|
| 25. | మారరంజని | | .... | .... | .... | 4 | .... | .... |
| 26. | చారుకేశి | | .... | .... | 23 | 10 | .... | 64 |
| 27. | సరసాంగి | | .... | .... | 59 | 16 | .... | .... |
| 28. | హరికాంభోజి | | 20 | .... | 29 | 22 | 8 | 65 |
| 29. | ధీరశంకరాభరణము | | 22 | 8 | 65 | 28 | 20 | .... |
| 30. | నాగనందిని | | .... | 44 | .... | 34 | .... | .... |
| 31. | యాగప్రియ | | ---- | ---- | ---- | ---- | ---- | ---- |
| 32. | రాగవర్ధని | | .... | .... | 24 | .... | .... | .... |
| 33. | గాంగేయభూషణి | | .... | .... | 60 | .... | .... | .... |
| 34. | వాగధీశ్వరి | | .... | .... | 30 | .... | 44 | .... |
| 35. | శూలిని | | .... | 9 | 66 | .... | 56 | .... |
| 36. | చలనాట | | .... | 45 | .... | .... | .... | .... |
| 37. | సాలగము | | ---- | ---- | ---- | ---- | ---- | ---- |
| 38. | జలార్ణవము | | ---- | ---- | ---- | ---- | ---- | ---- |
| 39. | ఝాలవరాళి | | ---- | ---- | ---- | ---- | ---- | ---- |
| 40. | నవనీతము | | ---- | ---- | ---- | ---- | ---- | ---- |
| 41. | పావని | | ---- | ---- | ---- | ---- | ---- | ---- |
| 42. | రఘుప్రియ | | ---- | ---- | ---- | ---- | ---- | ---- |
| 43. | గవాంబోధి | | .... | .... | .... | .... | 18 | .... |
| 44. | భవప్రియ | | .... | 34 | .... | .... | 30 | .... |
| 45. | శుభపంతువరాళి | | .... | .... | .... | .... | 36 | .... |
| 46. | షడ్విధమార్గిణి | | .... | 70 | .... | .... | .... | .... |
| 47. | సువర్ణాంగి | | ---- | ---- | ---- | ---- | ---- | ---- |
| 48. | దివ్యమణి | | ---- | ---- | ---- | ---- | ---- | ---- |

మూర్ఛనాకారక మేళపధకము ఆయా గ్రహస్వరములం దేర్పడు మేళముల సంఖ్యలు

| నం. | శుద్ధమధ్యమ మేళకర్తలు | స | రి | గ | మ | ప | ధ | ని |
|---|---|---|---|---|---|---|---|---|
| 49. | ధవళాంబరి | | ---- | ---- | ---- | ---- | ---- | ---- |
| 50. | నామనారాయణి | | ---- | ---- | ---- | ---- | ---- | ---- |
| 51. | క్షామవర్ధిణి | | .... | .... | .... | .... | .... | 1 |
| 52. | రామప్రియ | | ---- | ---- | ---- | ---- | ---- | ---- |
| 53. | గమనశ్రమ | | .... | 19 | .... | .... | .... | 2 |
| 54. | విశ్వంబరి | | .... | 55 | .... | .... | .... | 3 |
| 55. | శ్యామలాంగి | | .... | .... | .... | 3 | 54 | .... |
| 56. | షణ్ముఖప్రియ | | .... | 35 | .... | 9 | 66 | .... |
| 57. | సిమ్హేంద్ర మధ్యమము | | .... | .... | .... | 15 | 72 | .... |
| 58. | హేమవతి | | 14 | 71 | .... | 21 | .... | .... |
| 59. | ధర్మవతి | | 16 | .... | .... | 27 | .... | .... |
| 60. | నీతిమతి | | .... | .... | .... | 33 | .... | .... |
| 61. | కాంతామణి | | .... | .... | .... | 5 | .... | .... |
| 62. | రిషభప్రియ | | .... | .... | .... | 11 | .... | .... |
| 63. | లతాంగి | | .... | .... | .... | 17 | .... | 7 |
| 64. | వాచస్పతి | | 26 | .... | .... | 23 | 10 | .... |
| 65. | మేచకల్యాణి | | 28 | 20 | .... | 29 | 22 | 8 |
| 66. | చిత్రాంబరి | | .... | 56 | .... | 35 | .... | 9 |
| 67. | సుచరిత్ర | | ---- | ---- | ---- | ---- | ---- | ---- |
| 68. | జ్యోతిస్వరూపిణి | | ---- | ---- | ---- | ---- | ---- | ---- |
| 69. | ధాతువర్ధని | | .... | .... | .... | .... | .... | 13 |
| 70. | నాసికాభూషిణి | | .... | .... | .... | .... | 46 | .... |
| 71. | కోసలము | | .... | 21 | .... | .... | 58 | 14 |
| 72. | రసికప్రియ | | .... | 57 | .... | .... | .... | 15 |

## 91. 72 మేళకర్తల పథకం : విశ్లేషణ

ప్రపంచ సంగీత రీతులు, 12 స్వరస్థానాలను ప్రస్థరించగా వచ్చిన 32 రాగాలతో తృప్తిపడుతోండగా, అస్వభావికమైన ఈ 72 మేళకర్తల పథకం కర్ణాటక సంగీతంలో వచ్చి నిలబడిపోవడం గొప్పగా భావించాలా లేక మన పూర్వపు సంగీత గ్రంధకర్తలు, పండితులైన కొంతమంది, అనవసరమైన, ఆలోచనా విధానాన్ని ప్రకాశింప చేస్తుందా?!

72 మేళకర్తల పద్ధతిని మొట్టమొదటి సారిగా అంకురార్పణ చేసిన వేద పురుషుడు విద్యారణ్యుడు (1320-1380).

ఆ తరువాత వేంకటమఖి తండ్రి మహా పండితుడు, విద్వాంసుడు అయిన గోవింద దీక్షితులు (1577-1614) ఈ 72 మేళకర్తల పద్ధతిని కొంత ఆలోచించి కొద్దిగా రూపాన్ని ఇచ్చాడు. ఈయన కుమారుడు వేంకటమఖి "చతుర్దండి ప్రకాశిక" గ్రంధకర్త కర్ణాటక సంగీత చరిత్రలో ముఖ్యుడు, ఈ 72 మేళకర్తల పద్ధతికి గణిత దృష్ట్యా ప్రస్తరించి, 12 చక్రాలను, ప్రతి చక్రంలోగల 6 మేళాలకు 6 ప్రస్థారాలు అని పేర్లు పెట్టి మేళకర్తల పేర్లలో మొదటి రెండు అక్షరాలకు క, ట, ప, య, సూత్రానికి సరిపోయేటట్లు నామకరణం చేశాడు. అయితే వెంకటమఖి గుణించిన ఈ 72 మేళకర్తలు సంపూర్ణ సంపూర్ణాలు కావు. ఇవి అసంపూర్ణ మేళకర్తలు.

అసంపూర్ణ రాగాలు మేళ కర్తలుగా ఆ కాలంలో అంగీకరించారు. ఈనాడు జనకరాగం, మేళకర్త, రాగాంగ రాగాలు సంపూర్ణ-సంపూర్ణాలుగానే అవగాహన అందరిలోనూ ఉంది. సంపూర్ణాలుగా గాక వక్ర, వర్జ్యరాగాలుగా ఉంటేనే వీటి యందు గల 40 వివాది (రాగాలు) మేళకర్తలు కొంతలో కొంత బాగుండేది.

ఈ 72 అసంపూర్ణ మేళకర్తలకు వేంకటమఖి ఇచ్చిన కనకాంబరి, ఫేనద్యుతి మొదలైన పేర్లకు బదులు, కనకాంగి,రత్నాంగి అనే పేర్ల ప్రాచుర్యం వచ్చి, వేంకటమఖి పేర్లు గ్రంధాలకు మాత్రం పరిమితం అయ్యాయి.

ఈ 72 మేళకర్తలను సంపూర్ణాలుగా రూపొందించి వాటికి కనకాంగి, రత్నాంగి, అనే పేర్లు పెట్టినది గోవిందాచార్యుడు లేక గోవిందామాత్యుడు. "సంగీత శాస్త్ర సంక్షేపము" అనే గ్రంధాన్ని వ్రాశాడు.

గోవింద దీక్షితులు, వేంకటమకి, గోవిందాచార్యులు (గోవిందామాత్యుడు) ఇంచుమించు సమకాలికులు. వేంకటమఖి 72 మేళకర్తల పద్ధతిని మార్పుచేసి అసంపూర్ణ మేళాలను

సంపూర్ణాలుగా చేసి కనకాంబరి, ఫేనద్యుతి మేళపేర్లను, కనకాంగి, రత్నాంగి, పేరులుగా మార్చాడు గోవిందామాత్యుడు.

ఈ 72 మేళకర్తలకు కారకులు నలుగురు. మొదట విద్యారణ్యుడు. రెండవ వాడు గోవింద దీక్షతులు. 3, 4వ వారు వేంకటమఖి గోవిందాచార్యులు.

ఏది ఎలాగున్నా, ఈ పద్ధతి సరికాదేమో అనే అభిప్రాయాన్ని ఈనాడు కర్ణాటక సంగీత భీష్ముడు శ్రీ శెమ్మంగుడి శ్రీనివాస అయ్యర్, ఇంతకముందు 'కృతిమణి మాలై' అనే పేరులో లక్ష్య గ్రంధాలను నాల్గింటిని, కర్ణాటక సంగీత చరిత్రను, (ఆంగ్లమున) వ్రాసిన వాడు రంగరామానుజ అయ్యంగార్ మొదలైన వారు నిర్ద్వందంగా వక్కాణించారు.

## 92. 72 మేళకర్తల పద్ధతి యందు లోపాలు:

1. ప్రకృతి సిద్ధంగా, ప్రకృతి నుండి ఉదయించిన సప్తస్వరాల విభాగాలు 12 అనగా స్వరస్థానాలను అసహజంగా కదిపి వాటికి విరుద్ధమైన పేర్లు పెట్టడం :

చతుశృతి (ప్రకృతి) రిషభాన్ని = శుద్ధంగాంధారం అనడం వికృతి
సాధారణ గాంధారాన్ని = షట్శృతి రిషభం అనడం వికృతి
అలాగే ఉత్తరాంగంలో
చతుశృతి ధైవతాన్ని : శుద్ధ నిషాదం అనడం వికృతి
కైశిక నిషాధాన్ని : షట్శృతి ధైవతం అనడం వికృతి

ఈ ఏర్పాటు సంగీతానికి, శ్రావ్యతకి, సంగీతం యొక్క మాధుర్యానికి సహజత్వానికి గట్టి దెబ్బ. ఈ ఏర్పాటు వలన సాధించిన ప్రయోజనం. 40 వికృతి మేళాలను (వివాది మేళాలను, అనవసర మేళకర్తలను) తయారు చేయడమే.

ప్రపంచ దేశాలందరికి, భౌతిక శాస్త్రంలోనూ, ప్రకృతి సిద్ధంగానూ 12 స్వరస్థానములైతే 16 (ప్రకృతి వికృతి స్వరములు అనే పేర్లతో) స్వరాలు ఒక స్థాయిలో ఎక్కడున్నాయి? లేవుగదా!

శుద్ధరిషభం, చతుశృతి రిషభం కలిపి రిషభం అవుతుంది. సాధారణ గాంధారం, అంతర గాంధారం కలిపి గాంధారం అవుతుంది. అలాగే శుద్ధ ధైవతం, చతుశృతి ధైవతం కలిసి ధైవతం అవుతుంది. కైశిక నిషాధం కాకలి నిషాధం కలిపి నిషాధం అవుతుంది. స్వరములు మొత్తం ఏడు మాత్రమే. 8వ స్వరం సృష్టించడానికి వీలులేదు. పంచ భూతములులాగ, సూర్యచంద్రులు లాగ, 7 స్వరములను ఎవరూ సృష్టించలేదు వాటిని కనుగొన్నారు. అంతే

రిషభం అనే మూర్తిని విడదీసి రెండవ భాగానికి శుద్ధ గాంధారం అని పేరు పెట్టినంత మాత్రాన అది గాంధారం అవుతుందా? అలాగే సాధారణ గాంధారాన్ని షట్స్రుతి రిషభం అనడం కూడా అసమంజసమే. దాని వలన ఏమయింది?!

(శుద్ధ) గాంధారం మీద (షట్స్రుతి) రిషభం,

(శుద్ధ నిషాధంపైని (షట్స్రుతి) ధైవతం వచ్చింది. క్రమం, భంగం అయింది.

భాషాంగరాగాల్లో రెండు రిషభాలు, రెండు గాంధారాలు, రెండు మధ్యమాలు, రెండు ధైవతాలు, రెండు నిషాధాలు, ఆయా స్వరాలపేర్లు మార్చకుండానే స్వయంగానే అన్యస్వరాలుగా రావడంలేదా? రసాన్ని, భావాన్ని, మాధుర్యాన్ని పెంపొందించడం లేదా?

సింధుభైరవిలో రెండు మధ్యమాలు, రెండు రిషభాలు రెండు ధైవతాలు కొన్ని సందర్భాలలో ఎంతో అందంగా ఉండడం లేదా

విద్యారణ్యుడు ఈ పద్ధతిని కనిపెట్టి, పునరాలోచనలో సమంజసం కాదని వదిలేసి ఉంటాడు. వెంకటమఖి ఆలోచన చేసినది. 72 అసంపూర్ణమేళాలు కొంత సమంజసం ఏమో కాని గోవిందాచార్యులు వరస స్వరస్థానాలును గుచ్చెత్తి సంపూర్ణాలుగా చేయడం, భారతీయ సంగీత పద్ధతికి ఒక లోటు ఏమో. పాశ్చాత్య సంగీత పద్ధతిలో ముఖ్యంగా "ఆపేరా" సంగీతంలో వరస స్వరస్థానాలు పాడటం బహుళంగా ఉంది. (వికృతి నామములు అక్కర లేకుండానే.)

ఈ వివాదిరాగాలు అద్భుత రసాన్ని శ్రోతల మనస్సులలో కలుగ చేస్తాయేమోకాని సంగీత మాధుర్యాన్ని, శ్రావ్యతను కలుగ చేయలేవు.

కనకాంగి, రసికప్రియ, రాగ మూర్ఛనలు క్రింది విధంగా గానం చేస్తే బహుశః వివాదత్వం తగ్గవచ్చు.

స రీ సా గా మా పా దా పా నీ సా
సా 'ని సా' ప దా ప మా గ మా రీ సా

---

# 93. కల్పిత సంగీతము - సంగీత రచనలు

సంగీత రచన అనగా "పాట" అని అర్థం. ఈ పాట అనాదిగా అనేక రూపాలుగా, అన్ని దేశాలలోనూ, అందరి హృదయాలలోనూ, అందరి నోళ్లలోనూ ప్రకాశిస్తూనే ఉంది.

ఆది మానవుడు తన సహచరులతో కలసి ఒకే స్థాయిలో ఒకే లయలో ఎలుగెత్తి అరిస్తే అది పాటకి ప్రాతిపదిక అయింది.

వేదం చదవడం కాదు పాడటమే. వేదానికి లయ, స్వరాలు ఉన్నాయి.

సామవేదంనుండే సంగీతం ఉద్భవించింది. భాషా సాహిత్యంలో కూడా, వచనం, గద్యం, అయింది. గద్యం పద్యం అయింది. పద్యం పాట అయింది. వచనానికి లయ లేదు. గద్యానికి లయ ఉంది. పద్యానికి లయ, తాళం కూడా ఉంది. పద్యానికి గణనియమాలు. గణనియమాలను బట్టి తాళం ఉంది.

గేయం అనగా పాట. పాటకి, రాగం, తాళం, ఛందస్సు, గణాలు, మాత్రలు, ఆవర్త సంఖ్యా నియమాలు, యతిప్రాసలు ఉన్నాయి. సంస్కృత శ్లోకాలు గాని తెలుగు పద్యాలు కాని పాటలుగా చేసి, తాళ బద్ధంగా పాడవచ్చు. అనుష్టుప్ శ్లోకం, ఆది తాళానికి సరిపోతుంది. 16 మాత్రాలు ఉంటాయి. వాల్మీకి రామయణ శ్లోకాలను, లవకుశులు, శ్రీరాముని దర్బారులో పాడేరని వింటూన్నాం.

జానపదులు పాడుకునే పాటలు అన్ని దేశాలలోనూ అతి తక్కువ సంగీతంతో లయబద్ధంగా ఉంటాయి.

ఒక పాటను, ముందుగా ఒక లయకు కూర్చుకొని, తరువాత దానికి సంగీతాన్ని కూర్చి పాడుకోవటం సర్వ సాధారణంగా జరిగే ప్రక్రియ.

అట్లాంటి పాటలలో, అర్థం, భావం, కథా కథనం, వర్ణనం, నీతి బోధ, చరిత్ర, వీరకథలు, ప్రేమ కథలు, భక్తి మొదలైనవి ఉండి, జానపదుల జీవితాలలో ముడిపడి, వారి సంస్కృతులకు ప్రతిబింబాలుగా ఉంటాయి.

బాలనాగమ్మ కథ, బొబ్బిలికథ, రామాయణ, భారతకథలు, పలనాటి వీర చరిత్ర, మొదలైనవి ఈ కోవలోనివే.

ద్విపద కావ్యాలు ఒక మెట్టు ఎక్కువగా ఉన్న సాహిత్య సంగీత కావ్యాలే.

వీటిని జానపద కథా పాటలు అనవచ్చు. ఇవి పాటకపుజనకథలు.

ఈ జానపద పాటలను వ్రాయటానికి గాని, వ్రాసి పాడటానికి గాని, ఒక విధమైన సహజ చాతుర్యం, కల్పన, సహజ సంగీత సాహిత్య కవిత్వ పాటవం, కావాలి. ఇట్టి ధోరణి కలవారు వాగ్గేయ కారులే. తత్వాలు, జానపద సాహిత్యం రచించిన వారు అజ్ఞాత కవిగాయకులే. వారి పేర్లను వారి కృతులలో (ముద్రగా) చొప్పించాలని తెలియని వేదాంతులు.

ఇట్టి జానపద సంగీత రచనలలో సంగీతం సులభంగా 4,5, స్వరాలకు పరిమితమై, సులభమైన లయలలో ఉంటుంది. గమకాలు ఉండవు. పెద్ద నిడివి ఉండదు. ఒక్క స్థాయిలోపలనే ఉంటాయి.

ఈ జానపద సంగీత రచనలు కాలక్రమేణా ఎదుగుతో, సౌందర్యాలను పెంచుకుంటూ అను నిత్యమూ సంస్కరింపబడుతూ చరిత్రకు అందని కాలం నుంచి ఇప్పటి వరకూ మార్పులు, చేర్పులూ చేసుకుంటూ క్రొత్త తనాన్ని సంతరించుకుంటూనే ఉంది.

సుమారు 2500 సంవత్సరాల క్రిందట భరతుని నాట్యశాస్త్రంలో, 32వ అధ్యాయంలో "ధృవము" అనే రచనను గూర్చి వివరింపబడింది.

వీధి భాగవతములు, యక్షగానములు, నాటకములు, దృశ్య శ్రావ్య ప్రదర్శనా కళలు. ఆ ప్రదర్శనలలో 'ధృవము' అను గీతము గానము చేయబడెడిది. ఈ ప్రదర్శనలలో సంగీతము ఒక ఉపాంగముగా ఉండెడిది.

'ధృవము' అను సంగీత రచన గూర్చి నాట్య శాస్త్రమున 525 శ్లోకములలో వివరింపబడినది. ధృవము, దాని లక్షణము. వైవిధ్యము, విభజన, మొదలైన వివరములు ఇందు కలవు. ఈ వివరణకు సరియైన ఉదాహరణలు లేకపోవుట వలన, తరువాత తరముల వారికి వాటి స్వరూప, స్వభావముల అవగాహనకు వీలు కలుగలేదు.

'ఇల్లింగో' అను తమిళ మహారాజు, మహానుభావుడు, రచించిన 'శిలప్పాదికారము' అను తమిళ గ్రంధముననూ 'సంగం' అను తమిళ కావ్య సంపుటి యందును, ద్రవిడ సంస్కృతి, లలిత కళా చైతన్యం, వారి జీవన విధానము నాగరికత మొదలైన విషయములు ద్యోతములగుచున్నవి. అప్పటి ద్రవిడ దేశమునందు సంగీతము స్వతంత్రముగా అభివృద్ధి చెంది, అప్పటి తక్కిన దేశముల కంటే ఎంతో ఉన్నతని సాధించినది.

మాణిక వాచకర్, తిరుజ్ఞాన సంబంధర్ తిరునవు నక్కర్‌సర్, సుందరమూర్తి మొదలైన మహానుభావులు, వాగ్గేయకారులు, ఆధ్యాత్మిక, భక్తి తత్పరులు, శైవ సిద్ధాంతములను వారి 'తేవారములు' అను రచనల ద్వారా ప్రజలలో ప్రభోదించిరి.

ఈ తేవారములను మోహన రాగములో పాడెడివారు.

ఈ తేవారము ఈనాడు కూడా శైవవేదముగా పరిగణింపబడుచున్నది.

అటులనే వైష్ణవ సిద్ధాంతములను ప్రభోధించుచు ఆళ్వారులు దివ్య ప్రబంధములను రచించి పాడిరి. వీటిని వైష్ణవ వేదములుగా పరిగణించుచున్నారు.

తేవారములు 21 రాగములలో పాడెడివారు. రాగములకు 'పణ్'లు అని పిలిచెడివారు.

| పణ్ | రాగము |
|---|---|
| గాంధారం | గాయకప్రియ |
| పంచమం | ఆహిరి |
| కౌసికం | భైరవి |
| నట్టప్పలై | నాటకురంజి |

తేవారములను పాడెడి వారిని 'ఓదువారు' "ఓదువ మూర్తులు" అని పిలిచెదువారు. వైష్ణవ దివ్య ప్రబంధములు 4000 కలవు.

## 94. ప్రబంధము

మతంగుని 'బృహద్దేశి' గ్రంధమునందు "నిబద్ధ ప్రబంధము" 'అనిబద్ధ ప్రబంధము' అను రెండు విధములగు ప్రబంధములు వివరింపబడినవి. ప్రబంధము అనగా స్థూలముగా సంగీత రచన అని అర్ధము. నిబద్ధ ప్రబంధమునకు, ధాతు (స్వరము) మాతు (సాహిత్యము) తాళము ఛందస్సు అను అంగములు ఉండును. అని బద్ధ ప్రబంధము పై లక్షణములు ఏవియును కలిగి యుండదు అని వివరింపబడెను. దీనిని బట్టి నిబద్ధ ప్రబంధము అనగా గేయము, గీతము, పాట, సంగీత రచన అనియును, అని బద్ధ ప్రబంధమనగా 'రాగము' మొదలైన మనోధర్మ సంగీత శాఖలు అనియును అన్వయించుకొనవలెను. (రాగము, స్వరకల్పన, తానము, నెరవు పల్లవి)

భరతుని "ధృవము", మతంగుని "ప్రబంధము", సంగీత రత్నాకరము నందు నిర్వచింపబడిన వేదపరమైన "గీతిక", ప్రాచీన సంగీత రచనలుగ పరిగణింపవలెను.

ప్రబంధము పూర్వము ఒకప్పుడు వాడుకలోఉండిన సంగీత రచన. సంగీత రచనలన్నియును ప్రబంధములే. గీతము దగ్గర నుండి కృతిపరకును ప్రబంధములే యన వచ్చును. ప్రబంధము, స్వరము, సాహిత్యము, ఛందస్సు, తాళము, మొదలైన లక్షణములు

కలిగి వాగ్గేయకారుడు రచించిన, కల్పించిన ఒక కల్పిత సంగీత రచన. (Pre-set-piece of Music) ఒక నిబద్ధ సంగీత రచన. ప్రబంధములు వాడుకలో లేకపోయినప్పటికి ఆ లక్షణములు అన్నియునుగాని, కొన్ని గాని కలిగిన అన్ని సంగీత రచనలు ప్రబంధము యొక్క రూపాంతరములే.

ప్రబంధమునకు ఆరు అంగములు, నాల్గు ధాతువులు ఉండెడివి. అంగములు:-

1. స్వరము ; 2. బిరుదము; 3. పదము ; 4. తెన్నకము ;
5. పాటము ; 6. తాళము.

ఈనాడు, ఏనాడూ ప్రతి సంగీత రచనకు 1. స్వరము 2. పదము (సాహిత్యము) 3. తాళము. 4. సాహిత్యము నందు గల కథా భాగము అనగా భగవంతుని కీర్తించుట లేక విషయము, వర్ణన మొదలైనవి ఉండును. మిగిలిన రెండు అంగములలో ఒకటి పూర్వము సంగీతజ్ఞులకు, వాగ్గేయకారులకు ప్రోత్సాహము నిచ్చి పోషించు రాజుల పొగడ్తలు సాహిత్యమునందు చోటు చేసుకొనినవి ఇది ఆరవ అంగము.

ఇక ప్రబంధ ధాతువుల విషయమున ధాతువులనగా భాగములు. అవయవములు. ఇవి నాలుగు

1. ఉద్గ్రాహము = పల్లవి ;
2. మేళాపకము = అనుపల్లవి ;
3. ధృవము = చరణము ;
4. అభోగము = చరణాను బంధముగా అన్వయించుకొనవచ్చును.

ఈ చతుర్ధాతు ప్రబంధములు సంపూర్ణమైన సంగీతరచనలు.

ఈ ప్రబంధము ధాతు సంఖ్యను బట్టి మరల విభజన కలదు.

1. చతుర్ధాతు ప్రబంధము అన్ని ధాతువులతో ఉండునది. కృతికి సామ్యమైనది.

2. త్రిధాతు ప్రబంధము మేళాపకము లేని ప్రబంధము అనుపల్లవి లేని కీర్తనకు సరిసమానమైనది.

3. ద్విధాతు ప్రబంధము : ఉద్గ్రాహము, ధృవము మాత్రమే కలిగినది. పల్లవి చరణము మాత్రమే కలిగిన త్యాగరాజుని దివ్యనామ సంకీర్తన. ఉత్సవ సంప్రదాయ కీర్తనకు సరిపోవునది.

ఈ ప్రబంధము మరల అంగముల సంఖ్యను బట్టి 5 విధములైన జాతులుగ విభజింప బడినది.

1. మేదినీ ; 2. ఆనందినీ ; 3. దీపినీ 4. భావినీ ; 5. తారావళీ జాతులు

1. మేదినీ జాతికి స్వరము మొదలైన = 6 అంగములు కలవు.
2. ఆనందిని జాతికి = 5 అంగములే కలవు.
3. దీపిని జాతికి = 4 అంగములే కలవు.
4. భావిని జాతికి = 3 అంగములే కలవు.
5. తారావళి జాతికి = 2 అంగములే కలవు.

మరల

1. మేదినీ జాతి ప్రబంధము 'శ్రీరంగము' మొదలైన ఏడు భేదంబులుగ నుండెను.
2. ఆనందినీ జాతి ప్రబంధము 'పంచతాళేశ్వరము' మొదలైన పది భేదంబులుగ నుండెను.
3. దీపినీ జాతి ప్రబంధము "సుదర్శనము" మొదలైన 5 భేదంబులుగ నుండెను.
4. భావినీ జాతి ప్రబంధము 'వర్ణము' మొదలైన 17 భేదంబులుగ నుండెను.
5. తారావళీ జాతి ప్రబంధము "ఏల" మొదలైన 22 భేదములుగ నుండెను.

నిబద్ధ ప్రబంధమే నిర్యుక్త ప్రబంధము అని కూడా పిలువబడెది. సంగీత రచనలన్నియును ఈ తరగతికి చెందినవి.

అనిబద్ధ ప్రబంధము, అనిర్యుక్త ప్రబంధము, ఆశువుగా సద్యః కల్పనా గానమునకు చెందిన రాగాలాపన, స్వరకల్పన, తానము, నెరవు, పల్లవి అను మనోధర్మ సంగీత శాఖలకు చెందినవి.

ప్రబంధములలో ఏకజాతి, ద్విజాతి ప్రబంధములు మరల ఆరువిధములుగా నున్నవి.

అవి 1. హయలీల ; 2. గజలీల ; 3. ద్విపది ; 4. ద్వితకము ; 5. వృత్తము; 6. ఘటరామ అనునవి.

భరతుడు తన నాట్య శాస్త్రములో నాట్యము నందు ఉపయోగింపబడు అనేక రచలను పేర్కొని తన కాలమునం ధ్రువలు, గీతికలు అను రెండు రచనలు ముఖ్యముగా వాడుకలో నున్నట్లు తెలెపెను. మాగధి; అర్ధమాగధి; సంభావిత; పృథుల అను పేర్లతో 4 విధములగు 'గీతి' లను గూర్చి వివరించెను. మతంగుడు తన బృహద్దేశి యందు 49 దేవీ ప్రబంధములను, శార్గజదేవుడు తన సంగీత రత్నాకరమున 75 ప్రబంధములను గూర్చి పేర్కొనెను.

శార్గజదేవుడు ప్రబంధములను మరియొక పద్ధతిలో 3 విధములుగ విభజించెను. అవి 1. సూడ ; 2. అవిక్రమ ; 3. విప్రకీర్ణ ప్రబంధములు. సూడ ప్రబంధములతో మరల శుద్ధ సూడ; సాలగ సూడ అని రెండు విధములు. శార్గజదేవుడు. ఇవిగాక ఆక్షిప్తికములు, కపాలములు, కంబళముల వంటి రచనలను పేర్కొనెను. ఇవిగాక 108 తాళముల పేర్లు కలిగిన ప్రబంధములు ఉండెడివి. ఉదాహరణకు: చచ్చరీ; హంసలీల; తురగలీల: గజలీల మొదలైనవి.

శ్రీ గోపాల నాయకుడు గ్రహస్వర ప్రబంధము, తాళార్ణవ ప్రబంధము, రాగ కదంబక ప్రబంధము అను 3 విధములైన ప్రబంధములను రచించెను.

భూలోకమల్లుడు చాలా ప్రబంధములను రచించినట్లు తెలియుచున్నది.

ప్రబంధములలో ఈ క్రింది తెలిపిన అనేక విధములైన ప్రబంధములు ప్రాచీన కాలమున వాడుకలో నున్నవి.

1. వర్ణ ప్రబంధము : తాళ, వర్ణముల యందు రచింపబడిన ప్రత్యేక ప్రబంధము

2. పంచతాళేశ్వరము : ఈ ప్రబంధము 5 మార్గ తాళ మాలికలో రచింపబడిన ప్రబంధము.

3. శ్రీవిలాసము : 5 రాగములలో, 5 తాళములలో రచింపబడిన రాగతాళ మాలికా ప్రబంధము.

4. శ్రీరంగ ప్రబంధము : 4 రాగ, 4 తాళమాలికలో రచింపబడిన ప్రబంధము

5. ఉమాతిలక ప్రబంధము : 3, రాగ, 3 తాళ మాలికా ప్రబంధము

6. పంచ భంగి, పంచానన : ఇది 2 , రాగ : తాళ మాలికా ప్రబంధము

| | | |
|---|---|---|
| శరభలీల | : | 8. రాగ, 8 తాళ మాలికావ్య బంధము |
| రాగ కదంబము | : | రాగమాలికా ప్రబంధము, ఆధునిక రాగమాలిక |
| తాళార్ణవము | : | తాళమాలిక |
| స్వరార్థ | : | స్వరాక్షర సంగీత రచన. ఇది మరల 1. శుద్ధ 2. మిశ్రమ అని రెండు విధములు. |

## కైవార ప్రబంధము :

ఇది ధాతు మాతులలో అనగా స్వరసాహిత్యములతో ఉండును. ఇందు 4 ఖండములు. అనగా భాగములు ఉండును. పాటన ; జావడ ; ఆలాప ; ముద్రా ఖండములు. ఇందలి మొదటి రెండు ఖండములలో సాహిత్యమునకు బదులు "జతులు" ఉండును. తరువాత రెండు ఖండముల యందు సాహిత్యము స్తోత్ర పూర్వకముగ నుండును. సాహిత్యము వివిధ భాషలకు చెందినది అయి ఉండును. వీటిని మణి ప్రవాళ ప్రబంధము లనియును, "విచిత్ర ప్రబంధము"లను అనెడివారు.

## కఫాయి ప్రబంధము :

గీతమును పోలిన రచన. ధాతు, మాతు, జతులతో నుండును

## ఠాయము :

గీతము వలెనుండి స్వరములకు సాహిత్యమునకు బదులు జతులుగా నుండి వీణ మీటు పద్ధతులను తెలుపునది. పురందరదాసు, వెంకటమఖి ఈ ఠాయములను రచించిరి. వెంకటమఖి రచించిన చతుర్దండి ప్రకాశిక అనగా గీతము, ఆలాపన; ఠాయ. ప్రబందములతో కూడు కొనినది, అని అర్ధము.

"తానీ కరణము" అను రచన కూడా ఇట్టి విధమైన గీతమును పోలిన రచనయే. ఈ ప్రబంధ అధ్యాయమున పేర్కొనిన రచనలన్నియును కనుమరుగైనను అవియే రూపాంతరములు చెంది, ఆధునిక సంగీత రచనలుగా ప్రకాశించుచున్నవి, అనుట యదార్థము.

# 95. సంప్రదాయ సంగీత రచనలు

1. గీతము : లక్ష్య గీతములు, లక్షణ గీతములు
2. సూళాది 3. చిట్టతానము 4. ఠాయము
5. స్వరపల్లవి, జతిస్వరము 6. స్వరజతి
7. తానవర్ణము 8. పదవర్ణము (చౌకవర్ణము)
9. కీర్తన ; 10. కృతి ; 11. పదము ; 12. జావళి ;
13. తిల్లాన ; 14. దరువు ; 15. రాగమాలిక ;
16. శబ్దము ; 17. అలరిప్పు ; 18. విరూపణము ;
19. సంచారి ; 20. అష్టపది ; 21. తరంగము ;
22. అధ్యాత్మ రామాయణ కీర్తన ; 23. సంకీర్తన ;
24. తేవారము ; 25. తిరుప్పుగళ్ ; 26. తిరువరుత్పా ;
27. తిరువాచకము ; 28. పురందర దేవర నామములు ;
29. చిట్టతానములు ;

ఈ దిగువ వీటి లక్షణములు క్రమముగా వివరింపబడినది.

# 96. అభ్యాసగాన రచనలు

**గీతము :** అభ్యాస గానమునక చెందిన సులభమైన, సంగీతరచన, సరళీ, జంట, అలంకారములు తరువాత సంగీత విద్యార్థులు నేర్చుకొనే సంగీత రచన. పల్లవి, అనుపల్లవి, చరణం అనే విభాగాలు గీతమునకు ఉండవు. రాగము నిరాడంబరముగా గీతమునందు వ్యక్తమగును. ఈ గీతము నందు సంగీతము లయ ఒకే వేగముతో నడచును. ఇందు సంగతులు గాని క్లిష్ట పదములుగాని ఉండవు. మొదటి కాలమున క్రియకు ఒక అక్షరము చొప్పున నడచును. ఇందలి సాహిత్యము దైవస్తోత్రమునకు సంబంధించినదిగా ఉండును. కొన్ని గీతములలోని సాహిత్యమునందు కొంత భాగము అయ్య, తియ్య, అను అర్థము లేని పదములు ఉండును.

గీతములు చాలా ప్రాచీన రచనలు

గీతములందు సాధారణ గీతములు, లక్షణ గీతములు అను రెండు విధములు కలవు.

సాధారణ గీతములను, లక్ష్యగీతములు, సంచారి గీతములు, సామాన్య గీతములు అని కూడ వ్యవహరించుట కూడ కలదు.

**సామాన్య గీతములలో :** విఘ్నేశ్వరునిపై గీతములు (పిళయారి) (పిళయారి = ద్రవిధ భాషలో విఘ్నేశ్వరుని పేరు) పిల్లారి గీతములు కలవు. తక్కిన దైవముల మీద కూడ గీతములు కలవు.

**ఘనరాగ గీతములు :** నాట ; గౌళ ; ఆరభి ; వరాళి ; శ్రీరాగ గీతములు.

**రాగమాలిక గీతములు :** వివిధ రాగములలో క్లుప్తముగ రచింపబడిన గీతములు. ఇప్పుడు వాడుకలో లేవు.

**సూడ :** అనగా గీతము ; సూడలలో శుద్ధ సూడ; ఛాయలగ సూడ అను రెండు విధములు కలవు. ఛాయాలక్షమునే సాలగము అని కూడా అందరు. ఈ గీతములు కూడా ఇప్పుడు వాడుకలో లేవు.

**లక్షణ గీతములు :** గీతలక్షణములు కలిగి, అందలి సాహిత్యము ఆ రాగమును వర్ణించునదిగ ఉండునది లక్షణ గీతము. రాగము యొక్క వర్ణన అనగా, స్వరస్థానములు, జనకరాగము, ఉపాంగ, భాషాంగ రాగ వివరము, అన్యస్వరము గ్రహ, న్యాస, వాది, సంవాది, స్వరముల వైనము, జౌడవ, షాడవ సంపూర్ణ వివరములు సాహిత్యమునందు పొందుపరచబడి ఉండును. గ్రంధములను ముద్రణకు వీలులేని ప్రాచీన కాలమున ఈ లక్షణ గీత ఉపయోగము ఉండెడిది. ఇప్పుడు ఉపయోగము కన్న ప్రాచీన రచనలను గూర్చి తెలుసుకొనుటకు ఉపయోగపడుచున్నది. శహన; ధన్యాసిరాగములో లక్షణ గీతములు గ్రంధములలో కనుపించును. అన్ని విధముల గీతములు రచించిన వారిలో వేంకటమఖి ; పురందరదాసు; రామామాత్యుడు; గోవింద దీక్షితుడు, పైడాల గురుమూర్తి మొదలైన వారు ముఖ్యులు. పైడాలగురు మూర్తికి "వేయిగీత" అను బిరుదు కలదు.

**సుళాది :** ఇది గీతమును పోలిన రచన సుళాదులు పురందరదాసు వారే రచించినట్లు తెలియుచున్నది.

**చిట్టతానము :** ఈ రచనకే "కటకము" అని కూడ పేరు కలదు. వీణ యందు తానమును అభ్యాసము చేయుటకు ఈ రచన ఉపకరించును. మనో ధర్మముగా వాయించవలసిన తానమును. అభ్యాసము కొరకు. ఈ చిట్టతానములను వివిధ రాగములందు వర్ణించి, వాయించినచో క్రమముగా కొంత కాలమునకు చిట్టతాన పద్ధతిలో కల్పన చేయుటకు

ఉపయోగించును. ఈ చిట్ట తానముల వలన వివిధమైన "మీటు"లు, అలంకారములు, మొదలైనవి విద్యార్థులకు తెలియును.

**జతిస్వరము (స్వరపల్లవి)** : అభ్యాస గాన రచనలయందు మొదటిసారిగా పల్లవి. చరణములు కలిగిన రచన. దీనియందు స్వరము మాత్రమే యుండును. సాహిత్యము ఉండదు. గీత ములకు ఒక మెట్టు ఎక్కువగా నుండు రచన. గీతములు తరువాత నేర్చుకొనవలసిన రచన, వసంత; హంసధ్వని; బిలహరి రాగములందు వాడుక యందుగల ఈ స్వరపల్లవులు మంచి ఉదాహరణలు. స్వరపల్లవి అనగా పల్లవి కలిగిన స్వరములతో మాత్రము గల రచన. ముందు రచనలలో తాళమునందు క్రియకు మొదటి కాలమున ఒక స్వరము మాత్రము నడచును. క్రియను 4 అక్షరకాలములు ఈ రచన యందే ప్రారంభము.

**స్వరజతి** : స్వరజతి యందు పల్లవి, చరణములు ఉండును. చరణములు వివిధ ధాతువులతో ఉండును. స్వరజతికి సాహిత్యము కలదు. స్వరము సాహిత్యము కూడా గానముచేయవలెను. అభ్యాస గాన రచనల యందు చాలా ముఖ్యమైన రచన.

స్వరజతి యందు స్వర సాహిత్యములు, రాగ భావముతో మనోహరముగా ఆకర్షణీయముగా ఉండును. విద్యార్థులకు మొదటిసారిగా ఒక కీర్తనయో, కృతియో నేర్చుకొని పాడుకొను తృప్తి ఈ రచన యందు కలదు. తాళమున క్రియకు 4 అక్షరములు స్వర సాహిత్యములు నడచుట ప్రారంభము ఈ రచన యందు, స్వరపల్లవి యందు కూడ అని చెప్పవచ్చును.

మొత్తము స్వరజతులు అన్నియును ఒక ఎత్తు, శ్యామశాస్త్రిగారు రచించిన అజరామరమైన, భైరవి, తోడి యదుకుల కాంభోజి రాగముల యందు గల స్వరజతులు మూడును ఒక యెత్తు.

ఈ మూడు స్వరజతులు, తాన వర్ణముల స్థాయికి పైననే యున్నవి. ఈ మూడు స్వర జతులు రాగ తాళముల యందు సంప్రదాయ రాగశైలి, క్లిష్ట సంచారములు, పాండిత్య ప్రకర్షణను సంతరించుకొనినవి. ఇవి అభ్యాస గానరచనలే గాక సభాగాన స్థాయికి కూడ సరిపోయినవి. ఇవి త్యాగరాజ స్వామి పంచరత్న కృతులకు వాసి యందు సరిపోవును. స్వరజతులను రచించిన వారిలో, శ్యామశాస్త్రి, పచ్చిమిరియం ఆది అప్పయ్య, స్వాతి తిరునాళ్, కృష్ణస్వామి భాగవతర్, చిన్ని కృష్ణదాసు మొదలైనవారు ప్రసిద్ధులు.

**తానవర్ణము** :

కర్ణాటక సంగీత శిక్షణలో పాఠ్యక్రమంలో తానవర్ణం అతిముఖ్యమైనది. ఈ రచనను

సాధారణ గీతములను, లక్ష్యగీతములు, సంచారి గీతములు, సామాన్య గీతములు అని కూడ వ్యవహరించుట కూడ కలదు.

**సామాన్య గీతములలో :** విఘ్నేశ్వరునిపై గీతములు (పిళయారి) (పిళయారి = ద్రవిడ భాషలో విఘ్నేశ్వరుని పేరు) పిళ్లారి గీతములు కలవు. తక్కిన దైవముల మీద కూడ గీతములు కలవు.

**ఘనరాగ గీతములు :** నాట ; గౌళ ; ఆరభి ; వరాళి ; శ్రీరాగ గీతములు.

**రాగమాలిక గీతములు :** వివిధ రాగములలో క్లుప్తముగ రచింపబడిన గీతములు. ఇప్పుడు వాడుకలో లేవు.

**సూడ :** అనగా గీతము ; సూడలలో శుద్ధ సూడ; ఛాయలగ సూడ అను రెండు విధములు కలవు. ఛాయాలక్షమునే సాలగము అని కూడా అందరు. ఈ గీతములు కూడా ఇప్పుడు వాడుకలో లేవు.

**లక్షణ గీతములు :** గీతలక్షణములు కలిగి, అందలి సాహిత్యము ఆ రాగమును వర్ణించునదిగ ఉండునది లక్షణ గీతము. రాగము యొక్క వర్ణన అనగా, స్వరస్థానములు, జనకరాగము, ఉపాంగ, భాషాంగ రాగ వివరము, అన్యస్వరము గ్రహ, న్యాస, వాది, సంవాది, స్వరముల వైనము, ఔడవ, షాడవ సంపూర్ణ వివరములు సాహిత్యమునందు పొందుపరచబడి ఉండును. గ్రంధములను ముద్రణకు వీలులేని ప్రాచీన కాలమున ఈ లక్షణ గీత ఉపయోగము ఉండెడిది. ఇప్పుడు ఉపయోగము కన్న ప్రాచీన రచనలను గూర్చి తెలుసుకొనుటకు ఉపయోగపడుచున్నది. శహన; ధన్యాసిరాగములో లక్షణ గీతములు గ్రంధములలో కనుపించును. అన్ని విధముల గీతములు రచించిన వారిలో వేంకటమఖి ; పురందరదాసు; రామామాత్యుడు; గోవింద దీక్షితుడు, పైడాల గురుమూర్తి మొదలైన వారు ముఖ్యులు. పైడాలగురు మూర్తికి "వేయిగీత" అను బిరుదు కలదు.

**సుళాది :** ఇది గీతమును పోలిన రచన సుళాదులు పురందరదాసు వారే రచించినట్లు తెలియుచున్నది.

**చిట్టతానము :** ఈ రచనకే "కటకము" అని కూడ పేరు కలదు. వీణ యందు తానమును అభ్యాసము చేయుటకు ఈ రచన ఉపకరించును. మనో ధర్మముగా వాయించవలసిన తానమును. అభ్యాసము కొరకు. ఈ చిట్టతానములను వివిధ రాగములందు వర్ణించి, వాయించినచో క్రమముగా కొంత కాలమునకు చిట్టతాన పద్ధతిలో కల్పన చేయుటకు

ఉపయోగించును. ఈ చిట్ట తానముల వలన వివిధమైన "మీటు"లు, అలంకారములు, మొదలైనవి విద్యార్థులకు తెలియును.

**జతిస్వరము (స్వరపల్లవి)** : అభ్యాస గాన రచనలయందు మొదటిసారిగా పల్లవి. చరణములు కలిగిన రచన. దీనియందు స్వరము మాత్రమే యుండును. సాహిత్యము ఉండదు. గీతములకు ఒక మెట్టు ఎక్కువగా నుండు రచన. గీతములు తరువాత నేర్చుకొనవలసిన రచన, వసంత; హంసధ్వని; బిలహరి రాగములందు వాడుక యందుగల ఈ స్వరపల్లవులు మంచి ఉదాహరణలు. స్వరపల్లవి అనగా పల్లవి కలిగిన స్వరములతో మాత్రము గల రచన. ముందు రచనలలో తాళమునందు క్రియకు మొదటి కాలమున ఒక స్వరము మాత్రము నడచును. క్రియను 4 అక్షరకాలములు ఈ రచన యందే ప్రారంభము.

**స్వరజతి** : స్వరజతి యందు పల్లవి, చరణములు ఉండును. చరణములు వివిధ ధాతువులతో ఉండును. స్వరజతికి సాహిత్యము కలదు. స్వరము సాహిత్యము కూడా గానముచేయవలెను. అభ్యాస గాన రచనల యందు చాలా ముఖ్యమైన రచన.

స్వరజతి యందు స్వర సాహిత్యములు, రాగ భావముతో మనోహరముగా ఆకర్షణీయముగా ఉండును. విద్యార్థులకు మొదటిసారిగా ఒక కీర్తనయో, కృతియో నేర్చుకొని పాడుకొను తృప్తి ఈ రచన యందు కలదు. తాళమున క్రియకు 4 అక్షరములు స్వర సాహిత్యములు నడచుట ప్రారంభము ఈ రచన యందు, స్వరపల్లవి యందు కూడ అని చెప్పవచ్చును.

మొత్తము స్వరజతులు అన్నియును ఒక ఎత్తు, శ్యామశాస్త్రిగారు రచించిన అజరామరమైన, భైరవి, తోడి యదుకుల కాంభోజి రాగముల యందు గల స్వరజతులు మూడును ఒక యెత్తు.

ఈ మూడు స్వరజతులు, తాన వర్ణముల స్థాయికి పైననే యున్నవి. ఈ మూడు స్వర జతులు రాగ తాళముల యందు సంప్రదాయ రాగశైలి, క్లిష్ట సంచారములు, పాండిత్య ప్రకర్షణను సంతరించుకొనినవి. ఇవి అభ్యాస గానరచనలే గాక సభాగాన స్థాయికి కూడ సరిపోయినవి. ఇవి త్యాగరాజ స్వామి పంచరత్న కృతులకు వాసి యందు సరిపోవును. స్వరజతులను రచించిన వారిలో, శ్యామశాస్త్రి, పచ్చిమిరియం ఆది అప్పయ్య, స్వాతి తిరునాళ్, కృష్ణస్వామి భాగవతర్, చిన్ని కృష్ణదాసు మొదలైనవారు ప్రసిద్ధులు.

**తానవర్ణము** :

కర్ణాటక సంగీత శిక్షణలో పాఠ్యక్రమంలో తానవర్ణం అతిముఖ్యమైనది. ఈ రచనను

తాన వర్ణం అని వ్యవహరించుటకు కారణం ఏమనగా మనోధర్మ సంగీత శాఖలలో ఉండే "తానం" అనే ప్రక్రియకు ఈ తాన వర్ణం మార్గ దర్శకంగా ఉంటుంది గనుక, ఈ తానవర్ణం తానాన్ని పోలి ఉంటుంది కనుకను కూడా.

ఈ రచన అభ్యాస గాన రచనే కాకుండా, సభాగాన రచన కూడ. సంగీత సభ ప్రారంభంలో తాన వర్ణమును పాడుట. సంప్రదాయమే కాకుండ, సంగీతజ్ఞునికి ఉత్సాహాన్ని ఇస్తుంది. అదియును గాక గాత్రజ్ఞునికి గాత్రం స్వాధీనంలోకి రావడానికి, వాదకునికి వ్రేళ్లు స్వాధీనం అయి వాద్యం స్వాధీనం అవుతుంది. సంగీత భావనలోనికి మనస్సు లీనం అవుతుంది. రెండు కాలాలు పాడినా, వాయించినా, శ్రోతలు కూడా ఉత్సాహ వంతులు అవుతారు. విద్యార్థి, తాన వర్ణాలు ఎన్ని రాగాలలో ఎంత సంఖ్య నేర్చుకొంటే అంత రాగ అవగాహన ఉంటుంది. తాన వర్ణాలు మూడు కాలాలు సాధన చేస్తే రాగం, లయ, కరతలామలకం అయి, విద్యార్థి విద్వాంసుడుగా రూపొందుతాడు. సంగీతపరంగా, రాగపరంగా, తాళ విషయంగా సాధన విషయంలో ఈ తానవర్ణాన్ని మించిన రచన లేదనే చెప్పవచ్చు.

తానవర్ణాలు ముఖ్యంగా ఆదితాళాలలోనూ, అటతాళాలలోనూ ఉన్నాయి. త్రిపుట తాళంలో కూడా ఉన్నాయి. ఒకటో రెండు మిశ్రజాతి ఝంపతాళాలలో కూడా ఉన్నాయి. ప్రసిద్ధ రాగాలలోనూ, రక్తి రాగాలలోనూ, అపూర్వరాగాలలోనూ కూడా తాన వర్ణాలు ఉన్నాయి. తాన వర్ణాలు ప్రాచీన, రచనలు కాకపోయినా త్యాగరాజ స్వామికి కొంచెం పూర్వమే వర్ణ పాఠాంతరం ఉన్నదని తెలుస్తున్నది.

రాగము యొక్క అన్ని విధములైన వర్ణ ఛాయలను తెలిపేది ఈ రచన. దీనిని "రాగవర్ణం" (రాగచ్ఛాయ) అనవచ్చు.

తానవర్ణము అమరికలో - పల్లవి రెండు ఆవర్తములు, అనుపల్లవి రెండు ఆవర్తనములు. ముక్తాయి స్వరము రెండుగాని నాలుగుగాని ఆవర్తములు ఉండును. పల్లవి, అనుపల్లవి. ముక్తాయి స్వరమూ చేర్చి ఆరు ఆవర్తములుగాని ఎనిమిది ఆవర్తములుగాని పూర్వాంగము అని పిలువబడుచున్నది. గాన క్రమం కూడా పల్లవి అనుపల్లవి 4 ఆవర్తములు మొదటి కాలము క్రియకు 4 అక్షరముల చొప్పుననూ రెండవ కాలము క్రియకు 8 అక్షరములు చొప్పున ఒక్కొక్క ఆవర్తము రెండు సార్లు చొప్పున గానము చేసి, ముక్తాయి స్వరము కూడా, రెండు కాలములు గానము చేసి పల్లవిని అందుకొని ముగించుట పద్ధతి.

పిమ్మట చరణమును చిట్ట స్వరమును పాడవలెను. చరణము చిట్ట స్వరములు ఉత్తరాంగము అనబడును.

చరణము ఒక్క ఆవర్తముండును. చిట్ట స్వరములు నాలుగు గాని, అరుదుగా అయిదుకూడా ఉండవచ్చును.

ప్రతి చిట్ట స్వరముల యందు చివరి స్వరము - చరణమును ఎత్తుకొనుటకు వీలుగా చరణ గ్రహ స్వరము యొక్క క్రింద స్వరము న్యాసస్వరముగా నుండును.

మొదటి చిట్ట స్వరము దీర్ఘములతో అర కాలమున (చరణ కాలమునకు దిగువ కాలమున) ఉండును.

రెండవ చిట్ట స్వరము సమకాలమున ఒక ఆవర్తముగాని, రెండు ఆవర్తములుగాని ఉండును. 3వ చిట్ట స్వరము సర్వ లఘు స్వరములతో అమరియుండును. దీర్ఘ స్వరములు 3వ చిట్ట స్వరమునందు సాధారణముగా ఉండవు.

4వ చిట్టస్వరము 4 ఆవర్తములు ఉండి అందముగా ఒక పూర్ణత్వమును సంతరించుకొనినదిగ ఉండును.

చరణమునకు చరణ పల్లవి అని కూడా పేరు అటులనే చిట్ట స్వరములకు ఎత్తుగడ స్వరములు అని కూడా పేరు.

ఆది తాళవర్ణములకు చిన్న వర్ణములని అట తాళ వర్ణములకు పెద్ద వర్ణములని పేరు.

ఆది తాళవర్ణములు కంటె అట తాళ వర్ణములు పెద్దవి, కష్టతరము కూడా.

తాన వర్ణము - అభ్యాసగాన రచనలకు సభాగాన రచనలకు ఒక వారిధి లాంటిది. తాన వర్ణములు రచించిన వారిలో ప్రాచీనులలో ముఖ్యులు - వీణ కుప్పయ్యర్, పచ్చిమిరియం ఆది అప్పయ్య, స్వాతి తిరునాళ్, పట్లం సుబ్రహ్మణ్య అయ్యర్, తిరువత్తియూర్ త్యాగయ్యర్, రామనాడ్ శ్రీనివాస అయ్యంగార్, పల్లవి గోపాలయ్యర్, పల్లవి శేషయ్యర్, మహా వైద్యనాథ్ అయ్యర్, మైసూరు సదాశివరావు మొదలైన వారు.

ఆధునికులలో తాన వర్ణ రచనలు చేసిన వారు చాలా మంది కలరు.

మంగళంపల్లి బాలమురళీ కృష్ణ గారు, శ్రీ పాద పినాకపాణిగారు. మొదలైనవారు ముఖ్యులు.

## పదవర్ణము లేక చౌక వర్ణము

పద వర్ణము లేక చౌక వర్ణము అన్ని విషయములలోనూ, పోలికలోనూ తాన వర్ణమునే పోలియుండును. ఈ రచన భరతనాట్యమున నృత్య అభినయములకు ప్రత్యేకించి రచింపబడిన

సంగీత రచన. ఇందు పల్లవికి, అనుపల్లవికి, ముక్తాయస్వరమునకు, చిట్ట స్వరములకు కూడా సాహిత్యము ఉండును పాడుటలో విళంబలయలో దీని గమనము ఉండును. ఇందలి సాహిత్యము నాయిక, నాయకుని మధ్య శృంగార కథా కథనమునకు సంబంధించినదిగా యుండును. మృదంగ జతులు కూడ ఈ రచన యందు భాగముగ నుండును. తాన వర్ణములు కేవల సంగీత రచనలు, పద, (చౌక) వర్ణములు నాట్య సంగీత రచనలు.

## 97. సభాగాన రచనలు

### కృతి

ఇది కేవల సంగీత రచన. రాగము, రాగ రసము, సంగతులు, రాగ భావము, పాండిత్య ప్రకర్ష, కలిగిన కర్ణాటక సంగీతమున ముఖ్యమైన సంగీత రచన. తక్కిన రచనలు దీని తరువాతవే.

ఈ రచన యందు గల సంగీతమునకు సాహిత్యము వాహకము మాత్రమే. రాగ సౌందర్యము కృతి యందు సంపూర్ణముగా ద్యోతకమగును.

కృతికి, పల్లవి, అనుపల్లవి, చరణము, చరణాను బంధము అను అనుపల్లవి వలె నుండు చరణ చివరి భాగము ఉండును.

కృతులలో అనేక విధములు కలవు. అనేక అముఖ్యాంగములు కలవు,

కృతికి పల్లవిలోనూ, అనుపల్లవి లోనూ, చరణమునందును సంగతులు ముఖ్యములు.

కొన్ని కృతులకు చిట్ట స్వరములు ఆ చిట్ట స్వరములకు సాహిత్యము, లేక మృదంగ జతులు లేక ఈ రెండును ఉండవచ్చును.

త్యాగరాజస్వామి వారి కృతులు అనేక వైవిధ్యము కలిగి యున్నవి. పల్లవి, అనుపల్లవి. ఒక చరణము కలిగినవి కొన్ని ఉన్నవి. పల్లవి, అనుపల్లవి, అనేక చరణములు ఒకే ధాతువుతో కొన్ని ఉన్నవి. అన్ని చరణములు వివిధ ధాతువులతో కొన్ని ఉన్నవి. మధ్యమ కాల సాహిత్యములు అనుపల్లవులుగా, లేక చరణములుగా లేక ప్రత్యేకముగా కలిగి కొన్ని ఉన్నవి. అటులనే శ్యామశాస్త్రి వారి కృతులు, దీక్షితర్ వారి కృతులు కూడా వైవిధ్య విషయముగా అనేక అవకాశములతో ప్రకాశించుచున్నవి. సంగీత త్రిమూర్తుల కృతులను కూలంకషముగ వర్ణించుట అసాధ్యము.

సంగీత త్రిమూర్తులు ఒకరి నొకరు అనుసరించక సర్వతంత్ర స్వతంత్రులుగా కృతి రచనలను సాగించిరి.

కృతిలో సంగీతము ప్రధానముగా ఉండును. రాగ భావము ప్రధానము. అనేక సంగతుల ద్వారా రాగము విన్యాసము జరుగును.

కృతి యందు అనుపల్లవి, సంగతులు, చరణము చివర చరణాను బంధమైన అనుపల్లవి ధాతువు కలిగిన అంగము ప్రధానములు. దీనిని చరణానుపల్లవి అని అనవచ్చును.

కర్ణాటక సంగీత రచనల యందు "కృతి"కి సభాగాన రచనలలో ప్రధాన స్థానము కలదు.

భద్రాచల రామదాసు రచించిన కొన్ని రచనలలో కృతులు కలవు. అటులనే క్షేత్రజ్ఞుని పదములన్నియును కృతులే అగును. పదములన్నిటికి అనుపల్లవి, సంగతి అను అంగములు కలవు.

త్యాగరాజాది త్రిమూర్తుల రచనలకు భద్రాచల రామదాసు, క్షేత్రయ్య మార్గ దర్శకులు. కృతులు సాధారణముగా రూపక, జంప, చాపు, మధ్యమకాల-ఆది, విళంబకాల ఆది, తాళములలో కలవు. శ్యామశాస్త్రి రచించిన ఖండజంప తాళమునందు గల 'సరి ఎవ్వరమ్మ' చాలా ప్రసిద్ధిగాంచినది. శ్యామశాస్త్రి. చాపు తాళమున కృతులు రచించిరి. వీరి మిశ్రచాపు తాళ కృతులు లఘువు తరువాత మొదటి దృతమునందు రెండవ దృతమునందు ప్రారంభింపబడుచున్నవి కొన్ని కలవు. వీటిని విలోమ చాపు కృతులు అందురు.

ముత్తుస్వామి దీక్షితర్ కృతులు ప్రత్యేక తరహాకి చెందినవిగా ఉండును. వీరి ఏక ధాతు ప్రబంధములు పల్లవి చరణము కలిగి అతి చిన్నవిగా ఉండును.

అతి చిన్న కృతి నుండి అతి పెద్ద కృతులు వరకు దీక్షితర్ తన కృతులను రచించిరి. కమలాంబ నవ ఆవరణ కృతులు నవగ్రహ కృతులు చాలా పెద్దవిగా ఉన్నవి.

దీక్షితర్ కృతులు పాండిత్య ప్రకర్షకలిగి ఉన్నవి. విద్యార్థిని విద్వాంసునిగా రూపొందించు పటిమ కలిగినవి దీక్షితర్ కృతులు.

త్రిమూర్తుల తరువాత కాలమున నందు గల వాగ్గేకారులు త్యాగరాజస్వామి కృతుల రూపములను అనుసరించి వారి కృతులను రచించిరి.

### కృతులలో అముఖ్యాంశములు-

చిట్ట స్వరము: అనుపల్లవి తరువాత చరణము తరువాత చిట్ట స్వరము కొన్ని కృతులలో కలవు.

స్వరము+జతి (సొల్‌కట్టు స్వరము) కలసి కొన్ని కృతులలో కలవు.

స్వరము - సాహిత్యము : చిట్టస్వరము, ఆ స్వరమునకు సాహిత్యము కొన్ని కృతులకు కలవు.

మధ్యమ కాల సాహిత్యము: (మిశ్రము) కృతి నడకకు ద్విగుణీ కృత కాలమున సాహిత్యము. (అనుపల్లవి, చరణమునకు తరువాత) కొన్ని కృతులకు కలవు.

స్వరాక్షరము : ఇది అంగము కాదు. ఇది ఒక ప్రక్రియ. శ్రీరామపాదమ అను కృతి యందు "పాదమా" అను సాహిత్యమునకు స్వరము కూడా "పాదమా" అని ఉండుట స్వరాక్షరము- ఇంకను కొన్ని స్వరాక్షర సమూహములు దగ్గర=దాగరి; పనినిదానించి=పని నిదాని పద పంకజ= పదపాగమ; నీ దానిపై=నీదానిపా. నీ+గరిమ+గని= నీగరిమగని; నీదరిని=ఇవి స్వరాక్షరములు. మణిప్రవాళ సాహిత్యము=రెండు భాషలలో గల కృతి.

కీర్తన : కీర్తన భక్తి ప్రధానమైన సాహిత్యము కలిగి ఆ కీర్తనకు సంగీతము తగు మాత్రముగా ఉండి ఈ కీర్తన యందు గల భక్తి సాహిత్యమును ఎత్తి చూపించ కలిగి, సులభమైన సంగీతము అనగా సంగీతము "వాహకము" (VEHICLE) గా కలిగిన సులభ సంగీతరచనలకు కీర్తనలు అని పేరు.

కృతి కూడ కీర్తనయే. అట్లే కీర్తన కూడ కృతియే. అయినను సాంకేతికముగా ఈ రెండింటి ప్రత్యేక గుణములు, రూపములు, వినియోగములను బట్టి ఈ రెండింటిని వేరుగా పెద్దలు వివరించిరి.

కీర్తనకు పల్లవి ఉండి అనేక చరణములుండును. అన్ని చరణములకు ధాతువులు ఒకటిగానే ఉండును.

అన్నమాచార్యుల వారి పదములు అన్నియును కీర్తనలే. వీటికి అను పల్లవులు లేవు.

భద్రాచల రామదాసుల వారి రచనలలో ఎక్కువగా కీర్తనలే కలవు. కృతులు అరుదుగా నున్నవి.

కీర్తనలు భజన బృందములు గానము చేయుటకు అనువుగా ఉండును. త్యాగరాజు రచించిన ఉత్సవ సాంప్రదాయ, దివ్యనామ సంకీర్తనలు ఈ లక్షణ పరిధిలోనికి వచ్చును.

ఏక ధాతు ప్రబంధము = పల్లవి: అనుపల్లవి చరణములు అను విభాగములు లేనిది ఏకధాతు ప్రబంధములు.

**సమిష్టి చరణ ప్రబంధము** : పల్లవి - మధ్యమకాల సాహిత్యము గల రచనను సమిష్టి చరణ ప్రబంధమందురు. చతుర్ధాతు ప్రబంధము : కృతులన్నియు చతుర్ధాతు ప్రబంధములే. పల్లవి, అనుప ్లవి, చరణము, చరణానుపల్లవి కలగి, నాలుగు ధాతువులు అగుచున్నవి.

**పదము** : విళంబ కాలమున నడుచుచు, శృంగార రసమునందు, మధుర భక్తికి సంబంధించి నాయికా - నాయక, సఖుల మధ్య గల భావములు ఇతి వృత్తములుగా కలిగి, కృతుల వలె పల్లవి, అనుపల్లవి, చరణము, చరణాను పల్లవి అను చతురాంగములు కలిగిన రచనలకు పదములు అని పేరు.

క్షేత్రయ్య, సారంగ పాణి, పరిమళ రంగడు, స్వాతి తిరునాళ్ మొదలైన వాగ్గేయ కారులు రచించిన పదములు రాగ ప్రధానములుగా శృంగార భూయిష్టములై రాగామృత కలశాలుగా ప్రసిద్ధి గాంచినవి.

జావళి :

శృంగార (మధురభక్తి) రస ప్రధానముగా, రాగ, తాళములు ఆకర్షణీయముగా కలిగి, నాయికా-నాయక ప్రణయ భావములను వ్యక్తము చేయుచు పల్లవి, అనుపల్లవి, చరణము, చరణాను పల్లవి అను భాగములు కలిగిన సంగీత రచనను జావళీ అందురు. ధర్మపురి సుబ్బరాయరు, పట్టాభిరామయ్య, పట్టం-సుబ్రహ్మణ్యయ్యర్, రామనాడ్ శ్రీనివాస అయ్యంగారు జావళీలు రచించిన వారిలో ముఖ్యులు.

తిల్లానా

హిందూస్థానీ సంగీతమున గల "తరానా" అను సంగీత రచనకు సాదృశమైన రచన, 'తిల్లానా'. త్యాగరాజుని తరువాత కాలమునకు చెందిన ఈ రచనను స్వాతి తిరునాళ్. మొదట ప్రారంభించిరి. తరువాత పట్ణం సుబ్రహ్మణ్యర్, రామ్నాడ్ శ్రీనివాసయ్యంగారు, తరువాత కాలమున, బాలమురళీకృష్ణ, లాల్‌గుడి జయరామన్, మొదలైన వారందరు ఆకర్షణీయమైన తిల్లానాలు రచించిరి.

పల్లవి, అనుపల్లవి, చరణం చరణాను పల్లవి, దీని అంగములు. పల్లవి సాహిత్యము జతులతోఉండును. అనుపల్లవి కూడా సాహిత్యము, జతులతో ఉండును. చరణ సాహిత్యము భక్తి పరముగానూ లేక శృంగార పరముగానూ ఉండును. చరణము తరువాత వచ్చు చరణాను పల్లవి కూడా సాహిత్యము జతులు, స్వరము, కలిసి ఉండును. ఈ రచన వేగము మధ్యమ

కాలముగా ఉండును. గానసభ చివరగా ఈ రచనను గానము సేయుట సంప్రదాయము. భరతనాట్య ప్రదర్శనములలో తిల్లానాలను నృత్యము చేయుట సంప్రదాయము. ఇది నాట్యమునకు సంబంధించిన రచనగా కూడా ప్రసిద్ధి చెందినది.

**శబ్దము :**

కేవల నాట్య సంగీత రచన : సాహిత్యము, శబ్దము (జతుల) కలసి యుండు రచన, నృత్యమునకు అనుకూలమైన రచన. ఈ రచన సంగీత సభలలో గానము చేయుట అలవాటు లేదు.

**దరు (వు)** : శృంగార రస ప్రధానమై, పదమును పోలియుండు నాట్య సంగీత రచన. ఈ రచన కూడ నాట్య ప్రదర్శన యందు మాత్రము ఉపయోగించుచున్నారు. గాన సభలలో పాడుట ఇప్పుడు సంప్రదాయముగా లేదు. సంస్కృత ధృవయే దరువు. అయియుండవచ్చును.

**తిల్లానా దరు** : తిల్లానా రూపముతో జతులతో గూర్చిన నాట్య సంగీత రచన.

**ప్రవేశ దరు** : గేయ నాటకములలోనూ, నృత్య రూపకము యందును సూత్రధారుడు రంగ ప్రవేశముగావించుచు స్వయముగా గానము చేయు రచన.

**సంవాద దరు** : గేయ నాటకములలోనూ, నృత్య రూపకముల యందును. ఇద్దరు పాత్రల మధ్య సంవాద పూర్వముగా గానము చేయబడు సంగీత నాట్యరచన.

**స్వగత దరు** : గేయ, నృత్య నాటకములలో ఒక పాత్ర స్వగతముగా తనంతట తానే పరిచయము చేసుకొనుచు, గానము చేయు సంగీత నాట్య రచన.

**జక్కిణదరు** : పల్లవి, అనుపల్లవి, చరణములు కలిగి పల్లవి అనుపల్లవులకు సాహిత్యమునకు బదులుగా జతులు కలిగి చరణమునకు సాహిత్యము కలిగిన రచన. ఈ రచన ఇంచుమించు తిల్లానాను పోలియుండును. ఈ రచన నడక విలంబ, మధ్య, దురిత కాలములతో మార్పులు చెందుచు నుండును. బుగత గోపన్న జక్కిణ దరువులు ప్రసిద్ధములు.

**సంచారి** : రాగ సంచారములను తెలియచేయుచు; గీతమును పోలి యుండు రచన. ఈ రచన రాగ లక్షణమును లక్ష్య రూపమునందు తెలియచేయును.

**రాగమాలిక** : 3గాని, 5గాని, 7గాని, 9గాని, వివిధ రాగములందు గల ఒక కృతినిగాని కీర్తనను గాని, తానవర్ణమునుగాని, రాగమాలిక యందురు.

రాగమాలిక కృతి య ందు పల్లవి రాగమునందును అనుపల్లవి ఇంకొక రాగమందును, చరణములు ఎన్నియున్న అన్ని రాగముల యందును ఈ రచన యుండును.

ప్రతి రాగ చరణము చివర ఆ రాగమునందు చిట్ట స్వరముండును. సాహిత్యముల యందు ఆయా రాగముద్ర లుండును. చివరగా అన్ని రాగముల యందు ఒక్కొక్క ఆవర్తములలో చిట్ట స్వరములుండి అవరోహణ క్రమములో చిట్ట స్వరములను గానముచేయుచు పల్లవి రాగ చిట్ట స్వరముగానము చేసి పల్లవికి వచ్చి చేరుచు, గానము చేయుటకు అనువుగా రచింపబడినది రాగమాలిక రచన. ఉదా: నిత్యకళ్యాణి అను రాగమాలిక సీతారామారావు రచించిరి. దీక్షితర్ రచించిన విశ్వనాథం భజేహం అను చతుర్దశ రాగమాలిక ప్రసిద్ధిని గాంచినది. 72 మేళకర్తల యందు వరుసగా రాగమాలిక రచించినవారు కోటేశ్వరయ్యర్, మహావైద్యనాథయ్యర్.

**తాళమాలిక** : రాగ మాలిక వలెనే వివిధ తాళముల యందు వివిధ చరణముల చివర ఆయా తాళముల పేర్లు వచ్చునట్లు రచింపబడినరచనకు తాళమాలిక యని పేరు.

**రాగ తాళ మాళిక** : వివిధ రాగములలో వివిధ తాళముల యందు రచింపబడిన రచన. రాగ తాళముల పేర్లు చరణముల చివర చమత్కారముగా రచింపబడి యుండును. రామస్వామి దీక్షితర్ రచించిన దశ రాగతాళమాలిక ప్రసిద్ధ రచన.

**బృంద రచనలు, సముదాయ కృతులు** (GROUP KRTIS) : త్యాగరాజస్వామి వారు రచించిన ఘనరాగ పంచరత్నములు, లాల్‌గుడి పంచరత్నములు, కోవూరి పంచరత్నములు మొదలైనవి. దీక్షితర్ రచించిన, కమలాంబ నవ ఆవరణ కృతులు అభయాంబ నవావరణ కృతులు, పంచలింగ స్థల కృతులు మొదలైనవి.

శ్యామశాస్త్రి రచించిన కామాక్షి త్రిరత్న స్వరజతులు. మధుర మీనాక్షి నవరత్న కృతులు.

స్వాతి తిరునాళ్ రచించిన నవ విధ భక్తులను వర్ణించు 9 కృతులు, కృతి రత్న సముదాయములుగా ప్రసిద్ధిగాంచినవి.

## గీతగోవిందము

**అష్టపదులు** : 12వ శతాబ్దమున జయదేవునిచే రచింపబడిన అష్టపదులు బహుళ ప్రసిద్ధములు. ప్రతి కృతికి 8 చరణములుండును. ఇందలి ఇతి వృత్తము రాధాకృష్ణుల ప్రణయ వృత్తాంతము. శృంగారరసము. ఇవి మొత్తము 24 అష్టపదులు 12 సర్గల యందు రచింపబడినది. ఈ రచనల యందు ధృవము - (పల్లవి) (పదము) చరణములు ఎనిమిది ఉండి ధృవపదమునకు ఒక మంచి ఉదాహరణము. ధృవ పదమే హిందూస్థానీ సంగీతము "దృపద్" అయినది.

జయదేవుని అనుసరించి వేంకటమఖి త్యాగరాజాష్ట పదులను, చంద్ర శేఖర సరస్వతి శివాష్టపదులను శ్రీరామకవి రామాష్టపదులను రచించిరి.

## తరంగము శ్రీ కృష్ణ లీలాతరంగిణి

శివనారాయణ తీర్థులు 16వ శతాబ్దమున శ్రీ కృష్ణ లీలా తరంగిణి అను సంస్కృత యక్షగానము రచించిరి. ఇతి వృత్తము శ్రీకృష్ణ చరితము శ్రీ కృష్ణలీలలు. రసము, భక్తి శృంగారములు. (మధురభక్తి.) ఈ సంగీత కావ్యమునందు 12 సర్గలున్నవి. ఈ తరంగములు దక్షిణ భారతమునందు బహుళ ప్రసిద్ధములు. ఈ కృతులలో చివరి చరణము నందు "శివ నారాయణ తీర్థ" అను స్వకీయముద్రతో నున్నవి.

వీటియందు సంగీతము సంప్రదాయ బద్ధముగా ప్రసిద్ధ రక్తి రాగములలో పరంపరానుగతముగా గానము చేయుచున్నారు. తరంగములను పూర్వ పద్ధతిలో గానముచేయు వారు క్రమముగా అరుదు అగుచుండుటచే ఈనాడు తరంగములకు సంగీత విద్వాంసులు వారి వారి సౌకర్యమును బట్టి సంగీతమును కూర్చుకొను చున్నారు.

"తరంగ కాలక్షేములు" రాత్రి అంతయు బృందగానముగా జరుగుట సంప్రదాయము.

కృష్ణలీలా తరంగిణి యందు కథా కథనము, తరంగములతోపాటు, చూర్ణికలు, దరువులు, ద్విపదలు, చతుష్పదుల యందు సాగినది.

ఈ కావ్యము "యక్షగానము" అగుటచే నాటక ధోరణి యందు రచన సాగినది.

## ఆధ్యాత్మ రామాయణ కీర్తనలు

18వ శతాబ్దమున (1730-1780) మునిపల్లె సుబ్రహ్మణ్య కవి యను వాగ్గేయ కారుడు ఈ అధ్యాత్మ కీర్తనలను రచించెను.

శ్రీ మద్రామాయణ కథా వస్తువుననుసరించి ఆధ్యాత్మిక పరముగా అనగా శ్రీరాముని అద్వైత పరబ్రహ్మముగా నెంచుకొని పరతత్వమును బోధించు పద్ధతిలో ఈ అధ్యాత్మ కీర్తనల శైలినడచినది.

శ్రీరామునికి మొట్టమొదటి భక్తుడైన శివుడు, తన అర్ధాంగి యైన పార్వతీదేవికి శ్రీరాముని కథను వినిపించుట ఇందలి ఇతి వృత్తము.

ఇందలి కీర్తనలు, పల్లవి, అనుపల్లవి, చరణము, చరణములు మధ్యమ కాలవేగమున యున్నవి.

సాహిత్యము జటిలముగ నున్నది. సంగీతము కూడా అంత సులభము కాదు. అధ్యాత్మ కీర్తనలు పాడుటకు సంగీత వైదుష్యము గాని సహజ సంగీత జ్ఞానము గాని కావలెను. వీటి యొక్క ప్రాచుర్యము క్రమముగా సన్నగిల్లుచుండుట చింతింపవలసిన విషయము ఈ గ్రంథమున ఆరు కాండలు కలవు. మునిపల్లె సుబ్రహ్మణ్య కవి ఈ గ్రంథమును తిరుపతి వేంకటేశ్వర స్వామికి అంకితమిచ్చెను.

# 98. సంగీత వాద్యములు - విభజన

సంగీత వాద్యములు నాలుగు విధములు

1. తంత్రీవాద్యములు 3 (తతవాద్యములు); 2. సుషిర వాద్యములు. ఈ రెండు కేవల సంగీత వాద్యములు. 3. చర్మవాద్యములు; 4. లోహవాద్యములు. ఈ రెండు లయ (తాళ) వాద్యములు.

1. **తంత్రీ వాద్యములు అనగా తీగెలు** (WIRE, STRING) గల వాద్యములు. ఉదా:- వీణ; సితార్; వైలెన్ మొ॥ అనేకములు గలవు.

   వీటి యందు ముఖ్యమైనవి:-

   1. **వీణ** : అతి పురాతనమైన భారతీయ తంత్రీవాద్యము.

      సరస్వతీ దేవి వీణ పేరు విపంచి: నారదుని వీణ పేరు మహతి; శివుని వీణ పేరు రుద్రవీణ; విష్ణుని వీణ పేరు శార్గిణి; శ్యామలాంబ వీణ పేరు వల్లకి;

      కర్ణాటక సంగీతమున ప్రసిద్ధముగా ఉన్న వీణ పేరు సరస్వతీ వీణ. వీణను మీటుచు వాయించుదురు. ఇది ధృవవీణ.

   2. **సితార్** : హిందూస్థానీ సంగీతమునందు ప్రాముఖ్యముగ నున్న తంత్రీ వాద్యము. ఇది చలవీణకు సాదృశము. అనగా ఇందు మెట్లను ఆయా రాగములకు అనువుగా జరుపుకొనవచ్చును. ఇది మీటు వాద్యము.

   3. **వైలెన్ (ఫిడేలు)** : కర్ణాటక, హిందూస్థానీ సంగీత శైలులయందు ప్రసిద్ధము. ప్రత్యేక వాద్యము (SOLO) గను, ప్రక్క వాద్యముగనూ కూడా ప్రముఖముగా నున్నది. దీనిని విల్లు (BOW) తో వాయించెదరు.

   4. **సారంగి** : హిందూస్థానీ సంగీతమున ప్రసిద్ధము. విల్లు (BOW)తో వాయించెదరు. ఈ వాద్యము వైలెన్ వాద్యమునకు తలక్రిందుగా ఉండును. దీని నాదము గాత్రమునకు దగ్గరగా ఉండును. మెట్లు ఉండవు.

   5. **తంబురా (తాన్‌పూరా)** : ఆధార శృతి వాద్యము. కర్ణాటక, హిందూస్థానీ సంగీతముల యందు బహుళ ప్రసిద్ధి చెందినది.

6. సరోడ్ : మీటు వాద్యము హిందూస్థానీ సంగీతమున ప్రసిద్ధము మెట్లు లేవు.

7. గోటు వాద్యము (విచిత్రవీణ) : కర్ణాటక, హిందూస్థానీ బాణీలకు చెందిన వాద్యము. మీటు వాద్యము-మెట్లు లేని వీణ.

8. మేండలిన్ : మీటు వాద్యము మెట్లు గలవు. చిన్న వాద్యము. పాశ్చాత్య వాద్యము. కర్ణాటక, హిందూస్థానీ సంగీతముల యందు రాణించుచున్నది.

9. సంతూర్ : కాశ్మీర్ రాష్ట్రమునకు చెందిన జానపద సంగీత వాద్యము హిందూస్థానీ శాస్త్రీయ సంగీతమున రాణించుచున్నది. మూడు స్థాయిలలో గల రాగ స్వరములుగల తీగెలపై రెండు పుల్లలతో వాయించబడు వాద్యము. ఇందు గమకములు పలుకవు. సంగీతము తెలియని వారు వాయించినను అపస్వరములు పలుకవు. ఈమధ్య కాలమున ఈ వాద్యము రాణించుచున్నది.

10. పియానో : తీగెలు గల హార్మోనియం వంటి వాద్యము. పాశ్చాత్య వాద్యము ఇతర తంత్రీవాద్యములు:- దిల్‌రుబా; బాలసరస్వతి; ఎస్రాజ్; స్వరబత్; గిటార్; హర్ప్; స్వరమండల్; గెత్తువాద్యము ఇది వీణ వలె నుండిన తాళవాద్యము.

2. వాయు వాద్యములు (సుషిర వాద్యములు) : గొట్టము నందు గల రంధ్రము ద్వారా గాలిని ఊదుచు హెచ్చు తగ్గులను వ్రేళ్లతో తక్కిన రంధ్రములను తెరుచుట మూయుట ద్వారా వివిధ స్వరములను పలికించు ప్రక్రియ కలిగినవి వాయు, లేక సుషిర, వాద్యములు. సుషిర వాద్యములలో ప్రాముఖ్యత కలిగినవి:-

1. వేణువు, వంశీ, బాఁసురీ, మురళీ, (FLUTE) ఈ పేర్లు పర్యాయ పదములు. ఇది కర్ణాటక హిందూస్థానీ సంగీతములతో ప్రసిద్ధము. శ్రీకృష్ణుడు మురళిని వాయించి మురళీకృష్ణుడు, వంశీ అయ్యెను. వెదురు గొట్టముతో వేణువును తయారు చేయుదురు. మురళీ నాదము అతి శ్రావ్యము. మురళీ ప్రపంచమున గల అన్ని దేశములలోనూ ప్రసిద్ధిగా నున్నది.

2. సన్నాయి, షెహనాయి, నాదస్వరము, ఇవి. సన్నాయి వాద్యమునకు పర్యాయ పదములు. ఈ వాద్యము సన్నాయి, నాదస్వరముగా కర్ణాటక సంగీతమున, షెహనాయిగా హిందూస్థానీ సంగీతమునందు ప్రసిద్ధిగానున్నది. గాత్రమునకు అతి దగ్గరగా దీని నాదముండును. దీని నాదము సుదూరము ప్రసరించును. శుభప్రదమైన వాద్యము.

3. క్లారినెట్ సన్నాయికి పాశ్చాత్య రూపము. దీనికి యాంత్రిక పరికర ఏర్పాటు కలదు. (KEY) ఇందు గమకము ఒక ఉత్ప్రేక్ష. సహజము కాదు. అయినను భారతీయ సంగీతమున ప్రసిద్ధి గాంచినది.

4. ముఖవీణ సన్నాయిని పోలి, పొట్టిగా ఉండి, హెచ్చు శృతుల యందు వాయించబడు పురాతన వాద్యము.

5. ఒత్తు వాద్యము. సన్నాయి వాద్యమును పోలి, ఆధార శృతికి మాత్రము ఊదబడు శృతివాద్యము, ఇందు అన్ని స్వరములు పలుకవు. ఒక్కటే శృతి స్వరము పలుకును.

లయ వాద్యములు:- (తాళ వాద్యములు) వీటి యందు చర్మ వాద్యములు, లోహ వాద్యములు గలవు. ఈ వాద్యముల గుల్లలు (RESONENT BOXES) కర్ర, మట్టి, లోహములతో గలిగి ఉండును.

లయ వాద్యములలో ముఖ్యములు. మృదంగము, తబ్లా, డోలక్, డోలు (తావిక్) కంజిరా, పక్వాజ్, మోర్సింగు, ఘటము, డోల్కీ మొదలైనవి.

1. **మృదంగము:** మృత్+అంగము=మృదంగము. దీని గుల్ల పూర్వము మట్టితో చేసెడివారు. కాలక్రమంగా కర్రతో చేయడం ప్రారంభించారు. ఈ గుల్లకు రెండు ప్రక్కలా చర్మంతో మూసి నాదమును కలుగచేయుదురు. కుడి మూత శృతి స్వరము పలుకును. ఎడమ మూత శ్రావ్యమైన నాదము పలుకును. మృదంగము. కర్ణాటక సంగీతమున బహుళ ప్రసిద్ధము.

2. **డోలు** : (తమిళ భాష యందు తావిల్) సన్నాయి వాద్యమునకు ప్రక్క వాద్యము. రూపము మృదంగమునకు భిన్నముగా నుండిననూ, చేత మృదంగము వలెనే, దీనికి శృతి ఉండదు. అయిననూ చాలా గొప్ప వాద్యము.

3. **తబ్లా** : ఇది హిందూస్థానీ సంగీతమునకు చెందినది. తబ్లా రెండు వస్తువులు. రెండు శాల్తీలు.
1. బాయా ఎడమ చేతితో వాయించునది. 2. తబ్లా-కుడి చేతితో వాయించునది. ఆధార షడ్జమము శృతిగా గలది. తబ్లా లలిత సంగీత, సినిమా సంగీతములందునూ చాలా ప్రాముఖ్యము గాంచినది.

4. **ఘటము** : మట్టి కుండ. శృతి కలిగినది. ఉపతాళ వాద్యము. బహుళ ప్రసిద్ధము.

5. **కంజిరా** (ఖంజరి) కఱ్ఱతో చేసిన పెద్ద అంచులు గల చిన్న పళ్లెము వలె నుండి అడుగు భాగము ఉడుము తోలుతో మూయబడిన లయ వాద్యము. శృతి చేయనక్కరలేదు. మృదంగమున వాయించు రెండు చేతుల శబ్దములు ఒక్క చేతి వ్రేళ్లతోనే వాయించబడు క్లిష్టమైన ఉపవాద్యము. ఈ వాద్యమునకు తగినంత ప్రాచుర్యము కలదు.

6-7. **డోలక్, డోల్కీ, వాద్యములు** భజన, బృందగానముల యందు జానపద సంగీతమున, లలిత, సినిమా సంగీతముల యందు ఉపయోగపడుచున్నవి. ఇవి చర్మ వాద్యములే.

8. **మోర్సింగు** : లోహ వాద్యము. అతి చిన్న వాద్యము. ఇంచు మించు 'థ' అక్షరము వలె నుండును. నోటి యందు ఉంచుకొని వాయించెదరు. శృతిలో నుండును ఉపవాద్యము.

9,10,11. **ఖోల్ వాద్యము, మృదంగ్, పక్వాజ్ వాద్యములు** మృదంగ వాద్యము నందు స్వల్ప భేదములతో నుండు వాద్యములు. కొంచెముగా అరుదైనవే.

12. **జలతరంగ్** : పింగాణీ గిన్నెలలో నీరు పోసి రెండు పుల్లలతో వాయించు వాద్యము తాళ వాద్య కచ్చేరికి పూర్వపు నామము=అవనద్ధ కుతపము:

భారతదేశమున ప్రాంతీయ రాష్ట్రీయ, భేదములు, శాస్త్రీయ, జానపద, లలిత, సినిమా సంగీతములలో, నృత్య, నాట్య, నాటక, యక్షగాన ప్రదర్శనల యందు ఉపయోగ పడు తాళ వాద్యములు అనేకములు.

## 99. సంగీత వాద్యముల పేర్లు, అవి ఉపయోగించు ప్రదేశములు

| Classical Music-String Instruments & Places<br>భారతీయ సంగీత తంతి వాద్యములు - అవి వాడు ప్రదేశములు | | | |
|---|---|---|---|
| 1. | వీణ | Veena | South |
| 2. | వీణ | Veena | North |
| 3. | విచిత్రవీణ | Vichitraveena | S & N |
| 4. | వయోలిన్ | Violin | S & N |
| 5. | వయోలా | Vayola | S & N |
| 6. | గోటు | Gotu | South |
| 7. | గెత్తు | Gettu | South |
| 8. | సరోడ్ | Sarod | North |
| 9. | సితార్ | Sitar | North |
| 10. | సుర్‌శృంగార్ | Sursrungar | North |
| 11. | దిల్‌రుబా | Dilruba | North |
| 12. | ఎస్రాజ్ | Esraj | North |
| 13. | తార్ షె హనాయ్ | Tarshehanayi | North |
| 14. | సుందర్‌బహర్ | Sundarbahar | North |
| 15. | రబాబ్ | Rabab | North |
| 16. | సారంగి | Sarangi | North |
| 17. | సరిందా | Sarinda | North |
| 18. | సన్‌తూర్ | Santoor | North |
| 19. | స్వరమండల్ | Swaramandal | North |
| 20. | సురబహార్ | Surbahar | North |
| 21. | తంబురా | Tambur | South |
| 22. | తంబురా | Thambura | North |

| 100. జానపద సంగీత తంతి వాద్యములు - అవి వాడు ప్రదేశములు<br>**Folk Music-String Instruments & Places** | | | |
|---|---|---|---|
| 23. | ఆనందలహరి | Anandalahari | North |
| 24. | చికారా | Chikara | North |
| 25 | దోతారా | Dotara | North |
| 26 | ధడ్‌సారంగి | Dhadsarangi | North |
| 27. | గోపీచంద్ | Gopichand | North |
| 28. | ఏక్‌తార్ | Ektar | North |
| 29. | ఏక్‌నాదా | Eknada | North |
| 30. | తుంతునె | Thumthune | M.R. |
| 31. | పంజాబ్‌ఏక్తారా | Punjab Ektar | Punjab |
| 32. | చిక్కవీణ | Chikkaveena | Mysore |
| 33. | ధుంధునాదా | Dhundhunada | U.P. |
| 34. | చొంకా | Chomka | M.R. |
| 35. | ఖమక్ | Khamak | Bengal |
| 36. | ఖాదుయ్‌తారా | Khaduitara | Assam |
| 37. | గోగియబాణా | Gogiabana | Assam |
| 38. | రాజసేంగిబాణా | Rajasengibana | M.P. |

| 101. భారతీయ సంగీత గాలి వాద్యములు - అవి వాడు ప్రదేశములు<br>**Music-Wind Instruments - Places** | | | |
|---|---|---|---|
| 39. | వేణు | Flute | South |
| 40 | బాఁసురీ | Bunsuri | North |
| 41 | ఆల్ఘోజా | Alghoja | North |
| 42. | శృంగా | Sringa | North |
| 43. | కొంబు | Kombu | North |
| 44. | అయర్‌కుషల్ | Ayarkushal | T.N. |
| 45. | నాగస్వరమ్ | Nagaswaram | South |
| 46. | ఒత్తు | Ottu శ్రుతివాద్యం | South |
| 47. | షెహనాయ్ | Shehanai | North |
| 48. | పెప్రె | Pepre | M.P. |

| | | | |
|---|---|---|---|
| 49. | బొంగా | Bonga | M.P. |
| 50. | శంఖ్ | Sankh | M.P. |
| 51. | దవళాయ్‌శంఖ్ | Davalaisankh | M.P. |
| 52. | మగుడి | Magudi | South |
| 53. | పుంగి | Pungi | North |
| 54. | నఫరీ | Nafari | North |
| 55. | పిల్లనగ్రోవి | Pillangrovi | North |
| 56. | కాతంగ్‌మురి | Kathangmuri | Assam |
| 57. | కాషరాతి | Kasharathi | Assam |
| 58. | నాగసెరమ్ | Nagaseram | South |

102. భారతీయ సంగీత చర్మవాద్య (లయ)ములు, అవి వాడు ప్రదేశములు

**Music Percution Instruments - Places**

| | | | |
|---|---|---|---|
| 59. | ఫఖావాజ్ | Phakhavaj | North |
| 60. | మృదంగము | Mrudanga | South |
| 61. | ఖోల్ | Khol | Bengal |
| 62. | నక్వారా (నగారా | Naquara | Pershia |
| 63. | భేరి | Bheri | India |
| 64. | ఢోలక్ | Dholak | Punjab |
| 65. | డోలకీ | Dholaki | Punjab |
| 66. | డోల్ | Dhol | N.India |
| 67. | తబ్లా (రైట్) | Thabla | N.India |
| 68. | బాయా (లెఫ్ట్) | Bayah | N.India |
| 69. | చెండా | Chenda | Malbar |
| 70. | డమరు | Damaru | South |
| 71. | డూగి (భాయా) | Doogi | N.India |
| 72. | డప్పు | Dappu | Andhra |
| 73. | తప్పెట | Thumbattam | Andhra |
| 74. | కుండలమ్ | Kundalam | T.Nad |
| 75. | దవండై | Davandi | T.Nad |

| | | | |
|---|---|---|---|
| 76. | కరడివాద్య | Karadivadya | Mysore |
| 77. | ఖంగిరా (నగారా | Khangira | South |
| 78. | ఘటం | Ghatam | South |
| 79. | బుడ్‌బుడుక్కె | Budbudukke | North |
| 80. | డమరుగ | Damaruga | Mysore |
| 81. | చింటా (పె.చి.) | Chinta | Mysore |
| 82. | డఫ్రీ | Dafri | Punjab |
| 83. | ఘుంగ్రూ | Ghungru | South |
| 84. | మంజీరా | Manjeera | South |
| 85. | కర్‌తాళ్ | Kartal | South |
| 86. | చిప్లా | Chipla | South |
| 87. | మదోల్ | Madol | Bengal |
| 88 | జలతరంగ్ | Jaltharang | South |
| 89. | కాష్టతరంగ్ | Kasht Tarang | North |
| 90. | తబ్లాతరంగ్ | Tabla Tarang | North |
| 91. | సాధారణతబలా | Sadharanatabala | Delhi |
| 92. | ముకుర్‌తరంగ్ | Mukur Tarang | South |
| 93. | మోర్సింగ్ | Morsing | South |
| 94. | కోలాటమ్ | Kolatam | South |
| 95. | కటోరా | Katora | North |
| 96. | దండ్‌తా | Dandtal | South |
| 97. | తాషా | Thasha | South |
| 98. | పమ్పై | Pampai | South |
| 99. | తవిల్ (డోలు) | Thavil | South |
| 100. | ఉరిమి | Urimi | T.Nad |
| 101. | ఉడల్ | Udal | T.Nad |
| 102. | అఖారా | Akhara | M.P. |
| 103. | తర్బూలి (తాషా) | Tharbuli | M.P. |
| 104. | వీరవండె | Veeravandai | T.Nad |
| 105. | కంసాలె | Kamsale B.M.R. | Mysore |
| 106 | ఝాంజ్ | Jhanj (B.T.) | North |
| 107. | గగ్గర | Gaggara | Andhra |
| 108. | బ్రహ్మతాళ | Brahma Tala | T.Nad |

| | | | |
|---|---|---|---|
| 109. | ఉడుక్కు | Udukku | T.Nad |
| 110. | కాక్సింగ్ | Kaksing | N.W. |
| 111. | కాబామ్ | Kabam | N.W. |
| 112. | జగాతె | Jagathe | Mysore |
| 113. | చెండామల్కర్ | Chandamalkar | Mysore |
| 114. | మద్దళమ్ | Maddalam | Mysore |
| 115. | ఎడక్కా | Edakka | Mysore |
| 116. | తిమిలా | Thimila | Mysore |
| 117. | చెంగలా | Chemgala | Kerala |
| 118 | హురుక్ | Huruk | Lucknow |
| 119. | కటోరా | Katora | |
| 120. | తకారీ | Thakari | Calcutta |
| 121. | పెపా | Pepa | Assam |
| 122. | చిప్లా | Chipla (Ktl.) | Assam |
| 123. | ఖమక్ | Khamak | Assam |
| 124. | భోర్తాళ్ | Bhortal | Assam |
| 125. | రోఛెమ్ | Rotchem | Manipur |
| **103. భారతీయ లోహవాద్యములు - అవి వాడు ప్రదేశములు** | | | |
| 126. | బాణ | Bana | Manipur |
| 127. | కింగ్రీ | Kingri | Manipur |
| 128. | గుమేలా | Gumela | Manipur |
| 129. | తర్బూలి | Tharbuli | Manipur |
| 130. | తుంబకీనారీ | Thumbakanari | Kashmir |
| 131. | దస్కృతియా | Daskathiya | Orissa |
| 132. | నంధవాణి | Nandhavani | |
| 133. | భాంబే | Bhombe | Kojikod |
| 134. | రుంజీ | Runji | Kojikod |
| 135. | సోయెంకో | Soyenko | Kojikod |
| 136. | జయ్‌గుంఘి | Jiagunghi | Kojikod |
| 137. | గుగుచూ | Guguchu | Kojikod |
| 138. | టోరోటారో | Torotaro | M.P. |
| 139. | తుహిలా | Thuhila | M.P. |
| 140. | తిరియో | Thirio | M.P. |
| 141. | ధమ్‌పెలా | Dhampela | M.P. |
| 142. | బంక్ | Bunk | M.P. |

## 104. తాళ ప్రకరణము

శ్లో॥ నానా మార్గైర్లయో యత్ర । యతీనాం స్యాత్కలానిధౌ
తం దక్షిణం శివం నౌమి చిత్రం వృత్తిమయం ధృవం

సమస్త ఖగోళము, వ్యోమమండలములు, ప్రపంచము, జీవరాసులు, లయాన్వితము, శివుడు లయ స్వరూపుడు, లయకారి, లయమనగా ఒకదానితో ఒకటి ఐక్యతను పొందుట ద్వైతము అద్వైతమగుట (To Merge)

సంగీతమునందు లయ అంతర్లీనముగా నుండును. సంగీతమునకు లయ అంతర్భూతము, సంగీతము, వాద్యము, నృత్యము, సాహిత్యము, కవిత్వము, చిత్ర లేఖనము, శిల్పము, మొదలైన లలిత కళాన్వితములైన కల్పనా జగత్తు యొక్క హృదయము లయాన్వితము.

గీతవాద్యముల యందుగల లయ యొక్క బాహ్యరూపము తాళము. తాళము యొక్క ఆత్మ, హృదయము, లయ.

తాళము నందు (లయ యందు) గీత వాద్యములు నృత్యములు కూడా నెలకొని యున్నవి. స్వరము, సాహిత్యముతో కలిసిపాట అగుచున్నది. పాటకు లయ, తాళము తప్పక యుండును.

శివశక్తి సమాగమము తాళము. త కారము శంకరుడనియు, లకారము శక్తి యనియును శాస్త్రము.

తాళము హస్త ద్వయ సంయోగము వలన కలుగుచు, తాళము దశ ప్రాణములతో (దశల క్షణములతో) ప్రకాశించుచున్నది.

తాళము 'మార్గము', దేశి, అని రెండు విధములు. అవి మరల ఒక్కొక్కటి శుద్ధము, సాలగము, సంకీర్ణము అని 3 విధములుగా నున్నది.

## 105. తాళదశ ప్రాణములు (లక్షణములు)

శ్లో॥ కాలోమార్గః క్రియాంగాని గ్రహేజాతి కళాలయః
యతి ప్రస్థారకశ్చేతి తాళప్రాణ దశాస్మృతాః

1. కాలము ; 2. మార్గము ; 3. క్రియ : 4. అంగము :
5. గ్రహము ; 6. జాతి ; 7. కళ : 8. లయ : 9. యతి : 10. ప్రస్థారము.

## 1. కాలప్రాణము

నూరు తామర రేకులు దొంతరగా చేర్చి వానిని సూదితో పొడవగా, అందు ఒక తామర రేకు తెగుటకు పట్టు కాలము "క్షణము" అనబడును. అట్టి

| | | |
|---|---|---|
| 8 లక్షణములు | = | 1 లవము |
| 8 లవములు | = | 1 కాష్టము |
| 8 కాష్టములు | = | 1 నిమిషము (రెప్పపాటు) |
| 8 నిమిషములు | = | 1 కళ |
| 2 కళలు | = | 1 చతుర్భాగము |
| 2 చతుర్భాగములు | = | 1 అనుదృతము |
| 2 అనుదృతములు | = | 1 దృతము |
| 2 దృతములు | = | 1 చతురశ్ర లఘువు |
| 2 చతురశ్ర లఘువులు | = | 1 గురువు |
| 3 చతురశ్ర లఘువులు | = | 1 ప్లుతము |
| 4 చతురశ్ర లఘువులు | = | 1 కాకపాదము |

## 2. మార్గ ప్రాణము

ఒకదానికొకటి ద్విగుణీ కృతములైన కాలప్రమాణములతో గీతమును గానము చేయుట మార్గమనబడును. మార్గములు ఆరు విధములు. ఇవియే షట్కాలములని కూడ వ్యవహరింపబడుచున్నది.

దక్షిణ మార్గము : ఒక తాళ క్రియకు రెండు దీర్ఘాక్షర ప్రమాణములు గల కాలము. ఇది ఇప్పటి అన్వయము వాడుక ప్రకారము ఒక క్రియకు 32 హ్రస్వాక్షరముల కాల ప్రమాణము (32 Units)

వార్తిక మార్గము : ఒక క్రియకు ఒక దీర్ఘాక్షర కాల ప్రమాణము. ప్రస్థుత వాడుక ప్రాకారము ఒక క్రియకు 16 హ్రస్వాక్షరకాల ప్రమాణము (16 Units)

చిత్రము: : ఒక క్రియకు ఒక హ్రస్వాక్షర కాల ప్రమాణము ఇప్పటి వాడుక. ఒక క్రియకు 8 హ్రస్వాక్షరకాల ప్రమాణము (8 Units)

చిత్రతరము : ఒక క్రియకు అర్ధ హ్రస్వాక్షర కాల ప్రమాణము. సమకాలీన అవగాహన ఒక క్రియకు 4 హ్రస్వాక్షర కాల ప్రమాణము.

చిత్రతమము : ఒక క్రియకు పావు. 1/4 హ్రస్వాక్షర కాలప్రమాణము. ప్రస్థుత పద్ధతి ఒక క్రియకు 2 హ్రస్వాక్షర కాల ప్రమాణము.

అతి చిత్రము : ఒక క్రియకు 1/8 హ్రస్వాక్షర కాల ప్రమాణము అనగా ఇప్పటి ఒక క్రియకు ఒక హ్రస్వాక్షర కాల ప్రమాణము.

గమనిక : శాస్త్ర వాచకములలో పేర్కొనిన 2 దీర్ఘాక్షరములు మొదలు 1/8 హ్రస్వాక్షర కాల ప్రమాణము వరకు తార్కిక విలువలు లేక యున్నవి. హ్రస్వాక్షరము (Unit) ప్రమాణముగా వాడుకలో నుండుటయే సమంజసముగా నున్నది. సంప్రదాయ ప్రదర్శిని యందు మాత్ర యనగా 4 అక్షరములు, అని నిర్వచింపబడి యున్నది.

| | | | |
|---|---|---|---|
| దక్షిణ మార్గమునకు | = 8 మాత్రలు అనగా | 32 | అక్షరములు |
| వార్తికము | = 4 మాత్రలు | 16 | అక్షరములు |
| చిత్రము | = 2 మాత్రలు | 8 | అక్షరములు |
| చిత్రతరము | = 1 మాత్ర | 4 | అక్షరములు |
| అర్ధ చిత్రము | = 1/2 మాత్ర | 2 | అక్షరములు |
| అతిచిత్రము | = 1/4 మాత్ర | 1 | అక్షరము |

గమనిక = పై ప్రమాణములు ఆచరణ యోగ్యములుగా నున్నవి.

## 3. క్రియాప్రాణము

కుడి హస్తమును ఎడమ హస్తము నందు యుంచుచు కొట్టుచు, వ్రేళ్లను ఎంచుచు, కుడి హస్తమును వెనకకు తెరుచుచు తాళమును వేయుట సంప్రదాయము, ఈ క్రియలు సల్పుచు ఎంచుట తాళ క్రియలుగా వ్యవహరింపబడుచున్నవి.

ఈ క్రియలు మార్గములు దేశ్యములు అను రెండు విధములుగా ఉన్నవి.

"మార్గము" అను పదము ఏ లలిత కళ యందు ముఖ్యముగా సంగీతము నందు వచ్చునప్పుడు ఆ విషయము మారని విలువలు ప్రమాణములు కలిగినది అనియు, దేశకాల పరిస్థితులకు అతీతమైనది అనియు, విశ్వజనీనమైనదనియు. శాశ్వతమైనదనియు, మార్గ దర్శకమనియు, ఆదర్శమైనదనియు, సుసంప్రదాయ బద్ధమైనదనియు, సశాస్త్రీయమైనదనియు అన్వయించవలెను.

ఇందుకు భిన్నముగా "దేశ్య" మనినచో ఆయా దేశమునకు, ప్రాంతమునకు, ఆయా కాలమునకు ఒక్కొక్క సందర్భమున అన్య దేశీయ మైనదనియును మార్పునకు, మారుచున్న విలువలకు సరితూగునది అనియును. శాశ్వత ప్రమాణములకు భిన్నముగా నుండునదనియును, సందర్భమును బట్టి అన్వయించుకోవలెను.

మార్గము పాండితీ ప్రతిభ కలిగినది. క్లిష్టమైనది అయి ఉండుట పరిపాటి దేశ్యము సర్వజనాకర్షణముగా సులభముగా ఉండును.

మార్గ క్రియలు సశబ్ద క్రియలనియు, నిశ్శబ్ద క్రియలనియు రెండు విధములు.

*సశబ్ద క్రియలు 4*

1. ధృవము : రెండు వ్రేళ్లతో సశబ్దముగా వేయు చిటిక.
2. తాళము : ఎడమ అర చేతియందు కుడి అరచేతితో శబ్దము చేయుట.
3. శమ్యము : కుడి అరచేతియందు ఎడమ అరచేతితో శబ్దము చేయుట.
4. సన్నిపాతము : కుడి ఎడమ అరచేతులను అభిముఖముగా ఊర్ధ్వముఖముగా ఉంచి శబ్దించుట.

*మార్గ నిశ్శబ్ద క్రియలు 4*

1. ఆవాపము : పతాక హస్తమును ఊర్ధ్వముఖముగా నిలబెట్టి తర్జని మొదలుగా 4 వ్రేళ్లను లయబద్ధముగా ముడుచుట.
2. నిష్క్రామము : పై విధముగా ముడిచిన 4 వ్రేళ్లను లయబద్ధముగా విప్పుట.
3. విక్షేపము : పై హస్తమును కుడి ప్రక్కకు 4 అక్షర కాలములలో లయ బద్ధముగా విదిలించుచు 4 అంచెలుగా విదిలించుట.
4. ప్రవేశిక : పై హస్తమును క్రిందుగా 4 అక్షర కాలములలో లయ బద్ధముగా ఎడమ ప్రక్కకు తీసుకొని వచ్చుట.

ఈ మార్గ క్రియలు మార్గ తాళములలో ఉపయోగపడును. ఈ మార్గ క్రియలు ఈనాటి సాధారణ సంగీత సాధన యందు వాడుకలో లేవు.

*దేశ్యక్రియలు 8 విధములు*

| | | | |
|---|---|---|---|
| 1. | ధృవక | : | కుడితొడపై కుడి అరచేతిని మృదువుగా కొట్టుట లేక కుడి అరచేతితో ఎడమ అర చేతియందు మృదువుగా కొట్టుట (వాడుకలో నున్న సాధన/ఘాత) |
| 2. | సర్పిణి | : | కుడిచేతి పతాక హస్తమును ఎడమ వైపునకు చాచుట. |
| 3. | కృష్ణ | : | ఎడమ వైపున గల పతాక హస్తమును కుడివైపునకు తీసుకొని వచ్చుట. |
| 4. | పద్మిని | : | అరచేతిని తల క్రిందుగా చాచుట |
| 5. | విసర్జితము | : | పై అరచేతిని వెలుపలకు విసురుట |
| 6. | విక్షిప్త | : | హస్త వ్రేళ్లను క్రమముగా ముడుచుట |
| 7. | పతాకము | : | అరచేతిని పైకెత్తుట |
| 8. | పతిత | : | పై అరచేతిని క్రిందికి తెచ్చుట |

పై 8 దేశ్యక్రియల యందు, ధృవక, విక్షిప్త, విసర్జిత క్రియలు సుళాది సప్త తాళములలో ఉపయోగపడుచున్నవి. తక్కిన క్రియలు 108 తాళములలోనూ, గురు, ప్లుత, కాకపాద అంగములలోనూ ఉపయోగపడుచున్నవి. 108 తాళములు, గురు, ప్లుత, కాకపాదక్రియలు బహు అరుదుగా నున్నవి.

## 4. అంగప్రాణము (తాళ)

తాళము, సంగీతము నందు, గీతమునందు, వాద్యమునందు, నృత్యమునందు ఒక ముఖ్యమైన అవినాభావ సంబంధము గల, "ప్రాణము". అనదగిన అంశము.

తాళమునకు శరీరమునకు వలెనే అంగములు కలవు. ఆ అంగములకు క్రియలు ఆ క్రియలకు అక్షర కాలములు కలవు.

తాళాంగములు ఆరు

1. అను ధృతము: ఒక క్రియ. ఒక ఘాత. గుర్తు. చంద్రాకారము U

2. ధృతము : దెబ్బ. ఉసి. 1 ఘాత, 1 విసర్జితము, రెండు క్రియలు. గుర్తు- పూర్ణ చంద్రాకారము ం

3. లఘువు : ఒక ఘాత, కొన్ని విక్షిప్తములు. అనగా వ్రేళ్లను ముడుచుట (లయ బద్ధముగా)

లఘువులు 5 జాతులుగా ఉన్నాయి.

1. తిశ్రజాతి లఘువు. = 3 క్రియలు ఒక ఘాత 2 వ్రేళ్లు
2. చతురశ్రజాతి లఘువు = 4 క్రియలు ఒక ఘాత 3 వ్రేళ్లు
3. ఖండ జాతి లఘువు = 5 క్రియలు ఒక ఘాత 4 వ్రేళ్లు
4. మిశ్రజాతి లఘువు = 7 క్రియలు ఒక ఘాత 6 వ్రేళ్లు
5. సంకీర్ణజాతి లఘువు = 9 క్రియలు ఒక ఘాత 8 వ్రేళ్లు

పై మూడు తాళాంగములు ముఖ్యములు. ఇవి గాక ఇంకొక 3 అంగములు కలవు.

1. గురువు = 8 క్రియలు
1 ఘాత, 3 వ్రేళ్లు, కుడిచేతిని
4 అక్షరములలో క్రిందికి విడుచుట గుర్తు (8)

2 ప్లుతము = 12 క్రియలు
1 ఘాత 3 వ్రేళ్లు
4 అక్షరకాలము ఎడమ చేతిని చుట్టి,
4 అక్షరకాలములలో క్రిందికి విడుచుట సంజ్ఞ (ర్ట)

3. కాకపాదము = 16 నిశ్శబ్ద క్రియలతో కూడిన అంగము
కుడిచేతిని 4 అక్షర కాలములు ఎడమ ప్రక్కకు
పిమ్మట 4 అక్షర కాలములు కుడి ప్రక్కకు
పిమ్మట 4 అక్షర కాలములు పైకి ఎత్తి
పిమ్మట 4 అక్షర కాలములు క్రిందికి దించుట సంజ్ఞ +

## షడంగముల విశేష నామములు లేక నామాంతరములు

1. 1) అనుదృతము (2) అర్ధ చంద్రము (3) వ్యంజనము (4) అనునాసికము (5) అవ్యక్తము (6) విరామము

2. (1) ధృతము () అర్ధమాత్ర (3) వ్యోమము 94) బిందుకము (5) వలయము

3. (1) లఘువు (2) మాత్ర (3) సరళము (4) హ్రస్వము (5) కళ.

4. (1) గురువు (2) ద్విమాత్రకము (3) వక్రము. (4) కాణము (5) యమళము (6) దీర్ఘము.

5. (1) ప్లుతము (2) సమోద్భవము (3) దీపము (4) త్రియంగము (5) త్రిమాత్రకము.

6. (1) కాకపాదము (2) హంసపాదము (3) నిశ్శబ్దము (4) చతుర్లఘువు.

## షోడశాంగముల పట్టిక

తాళషడంగములు, వాటిపేర్లు, సంజ్ఞలు, అక్షరకాలములు, క్రియలు, మాత్రలు దెలుపు పథకము.

| అంగ సంఖ్య | 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|---|
| షడంగముల- -నామములు. | అను- -ద్రుతము | ద్రుతము | లఘువు | గురువు | ప్లుతము | కాకపాదము |
| అంగసంజ్ఞలు | U | ० | 1 | 8 | 8 | ✝ |
| అక్షరకాలములు | 1 | 2 | 4 | 8 | 12 | 16 |
| క్రియలు | కొట్టుట | కొట్టి, విసరుట | కొట్టి, వ్రేళ్లను ఎంచుట | కొట్టి వ్రేళ్లను/ఎంచి, విడచుట | సర్పిణి, చుట్టి, విడచుట | కృష్ణ పతాక పతిత ములజేయుట |
| మాత్రలు | పాతిక | అర | ఒకటి | రెండు | మూడు | నాలుగు |

షోడశాంగములు, వాటిపేర్లు, అంగసంజ్ఞలు, అక్షరకాలమును దెలిపెడి పథకము

| అంగ సంఖ్య | షోడశాంగముల పేర్లు | అంగ సంజ్ఞలు | అక్షర కాలము |
|---|---|---|---|
| 1. | అనుద్రుతము | U | 1 |
| 2. | ద్రుతము | O | 2 |
| 3. | ద్రుత విరామము | OU | 3 |
| 4. | లఘువు (చతురశ్ర) | I | 4 |
| 5. | లఘు విరామము | IU | 5 |
| 6. | లఘు ద్రుతము | IO | 6 |
| 7. | లఘు ద్రుత విరామ్యం | IOU | 7 |
| 8. | గురువు | 8 | 8 |
| 9. | గురు విరామము | 8U | 9 |
| 10. | గురుద్రుతము | 8O | 10 |
| 11. | గురుద్రుత విరామము | 8OU | 11 |
| 12. | ప్లుతము | 8 | 12 |
| 13. | ప్లుతవిరామము | 8U | 13 |
| 14. | ప్లుతద్రుతము | 8O | 14 |
| 15. | ప్లుతద్రుత విరామము | 8OU | 15 |
| 16. | కాకపాదము | ✝ | 16 |

## 5. గ్రహప్రాణము

గ్రహము = ప్రారంభించుట గ్రహించుట

తాళము నందు గీతము ప్రారంభించు స్థానము గ్రహము. అనగా ఏ సంగీత రచన యైనను తాళము నందు తాళముతో పాడుట మొదలు పెట్టునప్పుడు ఆ మొదలు పెట్టు తాళ స్థానమును గ్రహమని అందురు. తమిళమున "ఎడుప్పు" అని అందురు.

ఈ గ్రహము సమము, విషమము అను రెండు విధములు. మరల విషమ గ్రహము రెండు విధములు. అతీతము, అనాగతము.

**సమ గ్రహము :** పాట తాళము ఒకే స్థానమునందు ఒకే సారి అనగా తాళ ప్రారంభముననే సంగీత రచన కూడా ప్రారంభించుటకు సమగ్రహమని పేరు.

ఉదా: అన్ని ఆదితాళ వర్ణములు గీతములు మొ॥

1. బ్రోచేవారెవరే - శ్రీరంజని

2. తెలిసి రామ చింతన - పూర్ణ చంద్రిక మొ॥

**విషమ గ్రహము :** అతీత గ్రహము - పాట ప్రారంభించిన తరువాత తాళము ప్రారంభించినచో అది అతీత గ్రహము.

తాళము ప్రారంభించి వేయుచు తాళము యొక్క చివరి క్రియల దగ్గర పాట ప్రారంభించినను, అది అతీత గ్రహమే.

భైరవి అట తాళ వర్ణమున మొదటి, రెండవ చిట్ట స్వరములు ప్రారంభించిన స్థానములు అతీత గ్రహమునకు చక్కని ఉదాహరణలు.

3వ చిట్ట స్వరము సమగ్రహమునకు ఉదాహరణ.

**అనాగత గ్రహము :** తాళము వేయుట మొదలు పెట్టి తరువాత ఒకటి రెండు క్రియల వెంటనే ప్రారంభించిన అది అనాగత గ్రహము.

అనాగత గ్రహమున ఎన్నియో కీర్తనలు, కృతులు ప్రారంభింపబడును. సీతాపతే; ఎంత వేడుకొందు, ఉండేది రాముడొకడు; నిధిచాలసుఖమా మొదలైనవి.

భైరవి అట తాళ వర్ణ ప్రారంభం ; ; ; ; నీ సా రీ, గ సా రీ - తాళము ప్రారంభించిన తరువాత 3వ క్రియలో ఈ వర్ణము ప్రారంభించబడినది. ఇది కూడ అనాగత గ్రహమునకు చక్కని ఉదాహరణ.

# 6. జాతి ప్రాణము

తాళాంగములలో గల లఘువునకు 5 జాతులు కలవు.

1. త్రిశ్రజాతి లఘువునకు 3 క్రియలు (స్వర్గ లఘువు) ఒక దెబ్బ 2 వ్రేళ్లు
2. చతరశ్రజాతి లఘువునకు (మనుష్య) 4 క్రియలు. ఒక దెబ్బ 3 వ్రేళ్లు
3. ఖండ జాతి లఘువునకు (దేశ్యలఘువు) 5 క్రియలు. ఒక దెబ్బ 4 వ్రేళ్లు
4. మిశ్రజాతి లఘువునకు (హంసలఘువు) 7 క్రియలు. ఒక దెబ్బ 6 వ్రేళ్లు
5. సంకీర్ణ జాతి లఘువునకు (చిత్రలఘువు) 9 క్రియలు. ఒక దెబ్బ 8 వ్రేళ్లు

పై అయిదు వాడుకలో ఉన్న ముఖ్య జాతులు గాక, ఇప్పుడు వాడుకలో లేనివి. ముఖ్యము కానివి. అయినను తెలుసుకోదగినవి (Academic Interest) 5 లఘువులు కలవు. అవి

1. దివ్య లఘువు 6 క్రియలు
2. సింహ లఘువు 8 క్రియలు
3. వర్ణ లఘువు 10 క్రియలు
4. వాద్య లఘువు 12 క్రియలు
5. కర్ణాటక లఘువు 16 క్రియలు

అయిదు జాతులలో, అయిదు జాతి లఘువులలో, అతి శ్రేష్ఠమైనది అతి ఉపయోగమైనది, మిగుల వాడుకలో కలిగినది., చతురశ్రజాతి లఘువు. తరువాత ప్రాముఖ్యత త్రిశ్రజాతి లఘువు.

త్రిశ్ర + చతురశ్ర కలసి = మిశ్రజాతి

3 + 4 = 7 క్రియలు అయినది.

త్రిశ్ర + మిశ్ర కలసి సగ భాగము చేసిన

(3 + 7 = 10 ÷ 2 =) ఖండజాతి అయినది.

ఖండ + చతురశ్ర కలసి సంకీర్ణ జాతి అయినది

5 + 4 = 9 క్రియలు

## 7. కళా ప్రాణము (గతి, గమనం, నడ)

కళ అనే పదమునకు 2 అర్థములు కలవు. ఈ పదమును సందర్భానుసారముగా అవగాహన చేసుకోవలెను.

కళ = 4 అక్షరముల కాలము

కళ = 1 అక్షర కాలము

ఆది తాళము ఒక కళ అన్నచో క్రియకు నాలుగు అక్షరములు నడచు కాలము అని అర్థము. మధ్యమ కాల ఆదితాళ కీర్తనలు ఈ (ఏకకళ) కాలమున నడుచును.

రెండు కళల చౌకము అనిన 8 అక్షరములు క్రియకు నడచును అని అర్థం. విళంబ కాలములో నడచు ఆది తాళ కీర్తనలు ఈ (2 కళలచే ) కాలమున నడచును.

ఇంకొక సందర్భమున ఏకకళ, ద్వికళ, చతుష్కల అనిన ఒకటి, రెండు, నాలుగు అక్షరములని అర్థం. ఈ అర్థము అంతగా వాడుకలో లేదు.

### గతి భేదం

గతి, గమనం, నడై, అనునవి పర్యాయపదములు.

ఒక క్రియకు, 3 కళలు (3 అక్షరములు) నడచిన తిశ్రగతి, తిశ్రనడ (గతి.)

ఒక క్రియకు 4 అక్షరములు (కళలు) నడచిన చతురశ్రనడ (గతి)

ఒక క్రియకు 5 కళలు లేక అక్షరములు నడచిన ఖండగతి (నడ)

ఒక క్రియకు 7 కళలు లేక అక్షరములు నడచిన మిశ్ర నడ (గతి)

ఒక క్రియకు 9 కళలు (అక్షరములు) నడచిన మిశ్రనడ (గతి)

## 8. లయ ప్రాణము

లయ అనగా ఒక తాళమున అంతర్భాగముగా నుండు కళలు, అక్షరములు, క్రియలు సూక్ష్మమైన వ్యత్యాసము కూడా లేకయే సమాంతరముగా నడచుట లయ శుద్ధము అనబడును.

తాళము యొక్క నడక వేగము లయ. ఈ లయ 3 విధములు మరల ఆ మూడు విధములు ఒక్కొక్క విధము 3 విధములుగా విభజింపబడి 9 సూక్ష్మ విధములుగా రూపొందినవి.

1. విళంబ లయ ; 2. మధ్యలయ ; 3. ధృతలయ

విళంబలయ చౌక కాలము అని కూడా వ్యవహరింపబడుచున్నది.

1) దీక్షితర్ వారి తోడి, భైరవి, కళ్యాణి, రాగాలలో గల నవావరణ కృతులు, త్యాగరాజ స్వామి వారి ఓరంగశాయి, మోహనరామకృతులు, శ్యామశాస్త్రివారి, మాయమ్మా, సరియెవ్వరమ్మ కృతులు, విళంబలయకు ఉదాహరణలు.

2) త్యాగారాజ స్వామి ఆదితాళ మధ్యమ కాల కృతులు మధ్య లయకు ఉదాహరణలు. నెనరుంచినాను, తెలిసి రామ చింతనతో, మొ॥

3) దురిత లేక ధృత, లయలో ఉండు సంగీతము అతి వేగముగా ఉండును. 3వ కాల వర్ణము, దురిత తానము, రాగమున చివర (బ్రిగాలు) వేగ సంగతులు ఈ దృత కాలమునకు ఉదాహరణలు.

ఈ లయలు వివిధ ధశలలో సూక్ష్మ భేదములతో 9 విధములుగా మరల విభజన చెందినవి.

| | | |
|---|---|---|
| 1. విళంబ విళంబ | 2. విళంబ మధ్య | 3. విళంబ దృత |
| 1. మధ్య విళంబ | 2. మధ్య మధ్య | 3. మధ్య దృత |
| 1. దృత విళంబ | 2. దృత మధ్య | 3. దృత దృత లయలు |

## 9. యతి ప్రాణము

తాళమున గల అంగములను పేర్చి ప్రస్తరించి వాటి పేర్పులలో గల వ్యత్యాసములను బట్టి ఆ అంగములకు నామములును ఒసగిరి. ఆ నామములను "యతి" అని పిలిచిరి.

ఒక తాళమున అన్నియును లఘువులే, లేక అన్నియును దృతములే అనుకొందము. అట్టి ఏర్పాటుకు పిపీలక యతి లేక సమయతి అని పేరు. పిపీలకము=చీమ

ఉదా: । । । । । । ।

చీమలు బారులు తీర్చి నడచినట్లు ○ ○ ○ ○ ○ ○ ○

**గోపుచ్ఛ యతి** : మొదటి ఎక్కువ క్రియలు గల అంగములు (ఆవుతోక వలె ఉండును). క్రమముగా తక్కువ క్రియలు గల అంగములు గలది. ✝ 8 8 । ○ ○

**స్రోతోవహయతి** : నదివలె యుండునది (గోపచ్ఛయతికి ఎదురు లేక తలకిందు) తాళము మొదట చిన్ని అంగములు క్రమముగా పెద్ద అంగములు U ○ । 8 8 ✝

**డమరు యతి** : శివుని కరమునందు గల తాళ వాద్యము వలె నుండు అంగములు.



మొదట ఎక్కువ క్రమముగా కురుచన క్రమముగా మరల ఎక్కువ క్రియలు గల అంగములు పేర్పు ✝ 8 । ○ U ○ । 8 ✝

**మృదంగ యతి** : మృదంగ ఆకారమువలె మొదట కురుచ క్రమముగా మధ్య వరకు ఎక్కువ తిరిగి క్రమముగా కురుచ సంఖ్య గల క్రియ కలిగిన అంగముల పేర్పు



**ఉదా:-** U ○ । 8 ✝ 8 । ○ U

**విషమ యతి** : ఒక క్రమ పద్ధతిని అనుసరించిక యుండు అంగముల పేర్పు

**ఉదా:-** ✝ U 8 । ○ 8 T U

# 10. ప్రస్తార లక్షణము

ప్రస్తారము స్వర కల్పనకు మిగుల తోడ్పడుచున్నది.

కొన్ని స్వరములను గాని, కొన్ని తాళాంగములనుగాని, కొన్ని సంఖ్యలను గాని తీసుకొని వివిధ క్రమ పద్ధతులలో ప్రస్తరించుట. ఈ ప్రస్తారము వలన దురుక్తి (Repetation) ఉండదు. అతి ఎక్కువ సంఖ్యలో స్వరములు మొదలైన వాటిని రాబట్టుట వీలగును. కల్పన, సృజన శక్తి శాస్త్రీయ పద్ధతులలో పొందుటకు ప్రస్తార ప్రాణము ఉపకరించును.

ఉదాహరణకు సరి అను రెండు స్వరములను ప్రస్తరించిన (1) సరి (2) రిస (3) సస (4) రిరి ఇవి నాలుగు విధములుగా వచ్చినవి. దీర్ఘములు, జంటలు తీసుకొన్నచో [illegible]గా స్వరములు వచ్చును.

ఈ ప్రస్తారము శాస్త్రీయ పద్ధతులలో మొట్టమొదట సారిగా కనుగొనిన మహా వాగ్గేయకారుడు శ్రీ శ్యామశాస్త్రివారు అని అందురు.

తాళము నందు ఈ ప్రస్తారము జరుపు విధము ఒక లఘువును తీసుకొని అందుగల అంతర్భాగములను ప్రస్తరించవచ్చును. (1) లఘువు; (2) ౦౦ రెండు దృతములు; (3) 0UU ఒక దృతము రెండు అనుదృతములు; (4) UUUU 4 అను దృతములు; (5) UUO రెండు అను దృతములు ఒక దృతము; (6) UOU ఒక అనుదృతము ఒక దృతము మరల ఒక అనుదృతము; (7) ʊ0 ఒక దృత శేఖరము ఒక దృతము: (8) Uʊ అను దృతము దృతశేఖరము. ఇట్లు 8 విధములైన ప్రస్తారములు ఏర్పడినవి.

ఇటులనే షోడశాంగములును ప్రస్తరించవచ్చును.

ఈ ప్రస్తారములు 14 విధములు.

1. నష్టము ; 2. ఉద్దిష్టము ; 3. పాతాళము. 4. మహాపాతాళము : 5. అనుదృతమేరువు. 6. దృతమేరువు; 7. దృత శేఖర మేరువు. 8. లఘు యేరువు. 9. గురు మేరువు. 10. ప్లుత మేరువు 11. కాకపాద మేరువు 12. సంయోగ మేరువు; 13. ఖండ ప్రస్తారము. 14. యతి ప్రస్తారము.

ప్రస్తార ప్రాణ విషయము చాల విస్తారమైనది. ఈ విషయమున ప్రత్యేక గ్రంధములు కలవు.

## 106. తాళము: అనులోమ, విలోమ, ప్రతిలోమ ప్రక్రియలు

**అనులోమము** : తాళమును ప్రథమ కాలమున వేయుచు గానమును ప్రథమ, ద్వితీయ, తృతీయ మొదలైన షట్కాలములను ద్విగుణీకృత వేగమున పాడుట, వాయించుటను అనులోమ మందురు.

**విలోమము** : తాళము ప్రథమ, ద్వితీయ తృతీయ మొదలైన కాలములలో వేయుచు గానము గాని వాదన గాని ప్రథమ కాలము గానే పాడుట వాయించుట.

ఇట్టి సాధనల వలన లయ జ్ఞానమును, తాళ జ్ఞానము అలవడి పల్లవి జ్ఞానము తేజో వంతమగును.

**ప్రతిలోమము** : తాళము 3వ కాలమున ప్రారంభించి వేయుచు, గీతమును, ప్రథమ, ద్వితీయ, తృతీయ కాలములందు గానము చేయుట. ఇందు తాళము మూడవ కాలమున మార్పు లేకుండ యుండును. పాట యొక్క కాలములు ద్విగుణీకృతముగా అగుచుండును.

## 107. 7 తాళములు (సప్త తాళములు)

| | | అంగములు |
|---|---|---|
| 1. | ధ్రువ | I0II |
| 2. | మఠ్య | I0I |
| 3. | రూపక | 0I |
| 4. | ఝంప | IU0 |
| 5. | త్రిపుట | I00 |
| 6. | అట | II00 |
| 7. | ఏక | I |

పై సప్త తాళముల యందు వచ్చు లఘువుల పంచ జాతుల మార్పులను బట్టి. ఈ సప్త తాళములు 35 సూళాది తాళములైనవి. లఘువునకు, తిశ్ర 3; చతురశ్ర 4; ఖండ 5; మిశ్ర 7; సంకీర్ణ 9; జాతులుగా క్రియల సంఖ్య మారును.

వాటి అంగములు, ఈ 35 సూళాది తాళములు వాటి అంగములు క్రియలు వాటి వివిధ నామములు మొదలైన వాటితో ఈ దిగువ పట్టిక యందు గ్రహించనగును.

## 108. 35 సూళాది తాళముల పట్టిక

### పంచత్రింశతి (35) తాళముల పథకము

| తాళ సంఖ్య | సప్తతాళముల పేర్లు | అంగ సంజ్ఞలు | త్రిశ్రజాతి 3 క్రియలు | | చతురశ్రజాతి 4 క్రియలు | | ఖండజాతి 5 క్రియలు | | మిశ్రజాతి 7 క్రియలు | | సంకీర్ణజాతి 9 క్రియలు | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | తాళముల పేర్లు | క్రియల సంఖ్య | తాళముల పేర్లు | క్రియల సంఖ్య | తాళముల పేర్లు | క్రియల సంఖ్య | తాళము పేర్లు | క్రియల సంఖ్య | తాళముల పేర్లు | క్రియల సంఖ్య |
| 1 | ధృవతాళము | I O I I | మణి | 11 | శ్రీకర | 14 | ప్రమాణ | 17 | పూర్ణ | 23 | భువన | 29 |
| 2 | మఠ్యతాళము | I O I | సార | 8 | సమ | 10 | ఉదయ | 12 | ఉదీర్ణ | 16 | రావ | 20 |
| 3 | రూపకతాళము | O I | చక్ర | 5 | పత్తి | 6 | రాజ | 7 | కుల | 9 | బిందు | 11 |
| 4 | ఝంపతాళము | I U O | కదంబ | 6 | మధుర | 7 | చణ | 8 | సుర | 10 | కర | 12 |
| 5 | త్రిపుటతాళము | I O O | శంఖ | 7 | అది | 8 | దుష్కర | 9 | లీల | 11 | భోగ | 13 |
| 6 | అటతాళము | I I O O | గుప్త | 10 | లేఖ | 12 | విదళ | 14 | లోయ | 18 | ధీర | 22 |
| 7 | ఏకతాళము | I | సుధ | 3 | మాస | 4 | రత | 5 | రాగ | 7 | వసు | 9 |

# 109. ఇతర తాళములు

ఈ 35 తాళములు. అయిదు గతి భేదములతో 35×5=175 తాళములగును. మరల ఈ 175 తాళములు 1. (దివ్య) దివ్య సంకీర్ణ లఘువు; 2. (సింహ) మిశ్ర సంకీర్ణ లఘువు; 3. (వర్ణ) దేశ్య సంకీర్ణ; 4. (వాద్య) మిశ్ర దేశ్య సంకీర్ణ లఘువు. 5. (కర్ణాటక) దేశ్య శుద్ధ సంకీర్ణ లఘువులను పై లఘువుల అయిదింటితో చేరి

మొత్తము 7×10 (జాతులు) లఘువుల తో చేరి 7×10=70 తాళములు అగును.

ఈ 70×5 గతి భేదములతో 350 తాళములు అగుచున్నవి.

అయినను వాడుకలో నున్నవి. 35 సూళాది తాళములే.

చ॥ త్రిపుట (ఆది) 8 క్రియలు

తి॥ త్రిపుట 7 క్రియలు

మి॥ ఝంప (అరఝంప లేక ఖండ చాపు) 5 క్రియలు

మి॥ చాపు త్రి॥ త్రిపుటకు సగము) 7 అక్షరములు

చ॥ రూపకము 6 క్రియలు 6 అక్షరములు.

ఖం॥ అట తాళము 14 క్రియలు

పల్లవులలో, 35 సూళాది తాళములలో కొన్ని, దీక్షితర్ కృతులలో కొన్ని, వాడుకలో నున్నవి.

పూర్వ సంగీత గ్రంధకర్తలు కొన్ని తాళములను కల్పన చేసిరి. అవి ఒక విధముగా గ్రంధములకే పరిమితమై యున్నవి, కాని, ఆచరణయందు కన్పించుట లేదు. వాటి విషయము క్లుప్తముగా :

| | |
|---|---|
| 35 సూళాది తాళములు | = ఆచరణలో నున్నవి. |
| 175 గతి భేద తాళాలు | = ఆచరణ యందు కొంత వరకు కొన్ని ఉన్నవి. |
| 350 గతి భేద అపూర్వ లఘువులతో ప్రస్తరించినవి | = ఆచరణలో లేవు |
| 108 ప్రాచీన సంప్రదాయముగా వచ్చుచు, గురు ప్లుత, కాక పాదముల వాడుకతో నున్నవి. | = అచరణ యందు లేవు. గ్రంధమునకు పరిమితి. |

| | | |
|---|---|---|
| 108 యందు 5 మార్గ తాళములు | 5 మార్గ తాళములలో పల్లవులను అరుదుగా గానము చేయుచున్నారు. | అచరణలో అరుదుగా నున్నవి. క్లిష్టములు. |
| 120 తాళములు | సంగీత రత్నాకరము నందు గలవు. | అచరణలో లేవు. |
| 124 తాళములు | రాగతాళ చింతామణి యందు కలవు. | ఆచరణలో లేవు. |

లయ, తాళము, ప్రపంచ సంగీతములకు అన్ని విధములైన పద్ధతులకు శైలులకు ముఖ్యములు.

ప్రపంచ సంగీత రీతులలో వివిధ తాళ వాద్య రీతులలో చతురశ్రము అనగా నాలుగు సంఖ్య ముఖ్యము. అటులనే, 3, 7, 5, సంఖ్యలు కూడా ముఖ్యములు, అతి ముఖ్యములు 3,4 జాతులు మాత్రమే.(3 & 4 UNITS)

సంగీతము కన్న, లయ, తాళము ప్రపంచ సర్వజనా మోదముగా నుండును. అందరూ రసించు కలుగుదురు. మానవులు లయ బద్ధులు. లయ మానవుని ఉనికి యందు అంతర్లీనముగా కలదు.

సంగీతము నందు ప్రపంచమున అనేక పద్ధతులు. అనేక శైలులు కలవు. కాని లయ తాళముల యందు అన్ని ప్రపంచ రీతులు ఒకటిగానే ఉన్నవి.

**110. దేశాది మధ్యాది తాళములు** : ఈ రెండు తాళములు చిన్న వ్యత్యాసముతో ఒక తాళమే.

ఇవి ఆది తాళమేకాని ఆదితాళ అంగములు ఈ తాళముల యందు ఉండవు. మొత్తము లెక్క 8 అక్షరములు.

ఇవి కళా తాళములు. అంగ తాళములు కావు. 3, దెబ్బలు (ఘాతలు) ఒక విసర్జితము. మొత్తము 4 క్రియలు. ఒక్కొక్క క్రియకు 4 అక్షరములు. తాళమునకు 16 అక్షరములు.

ఈ తాళములు భజన బృందములలో, హరికథలలో, యక్షగానములలో, భజన కీర్తనలలో, పాడుకొని ఈ తాళములను సులభముగా అందరూ వేయుటకు వీలుగా వీటి అంతట ఇవి క్రమ పరిణామము చెందినవి. ఈ తాళము త్రితాళ్, తీన్ తాళ్, అనుపేర్లతో హిందూస్థానీ సంగీతమున బహుళ ప్రసిద్ధముగా నున్నది.

## 111. చాపు తాళములు

**మిశ్రచాపు తాళము** : 4 క్రియలు "తకిట తకదిమి" 2. విసర్జితలకు 3 అక్షరములు తకిట ఈ విసర్జిత యందు లేక "ఉసి" యందు రెండు సశబ్ద క్రియలు కలవు.

త ఒక క్రియ : కిట ఒక క్రియ: తక ఒక సశబ్ద క్రియ. దిమి ఒక సశబ్ద క్రియ. **తకిట తకధిమి**

ఇది కళా తాళము : అంగతాళము కాదు.

తిశ్ర త్రిపుట తాళమునందు 3 అంగములు, తిశ్ర లఘువునకు 3 క్రియలు+2 ధృతములకు రెండేసి క్రియలు 3+2+2=7 క్రియలు.

తిశ్ర త్రిపుట తాళమును ధృత కాలమున నడిపిన మిశ్ర చాపు అగును. తిశ్ర త్రిపుట తాళమున కొన్ని క్షేత్రయ్య పదములు పల్లవులు ఉండును. మిశ్ర చాపు తాళమున చాలా కృతులు కలవు.

1. నిధి చాలా సుఖమా త్యాగరాజు మిశ్రచాపు.
2. నీదు చరణములే మా త్యాగరాజు "
3. నిను వినగమరి శ్యామశాస్త్రి "
4. మీనలోచన శ్యామశాస్త్రి "

తిశ్ర త్రిపుట తాళమే ఆచరణ సౌలభ్యమును బట్టి మిశ్ర చాపుగా రూపొందినది.

**ఖండచాపు** : ఖండ చాపు తాళమునే అర్థఝంప కురుఝంప అనవచ్చును.

ఖండ చాపు తాళమునకు 5 అక్షరములు. తకతకిట

ఘాత : తక ఘాత : త ఘాత : కిట

మిశ్ర ఝంప తాళమే ఆచరణ సౌలభ్యము కొరకు ఖండచాపుగా రూపొందినది.

ఉదా: 1. పరిదానమిచ్చితే : పట్ణం సుబ్రహ్మణ్య అయ్యర్ ఖండచాపు
2. ఏమయ్యరామ : భద్రాచల రామదాసు "
3. నే పొగడకుంటే : త్యాగరాజు "

ధృవచాపు, రూపకచాపు, సంకీర్ణచాపు, తిశ్రచాపు, ధృవరూపకము; రూపకధృవము, రగణ మత్య తాళము; ఝూంపట తాళము శరభనందన తాళము. శ్యామశాస్త్రి వారిచే కనిపెట్టబడినవి. రామానంద తాళము; నవసంధి తాళములు మొదలైనవి ప్రాచీన కాలమున అరుదుగా వాడుకలో ఉండెడివి. ఆధునిక కాలమున వాడుకలో కనుపించుట లేదు. ప్రాచీన గ్రంధములలో కొన్నిటియందు పేర్కొనబడి వాటి (ఈనాటి) నిరుపయోగమును కూడ వ్రాయబడినది.

# 112. అష్టోత్తర శత తాళములు (108 తాళములు)

| వరుస నెం. | తాళముల పేర్లు | అంగ సంజ్ఞలు | అంగ సంఖ్య | మాత్రలు | అక్షర కాలములు |
|---|---|---|---|---|---|
| | | । | | | |
| 1. | చచ్చుత్పుట | 8 8 । 8 | | | |
| 2. | చాచపుట | 8 । । 8 | | | |
| 3. | షట్పుకాపుత్రిక | 8 । 8 8 । 8 | | | |
| | | । । | | | |
| 4. | చంపద్వేష్టక | 8 8 8 8 8 | | | |
| 5. | ఉద్ఘట్ట | 8 8 8 | | | |
| 6. | ఆది | । | । | । | 4 |
| 7. | దర్పణ | ० ० 8 | 3 | 3 | 12 |
| 8. | చర్చరి | ० ० । ० ० । ० ० । | | | |
| | | ० ० । ० ० । ० ० । | .32 | 18 | 72 |
| 9. | సింహలీల | । ० ० ० । | 5 | 31/2 | 14 |
| 10. | కందర్ప | ० ० । 8 8 | 5 | 6 | 24 |
| | | । । | | | |
| 11. | సింహవిక్రమ | 8 8 8 । 8 । 8 8 | 8 | 16 | 64 |
| | | । | | | |
| 12. | శ్రీరంగ | । । 8 । 8 | 5 | 8 | 32 |
| 13. | రతిలీల | । 8 8 । | 4 | 6 | 24 |
| 14. | రంగతాళ | ० ० ० ० 8 | 5 | 4 | 16 |
| 15. | పరిశ్రమ | i । । 8 8 | 5 | 7 | 28 |
| 16. | ప్రత్యంగ | 8 8 8 । । | 5 | 8 | 32 |
| 17. | రజలీల | । । । । | 5 | 41/4 | 17 |
| | | । | | | |
| 18. | త్రిభిన్న | 1 8 8 | 3 | 6 | 24 |
| 19. | వీరవిక్రమ | । ० ० 8 | 4 | 4 | 16 |
| 20. | హంసలీల | । । | 3 | 21/4 | 9 |
| 21. | వర్ణభిన్న | ० ० । 8 | 4 | 4 | 16 |
| | | । | | | |
| 22. | రంగద్యోతన | 8 8 8 । 8 | 5 | 10 | 40 |
| 23. | రాజచూడామణి | ० ० । । । ० ० । 8 | 9 | 8 | 32 |
| | | । । | | | |
| 24. | రాజతాళ | 8 8 ० ० 8 । 8 | 7 | 12 | 48 |
| 25. | సింహవిక్రీడిత | । । 8 8 । 8 8 । 8 | 9 | 17 | 68 |

# అష్టోత్తర శత (108) తాళములు

| వరుస నెం. | తాళముల పేర్లు | అంగ సంజ్ఞలు | అంగ సంఖ్య | మాత్రలు | అక్షర కాలములు |
|---|---|---|---|---|---|
| 26. | వనమాలి | o o o o I o o 8 | 8 | 6 | 24 |
| 27. | చతురశ్రవర్ణ | 8 8 I o o 8 | 6 | 8 | 32 |
| 28. | త్రయశ్రవర్ణ | I o o I I 8 | 6 | 6 | 24 |
| 29. | మిశ్రవర్ణ | o o o o o o o o o o o o | 15 | $6^3/_4$ | 27 |
| 30. | రంగప్రదీప | 8 8 I 8 8 | 5 | 10 | 40 |
| 31. | హంసనద | I I 8 o o 8 | 6 | 8 | 32 |
| 32. | సింహనాద | I 8 8 I 8 | 5 | 8 | 32 |
| 33. | మల్లికామోద | I I o o o o' | 6 | 4 | 16 |
| 34. | శరభలీల | I I o o o I I | 7 | $5^1/_2$ | 62 |
| 35. | రంగాభరణ | 8 8 I I $^1/_3$ | 5 | 9 | 36 |
| 36. | తురంగలీల | o o I | 3 | 2 | 8 |
| 37. | సింహనందన | 8 8 I 8 I 8 o o 8 8 I 8 I 8 8 I I + | 18 | 32 | 128 |
| 38. | జయశ్రీ | 8 8 I I 8 | | | |
| 39. | విజయానంద | I I 8 8 8 | 5 | 8 | 32 |
| 40. | ప్రతితాళ | I o o | 3 | 2 | 8 |
| 41. | ద్వితీయ | o I o | 3 | 2 | 8 |
| 42. | మకరంద | o o I I I 8 | 6 | 6 | 24 |
| 43. | కీర్తి | 8 I 8 8 I 8 | 6 | 12 | 48 |
| 44. | విజయ | 8 8 8 I 8 | 5 | 9 | 36 |
| 45. | జయమంగ | I 8 8 I 8 8 | 6 | 12 | 48 |
| 46. | రాజవిద్యాధర | I 8 o o | 4 | 4 | 16 |
| 47. | మత్య | I I 8 I I o o | 6 | 6 | 24 |
| 48. | జయ | I 8 I I o o | 6 | 6 | 24 |
| 49. | కుడుక్క | o o I I | 4 | 3 | 12 |
| 50. | విస్పారుక | I 8 8 | 2 | 5 | 20 |
| 51. | | | | | |
| 52. | త్రిభంగి | I 8 I 8 I | 4 | 6 | 24 |
| 53. | + కోకిలప్రియ | 8 I 8 | 3 | 6 | 24 |
| 54. | శ్రీకీర్తి | 8 8 I I | 4 | 6 | 24 |
| 55. | బిందుమాలి | 8 o o o o 8 | 6 | 6 | 24 |
| 56. | సమతాళ | I I o o | 5 | $3^1/_4$ | 13 |

# అష్టోత్తర శత (108) తాళములు

| వరుస నెం. | తాళముల పేర్లు | అంగ సంజ్ఞలు | అంగ సంఖ్య | మాత్రలు | అక్షర కాలములు |
|---|---|---|---|---|---|
| | | I | | | |
| 57. | నందన | I O O 8 | 4 | 5 | 20 |
| 58. | ఉదీక్షణ | I I 8 | 3 | 4 | 16 |
| 59. | మట్టిక | 8 O 8 | 3 | $5\frac{1}{2}$ | 22 |
| 60. | ఢెంకిక | 8 I 8 | 3 | 5 | 20 |
| 61. | వర్ణమట్టిక | O O I O O | 5 | 3 | 12 |
| 62. | అభినందన | I I O O 8 | 5 | 5 | 20 |
| 63. | అంతరక్రీడ | O O O | 4 | $1\frac{3}{4}$ | 7 |
| 64. | మల్లతాళ | I I I I O O | 7 | $5\frac{1}{4}$ | 21 |
| 65. | దీపక | O O I I 8 8 | 6 | 7 | 28 |
| 66. | అనంగ | I 8 I I 8 | 5 | 8 | 32 |
| 67. | విషమ | O O O O O O O O | 10 | $4\frac{1}{2}$ | 18 |
| 68. | నంది | I O O I I 8 | 6 | 6 | 24 |
| 69. | ముకుంద | I O O I 8 | 5 | 5 | 20 |
| 70. | | | | | |
| 71. | ఏకతాళ | O | 1 | 1/2 | 2 |
| 72 | అటతాళ | I O O I | 4 | 3 | 12 |
| 73. | పూర్ణకంకాల | O O O O 8 I | 6 | 5 | 20 |
| 74. | [illegible]కంకాల | O O 8 8 | 4 | 5 | 20 |
| 75. | సమకంకాల | 8 8 I | 3 | 5 | 20 |
| 76. | విషమకంకాల | I 8 8 | 3 | 5 | 20 |
| 77. | చతుస్తాళ | 8 O O O | 4 | $3\frac{1}{4}$ | 14 |
| 78. | డోంబులి | I I | 3 | $2\frac{1}{4}$ | [illegible] |
| | | I | | | |
| 79. | అభంగ | I 8 | 2 | 4 | 16 |
| 80. | రాయవంకోల | 8 I 8 O O | 5 | 6 | 24 |
| 81. | లఘుశేఖర | I | 2 | $1\frac{1}{4}$ | 17 |
| 82. | ప్రతాపశేఖర | 8 O O | | | |
| 83. | జగఝంప | 8 O O O | 5 | $3\frac{3}{4}$ | 15 |
| | | I | | | |
| 84. | చతుర్ముఖ | I 8 I 8 | 4 | 7 | 28 |
| 85. | ఝంప | O O I | 4 | $2\frac{1}{4}$ | 9 |
| 86. | ప్రతిమఠ్య | I I 8 8 I I | 6 | 8 | 32 |
| 87. | గారుగి | O O O O O | 6 | $2\frac{3}{4}$ | 11 |

# అష్టోత్తరశత (108) తాళములు

| వరుస నెం. | తాళముల పేర్లు | అంగ సంజ్ఞలు | అంగ సంఖ్య | మాత్రలు | అక్షర కాలములు |
|---|---|---|---|---|---|
| 88. | వసంత | I I I 8 8 8 | 6 | 9 | 36 |
| 89. | లలిత | O O I 8 | 4 | 4 | 16 |
| 90. | రతితాళ | I 8 | 2 | 3 | 12 |
| 91. | కర్ణయతి | O O O O | 4 | 2 | 8 |
| 92. | యతి | 8 I I I | 4 | 5 | 20 |
| 93. | షట్ తాళ | O O O O O O | 6 | 3 | 12 |
| 94. | వర్ధన | O O I 8 | 4 | 5 | 20 |
| 95. | వర్ణయతి | I I<br>I I 8 8 | 4 | 8 | 32 |
| 96. | రాజనారాయణ | O O I 8 I 8 | 6 | 7 | 28 |
| 97. | మదన | O O 8 | 3 | 4 | 16 |
| 98. | కారిక | O O O O | 5 | 2¼ | 9 |
| 99. | పార్వతీలోచన | O O I O O 8 8 I I I I 8 I I | 14 | 15 | 60 |
| 100. | శ్రీనందన | I<br>8 I I 8 | 4 | 7 | 28 |
| 101. | లీల | I<br>O I 8 | 3 | 4½ | 18 |
| 102. | విలోకిత | I<br>I 8 O O 8 | 5 | 7 | 28 |
| 103. | లలితప్రియ | I I 8 I I | 5 | 6 | 24 |
| 104. | ఝుల్లక | 8 I I | 3 | 4 | 16 |
| 105. | జనక | I I I I 8 8 I I 8 | 9 | 12 | 48 |
| 106. | లక్ష్మీశ | I<br>O O I I 8 | 5 | 6 | 24 |
| 107. | రాగవర్ధన | I<br>O O O 8 | 5 | 4¾ | 19 |
| 108. | ఉత్సవ | I<br>8 I | 2 | 4 | 16 |

# 113. సంగీత శాస్త్ర గ్రంథకారులు

1. **భరతుడు:** "నాట్య శాస్త్రం" సంస్కృత భాషలో వ్రాశాడు. క్రీస్తుపూర్వం 200 నుండి క్రీస్తు శకం 400 ప్రాంతాల కాలం నాటివాడు. తన శ్లోకాలలో నాట్య, సంగీత విషయాలు, సూత్రప్రాయంగా చెప్పాడు.

భావ, రాగ, తాళముల చేరికయే "భరతుడు" అయ్యాడు. భరతుడు ఒక వ్యక్తి అయి ఉండక పోవచ్చు. కొంతమంది లలిత కళా మహర్షులు చేరి 'భరతుడు' అని కలం పేరుతో నాట్య శాస్త్రం వ్రాసి ఉండవచ్చు. "భరత" అన్నది ఒక పదవి లేక ఒక బాధ్యత. విలేకరి, అధ్యక్షుడు లాంటి ఒక బాధ్యత గల పదవి అయి ఉంటుందని కొంత మంది పరిశోధకుల అభిప్రాయం. 2500 ఏండ్ల క్రితం వ్రాయబడిన మొట్టమొదటి నాట్య సంగీత గ్రంథం "నాట్యశాస్త్రం" ఇది నాట్య వేదం.

ఇందు నాట్యమును గూర్చి నాట్యమునకు ఉపాంగంగా అప్పటిలో ఉపయోగపడిన సంగీతాన్ని, గూర్చి ఉన్నాయి.

ఈ ప్రసిద్ధ నాట్య శాస్త్ర వేత్తకు "భరతమునిగ ప్రాచుర్యం ఉంది. నాట్యశాస్త్రంలో 6000 ద్విపద శ్లోకాలు 36 అధ్యాయాలలో ఉన్నాయి. భరతుడు, తన గ్రంథంలో సంగీత గురించి ఆరు అధ్యాయాలలో వివరించాడు. మొదటి నుండి 27 అధ్యాయాలు తరువాత 3 అధ్యాయాలు నాట్యం గురించి వివరించాడు. 28, 29, 30, 31, 32, 33, అధ్యాయాలలో సంగీతాన్ని గూర్చి వివరించాడు.

సంగీత అధ్యాయాలు

అవి: 1. జాతి (ఈనాటిరాగం) లక్షణ విధానం
2. అతోద్యజాతి విధానం
3. సుషిరాతోద్యధికారం
4. తాళ విధానం
5. ధృవాధ్యాయం (సంగీతరచన)
6. పుష్కర వాద్య విధానం.

తత, అవనధ, ఘన, సుషిర వాద్యాలు గూర్చి చెప్పాడు. గాత్ర వాద్య సంగీతములు గాంధర్వముగా వర్ణింపబడినది. వీణావాదన గురించి 75 శ్లోకాలలో వర్ణించాడు. వేణువు (వంశీ) గూర్చి వ్రాశాడు.

మృదంగ=మృత్+అంగ (మట్టితో చేయబడిన అవనధ వాద్యము. పుష్కర, పణవ, దర్దర, మురజ, దుందుభి, ఆలింగ్య మొదలైన అవనధ వాద్యాలను వర్ణించాడు.

ఇందు మొదటి మూడు అధ్యాయాలలో (28, 29, 30 అధ్యాయాలలో)

మూర్ఛనల ప్రస్తారం, జాతులు, వాద్యాలపై జాతులను ఎట్లా వాయించాలో వ్రాశాడు.

తాళం గురించి చర్చించాడు.

ధృవాధ్యాయంలో ధృవ=దరువు, (సంగీత రచనలను) వివరించాడు. చాలా విధములైన సంగీత రచనలను పేర్కొని వివరించాడు. ఆనాటి రచనలు ఈనాడు కూడా ఉన్నాయి. కాని పేర్లు, రూపాలు మార్పు చెందుతూ వచ్చాయి.

జాత్యధికారంలో షడ్జ గ్రామం నుంచి నాల్గు జాతులు షాడ్జి, నైషాధి, ధైవతి, ఆర్షభి. మధ్యమ గ్రామం నుంచి 3 జాతులు, గాంధారి, మధ్యమ, పంచమ వివరించాడు. జాతులే రాగాలు. ఈ రెండు గ్రామాలే చెప్పాడు అప్పటికే గాంధార గ్రామం వాడుకలో లేదు.

ఒక స్థాయియందు 22 శృతులు ఉన్నాయి అని తన చలవీణ, ధృవవీణల సహాయంతో ప్రయోగాల ఆధారంగా కనుగొని ధృవపరచాడు. తరువాత గ్రంథకర్తలు భరతుని పరిశోధనలను అంగీకరించి అనుసరించారు. ఇప్పటికీ, ఎప్పటికీ ఈ నాట్య శాస్త్రము ప్రామాణిక గ్రంథము.

2. **నారదుడు:** నారదీయ శిక్ష; సంగీత మకరందము; స్వరార్ణవము; చత్వారింశచ్ఛత రాగ నిరూపణం అనే సంగీత గ్రంథాలను వ్రాశాడు.

త్యాగరాజునకు స్వరార్ణవం ఇచ్చిన మహర్షి నారదుడు ఈయనే అని ప్రసిద్ధి.

ఈయన పురాణయుగంలోని బ్రహ్మపుత్రుడు నారదుడు ఈతడు కాకపోవచ్చు.

ఈతని సంగీత మకరందమునందు స్త్రీ, పురుష, నపుంసక రాగములు, సంధిప్రకాశ, సూర్యాంశ, చంద్రాశ, రాగములు, ముక్తాంగ కంపిత, అర్ధ కంపిత, కంప విహీనరాగములు అను రాగ విభజనను చేసి వివరించెను.

3. **మతంగుడు:** క్రీ॥శ 400 తరువాత వాడు. "బృహద్దేశి" గ్రంథమును రచించెను. ఈ గ్రంథము బహు ప్రసిద్ధము.

భరతుడు చెప్పని విధంగా తాను దేశీ రాగ పద్ధతులను చెప్తానని వివరించాడు. ఈతని రాగ సిద్ధాంతములు దేశ వ్యవహార సిద్ధములు కనుకనే ఈ గ్రంధము బృహత్ దేశి అయినది.

శృతి, స్వర నిర్ణయాలు, 33 అలంకారాలు. జాతులు, రాగ లక్షణం, భాషాలక్షణం, ప్రబంధా ధ్యాయము. ఇవి బృహద్దేశి యందు విషయాలు. జనకరాగములు, వాటి జన్యములు భాషా, విభాషా, అంతర్భాష రాగాలు ఒక దాని నుండి ఇంకొకటి పుట్టాయని నిర్ణయించాడు.

ఆయా రాష్ట్రాలు (దేశాల) పేర్లలో ఉన్న కొన్ని రాగాలు వివరించేడు. దానిని బట్టి ఆయా రాష్ట్రాలలో అప్పుడు వాడుకలో ఉండిన రాగాలను క్రోడీకరించాడని అనుకోవచ్చు.

సౌరాష్ట్ర; గుజ్జరి (గుజరాత్() ఆంధ్రి; మాలవి; షోడ్జోదీచ్య; గాంధారోదీచ్చ; సౌవీర, అభీరి; హిందోలక; టక్క; భోట్ట మొదలైనవి.

ఈతడు తన ప్రబంధాధ్యాయంలో కందాఖ్య; వృత్తీ; గద్య; ప్రబంధాలు; దండకం; వర్ణకం; ఆర్యా; గాథ్యా; ద్విపథం; వర్షటే; అద్దిలా; చతుష్పదీ మొదలైన 40 ప్రబంధాలు చెప్పాడు.

వీనిలో కందాఖ్య అనేది కందార్ధంగా యక్షగానాల్లో వినబడే దరువు. గద్య ప్రబంధం చూర్ణిక. దండకం అందరకూ తెలిసినదే.

---

4. **ముమ్మటాచార్యుడు** : క్రీ॥శ. 1050-1150 సంగీత రత్నమాల లక్షణ గ్రంధం వ్రాశాడు. కొన్ని రాగాలను పేర్కొన్నాడు.

5. **పార్శ్వదేవుడు** : క్రీ॥శ॥ 920 "సంగీత సమయసారం" అను లక్షణ గ్రంధాన్ని వ్రాశాడు.

6. **చాళుక్య సోమేశ్వరుడు** : క్రీ॥శ॥ 1174-77 "అభిలషితార్ధ చింతామణి" 'సంగీత రత్నావళి'అను లక్షణ గ్రంధాలను రచించాడు.

7. **జాయపసేనాని** : క్రీ॥శ॥ 1213-1262 కాకతీయ సామ్రాజ్యాధిపతి గణపతి దేవుని కొలువులో గజసైన్యాధిపతి. నృత్త రత్నావళి, గీతరత్నావళి, వాద్యరత్నావళి రచించాడు. నృత్త రత్నావళి ప్రసిద్ధంగా ఉంది.

8. **శార్ఙ్గ దేవుడు** : 1200-1247 "సంగీత రత్నాకరం" వ్రాశాడు. దేవగిరి (దౌలతాబాద్) రాజధానిగా పాలించిన యువరాజు సింహభూపాలుని ఆస్థాన పండితుడు, శార్ఙ్గదేవుడు. ఈయనికి "నిశ్శంకుడు" అను బిరుదు కలదు.

ఈయన రచించిన సంగీత రత్నాకరం ఆచంద్రార్కం ప్రకాశిస్తూనే ఉంటుంది. కూలంకషమైన ప్రామాణిక సంగీత గ్రంథం. ఈ గ్రంథం సంస్కృత భాషలో ఉంది. ఈ గ్రంథానికి అనేక భాషలలో వ్యాఖ్యానాలు వెలిసేయి.

ఇందు 1) స్వరగతాధ్యాయం; 2) రాగవివేకాధ్యాయం 3) ప్రకీర్ణాధ్యాయం; 4) ప్రబంధాధ్యాయం 5) తాళాధ్యాయం; 6) వాద్యాధ్యాయం; 7) నృత్తాధ్యాయం

అనే ఏడు అధ్యాయాలున్నాయి.

సంగీత రత్నాకర గ్రంధానికి 4 సింహళ సంస్కృత వ్యాఖ్యానములు, సింహభూపాల, శార్ఙ్గదేవ, కుంభకర్ణ, నరేంద్ర, కల్లినాధులు చేసినవి, గంగారాముని హిందీవ్యాఖ్యానం, సింహభూపాలునిచే తెనుగులోని వ్యాఖ్యానం ఉన్నాయి. ఈ తెనుగు వ్యాఖ్యానం గురించి వివరాలు లేవు.

ఈ గ్రంథంలోని అన్ని విషయాలు, దేశంలోని నలుమూలల యందు అప్పటికి ప్రాచుర్యంలో ఉన్న రీతులను, రాగములను, తాళములను, సంగీత రచనలను, వాద్యములను, శృతి స్వర విషయములను క్షుణ్ణముగా పరిశీలించి గ్రంథములోనికి చొప్పించాడు శార్ఙ్గదేవుడు.

ఈ గ్రంథమున, భరత, మతంగ, కీర్తిధర, కోహల, కంబళ, అశ్వతర, ఆంజనేయ, అభినవగుప్త, సోమేశ్వర మతములను నిరూపించినట్లు గ్రంథకర్త చెప్పాడు.

ఈ గ్రంథమునందు ఆంధ్రి, గౌడి, మొదలైన జాతుల నిర్వచనం, ఆంధ్రఏల, కర్ణాటక ఏల, ద్రావిడఏల మొదలైన "ఏలా" ప్రబంధముల లక్షణాలు, షడ్జ, మధ్యమ గ్రామ వివరాలు, షడ్జ, పంచమ భావాన్ని బట్టి 22 శృతులు, గ్రామ, ఉపరాగాలు, శుద్ధ రాగాలు, భాషా, విభాషా, అంతర్భాషారాగాలు, వాటి భేదాలు విపులీకరించాడు.

షడ్జ గ్రామం నుండి గౌడ రాగ భేదాలు, భోట్ట (భూటాన్) రాగ భేదాలు, మాలవ రాగాలు, మధ్యమ గ్రామం నుండి, టక్కా (ఢాకా) బాంగాలీ, వరాటికా, సౌవీరి, సౌవీర, భైరవా, నట్టా, ఛాయానట్టా, రామకృతి, దేవకృతి, గౌడకృతి, తోడికా, తురష్కతోడి, ఛాయాతోడి, గుర్జరీ రాగ భేదాలను, ఆంధాళి, మల్లారి, సైంధవి, రాగ భేదాలను సుమారు 100కు పైగా వివరించి వాటి లక్షణాలు చెప్పాడు.

దేశీ రాగాలను, రాగాంగ, ఉపాంగ, భాషాంగ, క్రియాంగ రాగాలుగా విభజించాడు. ఇందు 5000 అనుష్టుప్ శ్లోకాలు ఉన్నాయి.

22 శృతుల విషయంలో భరతుని కంటె వివరంగా వివరించాడు. ధృవ చల వీణల పరిశోధన విషయంలో భరతుని మీద ఆధారపడినా, అంతకంటె స్పష్టంగా వివరించాడు.

రాగ "కాకు" అనగా రాగ రసమును వ్యక్తము చేయు గమకముతో కూడిన స్వరసమూహమని వివరించెను. షడ్జ, మధ్యమ, గాంధార గ్రామముల మూర్ఛనలను విశదపరచెను.

13700 తానములు (స్వర ప్రస్తారములు) వివరించెను.

గ్రామ, మూర్ఛన, జాతి, తాన అలంకారములకు వినూత్నమైన అర్థములను విశ్లేషణను ఇచ్చెను.

గ్రహ, అంశ, న్యాస స్వములవరణ నొసెంగెను. 15 జాతులు, వాటి పేర్లు వివరించెను.

ఈనాటి రాగ పూర్ణ రూపమును మొదటిసారిగా ప్రతిపాదించవాడు శార్ఙ్గదేవుడే.

| | | |
|---|---|---|
| గ్రామము | - | 7 స్వర సప్తకములు (అవరోహణ క్రములలో నుండును) |
| మూర్ఛన | - | ఆరోహణ క్రమమున నుండిన ఒక స్వర సప్తకము దీనికి ప్రత్యేక శృతులు (ఈనాటి భాషలో స్వరస్థానములు) కలవు. |
| జాతి | - | వర్ణ, అలంకార, సహితము గమక రహితమైన ఇప్పటి రాగమునకు పూర్వ రూపము. |
| రాగము | - | సంపూర్ణ అభివృద్ధిని చెంది స్వర, వర్ణ, అలంకార, గమక, నియత శృతిసహిత, రాగ 'కాకు', రాగరస, రాగరూప సహితమైనది రాగము. |

15 గమకములను వివరించెను. రూపక ఆలప్తి (ఈనాటి నెరవు) రాగ ఆలప్తి (రాగాలాపన) గాత్ర, వాద్య బృందములు (భరతుని కుటపములు) వివరించెను.

అవనద్ధ బృందములు = తాళ వాద్య బృందములు

తాళ విషయములు = 400 శ్లోకముతో గలవు

120 తాళములను నిర్వచించి పేర్కొనెను.

వాద్యాధ్యాయమున 1220 శ్లోకములు కలవు.

11 రకముల వీణలు పేర్కొని 12వది తన "నిశ్శంక వీణ" గా పేర్కొనెను.

వీణా వాదనలో గల వివిధ సంకేత విషయములను పొందుపరచెను. మృదంగ శబ్దములను 5 రకములగ, ఒక్కక్క రాగమునకు 7 జాతులను పేర్కొనెను. స్వర, పద, లయలు కలిగినది ధృవము అని వివరించెను.

ప్రబంధ వైవిధ్యమును వివరించెను. ప్రబంధము అను పదము, రూపము, 15వ శతాబ్దము నుండి మార్పు చెంది. ఉత్తర భారతమున ధృపద్, (ధృవ+పద) డమార్, హోరి, రచనలుగానూ దక్షిణ భారతమున, పద, కీర్తన, కృతులుగా మార్పులు చెంది వాడుకలోనికి వచ్చినవి.

--

## 9. గోపాల నాయకుడు : క్రీ॥శ. 1265–1315

ఈతడు ధృవాగానము నందు, గీత. ప్రబంధ, ఠాయ ఆలాపనలలో అనగా చదుర్దండి యందు సిద్ధుడని తన చతుర్దండి ప్రకాశికలో వేంకటమఖి, గోపాల నాయకుని, ప్రశంశించెను.

---

## 10. హరిపాల దేవుడు : క్రీ॥శ॥ 1309-1312

"సంగీత సుధాకరం" అను సంగీత గ్రంధాన్ని వ్రాసిన ఈతడికి విచార చతుర్ముఖుడు అను బిరుదు గలదు. ఈయన దేవగిరిని పాలించిన రాజులలో చివరివాడు.

---

## 11. విద్యారణ్యుడు : క్రీ॥శ॥ 1320-1380

వీరి గ్రంధం "సంగీతసారము"

ఈతడు దాక్షిణాత్య సంగీతానికి కర్ణాటక సంగీతము అను నామకరణము చేసెను.

విద్యారణ్యస్వామి విజయనగర సామ్రాజ్య స్థాపకుడు. వేంకటమఖి కనుగొనెను. అనుచున్న 72 మేళకర్తల పద్ధతికి ఈయనే అంకురార్పణ చేశాడని వేంకటమఖి తండ్రి గోవింద దీక్షితుడు తన 'సంగీతసుధ'లో చెప్పెను.

ఈతడు వేద భాష్య ప్రణీతగా అఖిల భారతదేశమునకు ఆరాధ్యుడు.

---

**12. కుమార గిరి వసంతరాజు** : క్రీ॥శ. 1380-1400

వసంత రాజీయము అనే నాట్య శాస్త్రం వ్రాశాడు.

---

**13. పెదకోమటి రెడ్డి** : క్రీ॥శ॥ 1402-1420

సంగీత చింతామణి, సాహిత్య చింతామణి రచించాడు.

---

**14. గోపేంద్ర తిప్పభూపాడులు** : తాళదీపిక రచించాడు

---

**15. చతుర కల్లీనాధుడు** : క్రీ॥శ॥ 1423-1446

శార్ఙగదేవుని సంగీత రత్నాకరానికి 'కళానిధి' అని పేరుతో తెలుగులో వ్యాఖ్యానం వ్రాశాడు. ఈయనకి 'చతురుడు' రాజవాగ్గేయకారుడు అనే బిరుదులు ఉన్నాయి.

---

**16. అన్నమాచార్యుడు** : క్రీ॥శ॥ 1404-1480

"సంకీర్తన లక్షణం" సంస్కృతంలో వ్రాశాడు. తెలుగులో వేల కొలదీ సంకీర్తనలను వ్రాశాడు. సంకీర్తన లక్షణ గ్రంధాన్ని అన్నమాచార్యుని మనుమడు చిన తిరుమలాచార్యుడు తెనిగించాడు.

---

**17. పురందరదాసు** : క్రీ.శ. 1486-1564

వీరికి కర్ణాటక 'సంగీత పితామహుడని' బిరుదు కలదు. కర్ణాటక సంగీతానికి ఆద్యుడు. బోధనా పద్ధతిని కనిపెట్టి మాయామాళవి గౌళ రాగంలో సరళీ, జంట, అలంకారాలు, పిళయారిగీతాలు, రక్తి రాగాలలో గీతాలు; ఉగాబోగం అనే భక్తి రస రచనలు (గీతాన్ని పోలిన రచనలు) చేసి గురువులకు గురువుగా పరిగణింపబడుతున్నాడు. ఇవిగాక, దేవర నామములు, దాసరి పదములు, ఠాయములు, సూళాదులు కర్ణాటక భాషలో వేలకువేలుగా రచించాడు. ఠాయములు సూళాదులు ఒక విధమైన ప్రబంధాలే.

సూళాదులు 7, 8, విభాగాలుగా ఉండి ఒక్కొక్క భాగం ఒక్కొక్క తాళంలో ఉంటుంది. సంగీతధార సులభంగా ఉంటుంది. రాగమాలికగా కూడా కొన్ని ఉన్నాయి.

వీరి సూళాదులలోనూ, ఉగా భోగాలలోనూ ఇతివృత్తం, భక్తి, వేదాంతం, లోక వ్యవహార విమర్శ ఉంటుంది.

వీరు కర్ణాటక బ్రాహ్మణులు. మధ్యమతస్థుడు. అన్నమాచార్యుల వారి కంటె చిన్నవాడు. వీరు ఉభయులు తిరుపతిలో సమావేశమైనట్లు తార్కాణము కలదు.

---

## 18. రామామాత్యుడు : 16వ శతాబ్దం

'స్వరమేళ కళానిధి' అనే సంగీత ఉద్గ్రంధాని 1550లో, రామరాయలు వారి, కోరికపై వ్రాశాడు.

ఈతడు తన సంగీత లక్షణ గ్రంథం అయిన "స్వరమేళ-కళానిధిలో" వినూత్న మార్గాలను మొదటి సారిగా ప్రతిపాదించాడు.

ఈతనికి, రాజ ఉభయ కారుడు. (రాయ "బయకారుడు" అనునది అపభ్రంశ పదం. ఉభయకారుడు అనగా సంగీత సాహిత్య రచయిత. అనగా వాగ్గేయకారుడు అని అర్థం). అభినవ భరతాచార్యుడు తోడరమల్లు అను బిరుదులు ఉండేవి.

ఆయన ఎలా ప్రబంధాలు, రాగకదంబం, గద్యప్రబంధాలు, పంచతాళేశ్వరం, స్వరాంకం, శ్రీరంగవిలాసం, మొదలైన ప్రబంధాలు రచించిన వాగ్గేయకారుడు.

రామామాత్యుని కాలంలో సంగీత రత్నాకరంలో ఉన్న లక్ష్య లక్షణాలు పాతబడ్డాయి. వాడుకలో లేవు. ఆ నేపథ్యంలో రామామాత్యుడు క్రొత్తదారులు క్రొత్త ఆలోచనలు, ఆధునిక లక్ష్య లక్షణాలను క్రోడీకరించి "తన స్వరమేళ-కళానిధి"ని వ్రాశాడు.

జనక జన్య రాగ పద్ధతిని ప్రతిపాదించాడు.

సంగీత లక్ష్య లక్షణాలలో లక్ష్యానికే ప్రాధాన్యం ఉందని గట్టిగా చెప్పాడు.

ఆకాలంలో వ్యవహారంలో ఉన్న 20 మేళ రాగాలను పేర్కొని, వాటి లక్షణాలను చెప్పాడు. రాగంలోనే కర్ణాటక సంగీతసారం ఇమిడి ఉందని చెప్పాడు.

వీణా ప్రకరణలో తన కాలంలో ఆరు రకాల రుద్ర వీణలు ఉన్నాయి అని చెప్పాడు.

1. శుద్ధ మేళ వీణ 2. మధ్య మేళ వీణ 3. అచ్యుత రాజేంద్ర వీణ. వీటిలో

సర్వరాగమేళవీణ, ఏకరాగ మేళవీణ. మొట్టమొదటిగా "స్వయంభూ ధ్వనులు వీణాతంత్రులలో ఉన్నాయని కనుగొన్నవాడు రామామాత్యుడే. పేరు కూడా ఆయనే పెట్టాడు. ఈ స్వయంభూ ధ్వనులు కనుగొన్న మీదటనే తంబురా యొక్క ప్రాచుర్యం ప్రారంభం అయింది. తంబురాలో స్వయంభూ ధ్వనులు మిక్కిలిగా ఉంటాయి.

---

## 19. అహోబలుడు : 17వ శతాబ్దం

సంగీత పారిజాతం వ్రాశాడు. ఈ గ్రంథం 1724 సంవత్సరంలో పరిష్యన్ భాషలోకి పరివర్తింప చేసుకొన్నారు.

శృతులు 29 ఉన్నాయని, అయినా 12 శృత్శులే రాగ నిర్మాణానికి ఉపయోగపడతాయని వ్రాశాడు. 122 జనక జన్య రాగాలను పేర్కొన్నాడు. ఈతడు గణితంద్వారా స్వర కంపన సంఖ్య, శృతి స్థానముల పరస్పర దూరము నిర్దేశించి, సమాన శృత్యంతర మూర్ఛనస్థాయిని (Equal Tempermental) (పాశ్చాత్య సంగీతంలో ఉండినట్లు) చెప్పాడు.

---

## 20. సోమనాథుడు : క్రీ॥శ. 1609

సంగీత దర్పణం అను లక్షణ గ్రంథాన్ని వ్రాశాడు. ఇందు రాగ, రాగిణి, పరివార రాగములు 132 అని చెప్పేడు.

సంగీత దర్పణమున 10 అధ్యాయములు కలవు. స్వర, రాగ, రాగరాగిణి, ప్రకీర్ణ, ప్రబంధ, వాద్య ప్రబంధ, వాద్య, తాళ, దశప్రాణ నృత్యాధ్యాయాలు. ఈయనకి కూడ కల్లినాథునికి వలె 'చతురుడు' అను బిరుదు కలదు.

---

## 21. లోనచన కవి : 16వ శతాబ్దం

'రాగతరంగిణి' రచించెను. ఈ గ్రంథము ఉత్తర హిందూ స్థానీ సంగీత ప్రపంచమున ప్రసిద్ధి గాంచినది.

---

## 22. పుండరీక విఠలుడు : క్రీ॥శ॥ 1590

సం॥ 'షడ్రాగ చంద్రోదయం' 'రాగమాల' 'రాగమంజరి', నర్తన నిర్ణయం అను గ్రంథాలను వ్రాశాడు.

## 23. మాధవభట్టు : క్రీ॥శ॥ 1600

'సంగీత చంద్రిక' అను లక్షణ గ్రంథాన్ని వ్రాశాడు.

---

## 24. గోవింద దీక్షితులు : క్రీ॥శ॥ 1577-1614

72 మేళ కర్తల పద్ధతి ఈతడే కనిపెట్టెనను ప్రసిద్ధి కలదు.

కాని మొట్టమొదట విద్యారణ్యులు ఈ పద్ధతిని కనిపెట్టెనను ప్రతీతి గలదు.

ఏది ఏమైనా 72 మేళ కర్తల పద్ధతికి రూపం ఇచ్చి, పేర్లు, చక్రాలు, కటపయాది సూత్రము, మొదలైన వాటిని వెలుగులోకి తెచ్చినవాడు గోవింద దీక్షితుని కుమారుడు వెంకటమఖి.

గోవింద దీక్షితులు 'సంగీత సుధ' 'సంగీత సుధానిధి' అనే గ్రంథాలను వ్రాశాడు. 'రఘునాధవీణ' అనే సర్వరాగవీణను (ఈ కాలమునాటి వీణ) రూపొందించాడు. ఈతడు అచ్యుతప్పనాయకుని, అతని కుమారుడు రఘునాధ నాయకుని, కొలువుల యందు మంత్రి.

---

## 25. వెంకటమఖి : క్రీ॥శ॥ 1620

గోవింద దీక్షితులు రెండవ కుమారుడు. "చతుర్దండి ప్రకాశిక" అను మహా సంగీత లక్షణ గ్రంధమును వ్రాశెను. గురువు తానప్పాచార్యుడు. తానప్పాచార్యుడు హిందూస్థానీ సంగీతమున మహాగాయకుడు, విద్వాంసుడు.

12 స్వరస్థానములలో గల చతుశృతి రిషభమునకు సాధారణ గాంధారమునకు, చతుశృతి ధైవతమునకు కైశికనిషాధమునకు మారు నామములు పెట్టి ప్రకృతి సిద్ధముగా వచ్చు 32 మేళ కర్తలను పెంచి 40 వివాద రాగములుగా చేసి మొత్తం 72 మేళకర్తలను ప్రస్థరించి వాటికి నామములు, చక్రములు, కటపయాది సూత్రము. ప్రస్థార క్రమము (ప (1); శ్రీ 2 ; గో; భూ 4 ; మ 5 ; ష 6 ; లుగా) ఏర్పాటు చేసిన గణిత సంగీతజ్ఞుడు 72 మేళకర్తలు కర్ణాటక సంగీత విశిష్టత. ఈ ఏర్పాటు ప్రపంచమున ఏ సంగీత పద్ధతి యందును లేదు. ఎవ్వరికీ ఈ పద్ధతి యొక్క అవసరము రాలేదు. నిజానికి ప్రకృతి సిద్ధమైన తార్కిక విలువలు కలిగిన 32 మేళములలోనే 72 మేళకర్తలు ఉన్నవి. విద్వాంసులకు పండితులకు అందరికి ఈ విషయము తెలియును. అయినా ఈ 72 మేళకర్తల పద్ధతి కర్ణాటక సంగీతంలో ధీమాగా నిలబడినది.

వేంకటమఖి తన చతుర్దండి ప్రకాశిక గ్రంధమునందు స్వర, మేళ, రాగ, ఆలాపన, ఠాయ, గీత, ప్రబంధ, తాళములు అను పది ప్రకరణములలో క్రీ॥శ॥ 1660లో వ్రాశెను. చతుర్దండి అనగా గీత, ఠాయ, ప్రబంధ, ఆలాప, అను నాలుగు విషయముల చేరిక.

ఇతడు 'రాగలక్షణములు' అను మరియొక గ్రంధము కూడా వ్రాసెను.

ఈతడు తిరువారూరు త్యాగరాజ స్వామి దేవుని మీద 24 అష్టపదులు వ్రాసెను.

ఈతడు మాయామాళవగౌళ, రీతిగౌళ గానము చేసి చోరబాధను, రాజుగారి ఉదర బాధను నివారించెను.

ఈతడు విజయరాఘవ నాయకుని ఆస్థాన విద్వాంసుడు.

---

**26. రఘునాధ నాయకుడు:** క్రీ.శ. 1614-1642 తంజావూరు పాలకుడు అచ్యుతప్ప నాయకుని కుమారుడు సంగీతసుధ అను లక్షణ గ్రంధాన్ని వ్రాశాడు.

---

**27. విజయ రాఘవనాయకుడు** : క్రీ.శ. 1638-1673 ఈ నాయక ప్రభువులు అందరూ తెలుగువారు. వారందరూ తంజావూరును రాజధానిగా చేసుకొని విశాల దక్షిణ భారతాన్ని పరిపాలించి స్వయంగా పండితులై, విద్వాంసులై, విద్యలను కళలను, గ్రంధరచనలనూ, విద్వాంసులను, పండితులను పోషిస్తూ, భారత దేశాన్ని బంగారు బాటగా, బంగారు పంటగా నిర్మించారు.

వియజ రాఘవనాయకుడు, రఘునాధ నాయకుని కుమారుడు. క్షేత్రజ్ఞుని, వారి అజరామరమైన పద సంపదను పోషించిన ఘనుడు. వీరు, వీరి దర్బారులో పండిత సభలు తరుచు జరిపిస్తో తానే అధ్యక్షునిగా న్యాయనిర్ణేతగా వ్యవహరిస్తో ఉండేవాడని ప్రతీతి.

ఈయన కాలం ఒక స్వర్ణయుగంగా వన్నెకెక్కినది.

---

**28. అహోబలుడు** : క్రీ॥శ॥ 17వ శతాబ్దం 1650లో 'సంగీత పారిజాతం' అనే లక్షణ గ్రంధాన్ని వ్రాశాడు. వీరి గ్రంధం పారశీక భాషయందు అనువాదింపబడినది. హిందూస్థానీ 'కాపీ' రాగాన్ని ఈయనే సృష్టించారు.

---

**29. శహాజీ** : 1684-1712 తంజావూరును రాజధానిగా చేసిన మహారాష్ట్ర రాజు ఏకోజీ కుమారుడు.

"శంకర పల్లకీ సేవా ప్రబంధము" అనే యక్షగానాన్ని తెలుగులో వ్రాశాడు. విష్ణు పల్లకీ సేవా ప్రబంధం మొదలుగా 20 యక్షగానాలు వ్రాసిన ఘనుడు.

---

**30. శరభోజి** : క్రీ॥శ. 1712-1723 'శరభేంద్ర భూపాల కొరవంజి,' అనే యక్షగానాన్ని వ్రాశాడు ఈ యక్షగానం ఈనాటికి ప్రసిద్ధిగానే ఉన్నది.

---

**31. తుళజాజీ** : క్రీ॥శ॥ 1728-1736 "సంగీత సారామృతం" అనే లక్షణ గ్రంధాన్ని వ్రాశాడు. తెలుగులో 'శివకామ సుందరీ' అనే యక్షగానాన్ని వ్రాశాడు.

---

**32. గిరిరాజకవి** : క్రీ॥శ॥ 1684-1712 వాగ్గేయకారుడు శ్రీ త్యాగరాజస్వామి వారి మాతామహుడు శాహేంద్రచరిత్రము, రాజమోహన కొరవంజి, లీలావతి కళ్యాణము, వాదజయం, 'సర్వాంగ సుందరీ' విలాసము మొదలగు యక్షగానములను రచించిన పండిత గాయకుడు, విద్వాంసుడు ఈతడు. శహజీ, శరభోజీల ఆస్థాన విద్వాంసుడు.

---

క్రీస్తుపూర్వం 4వ శతాబ్దం నుండి క్రీస్తుశకం 17వ శతాబ్దం వరకు భరతుడు మతంగుడు మొదలుకొని గిరిరాజకవి వరకు సంగీత గ్రంధరచన చేసిన మహానుభావులు ఎందరో వారందరికి వందనములు. ఈ మహామహుల పాండిత్య ప్రకర్షణ, సృజన శక్తి, మొదలైన ఉన్నత సద్గుణాల వలన భారత సంగీతం ఎంతో అభివృద్ధిని సాధించి ప్రపంచ సంగీత రీతులలో అతి విశిష్టమైన స్థానాన్ని సంపాదించుకొంది. ఈ సంగీత పండిత విద్వాంసులందరూ ఆ చంద్రార్కం సంగీత ఆకాశంలో ప్రకాశిస్తానే ఉంటారు.

---

## 114. వాగ్గేయకారులు

1. **వాల్మీకి :** భారత సంగీత వాగ్గేయకారులలో ప్రథమ తాంబూలం వాల్మీకి మహర్షిది.

"వందే వాల్మీకి కోకిలం" అని నారదుడు అభి వందన గానం చేసాడు. వాల్మీకి శ్రీమత్ రామాయణాన్ని అనుష్టుప్ శ్లోకాలలో వ్రాశాడు. ఈ శ్లోకాలు రెండు పాదములు కలిగినవి. ప్రతి పాదానికీ 16 అక్షరాలు ఉంటాయి. ఈ శ్లోకాలను గేయాలుగా ఆదితాళంలో అనుకూల రాగాలలో గానం చేయవచ్చు.

"శ్రీరామ కథ" అయిన రామాయణ గేయాలను శ్రీరామచంద్రుని కుమారులు లవ, కుశులు శ్రీరాముని రాజ్య సభలో గానం చేశారని ప్రతీతి.

---

2. **జయదేవుడు :** క్రీ॥శ॥ 12వ శతాబ్దం

రామాయణ కాలం నుండి 12వ శతాబ్దంలో జయదేవుని వరకు వాగ్గేయకారులు లేరా అంటే చాలా మంది ఉండి ఉంటారు. కాని వారి చరిత్ర, వారి రచనలు మనకి అందలేదు. రెండవది వారు అజ్ఞాతంగా ఉండిపోయారు. జానపద సంగీత రచనలు అజ్ఞాతులే రచించారు. వారికి ముద్ర లుండవు. తమిళ నాయనార్లు, ఆళ్వారులు, తత్వాలు రచించినవారు అందరూ వాగ్గేయకారులే అయినా కొంతమంది వాగ్గేయకారులు చరిత్రలో ఉండతలచుకోలేదు.

జయదేవుని గీత గోవింద సంగీత సాహిత్య శృంగార కావ్యం భారతావనియందు చాలా ప్రసిద్ధి గాంచింది. జయదేవుని జననం ఒరిస్సాలో దిందుబిల్వ గ్రామం. రాధాకృష్ణుల భక్తి తత్వాన్ని 24 ప్రబంధాలలో అష్టపదులను నామములతో ప్రతికీర్తనకు 8 చరణాల చొప్పున జయదేవుడు రచించి గానం చేశాడు. ఈ కావ్యం 12 సర్గలలో ఉంది. ఇందు 80 శ్లోకములు కూడా కథాకథనాన్ని చెప్పేవిగా ఉన్నాయి.

ఈ కావ్యం 'గీత గోవిందంగా' ప్రసిద్ధి చెందింది. ఈ అష్టపదులను దక్షిణ దేశ సంగీత విద్వాంసులు, ఉత్తర దేశ సంగీత విద్వాంసులూ కూడా వారి వారి బాణీలలో వారి వారి స్వరరచనలలో పాడుకొంటున్నారు.

ఈ రచనలననుసరించి రామాష్టపదులు, శివాష్టపదులు, వేంకటమఖి రచించిన త్యాగరాజాష్టపదులు, వెలిశాయి.

---

### 3. పురందరదాసు : క్రీ॥శ॥ 1486 - 1584

పండరినాధుడైన పాండురంగని భక్తుడు. అన్నమాచార్యుని సమకాలికుడు. అన్నమయ్య కంటె చిన్నవాడు. వీరిద్దరు ఒకరినొకరు కలుసుకొనినట్లు చెప్పుకొందురు. వీరి పేరు శీనప్ప. మొదట ధనికుడైన వ్యాపారి. కర్ణాటక దేశస్తుడు బ్రాహ్మణుడు మధ్వమతస్థుడు త్యాగధనుడు. మహాపండితుడు. సంగీత విద్వాంసుడు, వాగ్గేయకారుడు.

కర్ణాటక సంగీత అభ్యాస రచనలను సృష్టించి, "కర్ణాటక సంగీత పితామహుడు" అను బిరుదును పొందిన ఘనుడు. కన్నడ భాషయందు 4,75,000 దేవర నామములను రచించెను. వీరి కన్నడ భాషలోని సంగీత రచనలను 'దాసరు పదగళు', (దాసుని పదములు) వీరి రచనా ముద్ర "పురందర విఠల" వీరి రచనలు ఈనాడుకూడా బహు ప్రసిద్ధిని పొందుచూ ప్రకాశించుచున్నవి. వీరి సంగీత శిక్షణా రచనలు:-

సరళీ వరుసలు, జంటవరుసలు, అలంకారములు, పిళయారి, గీతములు, సాధారణ గీతములు.

### 4. నారాయణ తీర్థులు : క్రీ॥శ॥ 1580-1680

తెలుగు వాగ్గేయకారుడు. సంగీత సాహిత్యములు యందు దిట్ట. విష్ణుభక్తుడు.

వీరు రచించిన "శ్రీ కృష్ణ లీలాతరంగిణి" యను సంస్కృత సంగీత యక్షగాన గ్రంధమునందుగల "తరంగములు" తరంగ కీర్తనలు బహుళ ప్రసిద్ధములుగా దక్షిణ భారత దేశమున అలరారుచున్నవి.

వీరు 'పారిజాతాపహరణము' యక్షగానము, కొన్ని వేదాంత గ్రంధములు రచించిరి.

వీరు తెలుగు దేశము నుండి తమిళ దేశము క్షేత్ర దర్శనార్థము వెళ్ళి అచ్చట వరహూరు అను గ్రామమునందు నివాస మేర్పరచుకొనిరి.

అచ్చట వీరి వర్ధంతి సంగీత ఉత్సవములుగా వార్షికంగా (శ్రీ కృష్ణలీలా తరంగ గానము) దివ్యముగా ఈనాటికినీ జరపబడుచున్నవి.

తరంగములు సంస్కృత, భక్తి, సంగీత, కీర్తనలు, పల్లవి, చరణములు కల వీటి యందు కొన్నింటికి అనుపల్లవి కూడ యుండి కృతి రూపములుగా ఉన్నవి. 'నారాయణ తీర్థ' యను స్వనామ ముద్ర ఈ కీర్తనలకు కలవు. వీరు సన్యసించిరి. వీరి నామము



శ్రీ పురందర దాసు వారు



(మొవ్వ వరదయ్య) క్షేత్రజ్ఞులవారు

నారాయణ యతీంద్రులుగా కూడా ప్రసిద్ధి. శ్రీకృష్ణ చరితము 12 సర్గలుగా (తరంగములు) ఈ గ్రంధమున కలవు. ఇందు మొదటి తరంగమున శ్రీ కృష్ణ అవతారము 22 కీర్తనలు, రెండవ తరంగమున బాలకృష్ణలీలలు, 17 కీర్తనలు; 3వ తరంగమున గోపాలనము 14 కీర్తనలు; 4వ తరంగమున 12 కీర్తనలు; గోపాలవర్ణన; 5వ తరంగము గోవర్ధనోద్ధరణము 7 కీర్తనలు; 6వ తరంగమున శ్రీకృష్ణగోపీ సమాగమము 10 కీర్తనలు; 7వ తరంగమున రాసక్రీడ 12, కీర్తనలు; 8వ తరంగము యందు రాసక్రీద 12 కీర్తనలు; 9వ తరంగమున మధుర ప్రవేశము, 11 కీర్తనలు; 10వ తరంగమున కంసవధ 7 కీర్తనలు; 11వ తరంగమున ద్వారక ప్రవేశమున 8 కీర్తనలు; 12వ తరంగమున రుక్మిణీ కళ్యాణము 16 కీర్తనలు; కలవు. ఇవిగాక 4 కీర్తనలు ఒక మంగళ కీర్తన కలసి మొత్తము 153 భక్తి సంగీతమయముగా సరళ సంస్కృత భాషలో మధురామృత ధారగా ఈ తరంగ కీర్తనలు మన సంపదగా కొనసాగుచున్నవి.

---

## 5. **క్షేత్రజ్ఞుడు** : క్రీ॥శ॥ 1600-1660

తెనుగు బ్రాహ్మణుడు. కృష్ణాజిల్లా మొవ్వ గ్రామ వాసుడు. క్షేత్ర దర్శనముల ద్వారా క్షేత్రయ్యగా పిలువబడు ఈయన నామము వరదయ్య. సంగీత సాహిత్య, నాట్యాభినయల యందు దిట్ట.

వీరు రచించిన "కంచి వరదరాజు" స్వామిపై, మొవ్వ (మువ్వ) గోపాలుని పైని ఈ దేవాతా ముద్రలతో రచించిన శృంగార పదములు సంగీతామృత కలశములు, శృంగార భూయిష్టములు, తెలుగు నుడి కారమునకు ఉదాహరణలు. కృతి రూపమునకు ఆదర్శములు. సంగీత జటిలములు. సంప్రదాయ సంగీత ఖనులు. రాగరస ప్రవాహములు తరువాత తరమునకు చెందిన వాగ్గేయకారులకు ఆదర్శప్రాయములు. నాట్య, నృత్య, అభినయ కళలకు దోహదకారకములు.

వీరి మువ్వగోపాల పదములలో అన్నింటిలోనూ అనుపల్లవి కలిగియుండుటచే త్యాగరాజాది వాగ్గేయకార కృతి రచనలకు మార్గదర్శకములు. ఈ పదములు విళంబలయలో త్రిశ్ర త్రిపుట యందు చాపుతాళముల యందే ఇంచుమించు అన్నియును కలవు. క్షేత్రయ్య పదములన్నీ 36 రాగాలలోనే ఉన్నాయి. ఆ రాగాలలో కొన్ని : ముఖారి, ఘంటా, నాదనామక్రియ, సారంగ, భైరవి, కాంభోజి, నవరోజు, సురటి, ఆహిరి మొదలైన రక్తిరాగాలు, అపూర్వరాగాలు కూడ ఉన్నాయి.

---

**9. మార్గదర్శి శేషయ్యంగార్** : క్రీ॥శ॥ 16-17 శతాబ్దముల వాడు భక్తి రస సంప్రదాయముగ 'కోసల' ముద్రతో కృతులను రచించెను. వీరి రచనలు తరువాత తరముల వారికి తన తరము వారికి మార్గదర్శకములుగా నుండుట వలన వీరు 'మార్గదర్శి'గా ప్రసిద్ధి నొందిరి. స్వాతి తిరునాళ్ వీరిని తన రచనలకు "మార్గదర్శిగా" అంగీకరించిరట.

---

**10. భద్రాచలరామదాసు** : క్రీ॥శ॥ 1620-1680

వీరి మొదటి పేరు కంచర్ల గోపన్న. భద్రాచల రామునికి పరమభక్తుడు, వాగ్గేయకారుడు. ఉద్యోగ రీత్యా సర్కారు ధనాన్ని వెచ్చించి భద్రాచల రామాలయాన్ని పునర్నిర్మాణించాడు. గోల్కొండ నవాబుల ప్రభుత్వ సొమ్మును దుర్వినియోగం చేసారన్న నెపంగా గోపన్నను గోలకొండ కారాగారంలో 12 సంవత్సరములు బందీగా ఉంచిరి. వీరు ఖైదీగా ఉండేటప్పుడు చాలా కీర్తనలను ఆర్తిగా రాముని మీద రచించాడు. భద్రాచల రామదాసుగా ప్రసిద్ధి చెందిన గోపన్న 140 భక్తి, సంగీత, వేదాంత కృతులను రచించెను. ఇవి గాక 'దాశరథీ కరుణాపయోనిధీ' అను మకుటంతో 100 పద్య వృత్తములను వ్రాసెను. ఈ పద్యములు. కీర్తనలు ఆంధ్రదేశమున ఇంటింటా ప్రసిద్ధాలుగా ప్రకాశిస్తున్నాయి. చిన్న చిన్న గ్రామములందు కూడా భజన మందిరములలో రామదాసుల వారి కీర్తనలను భజనలలో గానము చేయు బృందములు వేలకువేలు సంప్రదాయంగా వస్తున్నాయి. భద్రాచల రామదాసుని చరిత్ర హరికథలుగా, 1. తిరుక్కడయూరి కృష్ణదాసు, 2. యాదవదాసు, 3. సింగిరిదాసు, 4. తూము నరసింహదాసు రచించి హరికథా కాలక్షేపాలు నిర్వహించి ఆంధ్రదేశ జన బాహుళ్యంలోకి భక్తి, సంగీతంతో పాటు రామదాసు జీవితచరిత్ర, వారి కీర్తలను ప్రచారం చేశారు.

భద్రాచలరామదాసును గురుతుల్యునిగా శ్రీ త్యాగరాజస్వామి పరిగణించినట్లు త్యాగరాజు కృతులు, క్షీరసాగర శయన, అను దేవగాంధారికృతి యందు "ధీరుడౌ రామదాసుని బంధము తీర్చినది విన్నానురా' అను చరణ సాహిత్యము నందు విదిత మగుచున్నది. తను రచించిన ప్రహ్లాద "భక్తి విజయము నందు" మహా భక్తులనుతి యందు" శ్రీరామదాసుని నుతి యింతున్" అని వ్రాసి కొన్నారు.

త్యాగరాజస్వామి వారి తల్లిగారు త్యాగరాజునికి బాల్యమునందు రామదాసుని కీర్తనలను నేర్పించినట్లు, త్యాగరాజస్వామి భద్రాచల రామదాసుని కీర్తనలను ప్రీతితో గానము చేసెడివారు అని ప్రతీతి. దక్షిణ దేశ భజన సంప్రదాయములలో కూడా రామదాస కీర్తనలు ప్రసిద్ధములు.

రామదాసు తన కీర్తనలలో దిగువ నుదహరించిన ప్రసిద్ధ, రక్తి రాగములను వాడుకొనెను.

ఆనందభైరవి, కాంభోజ, కళ్యాణి, శంకరాభరణం, పంతువరాళి, బిలహరి, ముఖారి, ధన్యాసి, సౌరాష్ట్ర, యదుకులకాంభోజి, సురటి, నాదనామక్రియ మొదలైన రాగాలు.

రామదాసు, కవి, గాయకుడు, భక్తుడు, వాగ్గేయకారుడు, సంగీత విద్వాంసుడు, సంస్కృత భాషా కోవిదుడు.

రామదాసు కృతులు, కీర్తనలు పండిత పామర రంజకాలు. వీటిని భక్తితో నలుగురితో చేరి గానం చేయవచ్చు. పాండిత్య ప్రకర్షతతో కూడా పాడవచ్చు.

---

## 11. మునిపల్లె సుబ్రహ్మణ్య కవి : క్రీ॥శ॥ 1730-1780

దామెర్ల వంశరాజుల ఆస్థాన విద్వాంసుడుగా ఉండి, దామెర్ల వారికి అంకితంగా కొన్ని పదములు, శ్రీ కాళహస్తీశ్వరునికంకితంగా కొన్ని పదములను రచించెను.

తిరుపతి శ్రీ వేంకటేశ్వరునికి అంకితముగా "అధ్యాత్మ రామాయణ" కీర్తనలు రామాయణ కథాంశంగా 104 కీర్తనలను వ్రాశిరి.

ఇందు, 1. బాలకాండ యందు 17 కీర్తనలు

2. అయోధ్యకాండ యందు 9 కీర్తనలు

3. అరణ్యకాండలో 11 కీర్తనలు

4. కిష్కింధకాండలో 10 కీర్తనలు

5. సుందరకాండలో 10 కీర్తనలు

6. యుద్ధకాండలో 47 కీర్తనలు కలవు.

ఈ కీర్తనలు జటిలములు. ఈ కీర్తనలు సాధారణ ప్రబంధ లక్షణములకు భిన్నముగా నుండి సాహిత్య ప్రధానముగా నుండి, సంగీతము వాహకముగా నుండి, మధ్యమకాల సాహిత్యము, ఛందో విన్యాసములతో విళంబ, మధ్య, దృత లయలలో కథా కథన ప్రవాహ ప్రాధాన్యతతో నిడివియైన చరణములతో ఒక ప్రత్యేక శైలియందు కలవు. ఇందలి ఇతి వృత్తం రామాయణం అయినా వేదాంతబోధ, భక్తి, ప్రబోధం అడుగడుగునకు స్ఫురిస్తోనే ఉంటుంది.

---

ఈయన తన రామాయణ కీర్తనలకు 50 రాగాలకు పైగా ఉపయోగించాడు. అందు, మాంజి, గుమ్మ కాంభోజి, ఉసేని, కాపీ, ఆనందభైరవి, ఆహిరి, రేగుప్తి, ఘంటా, మారువ, జుజావంతి మొదలైన అపూర్వరాగాలను కూడా ఉపయోగించారు.

---

## 12. రామస్వామి దీక్షితర్ : క్రీ॥శ॥ 1738-1817

సంగీత త్రిమూర్తులలో ఒకరైన ముత్తుస్వామి-దీక్షితర్ ఈయన కుమారుడు. ఈయనకు చిన్నస్వామి, బాలస్వామి, అను మరి యిద్దరు కుమారులుగలరు. రామస్వామి దీక్షితర్, వాగ్గేయకారుడు సంగీత సాహిత్యముల యందు మహాపండితుడు..

తరువారూరు నందు వేంచేసియున్న శ్రీ త్యాగరాజస్వామి పైని శ్రీ కమలాంబపైని అనేక కీర్తనలను చేసెను.

'అష్టోత్తర శతరాగామాలిక' అనునొక సంగీతరచనను రచించెను.

శ్రీ వేంకటేశ్వరునిపై 48 రాగములతో ఒక రాగమాలికా కీర్తనను రచించెను. వీరి ముద్ర "వేంకట కృష్ణ" మీనాక్షి దేవిపై 40 రాగములలో రాగమాలికను రచించెను.

అనేక పదవర్ణములను రచించెను. 'హంసధ్వని' రాగమును ఈతడే సృష్టించి, అందు ఒక ప్రబంధమును రచించెను.

---

## 13. పచ్చిమిరియం ఆది అప్పయ్య : క్రీ॥శ॥ 1740-1833

కన్నడ దేశస్తుడు. 'శ్రీ వేంకటరమణ' ముద్రతో అనేక కీర్తనలు రచించెను.

అట తాళవర్ణములలో మేటియైన భైరవిరాగమునందు విరిబోణి వర్ణమును రచించిన ఘనుడితడే.

రాగము, తానము, పల్లవి గానమునందు మహానీయుడు. వీరి వైదుష్యం త్యాగరాజ స్వామి వారిని ఆనాటి ప్రముఖ విద్వాంసులను ఎంతయో ఆకర్షించినది. వయో వృద్ధులైన వీరిని అప్పటి యువకులైన త్యాగరాజాది మహా వాగ్గేయకారులు తరుచు దర్శించెడివారు.

---

14. వీణ కృష్ణయ్య :

ఈతడు పచ్చిమిరియం ఆది అప్పయ్యగారి కుమారుడు. వీణ యందు అద్వితీయుడు.

'సప్త తాళేశ్వరము' అను ప్రబంధ త్రయమును జటిలమైన రాగ శైలిలో, క్లిష్టమైన తాళ విన్యాసములతో రచించెను.

---

15. పులియూరు దొరైస్వామి : క్రీ॥శ॥ 1782-1816

వీరు తెనుగు భాషలో 'సుబ్రహ్మణ్య' ముద్రతో 50 కీర్తనలను, పదములను రచించెను. శ్రీ నటరాజస్వామి తాండవమును వర్ణించుచు నాలుగు ప్రసిద్ధ కృతులు రచించెను. అందు 'ఆడెనమ్మహరుడు' ఫరజురాగమునందును, తోడిరాగమునందు 'తత్తదిమిత దింది యనుచు సదా శివుడాడెనె' అనుకృతులు చాలా ప్రసిద్ధములు.

---

16. మెలట్టూరు వెంకట్రామ శాస్త్రి : 1798-1855

ఆంధ్రదేశము నుండి తమిళ దేశమునకు వలస వెళ్లి, అచ్చట స్థిర నివాసము ఏర్పరచుకొన్న అనేక కుటుంబములలో మెలట్టురు వారి వంశం ఒకటి. ఈయన సంగీత సాహిత్యములందు, కవిత్వమునందు పటుత్వము కలిగి పదములు, యక్షగానములు, సంగీత నాటకములు రచించెను. మెలట్టూరు భాగవత యక్షగానములు, సంప్రదాయమునకును. రాగపటిమకును, భావరస పోషణకును ఈనాడు కూడ ప్రసిద్ధిగా నున్నది.

---

17. ఘనం కృష్ణయ్యర్ : 18-19 శతాబ్దముల వాడు.

తానము (ఘనం) పల్లవి పాడుటలో ఘనుడు.

---

18. పైడాల గురుమూర్తి శాస్త్రి : 18వ శతాబ్దం

ఈయన, సాధారణ గీతములు, లక్షణ గీతములు, ప్రబంధములు, కీర్తనలు అనేకములు రచించెను. వీరు రచించిన గీతములు వేయి సంఖ్యకు ఎక్కువగా ఉండుటచే ఈయనకు "వేయి గీత" అను బిరుదు కలదు.

---

## 19. సదాశివ బ్రహ్మేంద్ర సరస్వతి : 18వ శతాబ్దం

వీరు అవధూత తరచు సమాధి స్థితి యందు ఉండెడి మహాయోగి. శివమానసపూజ, ఆత్మ విద్యా విలాసము, బ్రహ్మసూత్ర వృత్తి మొదలైన ఆధ్యాత్మిక, భక్తి ప్రబోధ గ్రంథములను, అనేక వేదాంత కీర్తనలను రచించెను. వీరి వేదాంత కీర్తనలు పరమహంస ముద్ర గలిగి బహుళ ప్రసిద్ధములుగా దేశమున ప్రకాశించుచున్నవి. 'మానస సంచరరే', 'బ్రూహిముకుం దేతిక' 'నహిరేనహి' 'చింతానాస్తికిలా', పిబరే రామరసం'' మొదలైనవి కొన్ని. జన బాహుళ్యంలో ప్రసిద్ధిని పొందినవి.

---

## 20. కవి మాతృభూతయ్య : 18వ శతాబ్దం

తమిళనాటి తెలుగు బ్రాహ్మణుడు సుగంధి కుంతలాంబ దేవికి అంకితముగా త్రిశరగిరి (తిరుచినాపల్లి) ముద్రతో అనేక కీర్తనలు, 'పారిజాతాపహరణం' యక్షగానాన్ని రచించాడు. 'నీ మది చల్లగ' అను ప్రసిద్ధ ఆనందభైరవి కృతి వీరి రచనయే.

---

## 21. తోడి సీతారామయ్య : 18వ శతాబ్దం

తమిళనాటి తెలుగు బ్రాహ్మణుడు. తోడి రాగము గానము చేయుటలో అద్వితీయుడు.

---

## 22. శంకరాభరణం నరసయ్య : 18వ శతాబ్దం

శంకరాభరణ రాగాలాపన ఈయన సొమ్ము. అనేక కృతులను తమిళ భాషయందు రచించెను.

---

## 23. ఉపనిషద్బ్రహ్మయోగి : 1720-1800

ముత్తుస్వామి దీక్షితర్, త్యాగరాజస్వామి వారలకు గురుతుల్యుడు, మార్గదర్శకుడు, అనేక కీర్తనలను రచించెను. ఉపనిషత్తులకు, భగవద్గీతకు భాష్యము వ్రాసిన యోగి.

---

## 24. పరిమళరంగపదకర్త : క్రీ॥శ॥ 1700

ఈయన తెలుగు భాష యందు 40 పదములు, కొన్ని కృతులు, దేవీపరముగా రచించెను. వీరి పేరు తెలియలేదు. 'పరిమళరంగ' అను ముద్రతో వీరి సంగీత రచనలు ఉండుట వలన వీరి పేరు 'పరిమళరంగ' అని ఉండవచ్చును.

---

**అజ్ఞాత తెలుగు పదకర్తలు :**

1. యువరంగని పదములు : ఉదా: చెయిబట్టి నాసిగ్గు - శహనరాగం
2. కస్తూరిరంగని పదములు
3. ఘట్టుపల్లివారి పదములు : తలచుకొంటే తాళబలనే - కురంజి
4. బొల్లవరంవారి పదములు : మోసమాయెగదె - ఆహిరి
5. శోభనాద్రి పదములు : చెలియనీతో - కాంభోజి
6. జటపల్లివారి పదములు : మగవారికి ధర్మమేడదే
7. ఇనకొండవారి పదములు : నీవే యోడితే - రేగుప్తి
8. శివరాంపురంవారి పదములు : ఏమిసేయుదు - కాంభోజి

తమిళ పదకర్తలు : 1. వైదీశ్వరన్ కోవిల్ సుబ్బరామయ్యర్ ; 2. ఘనం కృష్ణయ్యర్; 3. శంకరాభరణం నరసయ్య 4. ముత్తు తాండవర్ 5. పాప వినాశమొదలియార్ మొదలైనవారు.

---

## 25. శొంఠి వెంకటరమణయ్య : 18-19 శతాబ్దం

త్యాగరాజస్వామి వారికి సంగీత సాహిత్యాలలో సంగీత రచనా వైదుష్యంలో గురువు.

---

## 26. త్యాగరాజస్వామి : 1759-1847

మహావాగ్గేయకారుడు, శ్రీరామ భక్తాగ్రణ్యుడు, మహాకవి, మహా పండితుడు, సంగీత మహా విద్వాంసుడు. వాల్మీకి అంశమున జన్మించిన మహర్షి. సంగీత రచనాయుగకర్త. ధాతుమాతుస్రష్ట. కర్ణాటక సంగీత యుగకర్త, యుగపురుషుడు. సంగీత రచనా వైదుష్యతలో అనన్య సామాన్యుడు.

తమిళనాడున స్థిర నివాస మేర్పరచుకొనిన కాకర్ల తెనుగు వంశ చంద్రుడు.

తిరువారూరునందు వేంచేసి యున్న 'త్యాగరాజస్వామి' (శంకరుని) వారి ముద్రతో సుమారు వేయి కృతులు రచించిన ఘనుడు. ధాతు రచనలో ఆద్యుడు. సంగీత త్రిమూర్తులైన త్యాగరాజు, ముద్దుస్వామి దీక్షితర్, శ్యామశాస్త్రి వారలలో ఆద్యుడు.

ఈనాటి సంగీత సంప్రదాయాన్ని, రాగరూపాలను, కృతి రచనా శైలిని, నిర్మించి, కర్ణాటక సంగీతాన్ని ఉద్ధరించిన మహాపురుషుడు.

వీరి జననం శివ, శక్తి క్షేత్రం తరువారూరు. ముత్తస్వామి దీక్షితర్, శ్యామశాస్త్రి వారల జననం కూడా ఇచ్చటనే అవడం సంభ్రమాశ్చర్యకారణం.

త్యాగరాజస్వామి తల్లి, సీతమ్మ, తండ్రి రామబ్రహ్మం. గురువులు శొంఠి వెంకటరమణయ్య, ఉపనిషద్బ్రహ్మయోగి, శ్రీరామ కృష్ణ యతీంద్రులు, తారక మంత్రాన్ని, నారద మంత్రాన్ని, ఉపదేశించారు. శ్రీ నారదుడు 'స్వరార్ణవం', 'నారదీయం' అనే సంగీత గ్రంథాలను త్యాగయ్యకు ఇచ్చారు.

త్యాగయ్యగారి పూర్వ వంశీయులు 1600 ప్రాంతంలో కర్నూలు జిల్లా కంభం తాలూకా కాకర్ల గ్రామం నుండి తమిళ దేశంలో తంజావూరు జిల్లా తిరువారురునకు వలసవెళ్ళి అక్కడే స్థిర నివాసం ఏర్పరచుకొనిరి. త్యాగయ్య సుమారు వేయి కృతులు, కీర్తనలు, వివిధ శైలులలో అశుధారగా గానం చేస్తో కొన్ని శిష్యులకు నేర్పుతో కొన్ని ప్రసిద్ధ, రక్తి, అపూర్వ, వివాదిరాగాలలో రచించారు.

త్యాగయ్య ప్రతినిత్యం 1,25,000 సార్లు శ్రీరామ తారకనామ మంత్రాన్ని జపిస్తో 96 కోట్ల రామనామాన్ని పూర్తి చేశారు.

త్యాగయ్య కృతులలో, ఉపనిషత్తులు, రామాయణ, భాగవత కథా కథనానికి చెందిన కథలు, పురాణ ఇతి హాసాలు, వేదాంత, భక్తి, జ్ఞాన, తత్వాలు, నాద, సంగీత, రాగ, మహిమలను వ్యక్తం చేసే కృతులు. బృందగానాలకి అనువైన దివ్యనామ, ఉత్సవ సంప్రదాయ కీర్తనలు; విళంబ, మధ్యలయలలో కృతులు, ఘనరాగ పంచరత్న కృతులు, కోవూరు, లాల్గుడి పంచరత్న కృతులు. పాండితీ ప్రకర్షను వ్యక్తం చేయు కృతులు, సులభ కృతులు. చిన్న పెద్ద కృతులు మొదలైన వివిధ రస, రూప, విశేషాలతో రచించారు.

త్యాగయ్య సంగీత స్రష్ట, సంగీత బ్రహ్మ. అనేక రాగాలను సృష్టించారు. అనేక రాగాలకు రూపాల్ని రసభావాల్ని ప్రసాదించారు.

'ఖరహర ప్రియ' రాగాన్ని వారే వెలుగులోకి తెచ్చారు. రంజని, వసంతభైరవి, అమృతవాహిని, జింగ్ల, కళ్యాణవసంతం, వరాళి, రసాళి, ఆంధాళి, గరుడధ్వని, కన్నడ, గుండక్రియ, మారువధన్యాసి, సింధురామక్రియ, కలావతి, మాళవశ్రీ, దేవామృతవర్షిణి, సిద్ధసేన, కిరణావళి, శృతిరంజని, శ్రీమణి, మొదలైన శతాధిక రాగాలకు తన రచనలతో ప్రాణంపోసి ప్రసిద్ధం చేశారు.

వివాదిరాగాలలో, మేళకర్తరాగాలలో, గానమూర్తే అనుకృతిని గానమూర్తి రాగంలో 'ఫణిపతి శాయి' అనే కృతిని ఝుంకారధ్వనిలో, మానవతిరాగంలో 'ఎవరితోనే', చారుకేశిలో 'ఆడమోడిగలదా', వకుళాభరణరాగంలో 'ఏ రాముని' నాసికాభూషణిలో, మారవైరి, నాగానందినిలో 'సత్తలేనిదినము' మొదలైన కృతులు రచించారు. త్యాగరాజస్వామిపై చాలా మంది పండితుల, విద్వాంసులు, విమర్శకులు, మేధావంతులు. చాలా గ్రంథాలను వ్రాశారు. అయినా వారి గుణగణాలు, వైదుష్యం, రచనా విశేషాలు కూలంకషంగా, పూర్తిగా ఎవరూ వ్రాయలేదు. కారణం. త్యాగరాజస్వామి దైవాంశ సంభూతుడు కారణ జన్ముడు కనుక. అట్లాంటి వారిని గూర్చి ఒక అంశంగా వ్రాయడం సాధ్యమా? సాహసం అవుతుందిగాని!

త్యాగరాజస్వామి భారతీయ సంస్కృతికి సంగీతానికి, సంగీతజ్ఞులకు, సంప్రదాయ, భక్తి, వేదాంతాలకు, ఛందస్సుకు, కీర్తన, కృతి, రూపాలకు భిక్షను ప్రసాదించిన చరితార్థుడు, యుగకర్త. కర్ణాటక సంగీతలోకానికి తరగని సంపదను ప్రసాదించాడు. కర్ణాటక సంగీతాకాశంలో ఆ చంద్రార్కంగా కోటి సూర్య సమంగా ప్రకాశిస్తూనే ఉంటారు త్యాగారాజస్వామి.

వారి జీవిత సాయంకాలంలో సన్యసించి శ్రీ త్యాగబ్రహ్మానంద నాదయోగిగా నాదయతీంద్రులుగా ప్రసిద్ధులైనారు.

వారి వర్థంతి ఉత్సవాలు. తిరువయ్యారులోనూ, వారి జయంతి ఉత్సవాలు తిరువారూరులోనూ ఘనాతిఘనంగా జరుగుతున్నాయి. ప్రపంచ దేశాలు అన్నింటిలో త్యాగరాజ ఉత్సవాలు అతి వైభవంగా జరుగుతున్నాయి. కర్ణాటక సంగీత విద్వాంసులు అందరూ అన్ని దేశాలలోనూ వారి ఘనరాగ పంచరత్న కీర్తనలు బృందగానాలుగా గానం చేస్తూ అద్భుతంగా ఉత్సవాలను నిర్వహిస్తున్నారు. వీరి శిష్యులలో ముఖ్యులు. వీణ కుప్పయ్యర్, వాలాజీపేట వేంకటరమణ భాగవతర్, మానంబు చావిడి వేంకట సుబ్బయ్య మొదలగువారు. మానంబు చావిడి వేంకట సుబ్బయ్యగారి శిష్యులు సుసర్ల దక్షిణామూర్తిగారు. వారి శిష్యులలో ముఖ్యులు పారుపల్లి రామకృష్ణయ్య పంతులు, మంగళంపల్లి పట్టాభిరామయ్య, బాలమురళీకృష్ణ పట్టాభి రామయ్యగారి కుమారుడు, పంతులుగారి శిష్యుడు. ఈ గ్రంథకర్త మంగళంపల్లి

పట్టాభిరామయ్య గారి శిష్యుడు. త్యాగరాజస్వామి వారి శిష్య పరంపర ఆంధ్రదేశమున తామర తంపరగా అభివృద్ధి చెంది ఈనాడు కర్ణాటక సంగీత ప్రపంచంలో ప్రకాశిస్తూ ఉండటం ముదావహం

---

## 27. శ్యామశాస్త్రి : క్రీ॥శ॥ 1763-1827

సంగీత త్రిమూర్తులలో ఒకరు. తమిళనాడున స్థిర నివాసమేర్పరుచుకొనిన తెలుగు వంశీయుడు.

మొదటి పేరు వేంకట సుబ్రహ్మణ్యం ముద్దుపేరు శ్యామకృష్ణ. ఆ పేరే శ్యామశాస్త్రిగా రూపొంది, వీరి రచనా ముద్ర "శ్యామకృష్ణ"గా స్థిరపడింది. శ్రీ విద్యోపాసకుడు కంచి కామాక్షి అమ్మవారి భక్తుడు.

వీరి తోడి, భైరవి, యదుకుల కాంభోజి, రాగములలో స్వరజతులు అపురూపమైన రాగ భావ, భక్తి సమన్వయ రచనలు. వీరి రచనలు కదళీపాకమునకు త్యాగరాజ రచనలు ద్రాక్షపాకమునకు, దీక్షితర్ రచనలు నారికేళ పాకమునకు, పెద్దలు సరిపోల్చిరి.

శ్యామశాస్త్రి వారి రచనలలో రాగభావము, అమ్మవారి మీద భక్తిభావము కలిగి, సాహిత్యం అతిసులభంగా ఉండి స్తోత్ర రూపముగా నున్నవి. వీరి రచనలు ఎక్కువగా మిశ్రచాపు తాళంలో ఉండి వయ్యారంగా చమత్కారంగా ఉంటాయి. మిశ్ర చాపు 3+2+2=7 అక్షరాలు ఉంటాయి. వీరి కీర్తనలు కొన్ని 3 అక్షరాలు వదలి, కొన్ని అంగాలు (అనుపల్లవి చరణాలు) 5 అక్షరాలు వదిలి ప్రారంభం కావడంలో అపురూపత, సొగసు కొంచెంగా క్లిష్టంగా కూడా ఉండి, పాండితీ ప్రకర్షకు, అవకాశం ఇస్తాయి.

వీరి రచనలు 300 వరకు ఉన్నాయి. త్యాగరాజస్వామి, శ్యామశాస్త్రి, తరచు కలుసుకొంటూ భక్తి, సంగీత, నాద, విషయాలను చర్చించుకొంటూ ఆనందించే వారని ప్రతీతి. వీరి శిష్యులు. సుబ్బరాయశాస్త్రి, పెరంబూరు కృష్ణయ్య అలసూరు కృష్ణయ్య మొదలైనవారు.

---

## 28. ముత్తుస్వామి దీక్షితర్ : క్రీ॥శ॥ 1775-1835

వెంకటమఖి వంశీయుడు, తండ్రి రామస్వామి దీక్షితర్. ముత్తుస్వామి దీక్షితర్ బాల్యంలోనే, సంస్కృత సాహిత్యం, నాటక అలంకారములు, మంత్ర, యోగ, జ్యోతిష, వ్యాకరణ, ఛందశ్శాస్త్రములలో పాండిత్యము సంపాదించెను. సంగీతము వెంకట వైద్యనాధ దీక్షితర్ వారి దగ్గర అభ్యసించెను.

మంత్ర శాస్త్రము నందు పాండిత్యమును పొంది కాశికిపోయి అచ్చట 5 సంవత్సరములు మంత్రదీక్షతో తపస్సుచేసి హిందూస్థానీ సంగీత మర్మములు తెలుసుకొని వచ్చి, తిరుత్తణి శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర క్షేత్రమునందు శ్రీ గురు గుహుడైన శ్రీ శరవణభవుని మహామంత్రమును ఉపాసించి, శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరుని దర్శనమును పొందిరి. శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరుడే స్వయముగ మారురూపమున శ్రీ ముత్తు స్వామి దీక్షితర్ వారికి దర్శనమిచ్చి, నోటియందు కండ చక్కెర నుంచిన, సుముహూర్తమునుండి, ముత్తుస్వామి దీక్షితర్ మహా వాగ్గేయకారునిగా రూపొందిరి. వెంటనే గురుగుహుని కీర్తించుచు "శ్రీనాథగురుహోజయతి" అను కీర్తనను ఆశువుగా గానము చేసిరట.

దీక్షితర్ సంస్కృతమున 300 కృతులు రచించిరి. శ్రీ కమలాంబ నవ ఆవరణకృతులు, నవగ్రహకృతులు, షోడశ గణపతి కృతులు పంచలింగ స్థల కృతులు, అభయాంబానవఆవరణ కృతులు, దక్షిణ, ఆంధ్ర రాష్ట్రముల (తిరుపతి) యందు గల క్షేత్రములు, దేవాలయములను దర్శించి ఆయా దేవుని, దేవతల మహిమలను కీర్తించుచు కృతులను వ్రాసిరి.

వీరికృతులలో, మధ్యమకాల సాహిత్యములు, చిట్ట స్వరములు, వాటికి జతులు, సాహిత్యములు కలవు. అనేక అపూర్వ రాగములలో వీరి కృతులు గలవు. విళంబలయలలో, సరళ సంస్కృత ధారతో, చిక్కని, చక్కని ధాతుమాతు రచనతో, పాండిత్య ప్రకర్షణను వ్యక్తం చేసేవిగా ఉన్నవి. నారికేళ పాకమున వీరి కీర్తనలు ప్రవహించుచున్నవి, సంగీత విద్యార్థి దీక్షితర్ కృతులు కొన్నిటినైనను పాఠము చేయక విద్వాంసునిగా రూపొందుట సంభవముకాదు. వీరి రచనలు, వీరి కీర్తి, ఆచంద్రతార్కారముగ ప్రకాశించును.

---

## 29. సుబ్బరామ దీక్షితర్ :

20వ శతాబ్దం ప్రారంభమున వీరు "సంప్రదాయ ప్రదర్శిని" అను మొట్టమొదటి సంగీత లక్ష్య లక్షణ గ్రంధమును ఎట్టయాపుర సంస్థానాధీశుల ప్రోత్సాహము, ధనసహాయముచే వెలయుంచిరి. ఈ గ్రంధము తమిళ, తెలుగు భాషలయందు ప్రచురితమైనది.

ఇందు వేంకటమఖి సంప్రదాయముననుసరించి కూలంకషమైన లక్షణాంశములతో లక్ష్యసాధనములైన, గీతములు, లక్షణగీతములు, స్వరజతులు, తిల్లానాలు, దరువులు, తానవర్ణములు, కృతులు, కీర్తనలు, తాను రచించిన పద (చౌక) వర్ణములు; రాగమాలిక వర్ణములు, సంచారులు, చిట్ట తానములు, 72 మేళకర్తలలో సమిష్టి చరణములతో కృతులు ఉన్నవి. ఈనాటి విద్యార్థులకు సంప్రదాయమును అవగాహన చేసుకొనుట కొరకు ఈ గ్రంధము బహుళ ఉపయోగికారిగా నున్నది.

## 30. స్వాతి తిరునాళ్ : క్రీ॥శ॥ 1829-1847

తిరువాన్కూరు (తిరువనంతపురం) మహారాజు. గొప్ప వాగ్గేయకారుడు. బహు భాషా కోవిదుడు. పద్మనాభస్వామి భక్తుడు. వివిధ భాషల సాహిత్యముల (మణి ప్రవాళ) యందు పదములు, పదవర్ణములు, కృతులు, తిల్లానాలు రచించిన మహనీయుడు.

వైష్ణవ సంప్రదాయమున ఆళ్వారుల పరంపరలో వీరు 'కుల శేఖర ఆళ్వారు'గా పూజింపబడుచున్నారు. శంకరాభరణ అట తాళ వర్ణము వీరి రచనయే.

వీరి కృతులు "పద్మనాభ", "సరసిజనాభ", "పంకజనాభ" అను ఒకే అర్థముగల ముద్రలు కలిగియున్నవి. వీరి కృతులు బహుళ ప్రచారమున నున్నవి.

వీరి రచనలు సుమారు 300 ఉన్నవి. వీరు కుచేలోపాఖ్యానము కూడ రచించిరి.

---

## 31. తూము నరసింహదాసు : క్రీ॥శ॥ 18-19 శతాబ్దములు

త్యాగరాజ సమకాలికుడు, భద్రాచలరామదాసుని చరిత్రము హరికధగా రచించెను. భక్తి సంగీత రచనలు సులభశైలిలో భజనబృందగానములలో గానముచేసి కొనుటకు వీలుగా అనేకములు వ్రాసిరి. త్యాగరాజస్వామి దర్శనము చేసుకొన్న మహనీయుడు శ్రీరామభక్తుడు.

---

## 32. వీణ పెదగురాచార్యులు : 1794

త్యాగరాజుని సమకాలికుడు. ఆంధ్రదేశ ఆస్థానములైన, బొబ్బిలి, విజయనగరం ఆస్థాన విద్వాంసుడు.

వీరు, గీతములు, వర్ణములు, స్వరపల్లవులు, శబ్దములు, జక్కిణ దరువులు కీర్తనలు రచించిరి.

---

## 33. దూర్వాసుల సూర్యనారాయణ సోమయాజులు : 1842-1896

త్రిమూర్తుల కృతులను తాను పాఠము చేసి ఆంధ్రదేశమున ప్రప్రథముగా ప్రాచుర్యములోనికి తెచ్చిన ఘనుడు.

---



శ్రీ పద్మనాభదాస స్వాతి తిరునాళ్ మహారాజు వారు

**34. కంచి వేంకటాద్రి స్వామి : 18-19 శతాబ్దులు**

త్యాగరాజుని సమకాలికుడు విష్ణుపరంగా కంచి వరదరాజ స్వామి వారిపై వీరు రచించిన కృతులు, ప్రసిద్ధములు.

---

**35. పల్లవి గోపాలయ్య : క్రీ॥శ॥ 1788-1832**

ఆంధ్రుడు, వేంకటముద్రతో, తానవర్ణములు, కృతులు రచించిరి. పల్లవి పాడుటలో అఖండుడు.

---

**36. పల్లవి శేషయ్య : క్రీ॥శ॥ 18-19 శతాబ్దములు**

తెలుగు బ్రాహ్మణుడు. పల్లవి గానము చేయుటలో అద్వితీయుడు. వాగ్గేయకారుడు. 1000 రాగముల లక్షణములతో వాటి యందు కొన్ని రాగములలో తన రచనలను స్వరపరచి గ్రంధమును వ్రాశెను.

---

**37. సుబ్బరాయశాస్త్రి : క్రీ॥శ॥ 1803-1862**

శ్యామశాస్త్రి ఆఖరి కుమారుడు. సంగీత సాహిత్యములలో అగ్రగణ్యుడు. హిందూస్థానీ సంగీతమున కూడా మంచి ప్రతిభావంతుడు, గురువులు, గోస్వామి, రామదాస స్వామి. కర్ణాటక సంగీతమున వీరి గురువు శ్రీ త్యాగరాజస్వామి.

వీరి స్వరజతులు, కృతులు, 'కుమార' ముద్ర కలిగి శ్యామశాస్త్రి వారి రచనలను పోలి యున్నవి.

ప్రసిద్ధములైన, 'జననీ నినువినా' రీతిగౌళ, 'నినువినా గతిగాన' కళ్యాణి యందలి కృతులు వీరి రచనలే.

---

**38. వీణ కుప్పయ్యర్ : క్రీ॥శ॥ 18-19 శతాబ్దములు.**

"గోపాలదాస" ముద్రతో రచనలు సల్పిన వాగ్గేయకారుడు. వీణావాదనలో ఘనుడు.

**39. తిరువత్తియూర్ త్యాగయ్యర్ : 19వ శతాబ్దం**

'సంకీర్తన రత్నావళి' అను గ్రంధమును 108 రాగములలో తన రచనలతో ప్రచురించిన వాగ్గేయకారుడు 'పల్లవిస్వర కల్పవల్లి' గ్రంధమును కూడా వ్రాశెను.

---

40. షట్కాల గోవిందమారార్ : పల్లవి 6 కాలములలో పాడగలిగిన మహావిద్వాంసుడు త్యాగరాజస్వామి వీరి పల్లవి గానము విని ముగ్ధుడై "ఎందరో మహాను భావులు" అను తన రచనను గానము చేసి ఈయనను గౌరవించెను అని ప్రతీతి.

---

41. మనంబుచావిడి వెంకట సుబ్బయ్య : త్యాగరాజుని శిష్యులలో ముఖ్యుడు. బంధువు కూడ. వీరికి అనేక మంచి శిష్యులు కలరు. 'వెంకటేశ' ముద్రతో అనేక కృతులను రచించిన వాగ్గేయకారుడు. వీరి శిష్యులు, మహా వైద్యనాథ అయ్యర్, పట్టం సుబ్రహ్మణ్య అయ్యర్, శరభశాస్త్రి, పంచాపకేశయ్య. (ఈయన త్యాగరాజుని మనుమడు) సుసర్ల దక్షిణామూర్తి మొదలైనవారు.

---

42. వాలాజిపేట వేంకటరమణ భాగవతర్ : త్యాగరాజ స్వామివారి శిష్యుడు. త్యాగరాజస్వామి వారు ఆశువుగా కల్పించు కృతులను సద్యః స్ఫూర్తితో స్వరపరచి వ్రాసి తరువాత తరమువారికి త్యాగరాజ స్వామివారు గానము చేసినట్లు ధాతు మాతులను యథాతథంగా అందించి సంగీతమునకు దేశమునకు మహోపకారము చేసిన పుణ్యమూర్తి.

---

43. రామస్వామి శివన్ : 'గుహదాస' ముద్రతో కృతులు, వర్ణములను రచించిరి. 'పంకజాక్షి' అను పదవర్ణమును, పాహిమాం శ్రీరాజరాజేశ్వరి అనుకృతి వీరి రచనలే.

---

44. ఆనయ్య : 'ఉమాదాస' ముద్రతో కృతులను రచించిన వాగ్గేయకారుడు. వీరి రచనలలో ఇంతపరాకా, నాదనామక్రియ, భజన సేయవే, కేదార, మహిమ తెలియ తరమా, శంకరాభరణం పరాకేల రీతిగౌళ, కృతులు వీరి రచనలే.

---

45. మహావైద్యనాథయ్యర్ : వీరు 72 మేళకర్తలలో ఒక సుదీర్ఘ రాగమాలికను రచించిరి. "మహా" అనునది వీరి ప్రతిభ, ఉపజ్ఞకు గుర్తింపుగా ఒసగిన బిరుదు.

---

**46. పట్టం సుబ్రహ్మణ్య అయ్యర్ :** 'వేంకటేశ' ముద్రతో ఉన్న వీరి రచనలు త్యాగరాజ స్వామి వారి రచనలకు సమానముగా నున్నవి. బహుళ ప్రచారమున నున్నవి. సింహనందన తాళమునందు పల్లవిని రచించిన ఘనుడు, జావళీలు, వర్ణములు, కృతులు, తిల్లానాలు రచించెను. బేగడ రాగాలాపనలో అఖండుడు గనుకనే ఈయనకు బేగడ సుబ్రహ్మణ్యర్ అను ప్రఖ్యాతి కలదు.

---

**47. రామనాథపురం శ్రీనివాసయ్యంగార్ :** 19-20 శతాబ్దాలు. పట్టం సుబ్రహ్మణ్యయ్యర్ శిష్యుడు. తెలుగు, సంస్కృతం, సంగీతం, తమిళ భాషలలో, పండితుడు. వాగ్గేయకారుడు. పూచి శ్రీనివాసయ్యంగార్ అని కూడా వీరిని వ్యవహరించడం కద్దు. శ్రీనివాస ముద్రతో వీరు అనేక వర్ణములు, కృతులు, తిల్లానాలు, జావళీలు రచించిరి.

అరియక్కొడి రామానుజయ్యంగార్ వీరి శిష్యులే. వీరి రచనలు అన్ని బహుళ ప్రసిద్ధాలే.

---

**48. చెయ్యూర్‌చెంగల్వ రాయశాస్త్రి :** మహా వాగ్గేయకారుడు. 360 కృతులు కంచి కామాక్షిపైని, 240 కృతులు మధుర మీనాక్షిపైని, 100 కృతులు తిరుపతి వేంకటేశ్వరునిపైని రచించిరి.

సంస్కృత, ఆంధ్ర, తమిళ భాషలందు పండితుడు. తెలుగుభాష యందు, ముద్దుకుమార శతకము, చారులీలా శతకము రచించెను.

స్వరాక్షరములతో అనేక కంద పద్యములను వ్రాసెను. ఉదా: కందము :

ఉదా :- సామ పద గరిమ పస గని -
గామని దనిగాని మగని గాదనిరిగదా
నీమమ మరి సరిపనిగని
పామరి పగమాని గాని పనిగాదనిదా

---

**49. మైసూరు సదాశివరావు :** మహారాష్ట్ర బ్రాహ్మణుడు ఈయన 'సదాశివ' ముద్రతో వర్ణములు, కృతులు, తిల్లానాలు రచించెను.

---

**50. తిరుపతి నారాయణ స్వామి** : ఆంధ్రుడు తిరుపతి వాస్తవ్యుడు వేంకటేశ ముద్రతో కృతులు జావళీలు రచించెను.

---

**51. మైసూరులింగరాజు అర్సు** : 'లింగరాజ' ముద్రతో రచించిన అనేక కృతులలో ఒకటైన నీలాంబరి రాగకృతి 'శృంగారలహరి' మిగుల ప్రసిద్ధి చెందినది.

---

**52. చిన్ని కృష్ణదాసు** : చిన్నికృష్ణ అను స్వనామ ముద్రతో స్వరజాతులు, కృతులు రచించిరి. "సాంబ శివాయనవే" అనే వీరి ఖమాసు స్వరజతి ప్రసిద్ధము.

---

**53. తచ్చూరు సింగరాచార్య సోదరులు** : సుబ్బరాయశాస్త్రి శిష్యులు, స్వరమంజరి, సంగీత కళానిధి, గాయక పారిజాతము, గాయక సిద్ధాంజనము, గాయక లోచనము అనే గ్రంథములు సంగీత లక్ష్యల క్షణములతో కూలంకషమైన విషయములతో రచించి అందు వారు రచించిన సంగీత రచనలు కూడా చొప్పించి ఆంధ్రదేశ సంగీత లోకమునకు మహోపకారమును గావించిరి.

---

**54. శ్రీమదజ్జాడ ఆదిభట్ల నారాయణ దాసు** : హరికథా పితామహుడు. బహుభాషా కోవిదుడు. మహాకవి, లయబ్రహ్మ, మహాగాయకుడు. హరికథకు ఆంధ్రదేశమున ఆద్యుడు. స్వయముగ యథార్థ రామాయణము, జానకీ శపథము, రుక్మిణీ కళ్యాణము, మార్కండేయ చరిత్ర, హరిశ్చంద్రోపాఖ్యానము, అంబరీషచరిత్ర, భీష్మచరిత్ర, ప్రహ్లాదచరిత్ర, గజేంద్ర మోక్షము. మొదలైన అనేక హరికథలను యక్షగానములను రచించిన యుగపురుషుడు. అచ్చ తెనుగునందు అనేక కావ్యములను వ్రాసెను. పారశీక కవి వ్రాసిన రచనలను ఆంధ్ర భాషయందు అనువదించెను.

---

**55. ముత్తయ్యా భాగవతర్** : "హరికేశపుర" ముద్రతో అనేక సంగీత రచనలు చేసిరి. వీరి కృతులు చాలా ప్రసిద్ధిగా నున్నవి.

---

**56. హరినాగభూషణము** : వైలెన్ విదాంసులు. గాత్రజ్ఞుడు, వాగ్గేయకారుడు, భాగవతులు, సంస్కృత, ఆంగ్ల, ఆంధ్ర భాషలలో మేటి, నైష్టికుడు, న్యాయవాది. (బి.ఎ.బి.ఎల్) అనేక కృతులను రచించిరి.

**57. మైసూరు వాసుదేవాచారి** : అనేక కృతులు తెనుగులో వాసుదేవముద్రతో భావార్థ సహితంగా వ్రాసిరి. వీరి కృతులు చాలా ప్రసిద్ధి గాంచినవి.

**58. పాపనాశన్ శివన్** : 'రామదాస' ముద్రతో సంస్కృత భూయిష్టమైన తమిళ భాషయందు కృతులు రచించిరి. వీరి కృతులు మధురంగా, భక్తితో, సంగీత విశేషములతో ప్రకాశించుచున్నవి.

**59. దాసు శ్రీరాములు** : దాసు శ్రీరాములు క్రీ.శ. 1846-1908 వీరు అనేక కృతులు, పదములు, జావళులు రచించిరి.

**60. మంగళంపల్లి బాలమురళీకృష్ణ** : ఆధునికులు, మహా వాగ్గేయక కారుడు. మహాగాయకుడు, సంగీత యుగపురుషుడు వైలెన్ విద్వాంసులలో మేటి. లయ బ్రహ్మ. సంస్కృత, తమిళ, ఆంగ్ల, తెలుగు భాషలయందు అసమాన పండితుడు. ఖండాంతరముల యందు అఖండ యశస్సుతో అలరారుచున్న మహామనిషి. యుగపురుషుడు, మహామేధావి. తనదంటో ఒక వినూత్న శైలిని రూపొందించుకొని త్రిస్థాయికి మించిన గంభీర గాత్ర సంపదతో పండిత పామర రంజకంగా వేనకువేలు గాన సభలలో గానము చేయుచు కర్ణాటక సంగీతాకాశము నందు ధృవతారవలె ప్రకాశించుచున్నారు. ఈయన అనేక కృతులు, 72 మేళ కర్తలలో 72 కృతులు, అనేక తిల్లానాలు రచించిరి. ఇంకను రచించుచున్నారు. వీరి వివిధ పుణ్యక్షేత్ర సందర్శనములలో ఆయా దేవతలను కీర్తించుచు రచించిన అనేక కృతులు బహుప్రసిద్ధములు, పండిత పామర రంజకములు.

## సంగీత మహా విద్వాంసులు

మునుగంటి వేంకట రావుపంతులు గారు మహా విద్వాంసులు గాత్రజ్ఞులు, శాస్త్రజ్ఞులు సద్గురువు. వీరి శిష్యులు అనేక మందిలో సీత అనసూయ, ఓలేటి వేంకటేశ్వర్లు ముఖ్యులు.

సంగీత గ్రంధకర్తలూ వాగ్గేయకారులే. వాగ్గేయకారులూ గ్రంధకర్తలే. వీరు ఉభయులు సంగీత విద్వాంసులే. పండితులే. సంగీత విద్వాంసులు, గానము చేయువారు, వాద్యములపై వాదనను సల్పువారు అయి ఉండవచ్చు. సంగీత పండితులు. శాస్త్రజ్ఞులు, వీరు కూడా సంగీత విద్వాంసులే అయి ఉందురు. వీరందరూ సంగీత ఉపాధ్యాయులే. సద్గురువులే.

దక్షిణ భారత దేశంలోగల కేరళ, తమిళ, కర్ణాటక తెలుగు రాష్ట్రాలలో ఒరిస్సాలో కొంత భాగం కర్ణాట సంగీతం ప్రచారంలో ఉంది.

కర్ణాటక దేశంలో మైసూరు ప్రభువులు. తమిళ దేశంలో తంజావూరు ప్రభవులు, కేరళలో తిరువనంతపురం ప్రభువులు. ఆంధ్రదేశంలో, బొబ్బిలి, పిఠాపురం, విజయనగరం, వెంకటగిరి, నూజువీడు, ప్రభువులు, జమీందారులు కర్ణాటక సంగీతాన్ని పోషిస్తో వచ్చేరు.

కర్ణాటక సంగీతానికి మాట ఇచ్చినది తెలుగుదేశం, పాట ఇచ్చినది తమిళదేశం, కర్ణాటక సంగీతం అనే పేరు కన్నడదేశం ఇచ్చింది. కేరళదేశం కర్ణాటక సంగీతానికి శ్రోతలను ఇచ్చింది కేరళ శ్రోతలు సంఖ్యలోనూ అధికమే రసికతలోనూ ఆధిక్యతే. మహావిద్వాంసులు, మహాపండితులు, మహా వాగ్గేయకారులు కొన్ని సమయాలలో అజ్ఞాతంగా ఉంటారు. కొంతమందికి రావలసినంత కీర్తిరాదు. అట్టివారి సంగీత సేవ తక్కువకాదు సంగీత సరస్వతికి వారు చేసిన ఆరాధన. వారి పుష్పాల విలువ తక్కువ కాదు.

ఈ సంగీత చరిత్రలో వారి పేరు కూడా శాశ్వతంగా ఉండేటట్లుగా చూడటం ధర్మం.

వారి సంఖ్య చాలా ఎక్కువగానే ఉంది.

1) వీణ పెరుమాళ్ళయ్య 2) అన్నాస్వామి శాస్త్రి 3) మూవనల్లూర్ సభాపతయ్య 4) మధ్యార్జునం దొరైస్వామియ్యర్ 5) పరమేశ్వర భాగవతర్ 6) వైంకుంఠశాస్త్రి 7) కున్నకుడి-కృష్ణయ్యర్ 8) కరూర్ దక్షిణామూర్తి అయ్యర్, దేవుడయ్య సోదరులు 9) తాళ్లూరి నారాయణ కవి, 10) వీణ శేషన్న 11) పరాంకుశదాసు 12) ముత్తు తాండవర్ 13) అరుణాచలకవి-రాయర్ 14) కవికుంజర భారతి 15) గోపాలకృష్ణ భారతి, 16) వేదనాయకం పిళ్ళె 17) మారిముత్తు పిళ్ళె మొదలైనవారు తమిళనాడున కర్ణాటక సంగీతానికి జీవితాన్ని అర్పించిన ఘనులు.

తెలుగునాట మొదటి నుండి సంగీత సేవ చేసిన మహా విద్వాంసులు సుసర్ల దక్షిణామూర్తిగారు కర్ణాటక సంగీతాన్ని తమిళనాట గురు శుశ్రూష చేసి తెలుగు దేశానికి వచ్చి సద్గురువులుగా అనేక వందల మంది శిష్యులకు భోజన సదుపాయాలతో కూడా విద్యను నేర్పిన తెలుగుదేశంలో కర్ణాటక సంగీత విద్యారంగంలో ఆది గురువు, సద్గురువు.

వీరిలాగే, రాజనాల వేంకటప్పయ్య, కలిగొట్ల కామరాజు, బాపట్ల కాంతయ్య, తాటిపాక రామరాజు, వాసావారు, శిష్టువారు, ఈమనివారు, వారణాసివారు, తుమరాడ సంగ మేశ్వరశాస్త్రి, ద్వారం వేంకట కృష్ణయ్యనాయుడు, బంకుపల్లి సింహాచల శాస్త్రి, పేరిబాబు, బొంపాడవారు మొదలైన వారు ఆద్యులు. దుడ్డు సీతారామయ్యగారు, పురాణంవారు, బలిజేపల్లి సీతారామశాస్త్రి, వీరందరు గురు పీఠాన్ని అధిరోహించి సంగీత క్షేత్రాన్ని అభివృద్ధి చేశారు. మునుగంటి వెంకటరావు పంతులు గారు, త్యాగరాజ శిష్యపరంపరకు చెందిన వారు సమకాలికులు,

సద్గురువు, పారుపల్లి రామకృష్ణయ్య పంతులు అనేకమంది శిష్యులకు సంగీత విద్యాదానం చేసి ఈనాడు ఆంధ్రదేశాన్ని సంగీతమయంగా చేసారు.

వారి శిష్యులలో ముఖ్యులు, మంగళంపల్లి పట్టాభిరామయ్యగారు (ఈ గ్రంథరచయిత యొక్క గురువు) వంకదారి వెంకట సుబ్బయ్య గుప్త, చిలకలపూడి వేంకటేశ్వర శర్మ. నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు, అన్నవరపు రామస్వామి, సంగీతయుగ కర్త మహావాగ్గేయకారుడు. జంత్రగాత్ర ధురీణుడు కేవల గంధర్వుడు అయిన మంగళంపల్లి బాలమురళీకృష్ణ, పారుపల్లి వారి శిష్యుడు అవడం ముదావహం.

అన్నవరపు వారు నల్లాన్ చక్రవర్తులవారు వందల సంఖ్యలో శిష్యులను సంగీత విద్యా దానం చేస్తూ కర్నాటక సంగీతానికి ఆంధ్రదేశంలో ఎనలేని సేవచేస్తున్నారు.

ద్వారం వేంకట కృష్ణనాయుడుగారి శిష్యులు. ద్వారం వేంకటస్వామి నాయుడుగారు. వీరి వైలెన్ వాద్యం అపురూపమైనది. సాటిలేనిది. వీరు సుస్వరచక్రవర్తి, సంగీత సరస్వతీ పుత్రుడు, ద్వారం వారిది సంగీతవంశంగా రూపొందింది.

ద్వారం వేంకట కృష్ణయ్య నాయుడుగారి కుమారుడు. ద్వారం నరసింగరావు గొప్ప వైలెన్ విద్వాంసులు విజయనగరం కళాశాలకు అధ్యక్షులు. వీరి కుమారుడు ద్వారం దుర్గా ప్రసాదరావు విజయనగర సంగీత కళాశాల అధ్యక్షులు. ద్వారం నరసింగరావుగారి సంతతి అందరు వైలెన్ విద్వాంసులే. కుమార్తె (ద్వారం) పూసర్ల మనోరమ హైదరాబాదు సంగీత కళాశాల అధ్యక్షులు. కుమారుడు ద్వారం సత్య నారాయణరావు ఆకాశవాణి యందు నిలయ విద్వాంసుడు. వీరందరు ప్రతిభావంతులు. సంగీత తపస్వులు. ద్వారం వేంకట స్వామి నాయుడుగారి సంతతియందు ద్వారా మంగతాయార్, ద్వారం సత్యనారాయణ మహా విద్వాంసులు. ద్వారం భావనారాయణరావు విజయనగరం సంగీత కళాశాల అధ్యక్షులు. వైలెన్ విద్వాంసులు గాత్ర విద్వాంసులు. సంగీత శాస్త్రజ్ఞులు కూడ.

## 115. తమిళ సంగీతం

**శిలప్పాదికారం :**

క్రీ॥పూ॥ 3000 సంవత్సరముల నాటికి ఇండస్ నాగరికత యందు ద్రవిడ నాగరికతయే ఉన్నట్లు చరిత్ర వల్ల స్పష్టం అగుచున్నది. ద్రవిడ నాగరికత యందు ముఖ్యంగా సంగీతం చిత్రలేఖనం అభివృద్ధి చెందుతూ వచ్చాయి.

క్రీస్తు శకం ప్రారంభంలోనే తమిళ సాహిత్యం, సంస్కృతి చాలా అభివృద్ధిలో ఉన్నట్లు స్పష్టమైన చరిత్ర ఆధారాలు ఉన్నాయి.

క్రీ॥శ॥ రెండవ శతాబ్దంలో చేర రాజు వంశీయుడైన "ఇల్లాంగో" 'శిలప్పాదికారం' అను గేయకావ్యం వ్రాసెను. ఈ కావ్యానికి 3 అధ్యాయాలు. 30 సర్గలు 5200 పంక్తులు ఉన్నాయి. ఇది ఒక శాస్త్రీయ, సాహిత్య, లౌకిక, సాంఘిక, ఆధ్యాత్మిక, ఆర్థిక, లలితకళా, సమన్వితమైన మహాకావ్యం.

ఇందు చేర, చోళ, పాండ్య రాజ్యముల వ్యవస్థలు విశేషాలు వర్ణింపబడినవి.

"శిలప్పాదికారము" ఇల్లాంగో, రాజ్యమును త్యజించి, యోగియై అజరామరమైన ఈ కావ్యమును రచించెను. ఈ కావ్యమునందు ప్రాపంచిక ఆధ్యాత్మిక విషయములు కూలంకషముగ కలవు. ఇది ఒక సంగీత నాట్య మహా కావ్యము కూడ. ఇల్లాంగో తన శిలప్పాదికారము నందు భరతుని నాట్య శాస్త్రము నందు గల ముఖ్యమైన రీతులను చొప్పించి నాట్య శాస్త్రమునకు, దక్షిణ దేశ లలిత కళా సంస్కృతికి, మహోపకారముగావించెను.

"ఇల్లాంగో"కు ముందుగా కూడా వల్హల్లుడు, కొంతమంది శాస్త్రీయ గ్రంధకర్తలు, నాట్య శాస్త్రము ఆధారముగా, 'పంచ భారతీయము', 'భారతసేనాపతీయం' 'ఇంద్రకాలీయం' మొదలైన గ్రంథములు రచించిరి.

శిలప్పాదికార కావ్యమునందు, గాత్ర సంగీత సాధన, యాళ్, (వీణ) వేణువుల గూర్చి, వర్ణన కలదు.

నర్పేరుం, 'పన్'ల గూర్చి, వీణలలో పాలై వీణ (యాళ్) కురంజియాళ్, మరుడయాళ్, నైదల్యాళ్ల గూర్చి వాటియందు వచ్చు మూర్ఛనలు (పాలైలు) (పాలై అనగా మూర్ఛన) వర్ణింపబడినవి. కురుల్తిరిపు (అనగా గ్రహ భేదము)ను గూర్చి చర్చించబడినది. గ్రహభేద ప్రస్థారము నుండి గ్రహింపబడిన ఏడు మూర్ఛనల (పాళైలు) వివరణలు కలవు.

| | | |
|---|---|---|
| సెంపాలై | = | హరికాంభోజి |
| పెదుమలైప్పాలై | = | కళ్యాణి |
| శేవాళైప్పాలై | = | తోడి |
| అరుంపాలై | = | ఖరహరప్రియ |
| కొడిప్పాలై | = | శంకరాభరణం |
| విలారైప్పాలై | = | నఠభైరవి |

ఈ మూర్ఛనలే (పాలైలే) (పన్‌లు) రాగములు అయినవి.

ఇల్లాంగో, వేణువులను గూర్చి వర్ణిస్తో వేణువులు వెదురు, గంధం, ఎబోనీ, రక్తచందనం, కంచు, వేణువులను గూర్చి చెప్పెను.

వేణువు, వాటి రంధ్రములు, నిడివి, పొడవు మొదలైన విషయములు, వాయించు పద్ధతులను, గూర్చి కూలంకషంగా చర్చించెను.

యాళ్ అనే వీణ ద్రవిడ (దక్షిణ) సంప్రదాయంలో గల అతిపురాతనమైన వాద్యము. యాళులలో అనేక ఆకారములు, రకములు గలవు. పెరియాళ్, మక్కయాళ్, సగోడయాళ్, సెంగొట్టుయాళ్.

యాళ్ అనిన మొట్టమొదటి మూర్ఛన అని కూడ అర్థము కలదు.

తమిళ భాషయందు సంగీతమునకు 'ఇశై' అని పేరు. అటులనే:-

| | | |
|---|---|---|
| స్వరము | = | నరంబు |
| శృతి | = | అలకు (లేక) మాత్రై |

ఇశై అనగా స్వరమునకు కూడ అర్థము కలదు.

| | | |
|---|---|---|
| షడ్జమము | = | కురల్ |
| రిషభము | = | తుత్మేన్ |
| గాంధారము | = | కైక్కిలై |
| మధ్యమము | = | ఉఝై |
| పంచమము | = | ఇల్లి |
| ధైవతము | = | విళరి |
| నిషాధము | = | తరమ్ |

పైవి షడ్జాది స్వరములకు తమిళ పేర్లు.

తమిళ సంగీత గ్రంధములు 30కి పైగా తాళ వాద్యములను పేర్కొనినవి.

తమిళ సంస్కృతీ సంప్రదాయ గ్రంధము నందు సంగీత, నాటక, నృత్య సభాస్థలుల, నిర్మాణ పద్ధతులను, గూర్చి అభివృద్ధి జనకమైన, ఆసక్తి జనకమైన, విశేష విషయములు కలవు.

శిలప్పాదికారము నందు "వెనిర్ కటై" సర్గ యందు సముద్ర పరిసరము నందు జరిగిన ఒక సంగీత నాటక ఉత్సవమును, అందలి కథా కథనమును, అందుగల నాయకీ నాయకులు ప్రణయము, గానము, వాద్య సహకారములు చక్కగ వర్ణింపబడినవి.

<u>"సంగం" సాహిత్య సంస్కృతీ యుగం :</u> తమిళ సంస్కృతి, సాహిత్యము, సంగీతము, లలిత కళలు మొదలైన విషయాలను అభివృద్ధి జనకంగా ముందుకు నడపించటానికి కారణ భూతములు, పది తమిళ పద్య కావ్యములు (పట్టు పాట్టు)

అవి: పట్టుపాట్టులు (పది పద్య కావ్యములు)

| | |
|---|---|
| 1. తిరుమురు గాత్ర ప్పాదై | 2. పెరునార్ అత్రుప్పాదై |
| 3. సిరుపనత్రప్పాదై | 4. పెరుంపనత్రుప్పాదై |
| 5. ముల్లైప్పాట్టు | 6. మదురైక్కంచి |
| 7. నెదునాల్వదై | 8. కురంజిప్పాట్టు |
| 9. పట్టిన ప్పాలాయ్ | 10. మలైపాడుకదం |

ఈ పది పద్య గేయ కావ్యముల యందు, కథా సంవిధానంతోపాటు, సంగీతం, సంస్కృతి మొదలైన విషయాలు, అప్పటి సాంఘిక ఆర్థిక వ్యవస్థలు, పూర్తిగా వర్ణించబడినవి.

క్రీ॥శ॥ 7వ శతాబ్దంలో భారతదేశంలో, సనాతన ధర్మాన్ని సంరక్షించడానికి అనేక మంది వేదాంతులు, ధర్మ ప్రచారకులు ఉద్భవించారు. వారందరూ దైవిక, ధర్మ, తత్వాలను సులభ సంగీతంతో కీర్తనలుగ, పదములుగా వ్రాసి, తాము గానం చేసి, జన బాహుళ్యంలో ప్రచారం చేసేరు.

అట్టి వాటిలో తేవారం-శివతత్వాన్ని, దివ్య ప్రబంధం, విష్ణు తత్వాన్ని బోధించేయి.

శైవ, వైష్ణవ, మహర్షులైన వీరు ఆధ్యాత్మిక సంపదతోపాటు సంగీత, సాహిత్యాలకు భారతీయ సంస్కృతికి, మహోపకారం చేశారు.

శివ భక్తి సంగీత కావ్యం అయిన తేవారాన్ని మాణిక్క వాచకర్, తిరుజ్ఞాన సంబంధర్ (అప్పర్) తిరునవుక్కరసర్, సుందరమూర్తి భక్తులు వ్రాశారు. మాణిక్క వాచకర్ 700 పదాలను

తిరువాచకం అనే పేరుతో వ్రాశారు. ఈ పదాలు స్వరలయలతో రాగతాళాలు సరిపోయేటట్లు ఉన్నాయి. వీటిని మోహన రాగంలో గానం చేసేవారు.

ఈ తేవారాలు శైవ సిద్ధాంతాలకి వేదాలు లాంటివిగా ఉన్నాయి.

అప్పర్ - 40,000 గేయాలను వ్రాశారు.

తిరుజ్ఞాన సంబంధర్ 16,000 పదాలను వ్రాశారు.

24 మూర్ఛనలలో తేవారం గానం చేయబడింది.

| | పన్ | రాగం | మేళ సంఖ్య |
|---|---|---|---|
| 1. | గాంధారం | గాయకప్రియ | 13 |
| 2. | పియందైక్కందరమ్ | గాయకప్రియ | 13 |
| 3. | ఇందలమ్ | లలితపంచమం | 14 |
| 4. | పంచమం | ఆహిరి | 14 |
| 5. | సేకమరం | నాదనామక్రియ | 15 |
| 6. | కురంజి | మలహరి | 15 |
| 7. | వ్యాళకురంజి | సౌరాష్ట్రం | 17 |
| 8. | కౌశికం | భైరవి | 20 |
| 9. | సెందురుతి | మధ్యమావతి | 28 |
| 10. | నట్టప్పాదై | నాటకురంజి | 28 |
| 11. | తెక్కేసి | కాంభోజి | 28 |
| 12. | శెవ్వాళి | యదుకుల కాంభోజి | 28 |
| 13. | [illegible] | కేదారగౌళ | 28 |
| 14. | కొల్లి | సెంధుకన్నడ | 28 |
| 15. | కొల్లి కౌవనం | సింధుకన్నడ | 28 |
| 16. | టక్కరాగం | కాంభోజి | 28 |
| 17. | పజంటక్క | శుద్ధసావేరి | 29 |
| 18. | మేఘరాగకురంజి | నీలాంబరి | 29 |
| 19. | పజంపంజురం | శంకరాభరణం | 29 |
| 20. | అందాళికురంజి | శైలదేశాక్షి | 35 |
| 21. | పురనీర్మై | శ్రీకాంతి | 46 |
| 22. | సదరై | పంతువరాళి | 51 |
| 23. | నట్టరాగం | పంతువరాళి | 51 |
| 24. | తిరుత్తండకం | బేగడ | 29 |

తేవారం, దివ్య ప్రబంధాల స్ఫూర్తితో సిద్ధర్‌లు మహా సిద్ధ పురుషులు అనే పరంపరగా 18 మంది సిద్ధర్ పదల్ అనే జానపద గీతాలను రచించారు. వీటి యందు భక్తి తత్వంతో పాటు సాంఘిక దురాచారాల విమర్శ శ్లేష, హాస్యాల రూపాల్లో ఉంచబడ్డాయి.

దివ్య ప్రబంధాలు 4000 వైష్ణవాచార్యులు రచించారు. ఇవి వైష్ణవ వేదాలు. ఇవి తమిళ వేదాలుగా శ్రీవైష్ణవ శాఖలు వారు పరిగణిస్తారు.

కంచిని పాలించిన పల్లవ రాజులు చేర, చోళ, పాండ్య రాజుల వలెనే, సంగీతాన్ని పోషించారు. 7వ శతాబ్దంలో మహేంద్రవర్మ పల్లవుడు ఏకశిల దేవాలయాలను నిర్మించడంలో మొట్ట మొదటివాడు. స్వయంగా వీణా విద్వాంసుడైన మహేంద్రవర్మ పల్లవుడు, సంగీత శాస్త్ర మర్మాలను సంభ్రమ ఆశ్చర్యాల చకితులను చేసేటట్లు "కుడిమియామలై" అనే ఏక శిలా గుహ యందు శాసన రూపంలో చెక్కించాడు. ఈ శిలా శాసనం దక్షిణ భారత సంగీత చరిత్రకు ఆయువుపట్టుగా మనమధ్య నిలబడి ఉండడం. మనకు మన సంస్కృతికి గర్వ కారణం. మహేంద్రవర్మ పల్లవుని వీణ పేరు 'పరివాదిని' ఈతడు శివభక్తుడు. ఈతడు రుద్రాచార్యుని వద్ద సంగీతాన్ని వీణని అభ్యసించి మహా విద్వాంసుడుగా రూపొందాడు.

ఈయన నిర్మించిన సంగీత శాస్త్ర శాసనాలుగల కుడిమియామలై పుదుక్కోటై ప్రాంతంలో ఉన్నది.

ఈ శిలా శాసనాలలో మొదటి శతాబ్దపు నారద శిక్షయందుగల 7 గ్రామ రాగాలు వర్ణించబడ్డాయి.

అవి: 1. మధ్యమ గ్రామం, 2. షడ్జ గ్రామము 3. షాడవ 4. పంచమ

5. సాధారిత 6. దైశిక 7. కైశిక మధ్యమ.

దీనిని బట్టి పల్లవుల కాలంలో గ్రామ రాగాలూ జాతి రాగాలూ కూడా వాడుకలో ఉన్నాయని తెలుస్తుంది.

పల్లవులు కాలంలోనే తమిళ నాయనార్‌లు భక్తి వేదాంత ప్రబోధాత్మకములుగా బహుళంగా గీత, గేయ పణితిలో రచనలు చేసి వాటిని వీణ మృదంగ సహకారములతో గానం చేసి బహుళ ప్రచారం చేశారు. నాయనార్‌ల గేయాలు శైవ మత పరంగా ఉన్నాయి.

ఆ కాలంలోనే తమిళ - ఆళ్వారులు కూడా వైష్ణవ సిద్ధాంతాలను భక్తి వేదాంతాలను జతచేసి గీతాలను వ్రాశారు. ఈ గీతాలు కూడా స్వయంగా ఆళ్వారులే గానం చేసి ప్రచారం చేస్తూ వచ్చారు.

నాయనార్‌ల గీతాలు, ఆళ్వారుల గీతాలు, దేవాలయాలలో విధిగా ప్రతిదినం గానం చేయటానికి అప్పటి రాజులు ధనాన్ని, భూములను, దానాలు చేస్తూ సదుపాయాలు చేసేవారు.

చోళ రాజులైన మొదటి రాజరాజులు, గాంధారాదిత్య, వీరరాజేంద్ర, మొదలైన రాజులు సంగీతాన్ని ముఖ్యంగా నృత్యాన్ని పోషించారు.

చిదంబరం నట రాజస్వామి దేవాలయంలో నృత్య విషయాలను నర్తకీ మణుల హస్త పద, విన్యాసములను, అలంకరణలను, నృత్య ప్రదర్శనలను, శిల్పములుగా ప్రదర్శింపబడినవి.

పురాతన తమిళ సంగీతమున రాగములు, రెండు విధములుగ వర్ణించబడినవి. అవి పణ్ ; తిరమ్ లు.

పణ్ = రాగాంగ రాగములకు పేర్లు. ఇందు అసంపూర్ణ రాగములు కూడ వచ్చును.

తిరమ్ = జన్య, వర్జ్య రాగములు.

*పణ్‌ల యందు విభాగములు :-*

| | | | |
|---|---|---|---|
| 1. | పగల్‌పణ్ | = | పగలు గానము చేయతగు రాగము |
| 2. | ఇరవుపణ్ | = | రాత్రి గానము చేయ తగిన రాగము |
| 3. | పాదుప్పణ్ | = | అన్ని కాలముల యందు గానము చేయవచ్చు రాగము |

## 116. తమిళ, కన్నడ, హిందూస్థానీ, సంగీత రచనలు;

**తేవారమ్** : తిరుజ్ఞాన సంబంధర్, సుందరమూర్తి, మొదలైన జ్ఞానులు భక్తులు. తేవారములు రచించిరి. ఈ రచనలు అతి ప్రాచీనమై, జ్ఞానమును, భక్తిని ప్రబోధించునవిగా ఉన్నవి.

**తిరుప్పుగళ్** : అరుణగిరినాథర్ అను వాగ్గేయకారుడు చిత్రమైన తాళములలో రక్తి రాగములలో ఈ తిరుపుగళ్ కీర్తనలను రచించెను. ఇవి భక్తిని జ్ఞానమును ప్రబోధించుచున్నవి. గాత్ర సంగీత సభలలో వీటిని పాడుట అచారము. ఇవి తమిళ భాష యందు కలవు.

తమిళమున తిరువరుట్పా, తిరువాచకము, తిరువాయిమెళి మొదలైన రచనలు ప్రసిద్ధములు.

**దేవరనామములు** : కన్నడ భాష యందు కర్ణాటక సంగీత పితామహుడైన పురందర దాసు దేవర నామములను రచించెను. "దాసరుపదగళు" అని కూడా వీటిని అందురు. ఈ రచనలు భక్తి. జ్ఞానములను ప్రబోధించునవిగా నున్నవి.

ఈ రచనలలోని సంగీతము పురందర దాసుల వారు రచించిన పద్ధతి ఎట్లున్నదో తరువాత తరములు వారికి అందించబడలేదు. ఆకారణముగా తరువాత కాలమున సంగీతజ్ఞులు ఏర్పరచిన సంగీతముతో ఈ రచనలు ప్రసిద్ధములై యున్నవి.

దేవర నామములు సుమారు 7,15,000/- కలవు అనుచున్నారు.

## 117. హిందూస్థానీ సంగీతమునందు గల కొన్ని ముఖ్య రచనలు:

ఖ్యాల్, ధృపద్, టప్పా, ఠుమ్రీ, భజన్, గీత్, జోడ్-ఝూలా, గత్, ఘజల్ మొదలైనవి.

1. ఖ్యాల్ అను రచన యందు బడా ఖ్యాల్ లేక విళంబిత్ ఖ్యాల్. ఏక్‌తాళ (రూపక తాళముననుండును. ఛోటాఖ్యాల్ లేక ధృతఖ్యాల్ తీన్‌తాళ్ (ఆదితాళము) నందు ఉండును.
2. ధృపద్ - (అనగా ధృవ పదము) అను రచన. ప్రాచీనమైనది ఘనమైనది.
3. టప్పా - అను ప్రత్యేక రచన కూడా ప్రాచీనమైనది క్లిష్టమైనది.
4. ఠుమ్రీ - శృంగార రస ప్రధానమై ఆకర్షణీయమైన సంగీత సాహిత్యములు కలిగిన రచన.

5. మీరాబాయి, తులసీదాసు, సూరదాసు, హరిదాసు మొదలైన మహాభక్తుల్లు రచించిన భక్తి సంగీత రచనలకు "భజన్"లు అని అందురు.

6. గీత్ : ఆధునిక సులభ సాహిత్య సంగీతముల యందు రచింపబడినవి గీత్‌లు.

7. జోడ్ ఝూలా : వాద్య సంగీతమున గల తానమునకు సాదృశ్యమైన మనోధర్మ సంగీతమునకు చెందిన రచనా విశేషము..

8. గత్ : ఈ రచన కూడా వాద్య సంగీతమునకు చెందిన రాగ తాళములందు రచించబడిన రచన.

9. ఘజల్ : శృంగార రసమునందు, ఆకర్షణీయ, సంగీతమునందు, సాంఘిక జీవన విధానములు ప్రతిబింబించు ఇతి వృత్తములతో కూడిన రచన ఘజల్.

10. ధున్ : వాద్యముల యందు గల జానపద సంగీత స్వర రచనకు ధున్ అని పేరు.

## 118. జానపద సంగీత రచనలు

జానపద సంగీత రచనలు అనేకములు. వివాహాది శుభకార్యముల యందు ఆయా సందర్భములకు సరిపోవు కీర్తనలు. వరిచేలలోనూ పొలముల యందు కర్షకులు శ్రమ తెలియకుండునట్లు అందరూ కలసి పాడుకొను పాటలు, కార్మికులు, రోడ్డు రోలరును దొర్లించునప్పుడు, కాయ కష్టము చేయుకూలీలు పాడుకొనుపాటలు, బుర్రకథలలో బాలనాగమ్మ కథ, పూర్వ వీరగాధలు, బొబ్బిలి యుద్ధము మొదలైన కథా రచనలు, జ్ఞానము, భక్తి ప్రబోధించు తత్వములు, ఎంకి పాటల వంటి శృంగార భూయిష్టమైన రచనలు. దేవాలయముల యందు దేవునిపై మేలుకొల్పు, ప్రభాత సేవ, నిత్య పూజాదికములు, అభిషేకము, నైవేద్యము పవ్వళింపుసేవ, ఏకాంతసేవ, మొదలైన ఉదయాది సాయంకాలము వరకు జరుగు నిత్య సేవలను ప్రతిబింబించు రచనలు, యుద్ధ సంబంధమైన సంగీతము. వివిధ పండుగలలో, ఉత్సవములలో ప్రత్యేక సందర్భములకు రచింపబడిన రచనలు మొదలైనవి అన్నియును జానపద సంగీతమునకు సంబంధించినవియే.

జానపద సంగీతము యొక్క ముఖ్య లక్షణములు సులభ సంగీతము సులభమైన భాష, తక్కువ నిడివిగల స్థాయి యందు కీర్తన రచింపబడి యుండుట, ఆధార షడ్జమము నుండి మంద్ర పంచమము, మధ్య పంచమము వరకు (ప ద ని స రి గ మ ప) స్వరములలో రచనను సాగించుట. సాహిత్య ప్రధానమై సంగీతము అతి సాధారణమై, సులభమై, రచన

యందుగల సాహిత్యమును ఎత్తి చూపగల స్వభావము గలదియై ఉండుట ముఖ్య లక్షణములు.

## 119. లలిత సంగీత రచనలు

కర్ణాటక సంగీతము నుండి కొంత, జానపద సంగీతము నుండి కొంత, హిందూస్థానీ సంగీతము నుండి కొంత. ఇంగ్లీషు సంగీతము నుండి శుద్ధ స్వరములు, హార్మోనీ స్వరములు (కార్డు, (Chords) సంవాదులు, (Consonents) ఈ విధమైన దృష్టితో సులభమై, సాహిత్యమును ఎత్తి చూపించు దృష్టిని కలిగినవి, లలిత సంగీత రచనలు.

మహారాష్ట్ర నాటకముల ద్వారా, మహారాష్ట్ర హరికథల ద్వారా, తెలుగు నాటక రంగము నందు చొప్పించబడిన సంగీతము కొద్దిగా కర్ణాటక సంగీతముతో ఆంధ్రదేశమున సుమారు 50 సంవత్సరముల నుండి భావకవులు, ఆధునిక కవులు, కూర్చిన భావ గీతములకు ఒక విధమైన సులభ సంగీతము అవసరమైన సమయమునందు లలిత సంగీతము ఉద్భవించినది.

కర్ణాటక సంగీతమునందు గల సంప్రదాయ గమకములు లలిత సంగీతమున తగు మాత్రముగా నుండును.

హిందూస్థానీ సంగీతమున నుండి జారు, రవ, గమకములను కొంత తీసుకొని, ముఖ్యముగా స్వరములను శుద్ధముగా పాడిగా ఉంచుట లలిత సంగీత లక్షణము. ఆందోళిత, కంపిత గమకములు లలిత సంగీతమున ఉండవు.

లలిత సంగీతమున మనోధర్మ సంగీతమునకు తావులేదు.

లలిత సంగీత గానమునకు ముందు, మధ్య, మధ్యగా వాద్య సంగీతముండును. ఈ వాద్య సంగీతమును మ్యూజిక్ (Music) అనియు, బ్యాక్‌గ్రౌండ్ మ్యూజిక్ అనియు అందరు. ఈ ప్రక్రియ చాలా ముఖ్యము. లలిత సంగీతమున మృదంగము కంటే డోలక్, డోల్కీ తబ్లాకు హెచ్చు ప్రాముఖ్యత గలదు. లలిత సంగీత రచనలు ఆద్యంతము ఒకే రాగ స్వరములలో ఉండవలెనను నియమము ఉండదు. లలిత సంగీత గాయకులు సంగీతము నేర్చుకొన నవసరములేదు. సంగీతమునందు సహజ ధోరణి, లలిత సంగీత రచనల వినికిడి, ఉన్న చాలును. లలిత సంగీతమును కూర్చుటకు అనగా భావగీతములకు సంగీతము కూర్చుటకు కూడ సంగీత పాండిత్యము కంటే సహజ సంగీత ధోరణి (Gift in Music) సహజ లయ తాళ ధోరణి ఉన్న చాలును. పాండిత్యము విద్వత్తు ఉండినచో వారు సంగీతమును కూర్చు భావ గీతములు ఇంకనూ రసవంతమై ఉండును.

# 120. సంగీత రచనలు - ఛందస్సు

సంస్కృత సాహిత్యంలోగాని తెనుగు సాహిత్యంలో గాని, శ్లోకములకు, వృత్తములకు, పద్యములకు జాతులకు అనేక విధములైన ఛందస్సు కలదు.

ఛందో శాస్త్రము చాలా అపారమైనది. ఛందస్సునకు అనేక నియమములు కలవు. తెనుగు పద్యమునుగాని, జాతులను గాని లేక సంస్కృత శ్లోకములను గాని వృత్తములను గాని, ఒక మార్గమున, ఒక అక్షర నియమమున ఒక కొలతగా, ఒక లయలో, నియమించి, వాటిని అలంకరించి, అందమును చేకూర్చి, చదువుటకు, వినుటకు సొంపుగా నుండునట్లు, సొగసుగా, ఆహ్లాదముగా, అక్షర బద్ధముగా చేయుటకు ఛందస్సు అని పేరు.

వచనము, గద్యము, పద్యము, పాట ఈ వరుసలో సాహిత్యము క్రమ పరిణామము చెందినది. పాట, గీతము, పదము, కీర్తన, కీర్తనము, కృతి, మొదలైనవి ఇంచుమించు పర్యాయపదములే.

గద్యమునకు, పద్యమునకు లయ అంతర్లీనముగ కలదు. పద్యము పాటగా పరిణామము పొంది, పద్యము నందుండు లయ తాళముగా అభివృద్ధి చెందినది.

పాట, తాళము, అవినాభావము. తాళముచే కొలవబడు పదములు, పాటలు అగును.

పాట యొక్క అక్షరములు పదములు తాళమునందు ఇమిడి యుండవలెను. సులభమైన మార్గములలో, తాళములలో, జానపదగీతములు అతి ప్రాచీనకాలము నుండియు, వచ్చుచునే యున్నవి. పద్యమునకు నిర్దుష్టమైన గణములు, పాద విభజన సంఖ్య ఉండునట్లే గేయమునకు (పాటకు) తాళము ఉండును.

వచన సాహిత్యమున లఘువు, గురువు ఉన్నవి. లఘువు అనగా హ్రస్వాక్షరము. ఒక అక్షరము ఉదాహరణకు 'క'. గురువు అనగా రెండు అక్షరములు. దీర్ఘాక్షరము. ఉదాహరణము "కా"

సంగీతమున హ్రస్వాక్షరము, దీర్ఘాక్షరముతో పాటు దీర్ఘాక్షరము ఎంత పొడవైననూ ఉండును.

ఉదాహరణకు క = 1 అక్షరం; కా=2 అక్షరములు. కా, = 3 అక్షరములు కా ; = 4 అక్షరములు. కా ; , = 5 అక్షరములు. కా ; ; =6 అఓరములు ఇట్లు దీర్ఘాక్షరము ఎన్ని అక్షర కాలములైనను ఉండవచ్చును. ( , = ఒక అక్షరము) (; = రెండక్షరములు)

కర్ణాటక సంగీతమున అభ్యాసగాన రచనలలో ప్రప్రథమమైన పిళయారి గీతము.

శ్రీ గణనధ । సింధూరవర్ణ ।
కరుణ సగర । కరివద అన।
లంబోదర । లకుమికరా ।

ఈ గీతము 6 అక్షరములలో కూర్చబడిన సులభ గీతము. ఇందు యతి నియమములను గ్రహించునది.

త్రిశ్రత్రిపుట తాళమునందు కళ్యాణి రాగమున :

7 అక్షరములు గల గీతము

కమలజ అదళ । విమల సునయన ।
కరివరదకరు । ణాంబుధె ఎహరె ।
కరుణ శరధే । కమఅ । లఅఅఅ ।
కా అంతా అఅ । కైఎసి । నరకఅ ।

ఈ గీతము నంధు ప్రాసయతులు కలవు.

పాదము నందు మొదటి అక్షరం, యతి.
పాదము నందు రెండవ అక్షరం, ప్రాస.
పాదము చివరి అక్షరం, అంత్యప్రాస.
ప్రాసలలో అనేకములు కలవు.
వృత్యానుప్రాసము, ఛేకాను ప్రాసము
మొదలైనవి కలవు. క్రమముగా వీటిని పరిశీలించెదము.

పాట యంధు, తాళము, తాళ ఆవర్తములు, ప్రాసయతులను నియమబద్ధము చేయును. వృత్తములకు, పద్యములకు, పాదములున్నట్లుగానే, సంగీతరచనకు పాదములతోపాటు తాళ ఆవర్తములు ఉండును. ఆవర్త శుద్ధము. సంగీత రచనకు ముఖ్యము.
ఉదా:-

సరసాంగి : ఖండ చాపు 5 అక్షరములు

నీ కేల । దయరాదు । రెండు ఆవర్తములు మొదటి పాదము
నిన్ను భజిం ।చిననాపై । రెండు ఆవర్తములు రెండవ పాదము.

హరికాంభోజి : 6 అక్షరములు చ॥ రూపకం హరికాంభోజి

రామనన్ను । బ్రోవరా అ । రెండు ఆవర్తములు మొదటి పాదము

ప్రేమతో, । లో, కాభి । రెండు ఆవర్తములు రెండవ పాదము

తోడి : 7 అక్షరములు మిశ్రచాపు

; ఎందూకూ । దయా రా, దు । రెండావర్తములు

రా , , , శ్రీ । రామచంద్రా । రెండావర్తములు

హిందోళ : 8 అక్షరాలు - ఆదితాళం

సా మ జ వ ర గ మ । నా , , । సా ధు హృ , ॥

త్సా, ర సా, బ్జ పా, ల కా । లా ; తీ, త । వి ఖ్యా; తా ॥

సంగీత రచనల యందు గల సంపూర్ణ అర్థము నిచ్చు పదము (One complete sentance) సరి సంఖ్యకు సరిపోవు ఆవర్తముల యందు ఇమిడి యుండును. బేసి సంఖ్యలో పూర్తి యగు పదములు ఉండవు.

## వివిధ ప్రాసలు

ఛేకానుప్రాసం. రెండు హల్లులు తిరిగి తిరిగి వచ్చుట. ఛేకాను ప్రాసానికి ఉదాహరణ: "రాజ రాజునికి చెలికాడైన రాజ శేఖరుని గోపుర నిలయుని రాజసగుణ రహితుని శ్రీ త్యాగరాజ" వృత్యానుప్రాసం: ఒకే హల్లు తిరిగి తిరిగి వచ్చుట.

ఉదా : "అడుగులు తడబడ నడలను వడివడి కడుగడు."

ఉదా : ఆదిప్రాస = రెండవ అక్షరం ఒకటిగా ఉండటం.

పల్లవి : రామనీ సమానమెవరు / రఘువంశోద్ధారక

అనుపల్లవి : భామ మరువంపుమొలక / భక్తియనే పంజరపు చిలుక

ప్రాస మ : పల్లవి అనుపల్లవుల రెండవ అక్షరములకు పరస్పర ప్రాసమైత్రి.

యతి ర : మొదటి అక్షరాలు ఒకటిగా ఉండుట

వృత్యానుప్రాసం "ల"

బాల కనక మయ చేల

సుజన పరిపాల

శ్రీరమా లోల
విధృతశర జాల
శుభదకరు ణాలవాల
ఘన నీల
నవ్య వన మాలి కాభరణ ఏల

వృత్యానుప్రాసం : క్ష అక్షరం

ఉదా: దక్ష శిక్షణ దక్షతర సుర లక్షణ విధి విలక్షణ, లక్ష్య లక్షణ, బహు విచక్షణ, సుధా భక్షణ, గురుకటాక్ష వీక్షణ.

## అంత్యప్రాస

పాదముల చివరి అక్షరములు ఒకటిగానే ఉండుట.

వందనము రఘునందన సేతు బంధన భక్త చందన
వేగరా కరుణా సాగరా త్యాగరా జహృదయాకరా

యారమితా వనమాలినా
అనిల తరళకువలయన యనేన
తపతి నసా కిసలయ శయనేన
విరసిత . . . . . . . . . . ముఖేన
స్ఫురతి . . . . . . . . . . విసిఖేస
అమృత . . . . . . . . . . వదనేన
జ్వలతి . . . . . . . . . . పవనేన
శ్రీజయదేవ . . . . . . . . . వచనేన
ప్రవిశతు . . . . . . . . . . హృదయమనేన

## ప్రాసయతి

రెండు పాదముల యందు మొదటి రెండు అక్షరములు ఒకే విధమైనవి అయినచో అది ప్రాస యతి.

ఎందుకు పెద్దలవలె బుద్ధీయవు.
ఎందు బోదునయ్య

యతి: పాదముల మొదటి అక్షరములు

ఉదా: వినవే ఓ మనసా వివరంబుగాను

ఉండేది రాముడొకడు ఊరక చెడిపోలె

మ్రోరుబల్కకున్న లేమిరా । మా మనోరమణ

సొగసుగా మృదంగ తాళము జతగూర్చి నిను సొక్క జేయు

నాద తనుమనిశంశంకరం । నమామి

సాధారణముగా పల్లవి అనుపల్లవులు రెండవ అక్షరాలు ప్రాసలుగా ఉండును. ప్రాసయతులుగా కూడా ఉండవచ్చును.

పల్లవిలోనే రెండు వాక్యముల యందు లేక రెండు ఆవర్తములు యందు మొదటి అక్షరములు ఒకే అక్షరముగా ఉండుట వలన అవి యతి స్థానములు.

ఒకే వర్గమునకు చెందిన అక్షరముల మధ్య యతి ప్రాస మైత్రి యుండును.

ఉదా : క ; ఖ ; గ ; ఘ

ప ; ఫ ; బ ; భ

ప్రాస అక్షరం హల్లుగా నుండును. యతి అక్షరం అచ్చుగాని హల్లుగాని అయి ఉండవచ్చును.

అ, ఇ, ఉ ఎ ల మధ్య యతి మైత్రి గలదు. ఇవి గాక కొన్ని అక్షరముల మధ్య మైత్రిని శాస్త్రజ్ఞులు అంగీకరించిరి.

వ = మ

చ = ట

జ్ఞ = న మొదలైనవి.

## ఆవర్త శుద్ధము

పల్లవి ఒక ఆవర్తమున్న అనుపల్లవి కూడా ఒక ఆవర్తముగాని లేక రెండు ఆవర్తములు గాని యుండవచ్చును. 3 ఆవర్తములు ఉండుట అసహజము.

చరణ ఆవర్తములు 2 గాని, 4 గాని సమ సంఖ్యలో ఉండవలెను. బేసి సంఖ్యలో ఉండవు.

పల్లవి, అనుపల్లవి, చరణములు సరిసమాన ఆవర్తములు యుండుట సంప్రదాయ శుద్ధమే. పాట యొక్క చరణముల ఆవర్తముల మధ్య యతి, ప్రాస నియమములు ఉండును.

పల్లవి అనుపల్లవుల మధ్య యతి ప్రాస కలదు. కాని పల్లవి చరణముల మధ్య యతి ప్రాస మైత్రి ఉండవలెనను నియమము లేదు.

అనుపల్లవికి తరువాత అనగా వెంటనే వచ్చు మధ్యమ కాలమునకు అనుపల్లవి యొక్క యతి ప్రాసలు ఉండును.

యతులకు కొన్ని ఉదాహరణలు

1. ఎవరికై అవతారమెత్తియో
   ఇపుడైన తెలుపయ్య
2. ఉండేది రాముడొకడు
   ఊరక చెడిపోకెమనస
3. మోక్షముగలదా . . . . .
   ముక్తులు . . . . . . . . .
4. మనసా శ్రీరామచంద్రుని మరువకే

## యమకము

ఒకే పదము తిరిగి తిరిగి వచ్చుచు వివిధార్థములు కలిగి యుండుట.

మనసా మనసా మర్థ్యమేమి

వరము : కావరము; వనము : కవనము;

గోపాలా : కోపాలా; రమా : వరమా;

మావర ఉమావర

ఓరా జీవాక్షా; ఓర చూపులు; చూచేవేరా నేనీకు వేరా

సంగీత రచనలలోని చందస్సు, ఛందో నియమములు ప్రాస, యతి, అనుప్రాస, యమకం, ఆవర్త శుద్ధము, మొదలైన వ్యాకరణ అలంకార విశేషములు. సంగీత రచనా సౌందర్యమును ఇనుమడించును. కొన్ని సందర్భములలో జ్ఞాపక శక్తికి తోడ్పడును.

వచన, గద్య, పద్య, కేవల గేయరచనలను చేయు కవులకన్న సంగీతము సాహిత్యము ఏక కాలమునందు తాళములో ఛందస్సుతో రచన చేయు కవియే (వాగ్గేయ కారుడు) అత్యంత శ్రేష్ఠుడు.

## 21. వాగ్గేయకారుడు (ఉభయకారుడు, బయకారుడు)

వాక్ = సాహిత్యము, పాట

గేయ = సంగీతము

కారకుడు = కర్త, రచయిత

పాటలో ఉండిన సాహిత్యమును, అందుండు సంగీతమును రచించుచు గానము చేయువాడు వాగ్గేయకారుడు.

వాగ్గేయకారునికి ఉండవలసిన లక్షణములు: సంస్కృతము, వ్యాకరణము, ఛందస్సు, అలంకార శాస్త్రము, ఇతిహాస, పురాణ, ఉపనిషత్తులలో జ్ఞానము, భగవద్భక్తి, సత్ప్రవర్తన, సహజ కవితాధార, సంగీతమున పాండిత్యము, విద్వత్తు, తాళ జ్ఞానము, సృజనాత్మకత మున్నగు లక్షణములు అపారముగా ఉండవలెను. ఇట్టి సంపూర్ణమైన సకల విషయ జ్ఞానము కలిగిన వాగ్గేయ కారుడు ఉత్తమ వాగ్గేయకారుడు.

కేవల సాహిత్య జ్ఞానము కవిత్వ శక్తి కలిగి రాగ తాళములలో పాండిత్యము లేక గేయములు రచించి ఆ గేయములకు ఇతర సంగీత విద్వాంసులు రాగ తాళములను కూర్చినచో ఆ కవి, ఈ సంగీత విద్వాంసుడు వాగ్గేయకారులు కారు. మొదటి, వ్యక్తి సాహిత్యకారుడు, వాక్కారుడు. రెండవ. వ్యక్తి సంగీత విద్వాంసుడు, గేయకారుడు.

వాగ్గేయ కారత్వమునకు భిన్నముగా, సినిమా ప్రపంచమున, ముందుగా సంగీత దర్శకుడు స్వరమును కూర్చును. కవి ఆ స్వరమునకు అనువుగా మాటలు వ్రాయును. ఆ పాటను సహజ సంగీతజ్ఞుడు గానము చేయును. సినిమాలలో పాత్రను నటించు, నటుడు ఆ పాటను పాడినట్లుగా పెదవులు కదుపుచు, ఆ పాట తానే పాడినట్లు ప్రేక్షక శ్రోతలకు భ్రమ కలిగించును.

## 122. ఉత్తమ సంగీత విద్వాంసుని (గాయక, వాదకుని) లక్షణములు

మధురమై, త్రిస్థాయి, విళంబ, ధృత కాలములలో గానము చేయగలిగిన గాత్రము, శృతి పక్వము, స్వర శుద్ధము, గమక శుద్ధము, స్వర, సాహిత్య స్పష్టత, సాహిత్య రసభావ జ్ఞానము. భావుకత, రాగమును అన్ని కోణముల నుండి గానము చేయకలుగు సాధన, అవగాహన, అనుభవము, మనోధర్మ సంగీతమున అధికారము, క్లిష్ట తాళము లందు ఉన్నత జ్ఞానము, లయ విన్యాసముల యందు చాతుర్యం. సభా రంజక విషయావగాహన. ఒక్కొక్క రాగమున అనేక ప్రసిద్ధ కృతుల సాధన. ప్రసిద్ధ విద్వాంసుల సంగీత వినికిడి. తనదైన ప్రత్యేక

బాణీని, శైలిని, సృష్టించుకొన గలిగిన ఉపజ్ఞ, ఎంత చిన్నవాళ్లు పాడినా ఎంత గొప్పవారు పాడినా, ఆ పాటలలో ఉండే సూక్ష్మ విషయములను గ్రహించే మంచి మనస్సు. భగవద్భక్తి, ఆత్మ విమర్శన. తన సంగీత జ్ఞానాన్ని అందరికీ పంచి పెట్టాలి అనే మంచి ఆలోచన. తక్కిన విద్వాంసుల గానాన్ని విని ఆనందించకలిగే విశాల హృదయం ఉండాలి. ప్రతి మంచి గాయకుడు కొన్ని మంచి పనులు చేస్తూనే ఉండాలి. గురువులపై భక్తి, నిరంతర సంగీత సాధన (ఆచరణ), క్రొత్త కీర్తనలను ఎప్పుడూ నేర్చుకొంటూనే ఉండే అధ్యయనం (అధీతి). సంగీత బోధన, సంగీత ప్రచారానికి సేవ చేయుట. మంచి సంగీతజ్ఞునికి ఉండవలసిన లక్షణాలు.

## 123. గాయక గుణ దోషములు గాయక సద్గుణములు

కనులు మూసుకొని పాడుట, దంతములను కరుచుకొనుచు పాడుట, సీత్కారముతో పాడుట, భయముతో పాడుట, శంకతోపాడుట, శరీరము కంపించుచు పాడుట, నోరు అంతయు తెరచి పాడుట, మృదువుగా గాక, కాకి వలె పాడుట. మేకవలె పాడుట. శృతి కలియకుండ పాడుట. కనీసము 21/2 స్థాయిలలో పాడలేకపోవుట. సాహిత్యము స్పష్టముగా పాడలేకపోవుట అర్థము తెలియకపాడుట. సాహిత్యమున పదములను విడదీసి భావము లేక పాడుట, ఉచ్చారణ సరిగా లేకుండా పాడుట. పూర్తిగా నేర్చుకోకుండా పాడుటకు సిద్ధపడుట. శైలి, గమకము స్వర శుద్ధము. లేక పాడుట. రాగ అవగాహన లేక పాడుట. కల్పన చేయలేక పాడినదే మరల మరల పాడుట. ముక్కుతో పాడుట. మొదలైనవి గాయక దోషములు.

గర్వము, ఈర్ష్య, దంభము, అహంకారము, భగవద్భక్తి లేకపోవుట, ఆధ్యాత్మిక స్వభావము లేక కేవల ప్రాపంచిక విషయాసక్తి, సంగీతజ్ఞునికి మోక్షమును, ముక్తిని ఇహ పర సౌఖ్యమును ఈయజాలవు. ఇట్టి దోష రహితుడు గాయక సద్గుణి.

## 124. వాగ్గేయకార ముద్రలు :

స్వనామ ముద్రలు : పురందరదాస, త్యాగరాజనుత, జయదేవ, నారాయణ తీర్థ మొ॥

ఇష్టదైవ ముద్ర : దీక్షితర్-గురుగుహ; పట్ణం సుబ్రహ్మణ్యయ్యర్, వేంకట: అన్నమాచార్య- వెంకటేశ్వర: క్షేత్రయ్య-మువ్వగోపాల: శ్యామకృష్ణసోదరి; -శ్యామశాస్త్రి: వీణకుప్పయ్యర్-గోపాలదాస: సుబ్బరాయ శాస్త్రి-కుమార: స్వాతి తిరునాళ్: పద్మనాభ; సరసిజనాభ; జలజనాభ; ఆనయ్య-ఉమాదాస: రామస్వామి శివన్-గుహదాస: పైడాల గురుమూర్తి-గురుమూర్తి:

| | | |
|---|---|---|
| రాగముద్ర | : | దీక్షితర్ తన కృతులకు గురుగుహతో పాటు ఆ కీర్తన రాగము పేరును ముద్రగా కొన్ని కృతులలో రచించిరి. కమలాంబా నవావరణ కృతులలో కాంభోజి రాగముద్ర, యమక శైలిలో సకల సౌభాగ్య దాయక+అంభోజ చరణాయై అని సంధి కలిపి, (కాంభోజ) అని శ్లేషించిరి. |
| తాళముద్రలు | : | చాలా అరుదు |
| రాజముద్ర | : | రాజుల పోషణలో ఉండిన ఆస్థాన విద్వాంసులు తమ కృతులను రాజులకు అంకిత భావముగ ముద్రలను రచించిరి.<br>శ్రీకృష్ణారాజేంద్ర ముద్ర జంఝూటి తిల్లానాలో కలదు.<br>"వేంకట కృష్ణ" రామస్వామి దీక్షితర్ రచించిన రాగతాళ మాలికలో "శ్రీధర్మ పౌరాధిప" రాజముద్ర. |
| వంశముద్ర | : | కాకర్ల వంశాగ్రణి, రామబ్రహ్మ, తనయుడౌ (దొరకునా) గిరిరాజసుతా తనయా, త్యాగరాజుని తాతగారల పేరులు. |
| క్షేత్రముద్ర | : | కోవూరు సుందరేశ; తపః తీర్థ = లాల్‌గుడి పంచరత్నాలు:వీణ కుప్పయ్యర్ - కాళహస్తీశ, కాళహస్తీశపంచరత్నములు:శ్యామశాస్త్రి మధుర మీనాక్షి పంచరత్నములలో "మధుర మినాక్షి". |

ఇంకనూ అనేకమైన అముఖ్యమైన ముద్రలు నామ మాత్రంగా ఉన్నాయి. రాజముద్ర, తాళముద్ర, ప్రబంధముద్ర, నాయిక ముద్ర, నాయకముద్ర, స్థలముద్ర, బిరుదు ముద్ర, లక్షణగ్రంథ ముద్ర, సంవత్సర ముద్ర, గ్రామముద్ర మొదలైనవి కలవు.

ప్రబంధాలలో (సంగీత రచనలో) నామముద్ర, ఏకముద్రా ప్రబంధం (నామముద్ర). ద్విముద్రా ప్రబంధం, స్వనామ, రాగముద్రలు): త్రిముద్రా ప్రబంధం (పుణ్యక్షేత్ర, ఇష్టదైవ, రాగముద్రలు) మొదలైనవి కలవు.

ముద్రాకారులలో-ఏకముద్రాకారుడు, ద్విముద్రాకారుడు, త్రిముద్రాకారుడు, బహుముద్రాకారుడు, పర్యాయపద ముద్రాకారుడు అని వివిధములైన ముద్రాకారులు కలరు. స్వాతి తిరునాళ్ వారి రచనలలో పద్మనాభ, జలజనాభ, అంబుజనాభ, పంకజనాభ మొదలైన పర్యాయ పదములను వాడెను.

# 125. మనోధర్మ సంగీతం

(1) రాగలక్షణమును వివరించు పద్ధతి

(2) రాగాలాపన పద్ధతి

(3) స్వర కల్పనా విధము

(4) తాన విషయము

(5) నెరవు వివరణ (నిరవల్)

(6) పల్లవి పరిచయము

ఒక రాగము యొక్క లక్షణమును కూలంకషముగా వర్ణించుటకు ఈ క్రింద నుదహరించిన విషయములను పరిశీలించి పరిగణించవలెను.

జనకరాగము, 72 మేళకర్తలలో సంఖ్య, ఏ చక్రము, ఏ ప్రస్థానము, జన్యరాగము, స్వరస్థానములు, ఆరోహణ, అవరోహణ (మూర్ఛన) ఉపాంగము, సంపూర్ణము, షాడవ, ఔడవ భేదములు, వక్రము, వర్జ్యము, భాషాంగము, అన్యస్వరము (అన్యస్వరములు) మూర్ఛన యందు లేక ప్రయోగమునందు అన్యస్వరములు. అర్ధ భాషాంగము, శృతులు, ప్రసిద్ధ రాగము, రక్తి రాగము, అపూర్వ రాగము, 72 మేళ కర్తలలో వివాది రాగము. మూర్ఛన--ప్రధాన రాగము, ప్రయోగ ప్రధానరాగము, పూర్వాంగ ప్రధానరాగము, ఉత్తరాంగ ప్రధాన రాగము. పంచమాంత్య, ధైవతాంత్య, నిషాధాంత్వరాగములు. రాగనిడివి (రాగపరిధి) మంద్ర, స్థాయిలో సంచారము ఉనికి/లేమి లేక త్రిస్థాయి రాగము. కర్ణాటక శుద్ధ రాగము (వి) దేశీయరాగము. గమక విశేషములు. ముక్తాంగ కంపిత, అర్ధకంపిత, కంపవిహీన రాగములు. రాగరంజక ప్రయోగముల, అపురూప ప్రయోగములు రాగ చరిత్ర (ఉన్నచో) రాగ సంప్రదాయము, పూర్వ ప్రసిద్ధము ఆధునిక ప్రసిద్ధము, రచనలు, వాగ్గేయకారులు.

ఈ విషయములను దృష్టి యందుంచుకొని రాగ లక్షణమును వర్ణన చేసినచో ఆ వర్ణన కూలంకషముగ నుండును.

## రాగాలాపన పద్ధతి

సంప్రదాయానుబద్ధమైన శాస్త్రమునందు రాగాలాపన 3 అంచెలుగా నిర్ణయించిరి.

1. ఆక్షిప్తిక (ఎత్తుగడ ) : Introduction ఉపోద్ఘాతము రాగమును ప్రారంభించి రాగభావమును వ్యక్తీకరించుచు (Establish) పాడుట. రాగ రంజక ప్రయోగములతో కూడి ఉండవలెను. రాగము శ్రోతలకు వెంటనే తెలియునట్లు పాడవలెను. ఒకస్థాయి యందు ఆరోహణ, అవరోహణలలో కూడి యుండవలెను. శ్రోతలను రాగ సందిగ్ధమునందు ఉంచక వారికి తెలియునట్లు పాడినచో వారు ఆనందించెదరు. రాగము పేరు మొదలైన ముఖ్య వర్ణన విశేషములు, అతి క్లుప్తముగా శ్రోతలకు చెప్పినచో వారి ఆనందము ద్విగుణీకృతముగా నుండును.

2. రాగవర్ధని : రాగవర్ధని అనగా రాగమును వర్ధింపచేయుచు, పెంచుచు, కల్పించుచు, నెమ్మదిగా అంచెలు అంచెలుగా`మొదట నెమ్మదిగా, క్రమక్రమముగా వేగము హెచ్చించుచు, మంద్ర మధ్య, తారస్థాయిల యందు ప్రస్థరించుచు పాడుట రాగవర్ధిని అందురు.

ఈ రాగవర్ధని 4 భాగములు (Stages) గా చెప్పబడినది. అవి క్రమముగా ప్రథమ, ద్వితీయ, తృతీయ, చతుర్ధ రాగవర్ధనులు.

ప్రథమ రాగ వర్ధని : మధ్య - మంద్ర. స్థాయిల యందు, పూర్వాంగము నందు విళంబలయులతో ప్రస్థరించుట.

ద్వితీయ రాగవర్ధని : మధ్యస్థాయిలో - ముఖ్యముగా పూర్వాంగమునందు, కొంచెముగా ఉత్తరాంగమునందు, మధ్యలయల యందు ప్రస్థరించుట.

తృతీయరాగవర్ధని : మధ్య స్థాయి యందు ముఖ్యముగా ఉత్తరాంగమునందు, కొంచెముగా తారస్థాయి షడ్జమ రిషభ ప్రాంతమునందు, మధ్య, దురిత, లయల యందు ప్రస్థరించుట.

చతుర్ధ రాగవర్ధని : తారస్థాయిల యందు గల పూర్వాంగమునందు కొంచెముగా మధ్యస్థాయి యందు ఉత్తరాంగమునందు దృతలయలయందు ప్రస్థరించుట.

ఈ రాగవర్ధనులు పాడిన తరువాత 'మకరిణి', లేక 'వర్తిని' అను పద్ధతి కలదు. ఇది తారస్థాయి యందు షడ్జమము గాని కొన్ని రాగములందు గాంధారము గాని (కళ్యాణి మొదలగు రాగములందు) స్థాయిగా చేసుకొని అనగా ఆ స్వరముల మీద నిలబెట్టి దురితముగా వేగముగా పాడుచు మొత్తము ఒకటిన్నర (11/2) స్థాయిలలో సంచారములను పాడుచు రాగమును ముగించుట ఈ దురిత సంచారములు ఆధార షడ్జముపై నిలబెట్టి కూడా చేయవచ్చును.

## రాగ ఆలాపన చేయుటకు కొన్ని పద్ధతులు (సూచనలు)

రాగమును పాడుట అలవాటు చేయవలెను. ఆ పద్ధతులలో మొదటిది ఒక రాగమున గల కీర్తనలను వాటి యందుగల సంగతులను పరిగణలోకి తెచ్చి ఆ సంగతులను క్రమ పద్ధతిలో పాడుకొనినచో రాగాలాపనకు నాంది అగును. మన రాగములు సంగతులతో చేరి యుండును. ఒక సంగతికి తరువాత సంగతికి మధ్య ఆ రెండు సంగతులను కలుపు స్వర పదము స్వరముల దీర్ఘము ఉండును. ఇది ఒక connecting link పూలదండ యందు గల పూవులు సంగతులు. మధ్యగా ఆ సంగతులను కలుపు దీర్ఘము సూత్రమునకు సాదృశ్యము. రాగసంగతులు కృతులయందు, రాగ సూత్రము (Connecting Links) వర్ణముల యందు దొరుకును. రాగమును వినవలెను. మొదటిసారిగా అనుకరించవలెను. తరువాత క్రమముగా అనుసరించవలెను. రాగమునకు సంబంధించిన సంగతులు పాడవలెను. వాటి పేర్పు ముఖ్యము. సంప్రదాయ సంగతులనే పాడవలెను. స్వయముగా కల్పించకూడదు. రాగ అవగాహన సంపూర్ణముగా అయిన తరువాత సంప్రదాయ చట్టమునందు కల్పన తనంతట తానే వచ్చును. కల్పన ఒక వరము. అర్థవంతమైన, మధురమైన, రాగభావము ఇనుమడించు కల్పన వాంఛనీయము. ఎప్పటికప్పుడు కృతుల యందు గల రాగ సంగతులను రాగ ప్రవాహమును అధ్యయనము చేయుచు అవగాహన చేసుకొనుచు ఉండవలెను.

విద్వాంసుడు, విద్యార్థులకు సరియైన సమయమునందు రాగము నేర్పవలెను. అవసరమైనచో రాగమును వ్రాసి ఇచ్చినచో మంచిది. అన్ని రాగములలో వచ్చు కొన్ని దురిత సంగతులు ఉండును. వాటిని వ్రాసి ఇచ్చి సాధన చేయించిన బాగుండును. 'తదరినాంతోం' అను అక్షరములను ఉచ్చరించుచు పాడుట వలన రాగాలాపన సులభమగును. దీని అర్థము తత్, అరే, అనంతం, ఓం అని కొంతమంది పండితులు అందురు.

## స్వరకల్పనా పద్ధతులు

విద్యార్థులకు ముందుగా రూపక తాళములలో, మోహన, కళ్యాణి మొదలైన ప్రసిద్ధ రాగములతో సంపూర్ణ ఔడవ, షాడవ రాగములలో, సమగ్రహమునకు, మొదటి కాలమున ఒక ఆవర్త స్వరములను పాడించుచు, క్రమక్రమముగా రెండు, మూడు నాలుగు ఆ వృత్తములను పాడించి తరువాత రెండవ కాలమును పాడించుటకు ప్రారంభించవలెను. స్వర కల్పనా ప్రవాహము అలవాటు చేయించవలెను. ఈ సాధనకు క్రమముగా 4, 5, 6, 7, స్వరములను తీసుకొని వాటిని ప్రస్థరించవలెను. ఈ ప్రస్థరించుటలో క్రమముగా, హ్రస్వ, దీర్ఘ, దాటు, ప్రయోగములను పరిగణనలోకి తీసుకురావలెను.

స్వరకల్పనా ప్రవాహము అర్థవంతముగా రాగభావ ప్రధానముగా, క్రమమైన సంగతులతో స్వర సందర్భములతో కలసి, తగ్గింపులు, హెచ్చింపులతో 3, 4, 5, 6, మొదలైన స్వర సమూహములతో మృదంగ జతులను స్ఫురింప చేయుచు స్వర కల్పన సాగవలెను. తరువాత గ్రహ న్యాస స్వరముల అవగాహన కావలెను. ఆ తరువాత 'మకుట' స్వరములు, ముక్తాయి స్వరములుపై దృష్టి, సాధన కేంద్రీకరించవలెను. విన్యాస స్వర సమూహములను సాధన చేయవలెను. 4 అక్షరకాలమున ఒక అక్షర, 3 అక్షరముల విన్యాసములు విధిగా సాధన చేయవలెను. ఈ స్వర కల్పన యందు, పునరుక్తి, దోషమగును. సరియైన ఉచ్చారణ ముఖ్యము. స్వరకల్పనలో తీసుకోవలసిన జాగ్రత్తలు తీసుకొననిచో అర్థము, భావము లోపించి స్వర వాగుడుగా అగును. అట్లు కాకుండుటకు అను నిమిషము శ్రద్ధ వహించవలెను. మొట్టమొదట చిన్న తాళములైన రూపక తాళమున ప్రారంభించి, క్రమముగా మిశ్రచాపు, ఝంప, మధ్యమకాల - ఆది, తరువాత విళంబ - ఆది, తాళములతో స్వరకల్పనా సాధన సాగపలెను.

తానము

రాగాన్ని లయతో అనంతా, అనంతా అనుచు (అనగా భగవంతుని సంబోధించుట) పాడుటను 'తానం' అందురు. తెన్నా అను పదము నుండి కూడా తానము వచ్చినదని కొంతమంది అభిప్రాయము. స్వరాలంకార సముదాయములను, స్వరబృందములను, ప్రస్థరించుచు కల్పించుచు, రాగ భావములతో, రాగ మూర్ఛనకు సరిపోవు ప్రయోగములతో తానము పాడుదురు. పూర్వము, తానము, వీణ మీద వాయించెడువారు. లయ బద్ధముగా, మంద్ర, మధ్య, తారస్థాయిలలో విళంబ, మధ్య, ధృత లయల యందు రాగమును వాయించెడివారు. ఆ ప్రక్రియయే గాత్రమునందు కూడా ప్రదర్శించ మొదలిడిరి. అదియే తానమైనది. తానములు ఎనిమిది విధములు - అవి:- మానవ, అశ్వ, గజ, మర్కట, మయూర, కుక్కుట, మండూక, చక్ర తానములు.

'సితార్' వాద్యమునందు 'జోడ్', 'ఝాలా' అను ప్రక్రియకు, వీణ యందు 'తానము' అను ప్రక్రియకు సామ్యము కలదు.

ఈ 'తానము'నే 'మధ్యమ కాలము' 'ఘనము' అని కూడ వ్యవహరించెదరు.

వీణపై తానమునకు అనుకూలమైన రాగములకు ఘన రాగములని అనుచున్నారు. 1. నాట ; 2. గౌళ ; 3. ఆరభి ; 4. వరాళి ; 5. శ్రీరాగము ఘనరాగ పంచకము. ఇవి అయిదు గాక ద్వితీయ ఘనరాగ పంచకము అని అయిదు రాగములు కలవు. 1. రీతిగౌళ; 2. భౌళి: 3. నారాయణగౌళ; 4. సారంగనాట; 5. కేదార.

వీణ కచ్చేరీలో, ముఖ్య రాగము ఏది వాయించినను, ఆ రాగమున తానము వాయించుట అనే సంప్రదాయము నిన్న మొన్నటి దాకా ఉండెడిది ఇప్పుడు ఇట్టి విధమగు సంప్రదాయము క్రమముగా తగ్గు ముఖము పట్టినది.

తానము నందు ఎన్ని విధములగు అలంకారములు వేసిన, అంత శ్రేష్టముగా నుండును. పునరుక్తి దోషము లేకుండుట గొప్ప.

ఈ తానము వాయించుటలో రాగము నందు వలెనే ఒక మార్గము (Procedure) కలదు. సమయ సందర్భములను బట్టి తక్కువ, ఎక్కువలు ఉండును.

సంగీత కచ్చేరీలలో కచ్చేరీ చివర రాగము, తానము, పల్లవి పాడుట ఆచారము. ఈ ఆచారము కూడా క్రమముగా సన్నగిల్లుచున్నది. ఈమధ్య కొన్ని సంగీత సభల వారు వారి సభలలో రాగం తానం పల్లవి విధిగా పాడవలెనను నిబంధనలు సంగీతజ్ఞులకు వ్రాయుచు రాగం తానం పల్లవిని ఆలపించు సంప్రదాయమును పునరుద్ధరించుచున్నారు.

తానమునందు జంట అనగా స్ఫురితము ప్రత్యాహతములతో కూడిన ప్రయోగములు ఎక్కువగా ఉండును.

తానమును సమర్ధతతో పాడుటకు అనుభవము, రాగ అవగాహన, ప్రత్యేక సాధన తాన వినికిడి కావలెను.

## పల్లవి

'పల్లవి' పాడుట అనుప్రక్రియ కర్ణాటక సంగీతమునందు ఒక పాండిత్య ప్రకర్షకు ఒక విద్వాంసుని పాండిత్య ప్రతిభకు, ఉపజ్ఞకు నిదర్శనము. క్లిష్టములైన తాళములందు ఒక అర్థవంతమగు సాహిత్య పద సమూహములను తీసుకొని, రాగభావముతో, సంగీత విన్యాసములతో తాళ విన్యాసములతో నెరవును, మూడు కాలములో పాడుచు, ఆ పల్లవిని విళంబ, మధ్య, దృత కాలముల యందు, అనులోమ, విలోమముల యందు విన్యాసములు సల్పుచు పాడుట పల్లవి లక్షణము.

ఈ పల్లవులు సూళాది సప్త తాళములయందే గాక వాటి గతి భేదములందునూ మార్గ తాళముల యందును పూర్వకాలమున మహా విద్వాంసులు పాడెడివారు. పల్లవి గోపాలయ్యర్ పల్లవులను పాడుటలో ఘనుడు, ఘనం సీనయ్య తానము పాడుటలో ప్రసిద్ధుడు. శంకరాభరణం నరసయ్య, శంకరాభరణ రాగాన్ని నభూతో నభవిష్యతి అనునట్లు పాడెనట. అటులనే తోడి సీతారామయ్య కూడా.

పూర్వము రాజుల దర్బారులలో సభాసదులు 'పల్లవి'ని అప్పటికప్పుడు విద్వాంసుని ప్రతిభను పరీక్షించుటకు ఇచ్చెడివారు.

ఆ పల్లవి ఎంత క్లిషమైననూ సరే విద్వాంసుడు సమర్ధవంతంగా పాడగలిగి రాజుల యొక్క, విద్వాంసుల యొక్క మన్నలను సన్మానములను పొందెడివాడట.

అట్లు పాడలేకపోయినచో అవమాన భారము విద్వాంసునికి తప్పదు. ఆధునిక యుగములో ఈ పద్ధతి మార్పు చెందుతూ వచ్చినది. తరువాత కాలమున గాత్రజ్ఞుడు. ఒక క్లిష్ట పల్లవిని ఇంటి దగ్గర సానబట్టి సభలో ప్రక్క వాద్యముల వారి మీద ప్రయోగించెడివాడు. వారు సమర్థులైనచో సరియే, లేనిచో మనస్థాపములు.

ఇప్పటి కాలమునందు గాత్రజ్ఞులు, వైలెన్ విద్వాంసులు, మృదంగ విద్వాంసులు కలసి గృహ పరిశ్రమ బాగుగా చేసి సభలో పాడుచున్నారు. ఈ పద్ధతి వలన గాత్ర, వాద్య విద్వాంసులలో ఐకమత్యము వృద్ధి చెందినది. ఈ సంప్రదాయముతోబాటు, కచ్చేరీ ముందుగా వైలెన్ మృదంగ విద్వాంసుల కోరికపై గాత్రజ్ఞుడు ఒక్కసారి పల్లవిని పాడిన వైలెన్ మృదంగ విద్వాంసులు అవగాహన చేసుకొని సభయందు పల్లవి చక్కగా నిర్వహించుచున్నారు.

మృదంగ విద్వాంసులకు పల్లవులు "నల్లేరు మీద బండి" సదృశములే కదా!

పల్లవి, మనోధర్మ సంగీత రీతి కనుక, పల్లవిని అప్పటికప్పుడు కూర్చుని పాడుటయే సమంజసము. లేనిచో అది కృతివలె కల్పిత సంగీత మగునేమో. ఆధునిక కాలమునందు పల్లవులు పాడుటలో వాయించుటలో యశస్వులు, బాలమురళీ కృష్ణ లాల్‌గుడి జయరామన్, టి.ఆర్. సుబ్రహ్మణ్యం వారి శిష్యబృందం మొదలైన వారు ఎంతో మంది కలరు.

పల్లవులపై కూలంకష గ్రంధము. శ్రీపాద పినాకపాణి గారు వ్రాసిరి. ఈ గ్రంధము పల్లవుల పునరుద్ధరణకు తోడ్పడుచున్నది. పల్లవి అర్ధము ప=పదము (సాహిత్యము) ల్ల=లయ; ల్ల అనగా లయ మిగుల ప్రధానముగా గలది. వి=విన్యాసము. ప=పదగర్భము అని కూడా అర్ధము. తాళ గర్భమున (నడిబొడ్డున) గల ఘాతమీద సాహిత్య మధ్య అక్షరము పడుట, పల్లవి యొక్క ముఖ్య లక్షణము.

## నెరవు (నిరవళ్)

నిరవళ్ అనునది తమిళ పదము. ఆ పదమునకు తెనుగు "నెరవు" దీనికి సరియైన తెనుగు పదములేదు కనుక "నెరవు" బాగుగనే ఉన్నది. కృతియందుగాని (పల్లవి యందుగాని)

అర్థవంతమైన సాహిత్యమును తీసుకొని రాగమునందు ప్రస్థరించుచు ఒకటి రెండు కాలములలో సాహిత్యార్థమును భావమును ఇనుమడింప చేయుచు పాడుటకు నెరవు పాడుట యందురు.

నెరవు పాడుట మిగుల కష్టము. సాహిత్యము, రాగము, తాళము, సాహిత్య భావము, రాగభావము, తాళపరిధిలో సరిపెట్టి పాడవలెనన్న అనుభవము సాధన, వినికిడి, కల్పన, అపారముగా కావలెను.

తాళ విళంబ కాలమున నెరవు పాడుట ఇంకనూ కష్టము. తాళమునందు ఇమిడియున్న కృతి యొక్క సాహిత్య అక్షరములను యథాతథంగా ఉంచుచు ముందుగా పాడి తరువాత ఆ అక్షరములను అటునిటు కదుపుచు విన్యాసములు సలుపుచు పాడవలెను.

ఇట్టి ప్రక్రియకు హిందూస్థానీ సంగీతమున "బోల్‌తాన్" అందురు.

నెరవును మొట్టమొదట లయను పాటించుచు రాగము వలె పాడవలెను. రెండవ (Stage) అంచెయందు కృతి యొక్క మొదటి కాలమున పాడవలెను. 3వ అంచెయందు మొదటి కాలము పాడుచు పైకాలము (Introduce) పరిచయము చేయుచు రెండు కాలములను కలుపు కొనుచు పాడవలెను. చిట్టచివరిగా తాళము అంతయు నింపుచూ దురితముగా పాడవలెను. అప్పుడప్పుడు సాహిత్యాక్షరములను తాళ జతుల ననుసరించుచు ముందు వెనుక జరుపుతూ పాడిన సొగసుగా పాండిత్య ప్రకర్షణతో రంజకము కలిగి ఉండును.

నెరవు పాడుట మొట్టమొదట చిన్నతాళములైన రూపకతాళమునందు తరువాత జంప తాళమునందు క్రమముగా చాపు, ఆది, తాళములలో సాధన చేసి చివరగా విళంబ కాల ఆది తాళములలో సాధన చేయవలయును.

నెరవు చేయునపుడు ఏ కాలమున చేసినను సాహిత్య భావము, రాగభావము ప్రస్ఫుటమౌనట్లు ఉండవలెను. నెరవు ప్రస్థారము అంచెలంచెలుగా అన్ని స్వరములను కేంద్రములుగా చేసికొనుచు పాడవలెను.

## 126. ధ్వని విషయము

ధ్వని, చప్పుడు, నాదము, ఓంకారము, (ప్రణవనాదము) ఈ పదములు అన్నియును ఇంచుమించు ఒకే అర్థము కలిగి యున్నవి.

**చప్పుడు** Noise : చెవికి ఇంపుగా లేనిది. ధ్వని - చెవికి వినిపించునది ఏదైనను.

**నాదము** : చెవికి ఇంపగునది, సుదీర్ఘముగా ఒక నిర్ణీత మైన స్థాయి యందు నిర్ణీత కాలము వరకు నిశ్చలముగా నుండి నిర్ణీత కంపనములు సంఖ్య కలిగి యుండునది నాదము. నాదము సంగీత పరమైనది. సుస్వరయుతము. మధురము, రసవంతము. నాదము సంగీతమునకు ఆధారమైనది.

నాదము గాత్ర పేటిక యందు గల రెండు నాళికల కంపనము వలన ఆ నాళికల మధ్య నుండి గాలి కంపించునప్పుడు గాత్రము నుండి నాదము బహిర్గతమగును. తీగెను కంపింప చేసిన నందువలన నాదము ఉత్పన్నమగును. మురళీ వాద్యమున వెదురు గొట్టమునందు గాలిని ఊది ఆ గాలిని కంపింప చేసినందువలన నాదోత్పత్తి జరుగుచున్నవి. లోహవస్తువును గంటను లోహకడ్డీతో కొట్టుట వలన గంట ధ్వనించుచున్నది.

నాద ఉత్పత్తికి రెండు వస్తువుల యొక్క పరస్పర ఘర్షణ కావలెను.

ప్రపంచమున అనేకమైన ధ్వనులు, నాదములు మనము వినుచున్నాము.

నాదోత్పత్తి విషయమున సంప్రదాయ అభిప్రాయ ప్రకారము, ప్రాణాగ్నుల సంయోగము వలన ప్రణవ నాదము ఉత్పత్తి అగుచు సప్త స్వరములైనది అని శాస్త్రజ్ఞుల అభిప్రాయము. ఇది యదార్థమే.

భౌతిక శాస్త్రమున నాదోత్పత్తి గాత్రమునందుగాని, తీగె యందు గాని, వాయువాద్యముల యందుగాని, లోహములందుగాని, రెండు వస్తువుల పరస్పర ఘర్షణ వలన కంపనము వలన కలుగును.

ఆనాదము ఆకాశము ద్వారా (eather) వ్యాపించి మన చెవికి చేరుచున్నది.

నాదమునకు 3 వైవిధ్యములు గలవు. 1. స్థాయి (Piteh) 2. ఘన్నము లేక బిగ్గరతము (Volume or Intensity), 3. నాదగుణము (Timbre)

## స్థాయి - (PITCH)

నాదస్థాయి ఆ నాదము యొక్క కంపన సంఖ్యపై ఆధారపడి యున్నది. ఉదాహరణకు మగవారి గాత్రము నాద కంపన తరుచుతనము కన్న స్త్రీ గాత్ర నాద కంపన తరుచు తనము ఎక్కువగా నుండును. సంగీతమున షడ్జాది రిషభ గాంధార మధ్యమ, పంచమ, ధైవత నిషాదముల కంపన తరచు తనము హెచ్చుచు పోవును. ఈ తగ్గు హెచ్చులు పరిమాణమే స్థాయి. ఈ 'స్థాయి' కంపన తరుచుతనము. 20 లోపుగా ఉండిన మానవుని చెవి వినలేదు. అటులనే 16,000 తరుచు తనములపైన కూడా మన చెవికి వినుట సాధ్యపడదు.

సంగీత వాద్యమున గల అయిదు స్వర సప్త మండలములు, సంగీతమునకు చెందినవి అయి ఉండును. దానికి దిగువ, దానికి పైని, శ్రావ్యత లోపించును.

మానవుని గాత్ర సంగీతము 3 సప్త స్వర మండలముల యందు శ్రావ్యముగా నుండును.

సంగీత రచనలు రెండు స్థాయి యందే సాధారణముగా కలవు.

## ఘనము, బిగ్గర తనము - INTENSITY - VOLUME

నాదము నెమ్మదిగానూ, బిగ్గరగానూ పలికించుట, వినిపించుట, నాదము యొక్క రెండవ విధము. గాత్రమున గాని వాద్యమున గాని ఒకే స్వరము పలికించినను అదే స్థాయి యందు నెమ్మది బిగ్గరతనములలో తేడా చూపించవచ్చును. ఈ గుణమునకే నాద ఘనమని పేరు. అటులనే ఒక తంతిని నెమ్మదిగా మీటినప్పుడు ధ్వని తక్కువగును, గట్టిగా మీటినప్పుడు బిగ్గరగను వినిపించును. ఇదియే నాద ఘనము యొక్క వ్యత్యాసము.

## నాదగుణము - TIMBRE

ఒకే సంగీత రచన ఇద్దరు ఒకే స్థాయి, ఒకే బిగ్గరతనము ఒకే శైలి యందు ఒకే స్వరమును ఒకే గమకమును పాడుచున్నను కంఠస్వరములు మొదటివారిది రెండవ వారిది విభేదముండును. ఎవరి కంఠస్వరము వారిదే. ఈ విభేదమే నాద గుణము లేక TIMBRE. కంఠ స్వరముల వైవిద్యము వలనే వాద్య నాద వైవిధ్యము కూడ ఉండును. ఇదియే నాద గుణము TIMBRE.

## స్వయంభూ ధ్వనులు - UPPER PARTIALS

తంబురా యొక్క మంద్ర షడ్జమము పలుకు తీగె మంద్ర అంతరగాంధారము పలుకును. అటులనే మంద్ర పంచమము మీటినచో మధ్యస్థాయి చతుశృతి రిషభము పలుకును.

ఆధారషడ్జమముల యందు తార షడ్జమములు వాటి అంతట అవే పలుకును. ఇంకనూ సూక్ష్మముగా పరిశీలించిన మంద్ర షడ్జమము నందే అనేక సంవాది స్వరములు పలుకును. ఇవియే స్వయంభూ ధ్వనులు. ఇట్లు వాటంతట అవే అనేక స్వరములు వాద్యము నందు పలుకుట ప్రాకృతికమైన ఒక అద్భుతము. అసలు సంగీతము, సునాదము. స్వరములు స్వర స్థానములు, అన్నియును, ఒక ప్రకృతి అద్భుతము. అది సర్వ జనీనము. భగవంతుని ప్రతిబింబము.

## నాదపేటిక - RESONANCE BOX

వీణ యొక్క కుండ, వైలెన్ యొక్క నాద పేటిక, వేణువు ఆకారము, మృదంగ గుల్ల. మొదలైనవి అన్నియును నాద పేటికలు. వాటి ఆకారము, చిన్న పెద్ద పేటికలను బట్టి వాటి వాటి నాద బిగ్గరతనముల యొక్క భేదములు ఆధారపడి యుండును. మూగిఫిడేలు (MUTE VIOLIN) అని ఒక విధమైన వైలెన్‌కు Resonance Box అసలే ఉండదు. ఆ నాదము సాధనకు ఉపయోగింపబడును. వాయించు వానికి తప్ప ప్రక్క వానికి కూడా ఆ వాదము వినిపించదు. (Resonance Box) నాద పేటిక ద్వారా నాదము బహిర్గతమగును అనుటకు ఇది ఒక ఉదాహరణ.

(Trumpet) ట్రంపెట్ వాద్యములలో అతి చిన్నవి అతి పెద్దవి ఉండును. ఊరేగింపులులో వాయింపబడు ఈ వాద్యము నాదములు చాలా బిగ్గరగా వినిపించును. పెద్ద ట్రంపెట్ నాదము కొన్ని మైళ్లు వినిపించును.

## సహాయ కంపనములు - (SYMPATHIC VIBRATIONS)

ఒక తీగెను మీటి ధ్వనింపచేసినచో అదే స్థాయికి చెందిన, సమాన శృతి కలిగిన ప్రక్క తీగె కూడా (మీట కుండగనే) తనంతట తాను ధ్వనించును. ఒక గదిలో కొన్ని తంబురాలు ఒకే శృతికి చేసి ఆ శృతిలో ఎవరైన పాడినను, లేక ఆ శృతి యందు ఏ వాద్యమునైన వాదన సల్పినను ఆ తంబురాలన్నియును వాటంతట అవే ధ్వనించును. సారంగి, సితార్ వాద్యములకు సహాయ కంపనములు చెందుటకు 3 స్థాయిలలో స్థాయికి 12 స్వర స్థానములు

చొప్పున 36 తీగెలు అమర్చబడి యుండును. ఆ వాద్యములను వాయించునపుడు ఏ స్వరము వాయించునపుడు ఆ సహాయకంపన తీగె ధ్వనించి. వాద్యము యొక్క మాధుర్యము ఇనుమడించును.

## ప్రతి ధ్వని ; (ECHO) గాన మందిరములు

పర్వత ప్రాంతముల యందును, పెద్ద దేవాలయముల యందును, పెద్ద రాతి భవనముల యందును, ధ్వని చేసిన వెంటనే ప్రతి ధ్వని వినిపించును. మొదట చేసిన ధ్వని తరంగములు దూరముననున్నను, నున్నటి రాతి ప్రదేశములను తాకి వెనుకకు మరలి వచ్చినను, ప్రతిధ్వని వినిపించును. పెద్ద నృత్య సంగీత భవనముల యందును, పెద్ద వివాహ వేదికల యందును ఇట్టి ప్రతి ధ్వనులు ఉండుట కద్దు. ప్రతిధ్వనులు ఉన్నచో సంగీత సభలు రక్తి భంగము చెందును. అందుచేతనే (Sound engineers) భవన నిర్మాణ సాంకేతిక నిపుణులు ప్రతిధ్వనులు కలుగకుండ ఉండుటకు తగు జాగ్రత్తలు తీసుకొనెదరు.

అట్టి జాగ్రత్తలు : నాదమును పీల్చుకొనునట్లు చేయు చర్యలుగా గోడలకు రంధ్రములుండిన దళసరి అట్టలు బిగించుట, ఉన్ని బట్టలు గోడలకు అమర్చుట, కర్రతో చేసిన కుర్చీలు మందిరమునందు అమర్చుట మొదలైనవి చేయుదురు. శ్రోతలు, ప్రేక్షకులు వారి దుస్తులు కూడా ధ్వని తరంగములను పీల్చుకొనునట్లు చేయును.

మందిరము యొక్క పై కప్పు, అతి ఎత్తుగా లేకుండ చేసి పై కప్పునకు కృత్రిమ సీలింగు అమర్చిన ప్రతిధ్వని ఉండదు. ఇట్టి ధ్వని విషయములు నిర్మాణ దశయందే చర్యలు తీసుకొనిన Preventive Acoustics, అనియును, నిర్మాణ మయిన తరువాత తీసుకొన్నచో Curative Acoustics అనియును అందురు.

## 127. కర్ణాటక సంగీతము ఆంధ్రులసేవ-సంక్షిప్త వివరణ

ఆంధ్రదేశంలో 'కర్ణాటక సంగీత అభివృద్ధి, చరిత్ర, రాజులు, జమీందారులు, గురుకులాలు, మహా విద్వాంసులు, శ్రోతలు, సంగీత సభలు, సంగీత విద్యాలయాలు, సంగీత పోషకులు, ప్రభుత్వం, దేవాలయాలు, ఆకాశవాణి, దూరదర్శన్, క్యాసెట్ కంపెనీలు. మొదలైన వారి సేవ మీద ఆధారపడి ఉంది.

ఒకప్పుడు విజయనగర సామ్రాజ్యం దక్షిణాపథం అంతా ఆక్రమించి ఉండేది. ఆ తరువాత దక్షిణ రాష్ట్రాలన్నీ తంజావూరు రాజధాని చేసుకొని పరిపాలించిన, చోళ, చేర, మహారాష్ట్ర, నాయక ప్రభువులు, సంగీత సాహిత్యాలను పోషించారు. వీరందరూ సంగీతంతోపాటు సంగీతం అంత మధురంగా ఉండే తెలుగు భాషను కూడా పోషించారు. మహారాష్ట్ర ప్రభువులు స్వయంగా తెలుగులో యక్షగానాలను రచించారు.

ఆకాలంలో ఆంధ్రదేశానికి కూడా తంజావూరే రాజధానిగా ఉండేది. ఆకారణంగా ఆంధ్ర జిల్లాలలో ఉండే సంగీత, సాహిత్య, నాట్య విద్వాంసులు, కవులు, తంజావూరు రాజుల పోషణాశ్రయాల కోసం, వారివారి కళా కుశలత గుర్తింపు కోసం, తంజావూరు చుట్టు ప్రక్కల అగ్రహారాలకు వలస వెళ్ళారు.

త్యాగరాజుని వంశీయులు, శ్యామశాస్త్రి వారి వంశీయులు మెలట్టూరు వారు, కవయిత్రి పసుపు లేటి రంగాజమ్మ వీణాధనం, ముక్తాబృంద, బాలసరస్వతి, మొదలైన నాట్య, సంగీత విద్యా కుటుంబాలు సంగీత గ్రంథకర్తలైన కల్లినాధుడు, సోమనాధుడు, గోవిందా మాత్యుడు, విజయగోపాలుడు, గిరిరాజకవి, గోవిందసామయ్య, కూవన సామయ్య, ఘనంసీనయ్య, మెలట్టూరి కాశీనాధయ్య, మెలట్టూరు వీరభద్రయ్య, మెలట్టూరు వెంకట్రామశాస్త్రి, పైడాల గురుమూర్తి శాస్త్రి, కవిమాతృ భూతయ్య. మొదలైన అనేక మంది అజ్ఞాత తెలుగు పదకర్తలైన తెలుగు వాగ్గేయకారులు. శొంఠి వెంకటరమణయ్య, శొంఠి వెంకట సుబ్బయ్య, (శొంఠివారు త్యాగరాజుని గురువులు.) పల్లవి గోపాలయ్య, పల్లవి శేషయ్య మొదలైన మహా సంగీత విద్వాంసులు, వాగ్గేయకారులు తమిళనాట స్థిర నివాస మేర్పరచుకొనిన తెలుగువారే.

కర్ణాటక సంగీత చైతన్యానికి, అభివృద్ధికి తెలుగు వారి సేవ, తెలుగువారి దోహదం ఎంతో ఉన్నతమైనవి. కొనియాడదగినవి.

ఈ నేపథ్యంలో గొప్ప కళాకారులు, విద్వాంసులు, కవులు, వాగ్గేయకారులు, తమిళనాడు వలస వెళ్లడం మూలంగా ఆంధ్రదేశం సంగీత విషయంగా (కర్ణాటక సంగీత శైలి, గ్రంథములు, సంగీత రచనలు) వెనకబడింది.

## 128. మొట్టమొదటి గురువులు - గురుకులాలు

ఈ పరిస్థితులలో, ఆంధ్రదేశం నుండి కొందరు సంగీత జిజ్ఞాసువులు తమిళనాడు పోయి అచ్చట సంగీత విద్వాంసుల వద్ద, త్యాగరాజు వారి దగ్గర, వారి శిష్యుల దగ్గర సంగీత విద్య యందు ప్రావీణ్యతను సంపాదించి, ఆంధ్ర దేశం తిరిగివచ్చి వారి జ్ఞానాన్ని విద్యను వారి ఇళ్లలోనే గురుకులాన్ని స్థాపించి శిష్యులకు ఉచిత భోజన వసతులను కల్పించి ఆంధ్రదేశమున కర్ణాటక సంగీత వ్యవసాయమునకు విత్తనములు జల్లిరి. ఈ గురువులు సద్గురువులు, నిస్వార్ధంగా, త్యాగబుద్ధితో ప్రేమ వాత్సల్యాలతో గురుపత్నుల సహకారంతో సంగీత చైతన్యానికి నాంది పలికేరు. ఆ విత్తనములు ఈనాడు మహా వృక్షములై, శాఖోపశాఖలై, ఇంటింటా, వాడవాడలా సంగీత చైతన్యం మహోజ్వలంగా ప్రకాశిస్తోంది.

సుసర్ల దక్షిణామూర్తి శాస్త్రి గారు, (పెదకళ్లేపల్లి). త్యాగరాజ స్వామివారి బంధువు, శిష్యులు, అయిన, మానంబు చావిడి వెంకట సుబ్బయ్యగారి శిష్యులు. వారి ఇంట్లోనే భోజన వసతి సదుపాయాలు ఏర్పరచి శిష్యులకు సంగీత విద్య బోధించేవారు. వీరి ఉత్సవాలు వీరి శిష్య ప్రశిష్యులు విజయవాడలోనూ, హైదరాబాదులోనూ జరుపు కొంటున్నారు. వీరి శిష్యులు పారుపల్లి రామకృష్ణయ్య పంతులుగారు, చల్లపల్లి పంచనదంగారు, చల్లపల్లి పురుషోత్తంగారు, మొదలైనవారు. సుసర్ల గంగాధర శాస్త్రిగారు, సుసర్ల కృష్ణ బ్రహ్మ శాస్త్రిగారు, సుసర్ల లక్ష్మీ నరసింహమూర్తి, సుసర్ల శివరాం మొదలైనవారు, సుసర్ల వారి శిష్యులు, వంశీయులు. రాజనాల వేంకటప్పయ్యగారు (ప్రత్తిపాడు). వీరు కూడా అనేక మంది శిష్యులకు భోజన సదుపాయాలతో ఉచిత విద్యను ప్రసాదించారు. వీరి శిష్యులు రాజనాల వెంకట్రామయ్యగారు. వంకమామిడి రాఘవయ్యగారు. గుంటూరు జిల్లాలో నాదస్వర విద్వాంసులు. చాలామంది వీరి శిష్యులే. చిన్నపీరు,. పెద్ద పీరు సాహెబులు నాదస్వర విద్వాంసులు. వీరు గుంటూరు జిల్లాలో సంగీత సేవ చేశారు.

బాపట్ల కాంతయ్యగారు, తాడిగడప శేషయ్యగారు ఆనాటి మహా విద్వాంసులు. దుడ్డు సీతారామయ్యగారు, (తుని వద్ద శ్రీరామపురం) వీరు సద్గురువులు. వీరి శిష్యులు, దుడ్డు రామకృష్ణ సోదరులు

బాపట్ల కాంతయ్యగారు, బలిజేపల్లి సీతారామ శాస్త్రి గారు, పురాణం కనకయ్య శాస్త్రిగారు, కోనేరి రాజపురం వైద్యనాధ్ అయ్యర్ గారి శిష్యులు. పురాణం కనకయ్య శాస్త్రిగారి కుమారుడు పురుషోత్తమశాస్త్రి ఈనాటి మహాగాయకులు.

కలిగొట్ల కామరాజుగారు, విశాఖపట్టణ ప్రాంతం వారు. మహా విద్వాంసులు. తాటిపాక



శ్రీ సుసర్ల దక్షిణామూర్తి గారు



శ్రీ పారుపల్లి రామ కృష్ణయ్య పంతులు గారు



శ్రీ మంగళంపల్లి పట్టాభిరామయ్య గారు



శ్రీ ద్వారం వేంకటస్వామి నాయుడు గారు

రామరాజుగారు. వైలెన్ ఎడమ చేతితో కమానువేస్తూ కుడిచేతి వ్రేళ్లతో వాయించేవారు. సద్గురువు. విజయనగరం, బొబ్బిలి, పిఠాపురం, చోడవరం ప్రాంతాలలో గల సద్గురువులైన సంగీత విద్వాంసులు, వాసావారు, పెదగురాచార్యులువారు, వీణ వెంకటరమణ దాసుగారు, తుమరాడ సంగమేశ్వర శాస్త్రిగారు, శిష్టు వారు ఈమని అచ్యుత రామశాస్త్రిగారు కవిరాయనివారు, వీణావిద్వాంసులు పేరి బాబుగారు (గాత్రం), గున్నయ్య, సత్యమూర్తి గారలు, (వైలెన్) వాసా వెంకట్రావుగారు వీణ, పట్రాయని సీతారామ శాస్త్రిగారు, గాత్రం. అప్పలాచార్యులుగారు వీణ. మైసూరు లక్ష్మణరావు గారు గాత్రం మొదలైనవారు. అద్భుతమైన సంగీత సేవ చేశారు.

ఆ తరువాత కాలంలో, విజయవాడలో గురుకుల పద్ధతిలో అనేక మంది శిష్యులకు విద్య నేర్పినవారు, పారుపల్లి రామకృష్ణయ్య పంతులు గారు. వీరి శిష్యులు వందలు, వేలు. అందు ముఖ్యులు మంగళం పల్లి పట్టాభి రామయ్యగారు, చిలకలపూడి వేంకటేశ్వర శర్మగారు. మద్దులపల్లి లక్ష్మీనృశింహశాస్త్రిగారు, వంకదారి వెంకట సుబ్బయ్యగుప్తగారు, మహా గాయకుడైన బాలమురళీకృష్ణ గారు, అన్నవరపు రామస్వామిగారు (వైలెన్) నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులుగారు (వైలెన్) దారిపర్తిపిచ్చిహరిగారు (నాదస్వరం). దత్తాడ పాండు రంగరాజు (వైలెన్), నేతి శ్రీరామశర్మ (జంత్రగాత్రములు,) తిరుపతి పాన్నారావు, సరిదే సుబ్బారావు, కంభంపాటి అక్కాజీవరావు మహదేవు సూర్య నారాయణ రాజుగారు, కుటుంబయ్య, చావలి కృష్ణమూర్తి మొదలైన వారు. వీరందరూ సుసర్ల దక్షిణామూర్తి శాస్త్రిగారి, పారుపల్లి వారి శిష్యపరంపర. వీరందరిని త్యాగరాజ శిష్య ప్రశిష్య పరంపర అనవచ్చును.

మహా వాది వేంకటప్పయ్య శాస్త్రి క్రోవి సత్యనారాయణ శాస్త్రి గొప్ప గాయకులు.

బందరులో హరి నాగభూషణం గారు వైలెన్ గాత్రం, హరికథా ప్రవచనంలోనూ మహానుభావులు. వీరు వాగ్గేయకారులు. వీరు బి.ఎ.బి.ఎల్. చదువు కొన్న లాయర్. వీరి పుత్రులు హరి అచ్యుత రామశాస్త్రి (వైలెన్), హరి త్యాగశంకరశాస్త్రి గొప్ప విద్వాంసులు పండితులు కూడా.

చిదంబరంలో అన్నామలై విశ్వ విద్యాలయంలో 'సంగీత భూషణ బిరుదు పరీక్షలలో ఉత్తీర్ణులైన తెనుగు మహా విద్వాంసులు. డొక్కా శ్రీరామమూర్తి గారు, ఈధర నాగరాజు గారు, శిష్లా రాజశేఖరం గారు, మర్ల సూర్యనారాయణ మూర్తి. వీరు సంగీతానికి చాలా సేవ చేశారు.

కాకినాడలో మునుగంటి వేంకట రావు పంతులుగారు గొప్ప విద్వాంసులు సద్గురువు. సృజనాత్మకత కలిగి తన ప్రత్యేక బాణిలో గానం చేసేవారు. వారి శిష్యులలో ముఖ్యులు. ఓలేటి వేంకటేశ్వర్లు సీత, అనసూయ మొదలైనవారు.

వీరు శ్రీరామ సమాజ స్థాపకులు. వీరి కుమారులు మునుగంటి శ్రీరామమూర్తిగారు, సంగీతానికి అంకితమైన సహృదయుడు, విద్వాంసుడు, విమర్శకుడు, వీరు 'గానకళ' అనుపత్రికను స్థాపించి అవిచ్ఛనంగా కష్టనష్టాలకు గురి అవుతో జీవిత పరమార్ధంగా నిర్వహిస్తున్నారు. వీరి కుమారులు చి॥వేంకట్రావు కూడ ఇందు భాగస్వాములే.

మునుగంటి వారు, సంగీత విద్వత్‌సభను స్థాపించి గాన సభలను నిర్వహిస్తూ పండిత సత్కారాలను చేస్తూన్న ఉదారులు, రసికులు, సహృదయులు.

వారణాసి బలరామయ్యగారు, (వైలెన్) వారణాసి బ్రహ్మయ్యగారు (వైలెన్) వారణాసి ఘంటయ్యగారు (గొప్ప మార్దంగికులు) వీరి వంశీయులు ఈనాటికి సంగీతంలో ప్రకాశిస్తున్నారు. వారణాసి సుబ్బరామ శర్మ వారి కుమారులు వారణాసి కాళీప్రసాద్ మృదంగ విద్వాంసులు.

## 129. వీణా విద్వాంసులలో కొందరు : నాడు - నేడు :

వీణ ఆంధ్రదేశంలో మొదటి నుంచి చాలా ప్రసిద్ధి గాంచింది. బొబ్బిలి, విజయనగరం, పిఠాపురం సంస్థానాలలో ఆస్థాన విద్వాంసులుగా ఉండి మహా విద్వాంసులుగా ఉన్నవారు. ఆనాటి నుంచి ఈనాటి వరకు తమ ప్రత్యేక బాణీలతో ప్రకాశిస్తోన్న విద్వాంసులు అనేకులు ఉన్నారు. వారిలో ముఖ్యులు.

వాసావారి వంశంలో వాసా వెంకట్రావుగారు విజయనగర సంగీత కళాశాలలో ఆచార్యులు. వారి కుమారుడు వాసా కృష్ణమూర్తి. అఖండ ప్రజ్ఞావంతుడు. వారి వంశంలో సంగీతం, వీణ పిలిస్తే పలుకుతుంది.

మంచాల జగన్నాధరావు గారు, హిందూస్థానీ, లలిత సంగీతం,కర్ణాటక సంగీత శైలులలో గొప్ప విద్వాంసుడు, బహుళ గ్రంథకర్త. అయ్యగారి సోమేశ్వరరావుగారు అయ్యగారి కుటుంబంలో బహుశః ఆద్యుడు, వీరు వీణలో మేటి. వీరి సంతానంలో అందరూ మంచి వైణికులే. కుమారులు శ్యామ సుందర్ విజయవాడ సంగీత కళాశాల ప్రాచార్యులు. వీరి సోదరులు సత్యప్రసాద్. సోదరి పరిటి రాజేశ్వరి.

బండి శ్యామల, బండి సుబ్బలక్ష్మి ద్వారం వరదమ్మ, పాలగుమ్మి విశ్వనాధం, పప్పు సోమేశ్వరరావు, వారి కుమారుడు చంద్రశేఖర్ మొదలైన వారు ఆధునికత విద్వాంసులు.

ఈమని శంకరశాస్త్రిగారు, వాసా కృష్ణమూర్తిగారు, బేబీగాయత్రి, చిట్టిబాబు గారు ప్రపంచాన్ని ఉర్రూతలూగించిన వైణికులు.

కుంభంపాటి అక్కాజీరావుగారు. రామవరపు సుబ్బారావుగారు, వి.ఎల్. జానకిరాం గారు, కోకా సత్యవతి, మేడూరి నరసింహరావుగారు, సుబ్బలక్ష్మి, గోవింద రాజన్, మేడూరి సత్యనారాయణ, ఇవటూరి చెల్లాయి, వాసా పద్మనాభం, వంటెద్దు నాగరత్నం, కె. నాగమణి, ఆనంద రాజ్యలక్ష్మి గొప్ప వైణికులుగా ప్రకాశించేరు, ప్రకాశిస్తున్నారు.

## 130. వైలెన్ విద్వాంసులలో కొందరు : నాడు-నేడు

ఆంధ్రదేశంలో వైలెన్‌లో నాటి నుండి నేటి వరకు మహా విద్వాంసులు సద్గురువులు అనేక మంది చిరంజీవులుగ ప్రకాశిస్తున్నారు.

వైలెన్ అనగానే ఎవ్వరికైనా ద్వారం వారు గుర్తుకి వస్తారు. ద్వారం వైలెనుకు ఆద్యులు సద్గురువు, ద్వారం వేంకట కృష్ణయ్య నాయుడుగారు. వారి చిన్నతమ్ముడైన ద్వారం వేంకట స్వామి నాయుడుగారికి ప్రోత్సాహంతో, శిష్య వాత్సల్యంతో, కూలంకుషంగా వైలెన్ విద్యను బోధించారు.

ద్వారం వెంకట స్వామి నాయుడుగారు అఖిల దేశాలలో వైలెన్ వాదన యందు ధృవతారగా ప్రకాశించేరు ఈనాటికీ వైలెన్ అనగానే ద్వారం వారే.

ద్వారం వేంకటస్వామి నాయుడుగారు విజయనగర సంగీత కళాశాలకు ప్రాచార్యులుగా ఉండి అనేక వందల మంది శిష్యులను మహా విద్వాంసులుగా రూపొందించారు. సుస్వరంలో వారికి వారే సాటి. వారు లయబ్రహ్మ. తానంలో మేటి. పల్లవి వాదనలో బ్రహ్మణ్యుడు. సౌజన్యమూర్తి. ఉదారుడు. మహామనిషి ద్వారం వేంకట స్వామి నాయుడు గారి అన్నగారి (వేంకట కృష్ణయ్యచారి) కుమారుడు ద్వారం నరసింగరావుగారు విజయనగరం సంగీతం కళాశాల అధ్యక్షుడు. వారి కుమారుడు దుర్గా ప్రసాదరావు విజయనగర సంగీత కళాశాల ప్రస్థుత ప్రాచార్యుడు. ద్వారం వారి ఇంకొక అన్నగారి కుమారుడు ద్వారం భావనారాయణరావు గారు కూడా, విజయనగర సంగీత కళాశాలకు ప్రాచార్యులు. ద్వారం నరసింగరావుగారి కుమార్తె మనోరమ ప్రస్తుతం హైదరాబాదు సంగీత కళాశాల ప్రిన్సిపాలుగా పదవిని నిర్వహిస్తున్నారు. కుమారుడు ద్వారం సత్యనారాయణ (కుమార్) ఆకాశవాణి యందు నిలయ విద్వాంసుడు. ఇంకొక కుమార్తె రమణ కుమారి మంచి వైలెన్ విదూషి. ద్వారం వేంకట స్వామి నాయుడుగారి సంతతిలో మంగతాయార్, సత్యనారాయణమూర్తి మంచి విద్వాంసులు.

చాగంటి గంగబాబు, మారెళ్ల కేశవరావు, ద్వారం వారి ముఖ్య శిష్యులు, చదలవాడ కుమారస్వామిగారు, నోరి నాగభూషణంగారు, తిరుపతి నమ్మయ్యగారు తిరుపతి పొన్నయ్య,

సరిదే సుబ్బారావు గారు, నిరాఘాటం రామకృష్ణ శాస్త్రిగారు, సుసర్ల లక్ష్మీ నృసింహమూర్తిగారు, బొంపాడ రామన్నగారు, పొడుగు రామ్మూర్తిగారు, బొంపాడ రామచంద్రుడు. పేరి సుబ్బారావుగారు అన్నవరపు రామస్వామి గారు, కోటిపల్లి ప్రకాశరావుగారు, ఆకెళ్ల మల్లికార్జున శర్మ, కొమాందూరి శేషాద్రి, కొమాండూరి కృష్ణమాచారి, పుల్లెల పేరి సోమ యాజులు, తంపెళ్ల సూర్యనారాయణ, గౌరావఝుల రామమోహనరావు, అంపోలు మురళీకృష్ణ, ఐ.విజయేశ్వరరావు, బి.ఎస్. నారాయణ, సూర్యదీప్తి, భవాని, కృష్ణవేణి, చల్లా ప్రభావతి, రామానుజసూరి, సన్యాసిరావు, అన్నాజీరావు, పూర్ణచందర్, కొక్కొండ సుబ్రహ్మణ్యశర్మ, పేరి శ్రీరామమూర్తి, ఎం. శ్రీనివాస నరసింహమూర్తి మొదలైన వారు నాటి నుండి నేటి వరకు మేటి వైలెన్ విద్వాంసులుగా ప్రకాశించారు ప్రకాశిస్తున్నారు. ఇంకా ఇతోధికంగా ప్రకాశిస్తూనే ఉంటారు.

## 131. గాత్ర విద్వాంసులలో కొందరు : నాడు - నేడు

గాత్రంలో నాటి నుండి నేటి వరకు గల ఆంధ్ర విద్వాంసులు, పట్రాయని సీతారామ శాస్త్రిగారు, ఉప్పలిపాటి అంకయ్యగారు, అధికార్ల నరసింగరావుగారు, బంకుపల్లి లక్ష్మణ శాస్త్రి, బంకుపల్లి సింహాచల భాగవతర్‌గారు, జోస్యుల విశ్వనాథం, జోస్యుల కామేశ్వరరావు, ధర్మపురి రామమూర్తి, ముసునూరి వేంకటరమణ మూర్తి, బలిజేపల్లి రామకృష్ణ శాస్త్రి, పెమ్మరాజు సూర్యారావు, అరుంధతి సర్కార్, వసుంధరాదేవి, రంపసుభద్రమ్మ, వింజమూరి వరదరాజయ్యంగార్, కర్లపాలెం చంద్రమౌళి, నూకల సత్యనారాయణ శాస్త్రి, కొల్లెగాల్ సుబ్రహ్మణ్యం, గౌరీరామమోహన్, గురురాజాచారి, పురాణం పురుషోత్తమ శాస్త్రి, టి.టి. సీత, ఎన్.సి.వి. జగన్నాథాచారి, మాలతి పద్మనాభరావు, జోగుల్రాంబ, అనూరాధ, జయంతిరమ, పంతుల రమ, నేతి ఇందిర, రామకుమారి, జానకి, జయలక్ష్మి, వరలక్ష్మి, ఆలమూరు సుధారాణి, నీత, శేషులత, రాధ, పద్మ, ఉమాదేవి, భారతి, సేతుమాధవి, ద్వారం లక్ష్మి, మొదలైన వారిలో నిన్నటివారు, ఈనాటి వారు, సంగీతాన్ని జీవిత ధ్యేయంగా చేసుకొని సేవ చేసేరు. సేవచేస్తూ ప్రకాశిస్తున్నారు.

ఎమ్.ఎస్. బాలసుబ్రహ్మణ్య శర్మ, నేదునూరి కృష్ణమూర్తి, ఓలేటి వేంకటేశ్వర్లు, మణికృష్ణ స్వామి, శ్రీరంగం గోపాలరత్నం, లలిత, హరిప్రియ, శేషాచారి, రాఘవాచారి, సంగీత ప్రపంచంలో విశిష్టమైన స్థానాన్ని సంపాదించుకొనిన గాయక గాయనీ మణులు. మల్లాది సూరిబాబు మంచి విద్వాంసుడు. వీరి కుమారులు మల్లాది సోదరులు. ఈ వర్ధిష్ణువులకు మంచి భవిష్యతు ఉన్నది. పుచ్చా శేషయ్య శాస్త్రి, కూర్మనాథ్, మండా నరసింహం, తిరుపతి రామానుజసూరి, సరస్వతీ విద్యార్థి-శారద-సోదరీమణులు, మండపాక శారద, చల్లా విజయలక్ష్మి, చల్లా జలజాక్షి, కౌతాప్రియంవద, చెరువు సుందరమ్మ, విష్ణుభట్ల ముకుందశర్మ, ఉదయశంకర్

సోదరులు, తాడేపల్లి లోకనాథ శర్మ, మోదుమూడి సుధాకర్ , అంజన, బాలకృష్ణ ప్రసాద్. మోహన కృష్ణ, పారుపల్లి రంగనాథ్, ఎనమండ్ర పద్మావతి, శబరి గిరీష్, వెంకటాచారి, చక్రపాణి, రాజు, చిన్న, నారాయణ, సూరి, సుబ్బారెడ్డి, శ్రీరామ్, పార్ధసారధి, మొదలైన గాత్రజ్ఞులలో పెద్ద విద్వాంసులు, చిన్న విద్వాంసులు, వర్ధిష్ణు గాయకులు కూడా ఉన్నారు. వీరందరూ సంగీతానికి నిస్వార్ధ సేవ చేసారు, చేస్తున్నారు.

## 132. నాదస్వరవిద్వాంసులు

నాదస్వర విద్వాంసులలో మహా విద్వాంసుల మొదలు, చిన్నచిన్న విద్వాంసుల వరకు ఆంధ్రదేశంలో కొన్ని ప్రాంతాలలో ఎక్కువగానూ కొన్ని ప్రాంతాలో పల్చగానూ ఉన్నారు. రాజనాల వెంకటప్పయ్య శాస్త్రిగారి శిష్యులు గుంటూరు మండలంలోనూ, సుసర్ల దక్షిణామూర్తి వారి శిష్యులు కృష్ణా జిల్లాలోనూ ఉన్నారు. కర్నూలు, తిరుపతి, కడప ప్రాంతాలలో, తిరుమల దేవస్థానం సంగీత కళాశాల పుణ్యమా అని, అనేక మంది నాదస్వర డోలు విద్వాంసులు ఉన్నారు.

వీరిలో ముఖ్యులు, నాటి నుండి నేటి వరకు, పైడిస్వామి, దాలిపర్తి పిచ్చిహరి, దాలిపర్తి లక్ష్మీ నారాయణ, లోవరాజు, వేణుగోపాల్, అలుగోలు ఆంజనేయులు, ఒంగోలు రంగయ్య, దోమాడ చిట్టబ్బాయి, సత్యనారాయణ మొదలైన వారెందరో ఉన్నారు.

## 133. డోలు విద్వాంసులు :

నాదస్వర విద్వాంసులతో పాటు, డోలు విద్వాంసులు కూడా, బెజవాడ, గుంటూరు, విజయనగరం, కడప, కర్నూలు, తెనాలి, తిరుపతి ప్రాంతాలలో ఎక్కువగా ఉన్నారు.

నాదస్వరం కర్ణాటక సంగీతానికి పెట్టనికోట. అలాగే డోలు వాద్యం లయ విషయంగా మహాసముద్రం. డోలు వాద్యం దక్షిణ ప్రాంతంలో చాలా అభివృద్ధిని, పాండిత్య ప్రకర్షణని సాధించింది. దక్షిణాన కర్ణాటక సంగీత చైతన్యానికి ముఖ్య కారకులు నాదస్వర (సన్నాయి) డోలు (తావిల్) విద్వాంసులే.

డోలు నందు, మునిరామయ్య, రాజగోపాల్, కణ్ణారావు, అలుగోలు సత్యనారాయణ, అన్నవరపు గోపాలంగారు, మొదలైన మహా విద్వాంసులు ఎంత మందో గలరు.

## 134. మృదంగం విద్వాంసులు :

మృదంగ విద్వాంసులలో నాటి నుండి నేటి వరకు అశ్వధాటి రామ్మూర్తి, ముళ్లపూడి

లక్ష్మణరావుగారు, శ్రీపాద సన్యాసిరావుగారు, ధర్మాల రామమూర్తిగారు, పొట్లూరి వీర రాఘవయ్య చౌదరిగారు, నర్రా గోపాల కృష్ణయ్యచౌదరిగారు, కె. వీరభద్రరావుగారు, కొంతం గంగరాజుగారు, వారణాసి ఘంటయ్య శాస్త్రిగారు, తిరుపతి రామానుజ సూరిగారు క్రొవ్విడి హనుమంతుగారు, మహదేవు రాధాకృష్ణ రాజుగారు, నేమాని సోమయాజులు. అట్లూరి వేంకటేశ్వర చౌదరిగారు, పుచ్చా సుబ్బారావుగారు, చదలవాడ కుమారస్వామిగారు, సుదర్శనాచారిగారు, కోలంక వేంకట్రాజుగారు, త్రిమూర్తిగారు, క్రొవ్విడి సీతారాం, మల్లిఖార్జున రావు, దండమూడి రామమోహనరావుగారు, కమలాకరరావుగారు, ధర్మాల వేంకటశ్వేరరావుగారు, ముళ్లపూడి శ్రీరామమూర్తి, ఎల్లా వేంకటేశ్వరరావు (తెలుగు విశ్వ విద్యాలయం సంగీతశాఖ అధ్యక్షులు) ఎస్.వి. రమణ, వంకాళయ నరసింహంగారు, వంకాయల వేంకట రమణ, జ్ఞానానందం, పుల్లేటికుర్తి రామారావు, గుడిపాటి సుబ్బరాయశర్మ, సతీష్, ప్రసాద్, సద్గురు చరణ్, పి.వి. రమణమూర్తి, కళ్యాణ రామన్, కామరాజు, కాళీప్రసాద్, ఉదయశంకర్, సుధాకర్, భాస్కరభట్ల కృష్ణమూర్తి, ధర్మారావు, జయ భాస్కర్, మహదేవు సుబ్బరాజుగారు, శ్యాంకుమార్, సుమతి రామమోహన్ మొదలైన వారిలో పెద్ద చిన్న విద్వాంసులు, సంగీతానికి సేవ చేశారు, చేస్తున్నారు. మృదంగ విద్వాంసులలో కొంతమంది ఘటం, కంజిరా, మోర్సింగు వాద్యాలలో కూడా నిష్ణాతులున్నారు.

ఈ మహావిద్వాంసులందరూ లయ మహా సముద్రాన్ని ఈది పారంచూసిన వారూ ఉన్నారు. విజయవంతంగా ఈదుతోన్న వారూ ఉన్నారు.

## 135. ఫ్లూట్ (మురళీ వాద్యం)

వింజమూరి రాజగోపాలాచారిగారు, చంద్రశేఖరన్‌గారు, మండాబలరామ శర్మ, కణ్ణన్, శ్రీనివాసన్, దత్తాత్రేయగా, నాగరాజు, అనంతకృష్ణ, రవికిరణ్, ప్రపంచం సీతారాం, అనూరాధ, మొదలైన విద్వాంసులు, విదుషీమణులు నాటి నుండి నేటి వరకు ఉన్న వంశీ వాదనా విద్వాంసులు.

## 136. ఆంధ్రదేశంలో సంగీత విద్యాలయాలు :

1. విజయనగరం కళాశాల: విజయరామ గాన కళాశాల. విజయనగరంలో మొట్టమొదటి వెలసిన సంగీత కళాశాల. ఈ కళాశాల 1919లో విజయనగర ప్రభువులు విజయరామ గజపతి వారు శ్రీమదజ్జాడ ఆదిభట్ల నారాయణదాసు గారి ఆధ్వర్యంలో ఈ కళాశాలను స్థాపించారు. అందు మహానుభావులైన ఆచార్యులు ఉండేవారు. తరువాత క్రమంగా ద్వారం వేంకటస్వామి నాయుడుగారు, ద్వారం నరసింగరావుగారు, ద్వారంభావనారాయణరావుగారు, శ్రీరంగం

గోపాలరత్నం, నేదునూరి కృష్ణమూర్తి గారూ ప్రాచార్యులుగా ఉండేవారు. ప్రస్తుతం ద్వారం దుర్గా ప్రసాదరావు ప్రాచార్యులుగా ఉన్నారు. వీరందరూ కళాశాల అభ్యున్నతికి దోహదం చేశారు. చేస్తున్నారు. ఈ కళాశాల చాల ఏండ్లు విజయనగర రాజుల పాలనలో ఉంది. 1950 ప్రాంతంలో ప్రభుత్వం తీసుకొన్నది.

2. హైదరాబాదు సంగీత కళాశాల : 1950 ప్రాంతంలో ప్రభుత్వం నెలకొల్పి క్రమంగా వింజమూరి వరదరాజ అయ్యంగార్, గోవింద నారాయణ దంతాలే, రాజూర్కర్, ఈ గ్రంధకర్త, శ్రీరంగం గోపాలరత్నం, ఆకెళ్ల మల్లికార్జున శర్మ, ప్రిన్సిపాలులుగా ఉండేవారు. ప్రస్తుతం పూసర్ల మనోరమగారు ప్రిన్సిపాల్‌గా ఉంటున్నారు.

3. విజయవాడ ప్రభుత్వ సంగీత నృత్య కళాశాల: 1960 ప్రాంతంలో ఈ కళాశాల స్థాపించేరు. ఈ కళాశాలకు ప్రథమ ప్రాచార్యులు మహా విద్వాంసుడైన మంగళంపల్లి బాలమురళీ కృష్ణగారు. తరువాత క్రమంగా, నేదునూరి కృష్ణమూర్తిగారు, ఈ గ్రంధకర్త, ద్వారం భావనారాయణరావు గారు, ఘోటీకర్, వాసిరెడ్డి కనకదుర్గ, ప్రస్తుతం, అయ్యగారి శ్యామసుందర్, కళాశాల అభివృద్ధికి దోహదం చేశారు, చేస్తున్నారు.

4. సికింద్రాబాద్ ప్రభుత్వ కళాశాల: 1956లో ఈ కళాశాల సంగీత పాఠశాలగా ఉండి 1966లో కళాశాలగా అయింది. ఈ కళాశాల మొదటి ప్రిన్సిపాలు ఈ గ్రంధకర్త. రెండవ ప్రిన్సిపాల్ నేదునూరి కృష్ణమూర్తి. రెండవ సారి కూడా ఈ గ్రంధకర్త ప్రిన్సిపాల్‌గా ఉన్నాడు. ప్రస్తుత ప్రిన్సిపాల్ నాట్యంలో మహా విదుషీమణి, వాసిరెడ్డి కనకదుర్గ, కళాశాలను తీర్చిదిద్దుతున్నారు.

5. కర్నూలు ప్రభుత్వ సంగీత కళాశాల : మొదటి ప్రిన్సిపాల్, కర్లపాలెం చంద్రమౌళి, కొమాండూరి శేషాద్రి తరువాతి ప్రిన్సిపాల్.

6. వరంగల్ ప్రభుత్వ సంగీత కళాశాల: ఈ కళాశాల యందు మొదటి ప్రిన్సిపాల్ పూసర్ల మనోరమగారు, ప్రస్తుతం పుచ్చా శేషయ్య శాస్త్రి ప్రిన్సిపాల్‌గా కళాశాలను సమర్ధవంతంగా నడుపుతున్నారు.

పై కళాశాలలు గాక ఆంధ్రదేశంలో ప్రభుత్వ సంగీత పాఠశాలలు 1. నెల్లూరు 2. గుంటూరు, 3. రాజమండ్రి 4. మంథని 5. నిజామాబాదు, 6. హైదరాబాదు పాతబస్తీ యందు ఉన్నవి.

మొత్తం మీద ఆంధ్రదేశంలో 6 సంగీత నృత్య కళాశాలలు 5. పాఠశాలలు ప్రభుత్వం నిర్వహిస్తోంది. ఈ కళాశాలల యందు, పాఠశాలల యందు నిష్ణాతులైన విద్వాంసులు,

ప్రాచార్యులు ఆచార్యులుగా విద్యార్థులకు శిక్షణనిస్తూ ఆంధ్రదేశ సంగీత నృత్య కళల అభివృద్ధికి ఎనలేని దోహదం, సేవ చేస్తున్నారు.

ఈ ప్రభుత్వ సంగీత కళాశాలలు. "మహారాజా ప్రభుత్వ సంగీత నృత్య కళాశాల" పేరుతో విజయనగరంలోనూ, 'ఘంటసాలవేంకటేశ్వరరావు ప్రభుత్వ సంగీత నృత్య సంగీత కళాశాల' గా విజయవాడలోనూ, "త్యాగరాజ ప్రభుత్వ సంగీత నృత్య కళాశాలగా" హైదరాబాద్‌లోనూ, "భక్తరామదాస ప్రభుత్వ సంగీత నృత్య కళాశాలగా" సికింద్రాబాదులోను ఉన్నవి. విజయవాడ సంగీత కళాశాలకు ఘంటసాల సంగీత కళాశాలగా పేరుపెట్టినవారు మండలీ కృష్ణారావుగారు, (అప్పటిమంత్రి) త్యాగరాజ, భక్తరామదాస, సంగీత కళాశాలలుగా పేర్లను పెట్టినవారు అప్పటి మంత్రి హయగ్రీవాచారిగారు.

తిరుపతి : శ్రీ వేంకటేశ్వర సంగీత కళాశాల తిరుమల తిరుపతి దేవస్థానం వారి ఆధ్వర్యంలో అనేక దశాబ్దాలుగా చక్కటి ప్రమాణాలతో, శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయానికి అనుబంధంగా నిర్వహింపబడుతున్నది. ఈ కళాశాల అధ్యక్షులుగా, పి. సాంబమూర్తి గారు, చిత్తూరు సుబ్రహ్మణ్యంగారు, నేదునూరి కృష్ణమూర్తిగారు, పశుపతిగారు, ఈ గ్రంథకర్త ఉన్నారు. ఇందు ఆచార్యులలో ఎస్.ఆర్. జానకిరాం, వి.ఎల్. జానకిరాం, పుదుక్కోట రామనాథన్, ద్వారం సత్యనారాయణ, పుదుక్కోట కృష్ణమూర్తి పుల్లెల పేరి సోమయాజులు, ఉదయశంకర్, రాజేశ్వరి, తంజావూర్ లక్ష్మణన్ మొదలైన వారు సంగీత సేవ చేశారు.

ఆంధ్రదేశ కళాశాలలలో, గాత్రం, వీణ, వైలెన్, నాదస్వరం, డోలు, మృదంగం, సితార్, తబ్లా, భరతనాట్యం, కూచిపూడి, కథక్ జానపద నృత్య శాఖలలో, సర్టిఫికెట్, డిప్లొమా పరీక్షలు, కోర్సులు నిర్వహిస్తున్నారు. ఈ పరీక్షలు ప్రాంతాలనుబట్టి, ఆంధ్ర, నాగార్జున, కాకతీయ, తెలుగు, శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయాలు నిర్వహిస్తున్నాయి.

## 137. విశ్వవిద్యాలయాలలో సంగీతం

ఆంధ్ర విశ్వవిద్యాలయంలోఎం.ఎ. తరగతులు. పద్మావతీ మహిళా విశ్వవిద్యాలయంలో ఎం.ఎ. తరగతులు. పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయాలలో బి.ఎ.; ఎం.ఎ.; పి.హెచ్.డి. తరగతులు నిర్వహిస్తున్నారు.

## 138. గురుకులాలు : నాడు - నేడు

ఆనాటి నుండి ఈనాటి వరకు ఈ శతాబ్దం (20వ శతాబ్దం) మొదట్లో సుసర్ల

దక్షిణామూర్తిగారు, రాజనాల వెంకటప్పయ్య శాస్త్రిగారు, పురాణం కనకయ్య శాస్త్రిగారు, దుడ్డు సీతారామశాస్త్రిగారు, మంగళంపల్లి పట్టాభిరామయ్యగారు, హరినాగ భూషణంగారు, ద్వారం వేంకట స్వామి నాయుడుగారు, చిలకలపూడివారు, వంకదారివారు, బంకుపల్లి సింహాచల భాగవతర్‌గారు, పొడుగు రామ్మూర్తిగారు, వాసావారు, ఈమనివారు, శిష్టువారు, వారణాసివారు, క్రోవివారు, మహావాదివారు, తాటిపాకరామరాజుగారు, మునుగంటి వెంకట్రావు పంతులుగారు, ద్వారం నరసింగరావుగారు, ఎమ్.ఎస్. బాలసుబ్రహ్మణ్యశర్మగారు మొదలైన మహా విద్వాంసులు అనేక వందల మందికి సంగీత విద్యను బోధిస్తూ, జీవిత పరమార్థంగా ఎంచి సంగీత సేవ చేశారు.

ఆధునికంగా గురుకులాలు కొనసాగిస్తున్న వారిలో కొంతమంది: విజయవాడల్లో అన్నవరపు రామస్వామి గాత్రం, వైలెన్‌లో అనేకమంది విద్యా దానం చేస్తున్నారు.

విజయవాడలో నల్లాన్‌చక్రవర్తుల కృష్ణమాచారిగారు వైలెన్ విద్వాంసులు, సంగీత శాస్త్రంలోనూ, సంస్కృత సాహిత్యంలోనూ మహాపండితులు. వీరి గురుకులంలో అనేక గాత్ర వైలెన్ విద్యార్థులు, విద్వాంసులుగా రూపొందించిన ఘనత కృష్ణమాచారిగారికి దక్కుతుంది.

విశాఖపట్టణంలో ఐ.వి.ఎల్ శాస్త్రిగారు సంగీత జనకులాన్ని స్థాపించి అనేక వందలమంది సంగీత ప్రియులను, మంచి శ్రోతలుగా, సంగీత విద్యార్థులను విద్వాంసులుగా రూపొందిస్తున్నారు. ఐ. విజయేశ్వరరావు గారి గృహం మంచి గురుకులంగా ఈనాటికీ భాసిస్తోంది.

మద్రాసులో మంగళంపల్లి బాలమురళీకృష్ణగారు వారి గృహంలో తెనుగు, తమిళ, మళయాళ కన్నడ సంగీత విద్యార్థులను మంచి విద్వాంసులుగా రూపొందిస్తున్నారు. గురువుగారైన పారుపల్లి రామకృష్ణయ్య పంతులుగారి, తండ్రిగారైన మంగళంపల్లి పట్టాభిరామయ్యగారి అడుగుజాడలలో గురుకులాన్ని కేవల పారమార్థిక దృష్టితో నిర్వహిస్తూ సంగీత సేవ అకుంఠిత దీక్షతో చేస్తున్నారు. మోహనకృష్ణ, కనకదుర్గ మొదలైనవారు వీరి శిష్యులే. ఈ గ్రంథకర్తకు వీరు గురుతుల్యులు. వీరి పితృపాదులు ఈ గ్రంథకర్తకు ఆది గురువులు, పితృ సమానులు.

శ్రీపాద పినాకపాణిగారు విశాఖపట్టణంలోనూ, రాజమండ్రిలో కర్నూలులోనూ వారింట్లో వారు, వారి శ్రీమతి బాలాంబగారు, అనేకమంది శిష్యులకు విద్యా దానం చేసారు, చేస్తున్నారు.

వీరి శిష్యులు, ఓలేటి వేంకటేశ్వర్లు, నేదునూరు కృష్ణమూర్తి, శ్రీ రంగం గోపాల రత్నం, నట్టి నరసింగరావు, వసుంధర, మేడూరి సుబ్బలక్ష్మి, ధర్మపురి రామ్మూర్తి. ఈ గ్రంథకర్త వారి శిష్యుడే.

136. సంగీత సభలు :

కాకినాడలో సరస్వతీ గానసభ, మహా సంగీత పోషకులైన కొమ్మిరెడ్డి సూర్యనారాయణ మూర్తి నాయుడుగారు స్థాపించారు. ఇప్పటికీ ఈ సభ అద్భుతంగా నిర్వహింపబడుతూంది.

శ్రీరామ సమాజం, సంగీత విద్యత్సభ, మునుగంటి వారు స్థాపించారు. ఈనాటికీ ఈ సభలు మునుగంటి శ్రీరామమూర్తిగారి చేత అకుంఠితంగా నిర్వహింపబడుతూంది.

విశాఖపట్టణంలో మొట్టమొదట దుర్గారావు గారిచే స్థాపించబడిన సంగీతసభ, తరువాత, అలహాసింగరి, వెంకన్న పంతులు, బ్రహ్మయ్యశాస్త్రి, పినాకపాణిగారు, మొదలైన వారిచేత నిర్వహింపబడిన విజయ త్యాగరాజ సంగీతసభ చాలా దశాబ్దాలుగా సమర్ధవంతఘ్గా నిర్వహింపబడింది. ఆ సభకి అనుబంధంగా సంగీత పాఠశాలకూడా నిర్వహించారు. అందు ఉపాధ్యాయుడుగా ఈ గ్రంధకర్తను తన గురువైన శ్రీపాద పినాకపాణిగారు నియమించారు.

విశాఖపట్టణం "సంగీత మిత్ర బృందం" అనే సభని ఈ గ్రంధ కర్త స్థాపించి ఆ సభకి అధ్యక్షుడుగా 6, 7 సంవత్సరాలు సేవచేసాడు. కట్టోజు సత్యారావు ( మృదంగ విద్వాంసుడు) కట్టోజు రత్నారావు, కవిరాయని జోగారావు (వీణా విద్వాంసుడు) గరిమెళ్ల శ్రీరామమూర్తి మొదలైన మిత్రులు సంగీత ప్రియులుఈ సభా నిర్వహణలో భాగస్వాములుగా ఉన్నారు.

తరువాత వాసా కృష్ణమూర్తి అధ్యక్షుడుగా అదే సంగీత బృందం 'భారతీ గానసభ' గా అవతరించి ఈ నాటికీ విజయవంతంగా నడుస్తున్నది.

విశాఖమ్యూజిక్ ఎకాడమీ సంగీతసభ ఎన్.ఎ.ఆర్ శాస్త్రి గారు, కట్టోజువారు, శ్రీనివాసు, కాళీశంకర్, హోటల్ ఊటీవారు మొదలైన పుర ప్రముఖులచేత ఈనాటికీ చాలా విజయవంతంగా నిర్వహించబడుతోంది.

విశాఖ సంగీత నృత్య సభ, సి.ఎస్.ఎన్. రాజుగారు, వారి మిత్రులు కలసి అద్భుతంగా నిర్వహిస్తున్నారు.

సుసర్ల శంకరశాస్త్రిగారు అనే మహానుభావుడు, సంగీత ప్రియులు, నిస్వార్ధపరుడు, కళాతపస్వి, తమ జీవిత ధ్యేయంగా "కళాభారతి" అనే సంగీత మంటపాన్ని, సంగీత సభాస్థలిని నిర్మించారు. ఈ కళాభారతిని, సి.ఎస్.ఎన్. రాజుగారు, శంకర శాస్త్రిగారి కుమారులు సుసర్ల గోపాల శాస్త్రిగారు తక్కిన ప్రముఖులు నిత్య లలితకళా కళ్యాణ మందిరంగా నిర్వహిస్తున్నారు.

ఈ సంగీత మందిరం విశాఖపట్టణ లలితకళా ప్రియులకు ఒక లలిత కళా సరస్వతి దేవాలయం. ఇందు శ్రీ త్యాగరాజస్వామి వారి విగ్రహ ప్రతిష్ట చేయబడింది. శ్రీ త్యాగరాజ వర్ధంతి, జయంతులు చక్కగా నిర్వహింపబడుతున్నాయి.

విజయనగరం, అనకాపల్లి, తుని, పిఠాపురం, అమలాపురం, తాడేపల్లి గూడెం, గుడివాడ, గుంటూరు, బందరు, ఏలూరు, (విజయవాడ కనకదుర్గ సభ, సద్గురుసభ, సంగీత సన్మండలి) వరంగల్, ఖమ్మం, రామచంద్రాపురం, పాలకొల్లు, (సికింద్రాబాదు, హైదరాబాదు కళాసాగరం, దక్షిణభారతీయసభ (ఎస్.ఐ.సి.ఎ.) త్యాగరాజగానసభ) (శ్రీరామగానసభ, 30 సంవత్సరాలుగా కొణికి సత్యనారాయణ రావు గారు నిర్వహిస్తున్నారు) విశ్వకళాపరిషత్‌ను స్థాపించి 16 సంవత్సరాల నుండి ఈ గ్రంధకర్త చిన్న చిన్న సంగీత సభలను నిర్వహిస్తున్నాడు తిరుపతి, నెల్లూరు పట్టణాలలో అనేక సంగీత నృత్య సభలు విజయవంతంగా నిర్ణీత సమయాలలో సంగీత నృత్య సభలు నిర్వహింపబడుతూ పటిష్టంగా నడుస్తున్నాయి. హైదరాబాదు విద్యానగర్‌లో కొల్లెకాల్‌వారు త్యాగరాజ విగ్రహప్రతిష్ట చేసి, త్యాగరాజ ఉత్సవాలు జయప్రదంగా జరిపిస్తున్నారు.

పై పట్నాలలో గల సభలలో త్యాగరాజ వర్ధంతి, జయంతి, గణపతి, దసరా, నవరాత్రి, గానసభలు, సంగీత ఉత్సవాలు, నిర్విరామంగా జరుగుతున్నాయి.

ఇవిగాక, తెలుగు విశ్వ విద్యాలయంవారు, ఆంధ్రప్రదేశ్, సాంస్కృతీ మండలివారు, ప్రభుత్వ సాంస్కృతీ శాఖవారు, సంగీత ఉత్సవాలను నిర్వహిస్తున్నారు. కేంద్ర ప్రభుత్వ ఆధ్వర్యంలో దక్షిణ, కేంద్ర, సంస్కృతీ మండలివారు సంగీత ఉత్సవాలు నిర్వహిస్తున్నారు.

ఈ సభలలో విశాఖ సంగీత ఎకాడమివారు, కాకినాడ విద్వత్సభవారు తిరుపతి త్యాగరాజ ట్రస్టువారు, శ్రీరామగానసభ హైదరాబాదు వారు, సంగీతజ్ఞులను బిరుదులతో, బంగారుపతకాలతో సన్మానిస్తున్నారు.

## ఆనాటి నుండి ఈనాటి వరకు సంగీతానికి సేవచేసిన చేస్తూన్న సంగీత రసికులు, పోషకులలో కొంతమంది ముఖ్యులు :

అనకాపల్లిలో డా॥ సుబ్బరాజుగారు, ఏలూరులో కంభం మెట్టు సుబ్బారావుగారు, తాడేపల్లి గూడెంలో, పసల సూర్యచంద్రరావుగారు, బెజవాడలో చక్రవర్తిగారు, ముష్టి సుబ్రహ్మణ్యంగారు డా॥ డి.ఎల్.నారాయణగారు, జంటనగరాలలో మామిడిపూడి ఆనందంగారు, కౌతామనోహర్‌గారు, చెరువు పార్థసారధిగారు, డా॥ బి.దయానందరావుగారు, ఎన్. శ్రీరామ

మూర్తిగారు, డా॥ సి. నారాయణరెడ్డిగారు, మంతా భానుమతిగారు, చక్రపాణిగారు, రాజగోపాల్‌గారు, రమణాచారిగారు కిషన్‌రావుగారు, కళా దీక్షితులు గారు. మొదలైన వారు సంగీతానికి నిస్వార్థ సేవ చేస్తున్నారు.

ఆంధ్రదేశ దేవస్థానాలు అన్నీ ఆయా ఆలయాలలో వేంచేసియున్న శ్రీవారల బ్రహ్మోత్సవాల సందర్భంగా సంగీత పోషణ విస్తృతంగా జరిపిస్తున్నారు.

శ్రమదమాదుల కోర్చి సంగీత సభలను నిర్వహిస్తోన్న పుణ్యమూర్తులు అందరూ సంగీత పోషకులే.

ఆంధ్రదేశంలో ఈనాడు కర్ణాటక సంగీత చైతన్యం మహోజ్వలంగా ప్రకాశిస్తూంది. వర్ధిష్ణు గాయకులు మంచి సంప్రదాయ సిద్ధమైన శైలులతో గానం చేస్తున్నారు. సంగీత సభలు, సంగీత విద్యాలయాలు, పెద్దలైన సంగీత గురువులు, మహా విద్వాంసులు, ప్రభుత్వంవారు, సంగీత పోషకులు, ఈ చైతన్యానికి దోహదం చేస్తూ భాగ స్వాములుగా ఉన్నారు.

ఈనాడు సంగీత శ్రోతల సంఖ్య చాలా వృద్ధి చెందింది. సంగీత విద్వాంసుల ఆర్థిక స్తోమతలు హెచ్చు అయ్యాయి.

సంగీతపోషకులలో ఆకాశవాణివారు, దూరదర్శన్ వారు క్యాసెట్ కంపెనీలవారు చాలా ముఖ్యులు. నిర్ణీత సమయాలలో సంగీత విద్వాంసుల గానాలను ప్రసారం చేస్తో అనేక కార్యక్రమాలు ఏర్పాటు చేస్తో సంగీత విద్వాంసులను సత్కరించడమే కాకుండా వారికి ప్రజలలో ప్రఖ్యాతిని ప్రసాదిస్తున్నారు. కాగా ప్రజలలో సంగీత చైతన్యాన్ని రసికతను, అభివృద్ధి చేస్తున్నారు.

కిరణసేత్ అనే మహా వ్యక్తి SPICMACAY అనే మహోజ్వల సంస్థను స్థాపించి మన యువ హృదయాల్లో భారతీయ సంస్కృతిని, భారతీయ సంగీత చైతన్యాన్ని పెంపొందిస్తో మహోపకారం చేస్తున్నారు. SPICMACAY పరివారం, భారతదేశంలో వాడవాడలలోనూ, అన్ని విద్యాలయాలలోనూ సంగీత, నృత్య, ఉత్సవాలను నిర్వహిస్తున్నారు. ఈ మహా సంస్థ విదేశాలలో కూడా ప్రాచుర్యం పొందుతున్నది.

*ఓం తత్సత్*



శ్రీ మంగళంపల్లి బాలమురళీకృష్ణ గారు

# 140. సంగీత బోధన

1. విద్యలలో సంగీత విద్య యొక్క స్థానం, సంగీత విలువ
1. సంగీత ఆచార్యుని లక్షణాలు
2. సంగీత విద్యార్థి లక్షణాలు
3. బోధనా పద్ధతులు, పాఠ్యప్రణాళిక
4. సంగీతం నేర్చుకోవడంవలన లాభాలు ప్రయోజనాలు
5. సంగీత సాధన
6. సంగీత రసికత

అన్ని విద్యలలో సంగీత విద్య అనేక దృక్కోణాల నుండి గొప్పది. ఈ విద్య నాదవిద్య. తక్కినవన్నీ అక్షర విద్యలు. సంగీతవిద్య. ప్రకృతివిద్య. సంగీతవిద్య, సంగీత భాష, సర్వ ప్రపంచవాసులకు ఒక్కటే అవడంచేత అందరికీ అర్థం అవుతుంది.

సర్వ భాషలకు అక్షరాలు 26, 56 మొదలైనవి ఉంటాయి అయినా వాటి ఎల్లలు, దేశాలు, రాష్ట్రాల, వరకే పరిమితి అయి ఉంటాయి.

సంగీత భాషకు 7 స్వరాలు, 12 స్వరస్థానాలు మాత్రం ఉండినా, ప్రపంచ దేశాలలో ఉండే ప్రజల మధ్య పరస్పరం అర్థం, అవగాహన ఉంటుంది. విని రసించకలిగే స్థితి ఉంటుంది. ఈ గొప్పతనం సంగీతానికి ఒక ప్రత్యేకత.

చిన్న పిల్లలను 3 సంవత్సరాల వయసులోనే బడిలో వేస్తారు. వారు కె.జి. క్లాసులు మొదలుగా అన్ని క్లాసులు చదువుతో ఉత్తీర్ణులవుతారు. వారి కందరికి చదువుతో పాటు సంగీతం నేర్పిస్తే వారు గొప్ప సంస్కారవంతులుగా, సహృదయులుగా మంచి పౌరులుగా మేధావంతులుగా, ఆధ్యాత్మిక స్వభావులుగా విశాల దృక్పథులుగా ప్రపంచ పౌరులుగా రూపొందుతారు అనేది పరమసత్యం.

విద్యార్థులు వారి వారి విద్యాశాఖలలో ప్రథములుగా ఉత్తీర్ణులుగా రూపొందాలని ననూ సంగీతవిద్య వారికి ఎంతగానో ఉపకరిస్తుందని తత్వ శాస్త్రజ్ఞులు నిరూపించారు.

మానవ మేధ రెండు భాగాలుగా ఉన్నది. కుడి వైపున గల మేధస్సు లలితకళలు,

సంగీతం, కవిత్వం, కల్పన, సృజనాత్మకత, రసగ్రహణ, భావసౌందర్యోపాసన మొదలైన విషయాలయందు ఉంటుంది. ఎడమ ప్రక్కన గల మేధస్సు తర్కం, లెక్కలు, శాస్త్రదృక్పథం, విషయ సేకరణ, జ్ఞాపకాల దాపరికం, మొదలైన విషయాలను గ్రహిస్తుంది. ఈ ఎడమ ప్రక్కన గల మేధ (Brain) తక్కువ శక్తి కలదిగా ఉంటే, కుడిప్రక్కన గల మేధస్సు సంగీత చైతన్యంతో శక్తి గలది అయినప్పుడు, తన శక్తి ఎడమ మేధస్సుకి ఇచ్చి దానిని శక్తివంతం చేస్తుంది. దీనివల్ల తెలినదేమంటే చదువులో వెనకగా ఉన్న విద్యార్థులకు సంగీతం నేర్పిస్తే వారు చదువులో చురుకైన తెలివిని ప్రదర్శిస్తారు. ఈ విషయం వైద్య, భౌతిక శాస్త్రజ్ఞులు కనుగొన్నారు.

లెక్కలు, చరిత్ర, భూగోళం, భౌతిక శాస్త్రం, ఆర్థిక శాస్త్రం, వైద్యం, మొదలైన విద్యలను సాధిస్తూ ప్రక్కన తోడుగా సంగీత అవగాహన కొరకు కొంత సమయాన్ని వినియోగిస్తే పై విద్యార్థులు వారి వారి శాఖలలో సునిశితమైన నైపుణ్యాన్ని ప్రదర్శించగలరు.

సంగీతం నాదమయం. నాదము అతి సూక్ష్మమైన విద్య; కళ. అందుచేత సంగీత అవగాహన వల్ల, సూక్ష్మ జ్ఞానం సూక్ష్మబుద్ధి, సూక్ష్మమైన తెలివి, సంగీత జ్ఞానం వలన కలిగి, ఆ సూక్ష్మ జ్ఞానం తక్కిన విద్యాశాఖలలో ప్రతిబింబిస్తుంది. అతి సూక్ష్మమైన బుద్ధియే కాకుండా సంగీతం వలన హృదయ వైశాల్యం, హృదయ సంస్కారం అలవరుతుంది. అభివృద్ధి చెందిన అన్ని పశ్చిమదేశాలలోనూ సంగీతం శాఖగా, సంగీత తరగతి లేకుండా సంగీతం పాఠ్యాంశంగా లేకుండా ఏబడి, ఏ ఉన్నత విద్యాసంస్థ, ఏ విశ్వ విద్యాలయం ఉండదు. సంగీతం ఉన్నత విద్య వరకు నిర్బంధం. ఆ తరువాత ఐచ్ఛికం.

చిన్న తరగతులలో కొన్ని విద్యా శాఖలను, సంగీతం మాధ్యమంగా సంగీతంతో [illegible]రు.

సంగీత అభివృద్ధికి, దేశం యొక్క అభ్యున్నతికి, చాలా దగ్గర సంబంధం ఉంది. పశ్చిమ దేశాలలోని పౌరులలో సంగీత అవగాహన లేనివారు చాలా అరుదుగా ఉంటారు. అసలు ఉండరేమో ఎన్ని విధాలుగా ఆలోచించినా సంగీత విద్య ఉన్నతమైనది. గొప్పది. మానవులలో మానవత్వాన్ని పెంపొందించేది సంగీతం అనేది నిర్వివాదాంశం.

భారత దేశంలో కూడా అభివృద్ధి చెందిన రాష్ట్రాలలో సంగీతం చాలా అభివృద్ధి చెంది, ప్రతి ఇంట సంగీతం అతి ప్రాముఖ్యంగా పరిగణింపబడుతోంది. భారతదేశంలో సంగితాభివృద్ధిని సాధించిన రాష్ట్రాలలో ముఖ్యమైనవి. బెంగాల్, మహారాష్ట్ర, తమిళనాడు, కేరళ, కర్ణాటక రాష్ట్రాలను మొదట చెప్పాలి. తక్కిన రాష్ట్రాలలో ఆంధ్ర, ఒరిస్సా, ఉత్తర ప్రదేశ్, మొదలైనవి కూడా వస్తాయి.

సంగీతాభివృద్ధి, సంగీత వికాసం, సంగీత రసికత, ఈ అంశాలు కలిగిన ప్రదేశాలలో పౌరులు సంగీత మనస్కులుగా ఉంటారు.

సంగీత మనస్కులు సంగీత వాతావరణాన్ని వారు నివసించు ప్రదేశాలలో సృష్టించుకొంటారు. వారి వలన, సంగీత విద్వాంసులకు ప్రోత్సాహం లభించి, వారి సంఖ్య పెరుగుతుంది. వీరి వలనే సంగీతానికి ప్రాముఖ్యత పెరగుతుంది. సంగీత సభలు, సంగీత పాఠశాలలు, సంగీత గురువులు, సంగీత గ్రంధ రచన, సంగీత ప్రదర్శనలు, సంగీత విమర్శకులు, సంగీత సంస్థలు అన్ని అభివృద్ధిని సాధిస్తాయి.

**141. సంగీత ఆచార్యుడు** : సంగీతజ్ఞులలో, సంగీత విద్వాంసులు, అంటే చక్కగా పాడగలిగి, స్వర, శృతి, గమక, రాగ, మనోధర్మ జ్ఞానం గలిగిన వారు. సంగీత శాస్త్రం కూలంకుషంగా తెలిసనవారు సంగీత పండితులు.

సంగీత ఉపాధ్యాయులు అనగా సంగీతం బోధన చేయకలిగే సంగీతజ్ఞులు, వీరికి సంగీత విద్వత్తూ ఉండాలి. పాండిత్యమూ ఉండాలి. బోధనా చాతుర్యం, బోధనకు కావలసిన ఓర్పు, విద్యార్థులపై ప్రేమ, విద్యార్థులకు తాను బోధన చేస్తూండగా వారు గ్రహించి పాడగలుగు తున్నప్పుడు తృప్తి, వారిని పెద్ద విద్వాంసులను చేద్దామనే ఆకాంక్ష, విద్యార్థులు సరిగా గ్రహించి పాడగలిగిన తరువాతనే తన బాధ్యత తీరింది అనుకునే పెద్ద మనసు, ఇన్ని మంచి గుణాలు ఉండాలి. సంగీత విద్వాంసుడైన సంగీత పండితుడైన ఉపాధ్యాయునికి, సంగీత ఆచార్యునికి, అప్పుడే తాను సద్గురువు అనిపించుకోవడానికి అర్హత కలుగుతుంది.

సంగీత గురువుకు ఇంకా చాలా విషయాలలో పాండిత్యం ఉండాలి. సంస్కృతం, తెనుగు, తమిళం భాషలు వచ్చి ఉండాలి. మహా వాగ్గేయకారుల సాహిత్య సంగీత విశేషాలను కూలంకషంగా అవగాహన చేసుకో గలిగి, వాటిని విశ్లేషించకలిగి ఉండాలి. విద్యార్థికి ఒక కృతిని నేర్పేటప్పుడు ఆ కృతి యొక్క సంగీతాన్ని, ప్రతి సంగతికి, అణువు అణువునా, అనుస్వరాలతో స్వరములను స్వరపరచే సమర్థత, Notation పద్ధతిలో నిష్ణాతుడుగా ఉండాలి. స్వరజ్ఞానం మీద గౌరవం ఉంటో స్వరజ్ఞానాన్ని శిష్యునికి నేర్పకపోతే అది సంగీతానికి అపచారం, తన ఆచార్య వృత్తికి అవమానం అవుతుంది. ఆచార్యుడు తాను, స్వరపరచి యున్న క్రొత్త కృతిని చూస్తో పాడగలిగి ఉండడమే కాకుండా విద్యార్థులకు అట్టి నొటేషన్ పద్ధతిని చూస్తో పాడగలిగే జ్ఞానాన్ని ప్రసాదించి తీరాలి.

కృతిలో ఉండే సాహిత్య విశేషాలను, భక్తిని, సంగీత రసాన్ని, రాగ సంగతుల విశేషాల్ని, ఛందో విషయాలను కూలంకుషంగా విద్యార్థులకు బోధించాలి.

లయ, తాళ విషయాలు, లయ విన్యాసాలు తాను తెలిసికొని విద్యార్థులకు బోధించాలి.

మనోధర్మ సంగీత శాఖలైన స్వరకల్పన, రాగఆలాపన, నెరవు, తానం, పల్లవి, మొదలైన లోతైన విషయాల మీద తనకు సర్వాధికారాలు ఉండాలి. ఈ విషయాలను, విద్యను, మనసారా, అర్థిస్తోన్న శిష్యునికి దానం చేస్తూ ఉండాలి.

విద్యార్థి బృందమునకు పాఠం చెప్పేటప్పుడు ప్రతి విద్యార్థికి ప్రత్యేక కాలాన్ని వెచ్చిస్తో ఉండాలి. సంగీతంలోమాత్రం ప్రతి విద్యార్థి, వారివారి అవగాహనలో, వారి వారి గాత్ర ధర్మంలో, వారివారి అర్హతలలో, అతిసూక్ష్మమైన తరతమ భేదాలుంటాయి. వాటిని గమనించి ఎవరికి కావలసినట్లు వారికి నేర్పాలి. తక్కువ అవగాహన ఉన్న వారికి ఎక్కువసార్లు బోధించాలి.

వీలైతే ప్రతి విద్యార్థికి ఒక నిర్ణీతమైన కాలంలో ప్రత్యేకంగా నేర్పటం చాలా మంచిది. అట్లు వీలుగానిచో పై విధంగా ఒక్కొక్కరిని, పాడించి వారికి బోధించాలి.

విద్యార్థులలో, విద్యార్థినులలో శృతులు వ్యత్యాసం ఉంటాయి. విద్యార్థులకు విద్యార్థినులకు విడివిడిగా బోధన చేయాలి.

విద్యార్థులలోనే శృతులు తేడా ఉండవచ్చు. అట్లాంటి సమయాలలో అందరికీ సరిపడే ఒక శృతిని (Common) నిర్ణయించి, వారికి బోధన చేయాలి. అట్లాగనే విద్యార్థినుల విషయంలో కూడా.

తక్కిన విద్యా సంబంధిత విషయములకు, సంగీత విషయములకు (Subjects) బోధన విషయాలలో చాలా వ్యత్యాసము కలదు. తక్కిన విషయములు విద్యార్థులకు ఉపాధ్యాయులకు సమానమే. కాని సంగీత విషయాల యందు, సంగతి, గమకము, శృతి, లయ విషయాలలో ఎవరి అవగాహన, ఎవరి గాత్ర ధర్మం, ఎవరి యోగ్యత, వారిదే. ఇద్దరు సంగీత విద్వాంసులు ఒక రాగమును గాని, ఒక శృతిని, ఒక సంగతిని గాని, ఒక గమకమునుగాని, ఒకే విధముగా పాడుట సాధ్యముకాదు. అతి సూక్ష్మమైన భేదము లుండవచ్చును.

ఇది సంగీతమున, కొంతలో కొంత కవిత్వము, చిత్రలేఖనము శిల్పమునందు అన్వయము అగును.

సృజన, కల్పన, మనోధర్మము, ఆత్మగా కలిగిన సంగీతమున ఇది సహజాతి సహజము. ఇందుకు భిన్నముగా అందరూ విద్వాంసులు ఒకే విధముగా గానము చేసినచో అది లలితకళ అనిపించుకొనదు.

సంగీతము లలితాతి లలితమైన కళ, విద్య, జ్ఞానము.

సంగీత ప్రపంచమున, గానము చేయు విద్వాంసులకు (Performer; Exponent) ఖ్యాతి, కీర్తి, హోదా, ధనము మర్యాదా, భోగము మొదలైన అదృష్టములు కలుగును. ప్రజల అభిరుచులను అవగాహన చేసికొని వారి అభిరుచులకు అనుగుణముగా తన శైలిని మలుచుకొను విద్వాంసునికి, ఇంకనూ అధికముగా పై అదృష్టములు వరించును.

సంగీత ఆచార్యుడు గొప్ప విద్వాంసుడు, గొప్ప పండితుడు, గొప్ప భాషా వేత్త, అయి ఉండి బోధనా చాతుర్యము కలిగి ఉండవలెను.

సంగీత ఉపాధ్యాయుడు "గొప్పగా పాడనక్కరలేదు". అను వాదన ఒకటి కలదు. (అది అర్థము లేనిది). గొప్పగా పాడగలిగిన వారే గొప్పగా నేర్పగలరు అనుమాట సత్యము. పైగా ఉపాధ్యాయుడు. పండితుడు, భాషా కోవిదుడు కూడా కావలెను కదా.

సంగీత బోధనలుసలుపువారిలో తర తమ భేదములుండుట సహజము. కాని ఆచార్యుడు తాను ఎల్లప్పుడూ విషయ సేకరణ చేయుచు క్రొత్త విషయములను నేర్చుకొనుచునే యుండవలెను. తన విద్యా దీపము వెలుగుచున్ననే, తన దీపముతో ఇంకొకరి దీపమును వెలిగించగలడుగదా.

సంగీత బోధన చేయువారలలో మూడు తరహాలు కలవారు కలరు.

మొదటి తరహా ఆచార్యుడు తనకు తెలిసిన దానిని తాను నేర్చుకొనిన దానిలో కొంతవరకు అప్ప చెప్పినట్లు మ్రొక్కు తీర్చుకొనును. ఈ తరహా ఆచార్యుడు. కొంచెముగా నేర్చుకొనును. సాధన ఉండదు. విని నేర్చుకొనడు. స్వరజ్ఞానము చాలా తక్కువ ఉండి యుండును. రెండవ తరహా సంగీత ఆచార్యుడు. శిష్యుల యోగ్యతను బట్టి శిక్షణ నిస్తాడు. మూడవ తరహా సంగీతాచార్యుడు. సంగీత శిష్యులకు ప్రోత్సాహాన్ని ఉత్సాహాన్ని ఇచ్చి ఉత్తేజపరుస్తాడు. అతడి బోధనా ప్రయత్నం శిష్యులను అందలం ఎక్కించటమే.

సంగీత ఆచార్యుడు శిష్యులు అవసరాలు తెలుసుకొంటూ సూక్ష్మ బుద్ధితో సద్యవంగా కల్పనలను చేస్తో శిష్యులకు ఆనందాన్ని తృప్తిని ఇస్తో తాను తృప్తిని, ఆనందాన్ని పొందుతూ

ఉంటాడు. ఈతడికి సంగీతం నేర్పడమే ధ్యేయంగా, తాను ఒక సంగీత ఆచార్యుడై తనను తానే నిచ్చెనగ భావించి, వారిని పై అంతస్తులకు ఎక్కిస్తో ఉండడమే అదృష్టంగానూ, ధన్యజీవిగాను, భావిస్తూ ఉంటాడు. ప్రతిఫలాపేక్ష ఇంచుకైన లేకయే తన ఆనందమే, తృప్తియే ప్రతిఫలంగా భావించే ఉత్తముడు సంగీత ఆచార్యుడు.

**142. సంగీత విద్యార్థులు** : సంగీత విద్యార్థులు అనేక తరహాలుగా అనేకమైన సంగీత యోగ్యతలు కలిగి, అనేక గాత్ర ధర్మాలతో, అనేకమైన గ్రహింపుల తరతమ బేధాలతో ఉండడం సహజం.

కొంతమందికి జీవిత ధ్యేయం సంగీత పాడటం. వీరు సంగీతాన్ని ప్రేమిస్తారు. ఆరాధిస్తారు. సులభంగా గ్రహిస్తారు. సాధన చేస్తారు.

సంగీతం మీద ఆశ ఉన్నవారిలో కొంతమందికి మంచి గాత్రం ఉండకపోవచ్చును. మంచి గాత్రం ఉంటే సంప్రదాయ సంగీతం మీద ఆశ ఉండకపోవచ్చు. ఈ విధంగా చేరికలు కూడికలు (Permutations & Combinations) ప్రస్తారాలు ఎన్ని వస్తాయో అన్ని విధాలుగాను ఉంటారు.

మంచి గాత్రం, విళంబకాలం, ఘనం, వేగం, సంప్రదాయ సంగీతం మీద శ్రద్ధ. ఆశ, ధ్యేయం, భగవంతుడు ఇచ్చిన ఉపజ్ఞ (Gift) ప్రతిభ (Talent) వేగంగా అవగాహన చేసుకోవడం, అన్నిటికంటె ముఖ్యమైనది (Taste) రుచి, (Exellence) అనగా మంచి సంగీతం మీదనే దృష్టి. ఇంట్లో కుటుంబంలో సంగీత వాతావరణం, ముఖ్యంగా తల్లి తండ్రులకు సంగీతం మనస్సు. ఇన్ని మంచి విషయాలు కలిసి ఉండటం చాలా తక్కువ మంది విద్యార్థులలో ఉంటుంది.

వీటి తరువాత మంచి గురువు, గురువులు దొరకడం చాలా అదృష్టం. మంచి గురువును గురించి ఇంతకుముందు వర్ణించుకొన్నాం.

సంగీతం నేర్చుకొనేటప్పుడు గురువు గంట పాఠం చెప్తే శిష్యుడు కనీసం 5, 6 గంటలు సాధన చేయాలి. తానవర్ణాలు 3 కాలాలు, మొదటికాలం గమకపుష్టి, అనుస్వరాలు, రాగ ప్రధానంగా రెండవ కాలం ఉల్లసితంగా ఒక స్వరంలోంచి ఇంకొక స్వరంలోకి (Swing) ఊయలవలె ఊపుతో పాడాలి. 3వ కాలం అతి వేగంగా స్పష్టంగా బలం అంతా గాత్రం మీదికి తెచ్చుకొని సాధన చేయాలి. కృతి, కీర్తన, ప్రతి సంగతిని రాగమయంగా సాహిత్యాన్ని స్పష్టంగా పాడుతో, కృతిలో గల రాగం, సాహిత్యం ఒక దానికి ఒకటి తోడు నీడగా

(Complimentary) పాడాలి. సంగతి, రాగం, కోసం సాహిత్యాన్నిగాని, సాహిత్యంకోసం రాగాన్ని గాని వదులుకో (Sacrifice) కూడదు. ఈ విధంగా సాధన చేయాలి.

మనోధర్మ సంగీత శాఖలు సాధన చేయడం చాలా కష్టం. రాగ సంగతులు సంప్రదాయ సంగతులుగా ఉండాలి. కృతి, కీర్తన, వర్ణాల నుండి సంగతులు తీసుకోవాలి. ఎంత కల్పన చేసినా సంప్రదాయబద్ధంగా రాగ లక్ష్య లక్షణాల పరిధిలోనే సాధన చేయాలి. రాగ ఆలాపన నియమాల ప్రకారం, ఆ, క్రమ పద్ధతులను పాటించాలి.

కర్ణాటక సంగీతంలో రాగం ముఖ్యం. రాగమూ రాగమే, కృతి, కీర్తన, మొదలైన సంగీత రచనలూ రాగ భూయిష్టమే. స్వరకల్పన. నెరవు, తానము, పల్లవి, ఇవన్నీ కూడా రాగమయమే. అందుచేత రాగాన్ని కూలంకషంగా అవగాహన చేసుకోవాలి.

సంగీతాన్ని సేకరించడంలోనే మనస్సు ఉండాలి. ప్రదర్శన, సంగీత కచ్చేరీ, పేరు ప్రఖ్యాతి (Publicity) ఉద్యోగం, మొదలైన వాటి మీద మనస్సు ఏమాత్రం ఉండకూడదు. అద్భుతంగా పాడాలి. ఎవ్వరూ తనలాగ పాడకూడదు అనగా తన తోటి వారిలో విశిష్టతను సంపాదించాలి. పేరు ప్రఖ్యాతి, వాటంతట అవే వస్తాయి. వాటికి తొందర పడకూడదు. పలుకు అన్నాన్ని ఎవరు తినలేరు. సంగీత విద్యార్థి ఎంత విద్వాంసుడైనా విద్యార్థిగానే ఉండాలి. చాలు అనుకోకూడదు. అన్నం పూర్తిగా ఉడికేదాకా ఓర్పు కలిగి ఉండాలి.

"ఆత్మ విమర్శన" సంగీత విద్యార్థికి సంగీత విద్వాంసునికి చాలా ఎక్కువగా ఉండాలి. తనను తను నిశితంగా విమర్శించుకోవాలి. తన తప్పులను సమర్థించుకోకూడదు. తప్పులను విమర్శించుకొంటూనే ఉండాలి; జీవితాంతం వరకు.

పెద్ద విద్వాంసులను, చిన్న విద్వాంసులను తన సాటివారిని అందరినీ వింటూనే ఉండాలి. వారితో తనను పోల్చుకొంటూ ఉండాలి. విశేషమైన శైలి, సంగతులు, అందం, రుచి వాటిని తక్కిన వారి దగ్గర నుంచి విని, వాటిని తనవిగా చేసుకోవడానికి సాధన చేయాలి. అనుకరణ పూర్తిగా పనికిరాదు. అనుసరణ మాత్రమే చేయాలి. అది కూడా కొంతవరకే.

ఇతర విద్వాంసుల లోపాలను విమర్శించకూడదు. అవి తన యందు లేకుండా చూచుకోవాలి. రాకుండా జాగ్రత్త పడాలి. లోపాలతో పాడుతోన్న వారి వద్దనుండి లోపాలను తెలుసుకొనడం వలన ఒక విధంగా వారు కూడా గురువులే. ఎట్లా పాడకూడదో మనకి నేర్పుతున్నారు. క్రమంగా ఒక విద్యార్థి విద్వాంసునిగా రూపొందుతున్నప్పుడు తనదంటో ఒక శైలి (Style) ఒక పద్ధతి, ఒక అందం మొదలుగా గల విశిష్టవిషయాలపై శ్రద్ధగా సాధనచేసి పరిపూర్ణతను (Perfection) సాధించాలి.

సంగీతంలో పరిపూర్ణత చాలా ముఖ్యం. ఎంత చిన్న పరిధిలోనైనా పూర్ణత (Finished Product) (Refined) (Neat Presentation) చాలా ముఖ్యం.

గ్రంథం అనగా కృతుల సంఖ్య. అవి ఎంత ఎక్కువగా నేర్చుకొంటే అంత ఎక్కువగా రాగ అవగాహన ఉంటుంది. రాగం మీద అధికారంవస్తే సంగీత కోటలో పాగా వేసినట్లే.

కర్ణాటక సంగీత గమకాలు ఎక్కువగా రెండు స్వరాల మీద రెండు స్వరాల మధ్య ఊగుతోఉంటాయి. అలా ఊపేటప్పుడు ఎక్కువ, తక్కువ అవడానికి అవకాశం ఉంటుంది. సూక్ష్మ శృతులు జారే అవకాశం ఉంటుంది కనుక జాగ్రత్త పడాలి. అలాగే స్ఫురితం, రవ, ప్రత్యాహతం గమకాలను, శృతి శుద్ధంగా పాడాలి. కనీసం, రెండు స్థాయిలు, రెండున్నర స్థాయిలలో వేగాన్ని అలవాటు చేయాలి. వేగం, స్పష్టతతో అనేక అలంకారాలను సాధన చేసి పాడాలి. 'తానం' నిష్ణాతులైన మహా విద్వాంసుల వద్ద విని నేర్చుకోవాలి. మనో ధర్మ సంగీత సాధన స్వరకల్పనతో మొదలు పెట్టాలి. ముందు కల్పన చేయాలి. ఎవరికి వారే అలంకారాలను చేసుకొంటూ స్వరకల్పన చేయాలి. ప్రథమ కాలం ముందుగా ప్రయత్నం చేయాలి. క్రమంగా ద్వితీయకాలం సాధన చేయాలి. నెరవు, ఒకటి రెండు కాలాలు క్రమంగా సాధన చేయాలి. మొదటి కాలం రాగమయంగా ఉండాలి. తాళంలో ఉండాలి. సాహిత్య సర్దుబాట్లు చేసుకొంటూ ఉండాలి. అందుచేత చాలా కష్టం. సాధన చేసే వారికి రోజుకు 24 గంటలు సరిపోవు.

పల్లవులు, ముందుగా సాదా సీదా తాళాల్లో, తరువాత క్లిష్ట తాళాల్లో, క్రమంగా గతి భేద పల్లవులు, గురువు దగ్గర నేర్చుకొని సాధన చేయాలి. ఈ రోజులలో పల్లవి ప్రదర్శన, సాధన, శిక్షణ కూడా తగ్గిపోయాయి. ఈ మధ్య మరల పల్లవులకు ప్రాధాన్యం పెరుగుతోంది.

మనోధర్మ సంగీతం మన భారతీయ సంగీత (ముఖ్యంగా పై మనోధర్మ శాఖలు) సాంప్రదాయం యొక్క సొత్తు. దానిని కాపాడుకోవాలి. అన్ని సాధనలు గురువు సమక్షంలో, గురువు పర్యవేక్షణలోనే సాగాలి. అన్ని వేళలా అది వీలుకాదు. అట్లాంటప్పుడు ఆత్మ విమర్శతో సాధనలు సాగాలి.

# 143. స్వరజ్ఞానం, నొటేషన్ – సంగీత అక్షరాస్యత

స్వరజ్ఞానం అనగా, సంగీతంలో ప్రతి స్వరానికి, రాగంలో ప్రతి సంగతికి, స్వరం నిర్దుష్టంగా తెలియడం.

ఒక సంగతిని గాని, ఒక రాగమూర్ఛనను గాని, ఒక స్వరగుచ్ఛాన్ని గాని అకారంతో గానం చేసినప్పుడు, ఆ సంగతులను, ఆ మూర్ఛనను, ఆ స్వరగుచ్ఛాన్ని వెంటనే స్వరాలలోకి మార్చి పాడటం ఒకటే కాదు. ఆ స్వరస్థానాలను కూడా తెలుసుకోవటం స్వరజ్ఞానం, స్వరస్థానజ్ఞానం.

స్వర జ్ఞానం అంటేనే, స్వరస్థాన జ్ఞానం. గమకంతో ఉండే స్వరాలిని (అకారంతో రాగ సంగతులుగా పాడినప్పుడు) వెంటనే గుర్తు పట్టి తిరిగి స్వరాలను పాడటం స్వరజ్ఞానం.

స్వరజ్ఞానం రెండు విధాలు. మొదటిది అకారంతో ఉండే స్వరాలను గుర్తు పట్టడం. ఆ స్వరాలను హ్రస్వ, దీర్ఘాలతో స్వరపరచి వ్రాయడం. రెండవది స్వరపరచిన సంగీత రచనను చూచి పాడగలగడం. ఈ రెండు విధాలుగా గలిగిన స్వర (స్వరస్థాన, గమక) జ్ఞానం సంగీత విద్యార్థి దగ్గర నుంచి సంగీత విద్వాంసుని వరకు సంగీత ఆచార్యుని వరకు జీవితాంతం, అనుక్షణం, కావాలి. చాలా అవసరం. ఈ అపూర్వమైన, అతి ముఖ్యమైన స్వరజ్ఞానం ఉంటేనే విద్యార్థి విద్వాంసుడౌతాడు. విద్వాంసుడు మహావిద్వాంసుడుగా రూపొంది ప్రకాశిస్తాడు.

స్వరజ్ఞానమే, సంగీత శిక్షణ. స్వరజ్ఞానమే సంగీత జ్ఞానము. కూలంకషమైన స్వరజ్ఞానమే సంగీత విద్వత్తు, సంగీత పాండిత్యం.

ఈ స్వరజ్ఞానాన్ని, సంగీత ఆచార్యుడు. సంగీత విద్యార్థికి చిన్న చిన్న దశల నుండి నేర్పటం చాలా చాలా ముఖ్యం. గీతాలు, వర్ణాల నుండి విద్యార్థి మనస్సు నందు స్థాపించాలి. కృతులను నేర్పుతోన్నప్పుడు సంగతిని, ఆ సంగతి యొక్క స్వరాన్ని తెలుసుకొనేలాగ విద్యార్థికి శిక్షణను ఈయాలి. ఆ కృతిని ఈ విధంగా నేర్చుకున్న తరువాత, ఆ కృతిని స్వరపరచి విద్యార్థి చేత తాళగుర్తులతో, హ్రస్వదీర్ఘాల అక్షరకొలతలతో తాళ ఆవర్త అక్షరాలకు సరిపోయేటట్లు వ్రాయించిన తరువాతనే ఆ కృతిని ఆచార్యుడు నేర్పినట్లు, విద్యార్థి నేర్చుకొన్నాడు అని అర్థం.

ఈ స్వరజ్ఞాన వ్యవసాయం, అధ్యయనం అలంకారాల దశ నుండే ప్రారంభించాలి.

అన్ని రాగాలలోనూ అనేక అలంకారాలను ఆచార్యుడు రూపొందించి విద్యార్థి చేత పాడించి మొదట స్వరబృందాలను ఆస్వర బృందాలకు అకారాలని పాడిస్తో ఉంటే. ఆకారం

పాడుతోన్నప్పుడు విద్యార్థి మనస్సులో ఏ స్వరానికి ఏ ఆకారం పాడుతున్నాడో తెలుసుకొంటూ ఉంటాడు. ఈ క్రమపద్ధతే స్వరజ్ఞానానికి నాంది.

స్వరజ్ఞానం తరగతి ప్రత్యేకంగా నిర్వహించాలి. ప్రథమ దశలలో వారికి చెప్పిన మోహన గీతమో, కళ్యాణి, శంకరాభరణం గీతం చెప్పే ముందర ఆరాగ ఆరోహణ అవరోహణలను వానిలో చిన్న చిన్న స్వర బృందాలను అలంకారాలను పాడించిన తరువాత వారిని స్వరాలను పాడమని అడగాలి. "పమగా అను, నిదపా అను, మగమా అను" ఈ విధంగా వారి చేత అనిపించాలి. వారు బాగా పాడుతోన్న తరువాత ఆచార్యుడు ఆ రాగంలో ననన అని పాడి దానికి స్వరం అడగుతోంటే క్రమంగా విద్యార్థి మనస్సులో ఒక సూక్ష్మ జ్ఞానం తెరుచుకొని క్రమంగా వృద్ధి చెందుతుంది.

మొదటి పాఠంలోనే మోహన ఆరోహణ స్వరాలను వ్రాయాలి. "సరిగపదస" ఈ ఆరోహణ స్వరాలలోనే అవరోహణ స్వరాలు కూడా ఉన్నాయి.

సరీ సరిగా సరిగా, సరిగపా - మొదలుగా తారషడ్జమం వరకూ తరువాత సదా, సదపా, సదపగా, అని పాడిస్తో ఆధార షడ్జమం వరకు పాడించాలి. వెంటనే అకారం పాడించాలి.

అలాగే ఆరోహణ, అవరోహణ, స్వర బృందాలు స్వర అకారం ఎన్ని వీలైతే అన్ని ఎక్కువగా పాడించాలి. మధ్యమధ్య స్వరాలను అడిగి పాడించాలి. క్రమంగా అకారం పాడి స్వరం చెప్పించాలి.

ఒక్క ఆరోహణ స్వరాలు మాత్రమే వ్రాయాలి. ఆ స్వరాల మీద వ్రేలితో చూపిస్తో ఎన్ని వందల అలంకారాలైనా పాడించవచ్చు. ప్రతి దానికి స్వరం అకారం ముఖ్యం.

ఈ విధంగా నెమ్మదిగా ఓర్పుతో ఆచార్యుడు విద్యార్థికి నేర్పుతో ఉంటే వర్ణానికి వచ్చేసరికి వర్ణం విద్యార్థి చేతనే పాడిస్తో తప్పులను సరిచేస్తో సులభంగా వర్ణాలను నేర్పవచ్చు.

*కొన్ని అలంకారాలు*

1. సరిగపదస అవరోహణ
2. జంట ససరిరిగగ . . ; అలాగే అవరోహణ జంట
3. సరి, సరిగ, సరిగప, సరిగపద . . . . . .
4. సద సదప సదపగ . . . . .

5. సరిస, సరిగరిస, సరిగపగరిస . . . . .

6 సదస, సదపదస, సదపగపదస . . . . .

7. రిస, గరిస, పగరిస . . . . .

8. దస, పదస, గపదస . . . . . .

9. రిసరి, గరిగ, పగప . . . . .

10. దసద, పదప, గపగ . . . . .

11. రిస, గరి, పగ, దప . . . . .

12. దస, పద, గప, రిగ . . . . .

13. గరిసరిగా, పగరిగపా

14. పదసదపా, గపదపగా . . . . .

15. పగరిసరిగపా, దపగరిగపదా . . . . .

16. గపదసదపగా, రిగపదపగరీ . . . . .

17. సగ, రిప, గద, పస . . . . .

18. సప, దగ, పరి, గస . . . . .

19. సగరిగసరీరి, రిపగపరిగా . . . . .

20. సపదపసదా, దగ పగదపా . . . . .

పై విధంగానే అన్ని రాగాలలోనూ, స్వరం అకారం పాడించాలి. ఫలితాలు తృప్తిగా ఆనందంగా ఆచార్యునికి, విద్యార్థికి, విద్యార్థుల తల్లితండ్రులకు కూడా ఉంటుంది.

స్వరజ్ఞానం అనగా సంగీతాన్ని వింటో వ్రాయగలగడం, పుస్తకంలో ఉన్న స్వరాన్ని చూచి పాడగలగడం, ఈ రెండు జ్ఞానాలు కూలంకషంగా లేని సంగీత విద్వాంసుడు. విద్యా విషయంగా, అక్షరాస్యత విషయంగా నిరక్షరాస్యుడు అనవచ్చు. అతడు ఎంత విద్వాంసుడైనా, ఎంత పేరుండి ఎన్ని కచ్చేరీలు చేసినా సరే.

స్వర జ్ఞానం అనగా సంగీత అక్షరాస్యత. స్వరజ్ఞానం అనే సంగీత అక్షర జ్యోతిని వెలిగించి దానిని ఆచంద్రతారార్కంగా ప్రకాశింప చేయాలి.

# 144. సంగీత ఉపాధ్యాయ శిక్షణ
## (MUSIC TEACHES TRAINING)

ప్రభుత్వ సంగీత కళాశాలలో, విశ్వవిద్యాలయాలలో సర్టిఫికేట్, డిప్లొమా, బి.ఎ; ఎం.ఎ; పి.హెచ్.డి; డిగ్రీలు సంగీత శిక్షణలలో ఉన్నాయి. కాని సంగీత ఉపాధ్యాయ వృత్తిని చేపట్టాలంటే బి.యిడి. ఎం.యి.డి. డిగ్రీల లాంటివి సంగీతంలో లేకపోవడం ఒక లోటే.

సంగీత విద్యాలయాలలో నలుగురితో పాటు సంగీతం నేర్చుకొనే వారికి ఉపాధ్యాయ వృత్తిలో కూడా చిన్న, పెద్ద పరీక్షలు ఉంటే బాగుంటుంది. ఉండటం వాంఛనీయం. ఈ ఉపాధ్యాయ వృత్తి పరీక్షలలో పాఠ్యభాగాలలో (Syllabus) 'సంగీతం నేర్పడం' ఎలాగ అనే అంశాలు ఉంటాయి.

ఆ Syllabus లో విద్యార్థుల యోగ్యతా వైవిధ్యం. వారి వివిధ శృతులు, గాత్రసాధన, గమక అవగాహన. సంగీత శాస్త్రాన్ని ఎట్లా విద్యార్థులకు బోధించాలి అనే అంశాలు ఉండాలి.

విద్యార్థుల యోగ్యతలలో తర, తమ బేధాలను బట్టి వారిని విభజించి వారందరి సంగీతం వచ్చేటట్లు ఎట్లా బోధన చేయాలి అని విషయాలు సిలబస్‌లో ఉండేటట్లు చూడాలి.

ఈ ఉపాధ్యాయ వృత్తి శిక్షణాలయాలు కనీసం సంగీతంలో బి.ఎ. డిప్లొమా, పరీక్షల అనంతరం ఉండాలి. "సర్టిఫికేటు" స్థాయి ఈ ఉపాధ్యాయ శిక్షణకు సరిపోదు. అసలు సంగీతం, పరీక్షలలో ఉత్తీర్ణతను పొంది, సంగీతంలో బోధన చేద్దామనిగాని, రేడియోలో పాడదాం అని గాని, సంగీత కచ్చేరీలను చేద్దామని గాని అనుకోవడం కంటె, ముందుగా సంగీతాన్ని గురుకుల పద్ధతిలో క్షుణ్ణంగా 30 తానవర్ణాలు, అటతాళవర్ణాలు (3 కాలాలు); కృతులు, రాగం, స్వరకల్పన, నెరవు, తానం, పల్లవి, మొదలైనవి నేర్చుకొని, నిర్విరామ సాధన చేసి, అప్పుడు పరీక్షలలో కూడా ఉత్తీర్ణతను సాధించడం శ్రేష్టం. ఈ విధంగా వచ్చిన సంగీత విద్యార్థులు. విద్వాంసులు, పండితులుగా రూపొందుతారు. సంగీత విద్యకు మాత్రం ఇట్టి విద్యా విధానం మాత్రమే వాంఛనీయం.

## సంగీత వయోజన విద్య:

*సంగీత రసికత కొరకు మరియు వయోజన సంగీత విద్యాబోధన*, విషయంలో సంగీతంలో శ్రద్ధ, భక్తి ఉండి, కుటుంబంలో సంగీతం ఉండి, బాల్య, యౌవనాలలో వృత్తి విద్యలలో మునిగి, ప్రవీణులై, జీవితంలో మంచి ఉద్యోగిగా, వైద్యునిగా, మంచి ఇంజనీరుగా,

మంచి ఐ.ఎ.ఎస్. ఉద్యోగిగా నిలకడను పొందిన తరువాత, వారికి సంగీతాన్ని మంచి రసికుడుగా విని ఆనందించాలని గాని, గాన సభలలో (సరదాగా) ఆత్మార్థంగా పాడాలని గాని ఉండిన వారికి సంగీత శిక్షణను ఎట్లా ఈయాలి? ఆ పద్ధతికి సిలబస్ ఎట్లా రూపొందించాలి? అనే విషయాన్ని పరిశీలించడం అవసరం.

అట్లాంటివారికి త్వరగా నేర్పాలి. తక్కువ సమయాలలో ఎక్కువగా నేర్పాలి. సంగీత సూక్ష్మాలలో వారికి అవగాహన ముఖ్యంగా భావించి వారికి బోధన చేయాలి.

ముందుగానే చిన్న కృతులు నేర్పి, వాటి మూర్ఛనలు వాటి స్వరస్థానాలు వాటిలో ప్రతి రాగంలోనూ అలంకారాలు, అకారాలు నేర్పాలి. స్వరస్థానాలలో వైవిధ్యం వలన రాగ వైవిధ్యం ఉంటుందని ముందుగా హంసధ్వని, మోహన, హిందోళ, అభోగి తరువాత శ్రీరంజని తరువాత ఖరహరప్రియ తరవాత అతి కోమల స్వరాలు కలిగిన తోడి నేర్పి ఒక్కొక్క తీవ్ర స్వరమే పరిచయం చేస్తూ క్రమంగా తోడి, నఠభైరవి, ఖరహరప్రియ, హరికాంభోజి, శంకరాభరణం చివరిగా కళ్యాణి వారికి నేర్పాలి, పాడించాలి.

ఆ తరువాత 32 మేళకర్తలు నేర్పి పాడించాలి. ఆ తరువాత 72 మేళకర్తలు, నేర్పాలి. అలాగే తాళాలు.

మొదట రూపకం, తరువాత, ఆది, క్రమంగా ఖండచాపు, మిశ్రచాపు నేర్పాలి.

ఈ తాళాలలో చిన్న కృతులు నేర్పాలి. అవసరం అయితే కృతులను లేక కీర్తనలను రచించియైనా నేర్పాలి. పెద్ద కృతులను కూడా సంగతులు వేగంగా ఉన్న నడకలను తగ్గించి కృతిని సులభతరం చేసి నేర్పవచ్చు. విద్యార్థుని గాత్ర పలుకునుబట్టి కృతిని గాని, ఏ ఇతర అంశాన్ని గానీ నేర్పాలి.

## 145. సంగీత "దూర శిక్షణ" (Distant Education in Music)

దూరమున గల ఔత్సాహిక సంగీత విద్యార్థులకు సంగీత శిక్షణా క్యాసెట్ల ద్వారా సంగీతాన్ని నేర్పవచ్చు. గురువు చెంత పాడి తప్పుదిద్దుకోవటం ఈ పద్ధతి వలన లభించదు. కాని అప్పుడప్పుడు గురువు దగ్గర వినిపించటం సాధ్యం చేసుకోవచ్చు.

## 146. *సంగీత గురుకులం* : *సంగీత విద్యాలయ బోధన*

| సంగీత గురుకులం | సంగీత విద్యాలయ బోధన |
|---|---|
| 1. నిర్ణీత కాలం ఉండదు ఎక్కువ కాలం బోధనలో ఉంటుంది. | 1. నిర్ణీత కాలం తక్కువగా ఉంటుంది. |

| | |
|---|---|
| 2 గురువు దగ్గర సాధన చేయవచ్చు. | 2. ఆ విధంగా వీలుండదు. |
| 3. స్వరజ్ఞానం, నోటేషన్ జ్ఞానం లయ జ్ఞానం మొదలైనవి కూలంకషంగా అలవరతాయి. | 3. ఇక్కడ అన్ని విషయాలకూ పరిమి |
| 4. ప్రత్యేక శ్రద్ధ, శిక్షణ, ప్రేమతో లభిస్తుంది. | 4. గుంపులో గోవిందా. నలుగురితో పా నారాయణా. |
| 5. శిక్షణ కాలం సాధన కాలం పరిమితి ఉండదు. | 5. పరిమితి ఉంటుంది. |
| 6. సంగీత అవగాహన మీద, క్షుణ్ణమైన బోధన మీద దృష్టి | 6. సిలబస్ మీదనే దృష్టి |
| 7. ఎన్నో వర్ణాల తరవాతే కృతి | 7. చాలా తక్కువ వర్ణాలు, వెంటనే కృ |
| 8. అర్హతకు తగిన స్థాయిలో బోధన | 8. వివిధమైన యోగ్యతలుకలిగిన విద్యార్థులకు ఒకే విధమైన పాఠం (బోధన) (No feed back) |
| 9. గురకులం శ్రమ, కష్టం, సులభం కాదు. | 9. విద్యాలయాలు చాలా ఉన్నాయి. ఒక గంట వెళ్లి రావడం సులభం. |
| 10. గురువు నిష్ణాతుడు నిజమైన పండితుడు విద్వాంసుడుగా సాధారణంగా ఉంటారు. | 10. సాధారణంగా (Paper Qualification యోగ్యతా పత్రం మాత్రం ఉన్నవారే ఉపాధ్యాయులుగా ఉంటారు. సర్వత ముఖమైన పాండిత్యం సాధారణంగా ఉండదు. |
| 11. Paper Qualification అవసరంలేదు. | 11. Paper Qualificatin సరిపోతుంది. |
| 12 ఒకే శైలి అబ్బుతుంది. | 12. శైలుల కలగాపులగం. |
| 13. లక్ష్యానికి ప్రాధాన్యం | 13. లక్షణానికి ప్రాధాన్యం |

పై విషయాలు సాధారణంగా జరుగుతున్నాయి. అక్కడ అక్కడా అరుదుగా భిన్నంగా వాంఛనీయంగా ఉన్నాయి.

ఒక విషయం గమనించవలసినది ఏమనగా గురుకులాలు ఈ రోజులను బట్టి తక్కువగా అయ్యాయి. సంగీత విద్యాలయాలు ఎక్కువగా ఉన్నాయి. విద్యార్థులకు వారి తల్లి తండ్రులకు సర్టిఫికేటు డిప్లొమా, డిగ్రీమీదనే, నిజమైన యోగ్యతను సంపాదించడం కన్న ఎక్కువ దృష్టి. ఈ కాలంలో కేవలం సంగీత విద్యార్థులు లేరు. వారి వారి స్కూలు, కాలేజీ చదువులు ముఖ్యం. సంగీతానికి చిట్ట చివరి అవసరం (Last Preference)

## 147. ఇతోధికంగా సంగీత గ్రంధాల ఆవశ్యకత

పూర్వం మహానుభావులైన సంగీత పండితులు సంస్కృతంలో వ్రాసిన గ్రంధాలు వాటి వ్యాఖ్యానాలు ఉన్నాయి. వాటిలో చాలా గ్రంధాలు పురాతనమైన సంగీత రీతులను, అప్పటి అభివృద్ధిని, విపులంగా పేర్కొన్నాయి. పురాతనం నుండి ఇప్పటి వరకు లక్ష్య సంగీతం, అభివృద్ధిని సాధిస్తోనే ఉంది. లక్షణం మాత్రం పూర్వపు గ్రంధాలు ఎంత వరకు వ్రాశాయో అంతవరకు మాత్రమే ఉన్నాయి. కాగా ఈనాడు లక్ష్యానికి పూర్వపు లక్షణానికి చాలా విషయాలలో వర్తింప చేయడం అవగాహన, లోపిస్తోంది. ''లక్ష్యంఖలు లక్షణం'' అనే సూత్రం ప్రకారం ఈనాటి లక్ష్యాలను వర్తింప చేసేటట్లు లక్షణ గ్రంధాలను ప్రకాశింప చేయవలసిన బాధ్యత సంగీత పండితులకు కళాపోషకులకు ఉంది. సంగీత లక్ష్య లక్షణాల మీద ఎన్ని గ్రంధాలు వచ్చినా ఇంకా తక్కువే. పూర్వపు సంగీత గ్రంధాల అవగాహన, చరిత్ర అవగాహన కొరకు, మాత్రం ఉపయోగిస్తుంది. సంగీతం ఏ విధంగా చూచినా లక్ష్య ప్రధానం కనుక. లక్ష్య, లక్షణ గ్రంధాలు ఇతోధికంగా రావాలి.

ఈ సందర్భంలో ఒక్క విషయం ముచ్చటించవలసి ఉంది.

ఈ శతాబ్దం ప్రారంభంలో ''సంప్రదాయ ప్రదర్శిని మొట్టమొదటి సంగీత లక్ష్య గ్రంధం. (''నొటేషన్'' విషయంలో కూడా.)

తరువాత తమిళంలోనూ తెలుగులోనూ నొటేషన్‌తో కొంతమంది పెద్దలు సంగీత రచనలను వ్రాశారు.

వారిలో ముఖ్యులు కె.వి. శ్రీనివాస అయ్యంగారు. అరిపిరాల సత్యనారాయణమూర్తిగారు, ఏకా సుబ్బారావుగారు, ఎన్.సి. పార్థసారథి దంపతులు. పల్లవి స్వరకల్పవల్లి వ్రాసిన గ్రంధకర్త మొదలైనవారు. స్వరపరచటంలో సూక్ష్మమైన గమక భేదాలకు స్వరం వ్రాసి ఎక్కువ కృతులను

స్వరపరచిన ఘనత ఆర్. రంగరామానుజయ్యంగారికి దక్కుతుంది. అవి తమిళంలోనే ఎక్కువగా ఉన్నాయి. (వారే తెలుగులో వ్రాసిన పై గ్రంథాలకు ఆదరణ లేకపోవడం మూలంగా) వాటి పేరు "కృతిమణిమాల".

వారి తరువాత 1,100 కృతులు, కీర్తనలు, పదాలు, జావళీలు, తిల్లానాలు, మొదలైన వాటిని 4 సంపుటులలో (4 Volumes) 25, 30 ఏండ్ల నుండి శ్రమిస్తో జీవిత ధ్యేయంగా భావించి, "సంగీత సౌరభం" అనే పేరుతో సంగీత సౌరభాన్ని దక్షిణ దేశంలో వెదజల్లిన మహాఘనత "డా॥ శ్రీపాద పినాకపాణి గారికి దక్కుతుంది. వీరు ఇవిగాక, అనేక సంప్రదాయ పల్లవులను, "పల్లవి గాన సుధ" అను పేరుతోనూ, "మనోధర్మ సంగీతం" అనే గ్రంథాన్ని సంగీత లోకానికి అందించడం విశేషం. సంగీత సౌరభంలోని కృతులను స్వరపరచిన విధానం. సుబోధకంగానూ, సూక్ష్మమైన స్వరరచన (Notation) తోనూ, సంప్రదాయ శైలులలో మహా విద్వాంసుల శైలులలో, అరిటిపండు ఒలిచి నోటికి అందించినట్లు ఉండి బహు ఉపయోగంగా ఉన్నవి.

మంచాల జగన్నాథరావు గారు త్యాగరాజ కృతులు, అన్నమయ్య కృతులు, రామదాసు కృతులు, ఆధునిక సంగీతం, మొదలైన గ్రంథాలను ప్రచురించారు. బాలమురళీకృష్ణ గారు రచించిన 72 మేళకర్తలను, వారు రచించిన తిల్లానాలను, గ్రంథరూపాలలో లోకానికి అందించి సంగీత లోకానికి మహోపకారం చేశారు. డా॥ బి. రజనీకాంతరావుగారు సహజ సంగీతజ్ఞులు. వీరు రచించిన వాగ్గేయకారుల చరిత్ర అతి ముఖ్యమైనది, గొప్పది. నిరాఘాటం రామకృష్ణ శాస్త్రిగారు వ్రాసిన దీక్షితర్ కృతుల విశ్లేషణ, నొటేషన్ చాలా అపూర్వ గ్రంథం.

## వినూత్న సంగీత బోధనా విధానములు

బాల బాలికలకైనా, యువతీ యువకులకైనా, సరదాగా నేర్చుకొను పెద్దవారికైనా ఎట్లాంటి విద్యార్థికైనా మొదటగా మోహన మూర్ఛన, మోహనలో సులభమైన అలంకారాలు.

1. సరిగపదస మాత్రమే వ్రాయాలి.
2. జంట మోహనలోనే
3. సరిగ/రిగప 3 స్వరాల అలంకారం ఆరోహణ అవరోహణ క్రమంగా అకారం
4. సరి/సరిగ / సరిగప/ మొదలుగా ఆరోహణ అవరోహణ, అకారం.
5. సరిస/సరిగరిస/ మొ॥ ఆరోహణ, అవరోహణ, అకారం.
6. రిస/గరిస / పగరిస అలంకారాలు ఆరోహణ, అవరోహణ క్రమాలలో అకారం.
7. రిసరి / గరిగ ఆరోహణ అవరోహణ తరువాత, అకారం

8. గరిసరిగ / పగరిగప ఆరోహణ అవరోహణ తరువాత అకారం
9. పగరిసరిగప / దపగరిగపద ఆరోహణ అవరోహణ తరువాత అకారం
10. సరిస / రిగరి అవరోహణ, ఆరోహణ తరువాత, అకారం
11. సదస / దపద ఆరోహణ అవరోహణ తరువాత, అకారం
12. సరిగరిస / రిగపగరి ఆరోహణ అవరోహణ తరువాత, అకారం
సదపదస / దపగపద ఆరోహణ తరువాత అకారం
13. సగ రిప గద పస ఆరోహణ తరువాత అకారం
సప దగ పరి గస అవరోహణ తరువాత అకారం

పై విధంగానే అనేకమైన అలంకారాలను గురువు రూపొందిస్తో శిష్యులను కూడా పేర్చి పాడమనాలి. అకారం, బాగా స్వరం వచ్చిన తరువాత పాడించాలి. బాగా వచ్చిన తరువాత వేగంగా 2, 3 కాలాలలో నేర్పాలి, అకారం కూడా. తరువాత మోహన గీతం ఆ తరువాత వర్ణం నేర్పాలి. రెండు కాలాలు నేర్పాలి. తాళం కోసం ముఖ్యమైన అలంకారాలు మోహనలోనే. రూపక, త్రిపుట, ఏక (ఆది) ఝంపతాళ, అలంకారం ఖండచాపులో నేర్పాలి. క్రమంగా మూడు కాలాలు పాడించాలి.

స్వరజ్ఞానం కొరకు మోహన స్వరాలను విద్యార్థుల చేతనే సరిగా, దప, దస, మొదలైన అనేక విధాలుగా పాడించాలి. ఇవి బాగానేర్పి మోహన వర్ణంలోనివి గీతంలోనివి స్వర సమూహాలను అకారంతో గురువు పాడి వారిని స్వరం అడుగుతో స్వరం తెలుసుకొనే మార్గాలు వారికి వివరిస్తో స్వర జ్ఞానానికి పునాదులు వారి మనస్సులలో నాటాలి.

## 148. స్వరజ్ఞానమునకు సూక్ష్మ బోధనా విధానములు

స నుండి ప వరకు ఒక మండలం

ప నుండి స వరకు ఒక మండలం

తార స నుండి రిగమప, ఇంకొక మండలం మధ్య స నుండి మంద్ర ప వరకు ఇంకొక మండలాలుగా విభజించి విద్యార్థికి చెప్పాలి.

మనసులోనే విభజించుకోవాలి. మధ్య స నుండి ఒక స్వర గుచ్ఛం మొదలు పెట్టి క్రిందికి వస్తోందా పైకి వెడుతున్నదా (అవరోహణ స్వరాలా? ఆరోహణ స్వరాలా? అవి ఎన్ని ఈ విధంగా వారికి స్వరజ్ఞాన అంశాలను బోధపరుస్తూ ఉండాలి.

తరువాత మోహన రాగంలోనే ఒక కృతిని గాని కీర్తనను గాని క్లిష్ట సంగతులను నేర్పకుండా సులభంగా ఉండేటట్లు నేర్పి ప్రతిస్థాయిలోనూ స్వరాలను గుర్తించమని విద్యార్థులను ప్రోత్సహిస్తూ కీర్తనను బోధించి, క్రమంగా వారిచేత వ్రాయించాలి. వ్రాస్తోనప్పుడు తాళ అక్షరాలు, అనగా స్వరాలు, ఒక ఆవర్తానికి ఎన్నో చెప్పి, ప్రతి అంగానికి, ఒక నిలువు గీత. ఆవర్తం ఆఖరుకు రెండు నిలువు గీతాలు పెట్టించాలి.

| | | | | |
|---|---|---|---|---|
| మధ్యమకాలం | ఆది తాళానికి ఆవర్తానికి | 32 | అక్షరాలు 32 | స్వరాలు |
| | మిశ్రచాపు తాళానికి ఆవర్తానికి | 14 | అక్షరాలు 14 | స్వరాలు |
| | రూపక తాళానికి ఆవర్తానికి | 12 | అక్షరాలు 12 | స్వరాలు |
| | ఖండచాపు తాళానికి ఆవర్తానికి | 10 | అక్షరాలు 10 | స్వరాలు |

నెమ్మదిగా పైకాలం వ్రాయడం నేర్వాలి. స్థాయి గుర్తులు ముందుగానే నేర్వాలి.

పై విధంగానే ఔడవరాగాలు, హిందోళ, హంసధ్వని, అభోగి రాగాలలో అన్ని విధాల అలంకారాలు, స్వరం, అకారం, పాడించాలి. ఆ రాగాలలో గీతాలు లేకపోతే వాగ్గేయకారత్వం చేయటం కష్టంకాదు. అప్పటికప్పుడు రచించవచ్చు. తరువాత వర్ణాలు కీర్తనలు మొదలైనవి నేర్వాలి.

ఈ విధంగా సంగీత శిక్షణ జరిగితే ఎవరికైనా సరే చిన్న పెద్దలకు మంచి ఉపజ్ఞ ఉన్న వారి దగ్గర నుంచి తక్కువ గ్రహింపు ఉన్నవారి వరకు, వారిలో సంగీత ప్రియత్వాన్ని కలిగిస్తో, గురువు, తాను తృప్తిని పొందుతూ, సంగీత పాఠాలు నేర్పితే, ఉభయతారకంగా ఉంటూ సంగీతానికి నిజమైన సేవ చేయవచ్చు.

# 149. కర్ణాటక సంగీతము - హిందూస్థానీ సంగీతము భేదములు - పోలికలు - విభిన్నైక్యతలు

## COMPARITIVE STUDY OF KARNATIC & HINDUSTANI STYLES OF MUSIC

భారతీయ సంగీతం భారత దేశం నలుమూలలా ఒకే శాస్త్రీయ పద్ధతిలో వేదకాలము నుండి అభివృద్ధి చెందుతూ ఉన్నది. ఇట్లుండగా 12, 13వ శతాబ్దాల కాలంలో ఉత్తర దేశంలో ముస్లింలు, పర్షియా దేశస్తులు ఉత్తర భారతదేశ రాష్ట్రాలను ఆక్రమించి, వారి రాజ్య స్థాపన చేసినప్పుడు అఖండ భారతీయ సంగీత సంప్రదాయంలో ఉత్తర భారతంలో మార్పులు జరగటం,మార్పులను చొప్పించడం ద్వారా ప్రారంభం అయింది. క్రమంగా దక్షిణ రాష్ట్రాలు తప్ప తక్కిన పైన గల తూర్పు, పడమర, ఉత్తర రాష్ట్రాలు హిందూస్థానీ సంగీతం ఆచరించటం మొదలుపెట్టాయి. 'సంగీత రత్నాకరం' రచింపబడిన కాలానికి భారతం అంతా ఒక్కటే సంగీతం.

కర్ణాటక, ఆంధ్ర తమిళ, కేరళ రాష్ట్రాలు మాత్రం అంతకుపూర్వపు సంప్రదాయ శాస్త్రీయ సంగీతాన్నేయధాతధంగా అనుసరిస్తునే ఉన్నాయి.

కాగా భారతదేశంలో భారతీయ సంగీతం రెండు సంప్రదాయాలుగా రెండు శైలులుగా ప్రకాశిస్తున్నాయి.

ఈ రెండు సంప్రదాయాల మూలం, శాస్త్రం, ఒక్కటే అయినా కొన్ని విషయాలలో భిన్నమైన మార్గములలో పయనిస్తున్నాయి.

దీనిని ఏకత్వంలో భిన్నత్వం, భిన్నత్వంలో ఏకత్వం అనవచ్చు. (Unity in diversity and diversity in unity)

ఈ రెండు సంప్రదాయాలలో ఐక్యత, ఒకే పద్ధతి కలిగిన విషయాలు: ఆధారశృతి, స్వరం, 12 స్వరస్థానాలు శృతులు షడ్జమ పంచమ స్వరాలు అచలాలుగా ఉండుట, మూర్ఛన, స్థాయి. రాగపద్ధతి, కచ్చేరీ పద్ధతి, రాగ ఆలాపన, రాగములు, రసములు, మనోధర్మ సంగీతానికి ప్రాముఖ్యత, విషయాలలో ఐక్యత ఉన్నది. ప్రాథమిక సూత్రాలు, రెండింటికి ఒక్కటే. ప్రాథమిక ప్రామాణిక గ్రంథాలు, ఈ రెండు సంప్రదాయాలకు ఒకటిగానే ఉన్నాయి.

భిన్నమైన విషయాలు:-

గమకములు, తాళపద్ధతి, 16 ప్రకృతి వికృతి స్వరాల విషయంలో, రాగముల పేర్లు, మనోధర్మ సంగీతంలో స్వరకల్పన, వాద్యముల విషయంలోనూ, భిన్నమార్గాలు ఉన్నవి.

| కర్ణాటక సంగీతం | | హిందూస్థానీ సంగీతం | |
|---|---|---|---|
| 1. | ఆధారషడ్జమం తంబురా శృతి | 1. | ఐక్యత |
| 2. | స్వరములు 7 | 2. | ఐక్యత |
| 3. | స్వరస్థానములు 12 | 3. | ఐక్యత |
| 4. | 16 ప్రకృతి వికృతి స్వరములు | 4. | స్వరస్థానములు 12. 16 ప్రకృతి వికృతి స్వరములు లేవు వాటి ప్రయోజనం లేదు. |
| 5. | మేళకర్తలు 72 | 5. | 32 మేళకర్తలు |
| 6. | 40 వివాది మేళాలు అధికం | 6. | అవసరంలేదు, లేవు. |
| 7. | 1. శుద్ధగాంధార 2. షట్శృతి రిషభ 3. శుద్ధ నిషాధం, షట్శృతి ధైవతం | 7. | లేవు. అవసరం పడలేదు. |
| 8. | గమకములు-కంపనముల ప్రాముఖ్యత | 8. | గమకము 'జారు' ప్రాముఖ్యత |
| 9. | రవగమకం | 9. | ఐక్యత |
| 10. | సంగీత రచనకు ప్రాముఖ్యత సంగీతరచనలో మనోధర్మం ఉండదు. | 10. | సంగీత రచనయందు కూడా మనో ధర్మం ఎక్కువగా ఉండును. కీర్తన కృతికి ప్రాముఖ్యత చాలా తక్కువ. |
| 11. | స్వరకల్పనకు ప్రాముఖ్యం | 11. | అకారం 'తాన్'లకు ప్రాముఖ్యత |
| 12. | అకారతాన్‌లు ఉండవు. | 12. | స్వరకల్పన ఉండదు. ఈమధ్య కాలంలో స్వరకల్పన మొదలయింది. |
| 13. | రాగ ఆలాపన | 13. | ఐక్యత (ఉంటుంది.) |

| | |
|---|---|
| 14. నెరవు | 14. ఉంది. పేరు బోల్‌తాన్ |
| 15. తానం | 15. లేదు |
| 16. పల్లవి | 16. లేదు కాని 'ఖ్యాల్' ఒక విధంగా పల్లవే. |
| 17. సంగీత రచనలు<br>గీతం, స్వరపల్లవి, స్వరజతి, తానవర్ణం, కృతి, కీర్తన, పదం, జావళి, తిల్లానా, నారాయణ తీర్థ తరంగం, అధ్యాత్మ రామాయణ కీర్తనలు, భక్తి కీర్తనలు అన్నమయ్య భద్రాచలరామదాసు కృతులు. | 17. సంగీత రచనలు<br>లక్షణగీత్, బడేఖ్యాల్, ఛోటాఖ్యాల్, ట్రుమ్రీ, ఘజల్, టప్పా, ధృపద్, (ధృవపద్) తులసీదాస్, మీరా, కబీర్‌దాసు, సూర్‌దాస్ భజనలు, గీత్ ధున్, |
| 18. గాత్ర వాద్య సంగీతం రచనలు ఒకటేగానే ఉండును. విభేదములు లేవు. | 18. వాద్య సంగీత రచనలు ప్రత్యేకించి ఉండును. అవి:-<br>జోడు ఝూలా, గత్, బిలాస్ ఖానీ గత్, మసీద్‌ఖానీ గత్ మొదలైనవి. వాద్యమున ఖ్యాల్, ఘజల్, ట్రుమ్రీ ఉండవు. ఇవి గాత్ర రచనలు |
| 19. ముఖ్యమైన వాద్యములు<br>వీణ, వైలెన్, వేణువు, సన్నాయి. విచిత్రవీణ (గోట్‌వాద్యం) మృదంగం, ఘటం, మోర్సింగు, డోలు, కంజిరా | 19. ముఖ్యమైన వాద్యములు<br>తబ్లా; సారంగి, సితార్, సరోడ్, యస్రాజ్ బాలసరస్వతి, షహనాయి, బాంసురీ, డోలక్, డోల్కీ మొదలైనవి. |
| 20. రాగపద్ధతిలో<br>స్వరముల మధ్య గమకములు- కంపిత గమకాలు ఉంటాయి. | 20. రాగ పద్ధతిలో ఐక్యత<br>స్వరములపై నిలబెట్టి 'జారు' గమకంతో ఉంటాయి. |
| 21. కర్ణాటక సంగీత రాగ గమకములు అన్నియును కర్ణాటక సంప్రదాయానికి సంబంధించి ఉంటాయి. | 21. హిందూస్థానీ సంగీత రాగ గమకములు అన్నియును హిందూస్థానీ సంప్రదాయానికి చెందినవి అయి ఉంటాయి. |

| | |
|---|---|
| 22. నారద సంప్రదాయం అంటారు. | 22. హనుమత్ సంప్రదాయం అంటారు. |
| 23. ఆలోచనామృతం అనవచ్చు. | 23. ఆపాతమధురం అనవచ్చు. |
| 24. కర్ణాటక సంగీతం నేర్చుకోవటమూ కష్టమే, వినడంకూడా నేర్చుకోవాలి. | 24. నేర్చుకోవడం కష్టం. వినడం సులభం. |
| 25. పాండిత్య ప్రకర్షణ కలిగినది కనుక అన్ని వేళలా, కేవలం పామర రంజకంకాదు | 25. పండిత పామర రంజకం. |
| 26. కర్ణాటక సంగీతం దేవాలయ ప్రాంగణాలలో భక్తి ప్రధానంగా అభివృద్ధి అయింది. | 26. హిందూస్థానీ సంగీతం రాజ దర్బారులలో సంగీత రసికుల మధ్య అభివృద్ధి చెందింది. |
| 27. గాత్రజ్ఞుడు కృతిని తాళాన్ని తనే వేసుకొంటూ గానం చేస్తాడు. మృదంగ విద్వాంసుడు, కృతిని అనుసరిస్తో వాయిస్తాడు. | 27. గాత్రజ్ఞుడు ఖ్యాల్‌గాని టుమ్రీగాని మరి ఏ ఇతర రచననుగాని, పాడుతోన్నప్పుడు తాళాన్ని తన చేత్తో వేయడు. తబ్లా విద్వాంసుడు తాళాన్ని వేస్తో గాత్రజ్ఞుడికి చూపిస్తూ ఉంటాడు. తాళాన్ని పోషించటయే తబ్లా విద్వాంసుని బాధ్యత. ఎప్పుడైనా (సాథీ) అనుసరిస్తో ఉంటాడు కూడా. |
| 28. కర్ణాటక సంగీతజ్ఞుడు కొంతలో కొంతగానైనా హిందూస్థానీ శైలిని పాడగలడు. | 28. హిందూస్థానీ సంగీతజ్ఞునికి కర్ణాటక సంగీతాన్ని గానం చేయటం సులభం కాదు. కనీసం ప్రయత్నం చేయడు. |
| 29. రాగవిభజనలలో అసంపూర్ణ మేళాలు, 72 మేళకర్తలు సంపూర్ణ, షాడవ, ఔడవ భేదాలు, జనక జన్యరాగాలు, రాగాంగ, ఉపాంగ భాషాంగ క్రియాంగరాగాలు, శుద్ధ, ఛాయలగ, సంకీర్ణ రాగాలు, | 29. రాగ విభజనలలో స్త్రీ, పురుష, నపుంసక రాగాలు, పుత్ర, మిత్ర, పరివార రాగాలు, రాగముల రసములను బట్టి రాగములు, స్వర సంపుటినిబట్టి లోగడ జరిగింది. అలాగే |

| | |
|---|---|
| ముక్తాంగ కంపిత, అర్ధ కంపిత, కంప విహీన రాగాలు. నిషాధాంత్య, ధైవతాంత్య, పంచమాంత్య రాగాలు మొదలైన విభజనలు రాగ పరిణామ దశల్లో ఉంటూ వచ్చాయి. ఇప్పటికి కొన్ని ఆచరణలో ఉన్నాయి. | సూర్యాంశ, చంద్రాశ రాగాలు (ఉదయ, మధ్యాహ్న, సాయంకాల, రాత్రి రాగాలు) ఆయా కాలములకు ఆయారాగాలు విభజింపబడ్డాయి. చాలా రాగాలకు ధృశ్య కల్పనలు చిత్రకారుల కల్పనా చాతుర్యంతో చేయడ్డాయి. |
| 30. అన్నింటికంటె ముఖ్యమైనది. వినగానే ఇది కర్ణాటక సంగీతం అని ఇది హిందూ స్థానీ సంగీతం అనీ తెలిసేది గమకం. స్వర కదలికలు. అను-స్వరములతో నిండిన సంగతులు. కర్ణాటక సంగీతంలో ఆందోళిక, స్ఫురితం, ప్రత్యాహతం, కంపితం, వలీక, రవ, స్వరముల మధ్యగా జరుగుతో ఉంటాయి. ఒక పద్ధతి ప్రకారం కనకాంగి ఇంకొక పద్ధతి ప్రకారం తోడి శుద్ధ స్వరాలు. | హిందూస్తానీ సంగీతంలో ముఖ్యంగా దిగుజారు, ఎక్కు జారు, రవజాతి సంగతులు మొదలైనవి ఉంటూ స్వరముల మీద నిలబెట్టి గమకములు ఉంటాయి. హిందూస్థానీ సంగీతంలో (శంకరాభరణం) బిలావల్ మేళం శుద్ధమేళం అందువచ్చు స్వరస్థానములు శుద్ధ స్వరములు. |

## కొన్ని రాగముల పేర్లు

| *కర్ణాటక సంగీతం* | *హిందూస్తానీ సంగీతం* |
|---|---|
| 1. శంకరాభరణం | 1. బిలావల్ |
| 2. ఖరహరప్రియ | 2. కాపి |
| 3. కళ్యాణి | 3. యమన్ |
| 4. తోడి | 4. భైరవి |
| 5. మాయామాళవగౌళ | 5. భైరవ్ |
| 6. అభేరి | 6. భీంపలాస్ |
| 7. హిందోళ | 7. మాల్ కౌంస్ |
| 8. శుద్ధసావేరి | 8. దుర్గ |
| 9. మోహన | 9. భూపాలీ, (భూప్) |

10. నాట

11. శుభ పంతువరాళి

12. పూర్వకళ్యాణి

13. ద్విజావంతి

14. నాటకురంజి

15. హంసానంది

10. తిలంగ్

11. తోడి

12. పూర్వీ

13. జైజైవంతి

14. మాల్‌గుంజి

15. సోహిని

తాళములు

కర్ణాటక సంగీతంలో కొన్ని

1. ఆదితాళము 8 క్రియలు
2. తిశ్రత్రిపుట 7 క్రియలు
3. రూపక తాళం 6 క్రియలు
4. ఝంపతాళం 10 క్రియలు
5. తిశ్రగతి ఆదితాళం

హిందూస్థానీ సంగీతంలో కొన్ని

1. తీన్‌తాల్, త్రితాళ్ 8 క్రియలు
2. రూపక 7 క్రియలు
3. ఏక్‌తాళ్ 12 క్రియలు
4. ఝప్‌తాళ్ 10 క్రియలు
5. దాద్రా తిశ్రగతి

కర్ణాటక సంగీతమున
స్వరస్థానముల పేర్లు

షడ్జమం, శుద్ధరిషభం, చతుశృతిరిషభం, సాధారణగాంధారం, అంతరగాంధారం శుద్ధమధ్యమం, ప్రతిమధ్యమం, పంచమం, శుద్ధధైవతం, చతుశృతిధైవతం, కైశికనిషాధం, కాకలినిషాదం.

హిందూస్తానీ సంగీతమున
స్వరస్థానముల పేర్లు

ఖడ్జ-కోమల రిఖబ్, శుద్ధ రిఖబ్, (తీవ్రరిఖబ్), కోమల్ గాంధార్, తీవ్ర గాంధార్, (శుద్ధ గాంధార్) శుద్ధ మధ్యమ్ (లేక) కోమల మధ్యమ్, తీవ్ర మధ్యమ్, పంచమ్, కోమల్ ధైవత్. శుద్ధ ధైవత్ (తీవ్ర ధైవత) కోమల్ నిఖాద్. శుద్ధ నిఖాద్ (తీవ్ర నిఖాద్) 10 స్వరస్థానాలలో 5 కోమలాలు, 5 తీవ్రాలు శంకరాభరణ స్వరాలు శుద్ధ స్వరాలు.

# 150. అనుబంధము

## రాగములు - మేళకర్త సంఖ్య - మూర్ఛనలు అకారాది పట్టిక

| రాగముల పేర్లు | మేళకర్త సంఖ్య | ఆరోహణము | అవరోహణము |
|---|---|---|---|
| 1. అగ్నిగోపము | 20 | సగమపనిస | సనిపమగరిస |
| 2. అఠాణా | 29 | సరిమపనిస | సనిధాపమగారిస |
| 3. అమృతతరంగిణి | 19 | సరిగమధనిస | సధనిధపమగరిస |
| 4. అమృతపంచమము | 48 | సరిగమధనిస | సనిధమగసరిస |
| 5. అమృతవర్షిణి | 39 | సరిగమపధనిపస | సనిపధమగరిస |
| 6. అమృతవాహిని | 20 | సరిమపధనిస | సనిధమగరిస |
| 7. అసావేరి | 8 | సరిమపధస | సనిసపధమపరిగరిస |
| 8. ఆదిపంచమము | 48 | సరిపధని | సనిధనిపమగరిస |
| 9. ఆదిభైరవి | 20 | సరిమపనిస | సనిపమరిగమరిస |
| 10. ఆంధాళి | 28 | సగమధనిధస | సనిధపమగరిస |
| 11. ఆందోళిక | 28 | సరిమపనిస | సనిధమరిస |
| 12. ఆనందభైరవి | 20 | పగరిగమపధపనిస | సనిధపమగరిస |
| 13. ఆనందభోగి | 42 | సరిగమపనిధని | ధపమగరిసనిస |
| 14. ఆభీరు | 47 | పధనిసమగమ | పమగసనిధనిస |
| 15. ఆభేరి | 20 | సగమపనిస | సనిధపమగరిస |
| 16. ఆభోగి | 22 | సరిగమధస | సధమగరిస |
| 17. అభ్రదేశి | 62 | సగమపధనిధస | సధనిపమగస |
| 18. అభ్రపంచమము | 48 | సరిగమధనిస | సనిధమగస |
| 19. అరభి | 29 | సరిమపధస | సనిధపమగరిస |
| 20. ఆర్ద్రదేశిక | 15 | సరిగమపధనిస | సధపమగరిస |
| 21. ఆలాపి | 37 | సరిగమపధనిస | సనిధపమగరిస |
| 22. ఆహిరి | 8 | సరిసగమపధనిస | సనిధాపమగరిస |
| 23. ఆహిరినాట | 29 | సమగమపధనిస | సనిధనిపగమగస |
| 24. ఆహోరి | 20 | సరిగమపధస | సనిధపమగరిస |
| 25. ఇందుగీర్వాణి | 42 | సరిగమపస | సనిధపమగరిస |
| 26. ఇందుఘంటారవము | 20 | సగమపధపని | ధాపమగరిసని |

| రాగముల పేర్లు | మేళకర్త సంఖ్య | ఆరోహణము | అవరోహణము |
|---|---|---|---|
| 27. ఇందుధన్యాసి | 46 | సగమధనిస | సనిధపధమగరిస |
| 28. ఇందుధవళి | 21 | సరిగమసమపధనిస | సనిధపమగస |
| 29. ఇందుభోగి | 46 | సగరిగపమధస | సనిధనిపమగరిస |
| 30. ఇందుమతి | 51 | సగమధనిస | సనిధపమగస |
| 31. ఇందుశీతల | 4 | సరిగమపధనిధస | సధనిపమగరిస |
| 32. ఇందుసారంగనాట | 8 | సరిగమపమధనిస | సధపమగరిస |
| 33. ఈశగిరి | 69 | సరిగమపధని | ధపమగరిసనిస |
| 34. ఈశగౌళ | 7 | సమగమపధనిస | సధపధమగరిస |
| 35. ఈశమనోహరి | 28 | సరిగమపధనిస | సనిధపమరీమగరిస |
| 36. ఉత్తరి | 64 | సగమపధనిస | సనిధమగస |
| 37. ఉదయరవిచంద్రిక | 20 | సగమపనిస | సనిపమగస |
| 38. ఉమాభరణము | 28 | సరిగమపధనిస | సనిపమరిగమరిస |
| 39. కంకణాలంకారి | 52 | సగపధని | సనిధపమగరిస |
| 40. కటకప్రియ | 1 | సగరిగమపధపనిస | సధపధమగరిస |
| 41. కనకకుసుమావళి | 61 | సరిగమపధస | సధపమగరిస |
| 42. కనకగిరి | 66 | సరిగమపసనిస | సనిధనిపమగస |
| 43. కనకగీర్వాణి | 67 | సరిమపమధనిస | సధపమరిస |
| 44. కనకజ్యోతిష్మతి | 72 | సమపధనిస | సనిధపమస |
| 45. కనకదీపరము | 45 | సగమపధపని | ధపమగరిసనిస |
| 46. కనకనాసామణి | 62 | సరిగరిమపధనిస | సనిధపమగరిస |
| 47. కనకనిర్మద | 67 | సరిగమపమధస | సనిధపమగరిస |
| 48. కనకభవాని | 66 | సమగమపధనిస | సనిపమరిస |
| 49. కనకభూషావళి | 58 | సగమపధనిస | సనిపమగరిస |
| 50. కనకరసాళి | 51 | సరిగమధనిస | సధపమగరిస |
| 51. కనకవసంతము | 20 | సగమపనిధస | సనిధపమగరిస |
| 52. కనకశ్రీకంఠి | 60 | సరిగమపస | సనిధనిపమరిస |
| 53. కనకసింహారవము | 61 | సగమపనిస | సనిధపమరిస |

| రాగముల పేర్లు | మేళకర్త సంఖ్య | ఆరోహణము | అవరోహణము |
|---|---|---|---|
| 54. కనకాంగి (మేళ) | 1 | సరిగమపధనిస | సనిధపమగరిస |
| 55. కనకాంబరి | 1 | సరిగమపధనిధస | సనిధపమగరిగరిస |
| 56. కన్నడ | 29 | సమగమధనిస | సధాపమగమరిస |
| 57. కన్నడకురంజి | 49 | సగరిగమపధనిస | సధపమరిస |
| 58. కన్నడగౌళ | 22 | సరిగమపనిస | సనిధపమగస |
| 59. కన్నడదర్బారు | 33 | సరిగమపధపస | సనిధపమరిస |
| 60. కన్నడదీపరము | 44 | సరిగమధనిస | సనిధపధమగరిస |
| 61. కన్నడపంచమము | 26 | సరిగమపనిస | సనిధనిపమగస |
| 62. కన్నడబంగాళ | 15 | సరిమగమధపధస | పధపమగరిస |
| 63. కన్నడభోగి | 50 | సరిగమపనిధనిస | సనిధమగరిగస |
| 64. కన్నడమల్లారు | 20 | సగమపధస | సనిధమగస |
| 65. కన్నడమారువ | 53 | సగమపధనిస | సనిధపమగస |
| 66. కన్నడవేళావళి | 48 | పనిసరిగమప | పమగరిసనిధనిప |
| 67. కన్నడసౌరాష్ట్రము | 10 | సరిమగమధపధనిస | సనిధపమగస |
| 68. కమలనారాయణి | 55 | సరిమపధనిస | సనిధపమగమరిస |
| 69. కమలవంసత | 37 | సరిసమపధనిస | సనిధపమగరిస |
| 70. కమలాతరంగిణి | 20 | సరిగమపధనిస | సనిధపమరిస |
| 71. కమలాభరణము | 45 | సరిగమపనిధస | సనిధపనిధమగరిస |
| 72. కమలామనోహరి | 27 | సగమపనిస | సనిధపమగస |
| 73. కరుణాకరి | 63 | సమపధనిధస | సనిధపమస |
| 74. కర్నాటక ఆంధాళి | 14 | సగరిమపధనిస | సధపమగరిస |
| 75. కర్నాటక తరంగిణి | 61 | సరిగమపనిస | సపమగరిస |
| 76. కర్నాటక దేవగాంధారి | 21 | నిసగమపా | ధాపమగరిసని |
| 77. కర్నాటక సురటి | 4 | సరిగమపధస | సనిధపమరిస |
| 78. కలకంఠి | 13 | సరిగమధనిస | సనిధపగరిస |
| 79. కలకడ | 13 | సరిగపధనిస | సనిధపమగరిస |
| 80. కల్గడ | 13 | సరిగపధనిస | సనిధపమగరిస |

| రాగముల పేర్లు | మేళకర్త సంఖ్య | ఆరోహణము | అవరోహణము |
|---|---|---|---|
| 81. కలవసంతము | 43 | సగమపధనిస | సనిపమగస |
| 82. కలహంస | 31 | సరిమపధనిధస | సనిధపమరిస |
| 83. కలాభరణి | 52 | సగరిగమపనిధని | ధపమగరిసనిస |
| 84. కల్గడ | 13 | సరిగపధనిస | సనిధపమగరిస |
| 85. కల్యాణకేసరి | 13 | సరిగపధస | సధపమగరిస |
| 86. కల్యాణవసంతము | 21 | సగమధనిస | సనిధపమగరిస |
| 87. కల్యాణి | 65 | సరిగమపధనిస | సనిధపమపగారిస |
| 88. కల్లోలబంగాళ | 31 | సరిమపనిధస | సనిపధమగరిస |
| 89. కల్లోలము | 18 | సపధనిస | సనిధనిపమగస |
| 90. కల్లోలసావేరి | 25 | సరిమపధస | సనిధపమగరిస |
| 91. కల్హారు | 22 | సరిగమసపమధనిస | సనిధపమగరిస |
| 92. కళానిధి | 22 | సరిగమసపమధనిస | సనిధపమగరిస |
| 93. కళామూర్తి | 44 | నిసగరిగమపస | సనిధపమగరిస |
| 94. కళావతి | 16 | సరిమపధస | సధపమగరిస |
| 95. కళాసావేరి | 8 | సరిగపనిస | సనిధపమగరిస |
| 96. కళాస్వరూపి | 22 | సరిగామపధనిపస | సనిపమగారిస |
| 97. కాంతామణి (మే) | 61 | సరిగమపధనిస | సనిధపమగరిస |
| 98. కాంభోజి | 28 | సరిగమపధస | సనిధపమగరిస |
| 99. కానడ | 29 | గరిసరిగమపమధనిస | సనిసధపమపగమరిస |
| 100. కాననప్రియ | 63 | సరిగమపమధనిస | సధనిపమగరిస |
| 101. కాపి | 22 | సరిగామరిపమపధనిస | సనిధపమగరిస |
| 102. కాపినారాయణి | 28 | సరిమపధనిస | సనిధపమగారిస |
| 103. కామరూపి | 52 | సగమపమధనిపస | సనిధపమగరిస |
| 104. కామవర్ధని (మే) | 52 | సరిగమపధనిస | సనిధపమగరిస |
| 105. కాలనిర్ణిక | 63 | సగమపనిధస | సపమగరిస |
| 106. కాళింది | 22 | సమగామపస | సధపమరిస |
| 107. కిరణావళి | 21 | సరిగమపధనిస | సధపమగరిస |

| రాగముల పేర్లు | మేళకర్త సంఖ్య | ఆరోహణము | అవరోహణము |
|---|---|---|---|
| 108. కిరణి | 51 | సరిగమపనిధనిస | సనిధమగరిస |
| 109. కీరవాణి (మే) | 21 | సరిగమపధనిస | సనిధపమగరిస |
| 110. కీర్తిప్రియ | 1 | సరిమపధస | సనిధపమగరిస |
| 111. కీర్తివిజయ | 61 | సరిగమపనిధస | సనిధపమగరిస |
| 112. కుంతల | 16 | సరిగమపధనిస | సధనిపమగమరిస |
| 113. కుంతలకాంభోజి | 13 | సగమపధనిధస | సనిధపమగస |
| 114. కుంతలకుసుమావళి | 65 | సరిగమపమపస | సనిధనిపమగస |
| 115. కుంతలగీర్వాణి | 68 | సరిగమపధనిస | సధమపమగరిస |
| 116. కుంతలఘంటాణము | 70 | సరిగమపమపస | సనిపమరిస |
| 117. కుంతలదీపరము | 48 | సమపధనిస | సనిధనిపమగస |
| 118. కుంతలధన్యాసి | 47 | సరిగమపమధనిస | సనిధనిపమగరిస |
| 119. కుంతలభవాని | 67 | సరిగమపమపస | సనిధనిపమరిస |
| 120. కుంతలభోగి | 41 | సరిగమధపనిస | సనిధనిమగరిస |
| 121. కుంతలము | 61 | సరిగమపధనిధస | సనిధపమగమరిస |
| 122. కుంతలరంజని | 68 | సరిమపనిధనిస | సనిధపమగరిస |
| 123. కుతలరాగము | 61 | సరిగమపధనిధస | సధపమగమరిస |
| 124. కుంతలవరాళి | 28 | సమపధనిధస | సనిధపమస |
| 125. కుంతలశ్రీకంఠి | 65 | సగమపధనిస | సనిపమగరిస |
| 126. కుంతలశ్రీరంజని | 68 | సరిమపనిధనిస | సనిధపమగరిస |
| 127. కుంతలసింహారము | 69 | సరిమపమధనిస | సధపమరిస |
| 128. కుంతలస్వరావళి | 46 | సగమపధనిస | సనిధనిపమగరిస |
| 129. కుటుంబిని | 64 | సగమధపధనిస | సనిపమగరిస |
| 130. కుముదప్రియ | 22 | సరిగామపస | సనిధనిపమగస |
| 131. కుముదాభరణము | 38 | సరిగమపనిధస | సధనిపమగరిస |
| 132. కురంజి | 29 | సనిసరిగమపధ | ధపమగరిసనిస |
| 133. కులపవిత్ర | 28 | సగమధపనిస | సనిపమరిస |
| 134. కులభూషణి | 21 | సరిగమపనిస | సధపమగరిస |

| రాగముల పేర్లు | మేళకర్త సంఖ్య | ఆరోహణము | అవరోహణము |
|---|---|---|---|
| 135. కువలయానంది | 16 | సరిగమనిధనిపనిస | సనిధమగస |
| 136. కుసుమకల్లోలము | 32 | సపమరిగమపస | సధపమగమరిస |
| 137. కుసుమచంద్రిక | 32 | సరిమగమపధనిస | సధపమరిస |
| 138. కుసుమజ్యోతిష్మతి | 69 | సరిమగమపధనిస | సధనిధపమరిస |
| 139. కుసుమప్రియ | 27 | సరిగమపధస | సనిపమగారిస |
| 140. కుసుమభవాని | 68 | సరిమపధస | సనిధమపమరిస |
| 141. కుసుమభోగి | 50 | సరిగమధనిస | సధనిధమగరిగస |
| 142. కుసుమభ్రమరి | 34 | సరిగమపమధనిస | సనిధపమరిస |
| 143. కుసుమసారంగ | 56 | సరిమపధనిస | సనిధపమగరిస |
| 144. కుసుమాంగి | 16 | సరిసపధనిస | సనిధపమగరిస |
| 145. కుసుమావళి | 71 | సగమపధస | సనిధపమగమరిస |
| 146. కేతకప్రియ | 64 | సగమపనిస | సనిధపమగరిస |
| 147. కేతారనాట | 27 | సరిగమపనిపస | సనిపమగరిస |
| 148. కేదార | 29 | సమగమపనిస | సనిపమగమధమగరిస |
| 149. కేదారగౌళ | 28 | సరిమపనిస | సనిధపమగరిస |
| 150. కేసరి | 25 | సరిగమపమధపధస | సధనిధపమగరిస |
| 151. కైకవశి | 60 | సరిగమపధనిస | సనిపమగరి |
| 152. కైవశి | 58 | సరిగమపధనిస | సనిపమగరిస |
| 153. కోకిలగంధర్వము | 31 | సగమధస | సధపమగరిగస |
| 154. కోకిలగీర్వాణి | 43 | సరిగమపధస | సనిమగరిస |
| 155. కోకిలదీపకము | 23 | సగమధనిస | సనిధమగరిస |
| 156. కోకిలదీపరము | 43 | సరిగమనిధస | సనిధమగరిస |
| 157. కోకిలధ్వని | 28 | సరిగమధనిధస | సనిధనిపమగరిస |
| 158. కోకిలపంచమము | 39 | పధనిసరిగరి | సనిధపధనిస |
| 159. కోకిలప్రతాపము | 26 | సగమపమధనిస | సనిపమగస |
| 160. కోకిలప్రియ (మే) | 11 | సరిగమపధనిస | సనిధపమగరిస |
| 161. కోకిలభాషిణి | 29 | సరిగమపధనిస | సనిపమగమరిస |

| రాగముల పేర్లు | మేళకర్త సంఖ్య | ఆరోహణము | అవరోహణము |
|---|---|---|---|
| 162. కోకిలవరాళి | 20 | సరిగమపధనిధస | సనిధనిపమరిగరిస |
| 163. కోకిలస్వరావళి | 41 | సరిగమధనిస | సధమగరిస |
| 164. కోకిలానంది | 56 | సగమధనిస | సనిధపమగస |
| 165. కోకిలారవము | 11 | సరిగరిమపధనిస | సనిధపమగరిస |
| 166. కోమలి | 63 | సరిగమపనిధమపస | సధనిమగరిస |
| 167. కోలాహలము | 29 | సపమగమపధనిస | సనిధపమగరిస |
| 168. కోసల (మే) | 71 | సరిగమపధనిస | సనిధపమగరిస |
| 169. కౌమారి | 11 | సరిగమపధస | సనిధపమగరిస |
| 170. కౌమోద | 65 | సరిగమనిస | సనిమగరిస |
| 171. కౌస్తుభప్రియ | 71 | సరిగమపధనిస | సధపమగమరిస |
| 172. ఖడ్గప్రియ | 1 | సగరిగమపధపనిస | సధపధమగరిస |
| 173. ఖమాసు | 28 | సమగమపధనిస | రిసనిధపమగస |
| 174. ఖరహరప్రియ (మే) | 22 | సరిగమపధనిస | సనిధపమగరిస |
| 175. ఖిలావళి | 22 | సరిగామపస | సనిపమగరిస |
| 176. గంగాతరంగిణి | 33 | సరిగమపస | సనిధపమగమరిస |
| 177. గంధర్వకన్నడ | 31 | సరిగపధస | సనిధపమగమరిస |
| 178. గంధర్వనారాయణి | 24 | సమపధనిస | సనిధనిపమస |
| 179. గంధర్వమనోహరి | 26 | సరిమపస | సనిధమగరిస |
| 180. గంధర్వము | 42 | మపధనిసరిగ | రిసనిపమపధనిస |
| 181. గంభీరనాట | 36 | సగమపనిస | సనిపమగస |
| 182. గంభీరిణి | 23 | సరిగమపధనిధస | సనిధపమగరిస |
| 183. గగనభూపాలము | 21 | సమగమపధనిస | సనిధమగరిస |
| 184. గగనమోహిని | 64 | సగపధనిస | సనిపమగస |
| 185. గగనరంజని | 66 | సగమపస | సధనిపమగరిస |
| 186. గగనసరసీరుహము | 53 | సగరిగమపధని | ధపమగరిసనిస |
| 187. గణితవినోదిని | 16 | సగమపనిస | సనిధపమగరిస |
| 188. గమకప్రియ | 51 | సరిగమపనిధస | సధపమగరిస |

| రాగముల పేర్లు | మేళకర్త సంఖ్య | ఆరోహణము | అవరోహణము |
|---|---|---|---|
| 189. గమకసామంతము | 45 | సగమపనిస | సనిధపమగరిస |
| 190. గమనక్రియ | 53 | సరిమపధనిస | సనిధపమగమరిస |
| 191. గమనశ్రమ (మే) | 53 | సరిగమపధనిస | సనిధపమగరిస |
| 192. గరిగద్య | 56 | నిసగమపధని | ధపమగరిసనిస |
| 193. గరుడధ్వని | 29 | సరిగమపధనిస | సధపగరిస |
| 194. గర్జము | 17 | సగమధనిస | సనిధపమగరిస |
| 195. గవాంబోధి (మే) | 43 | సరిగమపధనిస | సనిధపమగరిస |
| 196. గాంగేయభూషణి (మే) | 33 | సరిగమపధనిస | సనిధపమగరిస |
| 197. గాంభీర్యఘోషణి | 52 | సగరిపమధనిస | సనిధపమగరిగస |
| 198. గానమూర్తి (మే) | 3 | సరిగమపధనిస | సనిధపమగరిస |
| 199. గానవారిధి | 35 | సమరిగమపధనిస | సధనిపమరిస |
| 200. గానసామవరాళి | 3 | సరిగరిమపధపనీస | సనిధమాగగరిస |
| 201. గాయకప్రియ | 13 | సరిగమపధనిస | సనిధపమగరిస |
| 202. గిరికుంతలి | 72 | సరిగమపమగమపస | సనిధనిపమగస |
| 203. గీతనటని | 53 | సరిమగమపధనిస | సనిధపమరిస |
| 204. గీతప్రియ | 13 | సరిగమపధనిస | సధపమగరిస |
| 205. గీతమూర్తి | 33 | సరిగమపధనిస | సనిధపమగస |
| 206. గీర్వాణి | 43 | సరిగరిమగమధనిపనిధస | సనిధపమగరిస |
| 207. గుండక్రియ | 15 | సరిమపనిస | సనిపధపమగరిస |
| 208. గుజ్జరి | 15 | సరిగమపధనిస | సధనిపమగరిస |
| 209. గుమ్మకాంభోజి | 15 | సరిగపధనిధస | సనిధపమగరిస |
| 210. గురుగద్య | 56 | నిసగమపధని | ధపమగరిసనిప |
| 211. గురుప్రియ | 64 | సరిగమధనిస | సనిధమగరిస |
| 212. గుహప్రియ | 16 | సరిగామసపమధనిస | సధనిపమగసరిస |
| 213. గోత్రారి | 63 | సరిమపధస | సనిధపమగరిస |
| 214. గోపతి | 42 | సరిగమపధని | పమరిగరిస |
| 215. గోపికావసంతము | 20 | సమపనిధనిధని | సనిధపమగస |

| రాగముల పేర్లు | మేళకర్త సంఖ్య | ఆరోహణము | అవరోహణము |
|---|---|---|---|
| 216. గౌడమల్లారు | 29 | సరిమపధస | సనిధమగరిస |
| 217. గౌరి | 15 | సరిమపనిస | సనిధపమగరిస |
| 218. గౌరీక్రియ | 60 | సగమపధనిస | సనిధనిపమగస |
| 219. గౌరీగాంధారి | 2 | సమరిగమపధనిధస | సనిధపమగరిస |
| 220. గౌరీనిషాదము | 71 | సగమపనిధస | సనిధనిపమగస |
| 221. గౌరీబంగాళ | 9 | ధసరిమపధని | ధపమగరిసనిధప |
| 222. గౌరీమనోహరి (మే) | 23 | సరిగమపధనిస | సనిధపమగరిస |
| 223. గౌరీపంతు | 51 | సరిమపనిస | సనిధపమధమగరిస |
| 224. గౌరీమారువ | 50 | సరిమపధస | సనిధపమగరిగస |
| 225. గౌరీసీమంతి | 70 | సరిగమపధనిస | సనిపమగస |
| 226. గౌళ | 15 | సరిగమరిమపనిస | సనిపమగమరిస |
| 227. గౌళచంద్రిక | 7 | సరిమపధస | సనిధపగరిస |
| 228. గౌళపంచమము | 24 | సరిమపనిస | సనిపమగరిస |
| 229. గౌళమాళవి | 6 | సరిగమపధనిపనిస | సపధనిపమగరిస |
| 230. గౌళిపంతు | 15 | సరిగరిమపధపనిస | సనిధపమగరిస |
| 231. ఘంటా | 8 | సరిగమపధని | ధపమగరిసనిధాపనీస |
| 232. ఘంటాణము | 57 | సరిగమపనిస | సనిధమగరిస |
| 233. ఘననాయకి | 63 | సగమనిధపధనిస | సనిధపమగరిస |
| 234. ఘనశ్యామల | 5 | సగమపధస | సనిధపమగరిస |
| 235. ఘనసింధు | 15 | సమగమపధనిధస | సనిధపమగస |
| 236. ఘోషణి | 16 | సమగమపధనిధస | సనిధపమగరిస |
| 237. చంద్రకాంతము | 65 | సరిగమపధనిస | సనిధపమగరిస |
| 238. చంద్రకిరణి | 16 | సగమపమధనిస | సనిధనిపమగమరిస |
| 239. చంద్రగాంధారము | 8 | సరిగమస | సధమగరిస |
| 240. చంద్రచూడప్రియ | 18 | సగమపనిధనిస | సనిపమరిస |
| 241. చంద్రజ్యోతి | 41 | సరిగమపధస | సధపమగరిస |
| 242. చంద్రరేఖ | 58 | సరిగమపధస | సనిధమగరిస |

